# చిలకమర్తి లక్ష్మీనృసింహకవి

# సంపూర్ణ గ్రంథావళి

---

## షష్టిపూర్తి ముద్రణము

## ౨-వ సంపుటము—నవలలు

సౌందర్యతిలక - అహల్యాబాయి - హేమలత.



షష్టిపూర్తి సంఘకార్యదర్శి :

పాలకోడేటి గురుమూర్తిగారిచే

ప్రకటితము.

1927



[ Price Rs. 3




## మొదటి ప్రకరణము.

“భగవంతుఁడగు నారాయణుఁడు మనుష్యరూపము ధరించి ప్రత్యక్షముగ ద్వారకానగరమునందుండి జగముల నేలుచుండఁగ నే నావంటి వృద్ధులకింత పాటును మనుష్యులకింత చేటును గల్గుచున్నదిగదా! ముందురాఁగల యుగముయొక్క ధర్మములు మందుఁడనగు నాకె కనులకుఁ గట్టిన ట్లెదుటఁ గనఁబడుచుండ వేదవ్యాసునంతటి మహాత్మునకుఁ గనఁబడకుండునా! నేఁడుదయమునుండి నే నెవ్వరియింటికిఁ జనినను నాకు నొక కబళ మన్న మయినను దొరకదయ్యె. ఇది యేమి యాఁకలియోగాని కడుపులోనున్న ప్రేవులను, మాంసమునుగూడ హరించుచున్నది. ఈ ముసలితనమునకుఁ దోడై నాయాఁకలి నన్నుఁ బెట్టు తిప్పలు చెప్పుకొనఁగ మన్న నాలకించువా రెవ్వరు నీగిరివ్రజపురమునఁ గానరారు. అయ్యో! కృష్ణా! నీవెంతచేసితివి. కృష్ణకుల సంకట దిగ్భ్రమింగి సంపూర్ణమయిన యాయువుతో నేనింక నెన్ని సంవత్సరములు జీవింతునోకద. దైవమా! కనులు గానక చెవులు వినరాక ప్రజలఁ బీడించుచు దినమంతయుఁ బంచ పంచలకుఁ దిరిగి పట్టెడోగిరము నయినను దెచ్చుకొనఁజాలక హేయమయిన జీవనముఁ జేయుచున్ననాకుఁ బూర్ణాయు

వ్యాసంగ ప్రజ్ఞావంతులను, సకలైశ్వర్య సంపన్నులను, శ్రేయఃకాము లను నేదియో వంకఁబెట్టి తెప్ప వేయునంతలో నంత మొందింపఁడు నీ శాస్త్ర వైపరీత్యములు కెవరుఁ గారణముఁ జెప్పరు గదా! హా తవిధీ! నామీఁద నీకింత నిష్కారుణ్యమేల? నాకు నేనే భారముగ నుండ నీభూమికి నీ నగరములకు నిందలి ప్రజలకు భారమని తోఁచుట యొక యాశ్చర్యముగాదు. ఎంతలేసి సంకటములు నాకు సంభవించియు, మంచు విరియునట్లు చులకనగ నెగిరి పోవును. భగవంతుఁడా! నా నిమిత్తము నీవెన్ని క్రొత్త క్రొత్త దుఃఖముల నిలువచేసి యున్నావో యన్నియు నొక్కసారిగ నాపయి దండెత్తఁబంపి నన్ను నీకడకుఁగొ నిపోవఁ గటాక్షింపుము. ఆహాహా! ఇంత పొడవును విడివియుఁ గ లిగి సకలైశ్వర్యములతో విలసిల్లు నీనగరమేమి? కుబేరు నైనఁ దిర స్కరించు నీ వణిక్సంఘమేమి? కైలాసపర్వతమువలెఁ గొత్తగా నలఁదిన సున్నముతో నలరారు నీమేడలేమి? నాకుఁగూడు దొరక కుండుటయేమి? నేనెచ్చటికిఁ బోయిన నచ్చట లేదు పొమ్మనువారు ను, నీకొఱ కెవ్వరాయత్తము చేసి యుంచినారను వారును నీ! య ఱవకు మనువారును, జేయి యూరకొనలేదనువారును లోనికి రా వలదనువారును గఱ్ఱ దీసికొని కొట్టవచ్చువారును నిట్టివారు నేగాని యీముసలి దయ్యమునకుఁ బిడికెడు బియ్యమో పట్టెఁడన్నమో, గుక్కెఁడు నీరో యాదరించి యొసఁగినవారు లేరయిరి. నేను యుఁ బెరుపుఁ గమ్మని కూరలు, పిండివంటలు బొట్టెలు విచ్చునట్లు మెక్కి పొర్లువోవక సాగటాలో, కల్లజూదమో యాడుచు నొకరిని మించునట్లొకరు పందెమునకుఁ బయిపందెమిడుచు నన్నుఁ జూచి జా లిఁబడుటకు మాఱు వికవిక నవ్వి, వీఁడు ముసిచ్చు వీని కాళలి మె క్కడిది నోడల నడుమ్మఁడని సేవకుల కానతిచ్చు పడుచువాండ్ర న లుకళ్ళు నాలుకలో ఖురుపతువకలో నేనెఱుంగను. మద్యపాన

నకును గాంతా ప్రసన్నతకును బ్రీణయ ద్యూతమునకును నీప్రభు వు లోకనాఁడు వ్యయముఁ జేయు ధనము నాకు రెండేండ్లు బ్రదుకఁ జాలు నర్థముగదా. అహాహా! అప్పుడప్పుడే వార్చిన వెచ్చనెచ్చని గంజిలో రవంత యుప్పుఁగూడ వైచి ఘల్లని యూరఁగాయి నంజుకొనుచు నాఁకలిఁ దీఱ నారగించి నేఁటికి మూఁడు దినములయినది. అయ్యో! ఆఁకలి, ఆఁకలి, దాహము, ఓరోరి పాపాత్ములారా! ఓరోరి పౌరులారా! నాకడుపు కాలుచున్నది. ఏసత్రములకుఁ జనినను బోతరించియున్న బ్రాహ్మణు లాదరించువారేగాని నాదెసఁ జూచువారు లేరేమి? మీరెందఱుఁ గటికవాండ్రవలెఁ గనఁబడుచున్నారు. ఇండ్లదగ్గర గావలియుండు సేవకులు యజమానుని సెలవగుటతోడనే కనికరము దొలఁగి జాతి మెట్లమీఁదనుండి ద్రొబ్బునట్లు నన్ను మెడఁబట్టి గెంటుటకు సాహసించిరి. ఆసమయమునఁ దగిలిన దెబ్బలు నన్నింకను బాధించుచున్నవి. "అయ్యో! అన్నమన్నము నాతండ్రులారా ఇంక నిలువఁజాల" అని యఱచుచు నొక ముసలివాఁడు వాడలంబడి తిరుగుచు గిరివ్రజపుర జనుల యాచించుచుండెను. అతఁడు శత వృద్ధగుట జీర్ణమయిన కాయము గలవాఁడు. శరీర మెంత జీర్ణమయి యుండెనో యతఁడు దాల్చిన వలువయు నతిజీర్ణమయి పలు చినుఁగులు గలదయి డుమూసి దగ్గరనుండు పౌరుల కతనిపయిఁ గల సహజమగు నసూయను ద్విగుణము సేయుచుండెను. వివర్ణమయి మోమంతయుఁ బెక్కుముడుతలతో నిండియుండెను. అవయవపటుత్వము తప్పియో, యెల్లప్పు డన్న మన్నమని యఱచుచుండుటచే వానినోరు నిరంతరముఁ దెఱచుకొని యుండుటయు రెండు సెలవులనుండియుఁ లాజలము లాఁపినసాఁగక స్రవించుటయు కన్బొమలమీఁది వెండ్రుకలు నయితము నెరయుటయుఁ దమ పాటవము నదలి[illegible]

న్నెలు విలపించుచున్నవో యనునట్లు వానినుండి దుర్జలము దొరఁగుట
యు, మొగమునకు విపరీతమయిన భయంకరరూపముగల్గుటయు నా
యాకారమున కాయా లక్షణము లనురూపములగునట్లు ముసలికారున
కుఁ దగునట్లు వచ్చి యాతని నాశ్రయించెను. పూరింపఁబడినగా
లియంతయుఁ బోయినవెనుక మెత్తనయి యణఁగియుండు చర్మభ
స్త్రివలె వాని దేహము శల్యావశిష్టమయి వ్రేలాడుచు రక్తమాంస
క్షయమును వెల్లడిసేయుచుండెను. బహుసంవత్సరముల భారమువ
హించుటచేఁ గ్రుంగెనో యనునట్లు వాని నడుము నేలఁదాకునట్లు
వంగియుండెను. కనులకుఁజూపులేదు. చెవులకు జక్కని వినికిలేదు.
దంతములు మొదలంట నూడుటచే నాతని బోసినోటనుండి వెడలు
మాట యొకపట్టున విస్పష్టముగఁ దెలియుచుండుటలేదు. దేహబల
ముతో సర్ధబలమును సర్ధబలముతో బంధుబలమును దానితో మ
నోబలమును క్షయము నొందుటయు, విసుగు చిరాకు మొదలగుమన
శ్చిన్నెలు పొడసూపుటయు, గిరివ్రజ నివాసులు కాంచి యతనినా
దరింపనయిరి. పయినుదహరింపఁబడిన తెఱఁగున నాదినమున నీమున
లివాఁడు వీథులంబడి యఱచుచుండ నత్యంత వినోదముగనుండి కాఁ
బోలును గొందఱు బాలురా నిరుపేద వెంబడింబడి చేతనుండుయూఁ
తకోలఁ దిగలాగుచుఁ దరిపమెత్తుగొను పాత్రి మూఁడఁబెఱకుచు
ఱాల రువ్వుచు నింకఁ బలువిధముల విసిగింపఁజొచ్చిరి. మితిమీఱి
రవులుచున్న క్షుధానలంబునకుఁ గ్రుధానలంబు తోడయిన తఱి
వాని యవస్థ యెట్లుండునో వర్ణింప నేరితరము? జరాభారమును
నీరసత్త్వమును బాధించు బాలకులను శిక్షలేనివారిఁగా నొన
ర్చినను దననోటిలో . నేమో గొణుఁగుకొనుటయు నోపిక యున్న
పూడు స్పష్టముగాఁ దిట్టుటయు మాత్ర మతఁడుమానఁడయ్యెను.
కఁదుఱీఁ. ల పోయిన కొఱ్వలేక యటు. నిటు విదుర్చుకొను ముసలి

యీలపోతు బలె నతఁడు కొందఱు నవ్వులఁ గసిరి కొట్టుచుండ నొకఁడు మెల్లమెల్లనె వచ్చి వాని చెవిలో ఢామ్మని పెద్దపెట్టున గొంతు చేసెను. వృద్ధుఁ డది యేమోయనియదలి బెదరి బెదరి చూచుచుండఁ జేతనున్న దండము లాగికొని యొక పలుగాకి వాని నిరాయుధునిఁ జేయ వాఁడును వడవడ వడఁకుచు నేలంబడి బికిరపుటన్న మున్న పాత్రముఁ బగలఁగొట్టుకొనెను. అంతలో నొకరథము చప్పు డప్పుడు చెవిఁ బడుటయు, వారు పెరిగిన హారములోని ముత్యములవలె యథాయథలై నలుదెసలకుఁ బరుగెత్తిరి. వెంటనే సేవకు లిరువురు ముందు పరుగులిడుచువచ్చి బాటనడచు జనుల నొత్తిగించుచు "లెంపు తప్పుకొనుఁడు ప్రధానమంత్రి యగు పుష్పకేతుని కొమరుఁడు వజ్రదంతుఁ డరదమునెక్కి ప్రియురాలితోఁగూడ మధుసాగరమను నుద్యానవనమున కరుగుచున్నాఁడు. దారి యొసఁగుఁడీ" యని యఱచుచు, జాఱిన యూఁతకోలకు దడవువాని, భిన్నమగు భిక్షాపాత్రమునకు వగచువానిఁ గుజ్జులను నిందించువానిఁ దన యవస్థకు రోదనము సేయువాని, ముసలివానిఁ దొలఁగుమని చెప్పిరికాని వాని గొడవలో వాఁడుండి వీరిమాటఁ జెవినిడఁడయ్యె. సేవకులా బలహీనునిఁ బలిమిచే నీవలకు లాగఁ బ్రయత్నించుచుండ నింతలో నరదము సమీపించెను. ఏదియుఁ జేయునదిలేక భటులు తొలఁగిరి. అధికారి రథముతోలు గర్వముచేఁ బొతరించిన సూతుఁడు కనులఁ గానకయో దయారసములేకయో, నిలుపక రథముఁ దోలెను. నిమిష నిమిషము దొర్లుచు నిరుసుపైఁ దిరుగు నినుపచక్రములతోడను నానావర్ణములఁ గనులు మిఱుమిట్లుగొలుపు కాంతులతోడను జంగుచంగున నిరాఘాటముగఁ బరుగువాఱు ధవళాశ్వంబులతోడను, వెలయు నా రథంబు ముసలియనద యెడమకాలి పై నుండిపోయె. సూతుఁ డెట్టి యుల్లసితుఁడో

వాని మున్నుముందా వృద్ధునిఁ దాఁ గనుంగొనకున్నను, వానికాలిపై
రథము పోవుట దెలిసినంతనైనఁ దాను జాలిపడఁడు. రథము
నాపఁడు. యజమానుని కావార్త విన్నవింపఁడు. యజమా
నుఁడు స్వయముగా నేల వారింపఁడందురో యాతఁడును మద్యపాన
మత్తుఁడై ప్రియురాలిపై నానకొని ప్రపంచమెఱుఁగక పొరలు
చుండెను. ఇట్లు సారథి కనుమూయునంతలో నెంతయుఁ దవ్వున
కు రథము తోలుకొనిపోవుటయు నీయనాథుఁడు కెవ్వున నఱచి నేల
మూర్ఛిల్లెను. అతనియొడలనున్న నాలుగు నెత్తురుచుక్కలు నాఁ
డెచ్చుట నేలఁబడి రాజమార్గమున నరుగు ప్రజకుఁ గనికరంబుఁ గలి
గించె. ఈవినోదంబు సందర్శింపఁ జనంబులు తండోపతండము
లుగవచ్చి యాతనిచుట్టుఁ జేరి యీపాపి యింతకాలమేల జీవింపవల
యుననియు, దైవము నిందార్హుఁడనియు, సూతుఁడు శిక్షార్హుఁ డని
యు, వజ్రదంతుఁడు కనుఁబొగరుపోతనియు, నేలిక కిది యెఱిఁగిం
చినఁ దప్పక యతఁడు రథిక సారథుల దండించుననియుఁ బలుకు
చుఁ గాలముఁబుచ్చువారె కాని కాలోచితమగు చికిత్సఁ జేయనెవ్వరు
సాహసింపరైరి.

*

# రెండవ ప్రకరణము.

---

" రోహాణకా ! ఎంతసేపు నీయంగడిమీఁద గూర్చుండెదవు? ప్రొద్దుప్రాలినది. నేవచ్చి చాలదడవయినది. నాప్రియసఖి యేమని యలుకఁబూనునో? నాకన్న నేఁడువెనుక లాలస్యముగ వచ్చిన ముగ్గురఁ బంపితివి. వేరగాండ్ర నందఱ వెంట వెంటనే పంపి నాపట్టున నిట్లాలస్యము జేసెదవేమి? ఇప్పుడేకాదు. నీవేమి కతమ్మునననో నేనెప్పుడు నీయంగడికి బేరమునకు వచ్చినను జాలసేపు నన్నిందు నిలుపక యనుపవుగదా " అని చిఱునగవు మొగము నలంకరింపఁ దలవంచి పలుకు నాగవల్లిం గనుఁగొని "బాల నీకడ నాకుఁగల చనవుచే నిన్నుఁ గొంతతడవాఁపి క్రొత్తగా వచ్చిన బేరగాండ్రవలియంగళ్ళకుఁ బోవకుండ ముందు వారి నంపితిని. నిరంతరమును మీ యంతిపురమునసేయున్న మాయంగడి పావనంబగుట యెన్నఁడు? ఇంచుకసేపు మాయంగడిపై నుండి నీదు వాలుగంటిచూపులు మాపై, మాపూవులపై, మాయంగడిపైఁ బ్రసరింపఁజేయరాదా? " అని పూలవర్తకుఁడగు రోహాణకుఁడా పడుచును హెచ్చరించుటయు నామె కినుకతో " నీపలుకులకేమి? దండల నిమ్ము. ఈయవేని వేఱొకవర్తకునివద్దఁ గొనఁబోయెదనుజుమా! " అని బెదరించుటకు రెండడుగులిడియె. రోహాణకుఁ డామె చిత్త మెఱిఁగియు రారమ్మని పిలిచి యిట్లనియె. "ఇవె జాజిపూవుల దండలు. ఇట్టి పీ మగధలోనెందునుఁ దలక్రిందుగఁ దపసుఁజేసిన నీవు తేఁజాలవు. ఇవి కమ్మసంపంగిపూలచెండ్లు రసికురాలవగు నీకు నేను వీని యుపయోగమును జెప్ప నక్కఱలేదు. ప్రణయకలహములుగలక్రొత్తదంపతు లొకరినొకరు మోదుకొను నాయుధ

లుగా నుండునట్లు వీనిఁ జేయించితిని. ఇట్టివి వేయువరాలిచ్చియు నీవు సంపాదింపనేరవు. ఇవె మల్లెపూవులు యంగీలు. ఇవి తప్పక మీచెలివద్ద నుండఁదగినవి. నాశ్రమముఁజూచి వెలయకుగును. మీ నిమిత్తమే వీనిఁ జేయించితిని.” అని సోత్కర్షముగఁ బలుకుచున్న యవ్వణిజునిఁ గాంచి నాగవల్లి “ నీసొమ్ము నీవు పొగడుకొనుట సహజము! తన వస్తువులు చక్కగ లేవను వెంగలి వర్తకు నేనెన్నఁడు నెఱుఁగ. దానికేమి. ఒక దండయు, నొక చెండును, నొక యంగీయు నిమ్ము. వాని నింటికిఁ గొనిపోయి యా యమ్మకుఁ జూపి కావలయువాని వలయు వెలయిచ్చి తీసెద. అక్కరలేనివాని మరలఁ దీసికొనవలయుఁజుమీ! అయినను వెల ముందుగా నిచ్చెద. ఇవిగో మూడు మాడలుతీసికొమ్ము” అని వానిపై నాశ్రమములువైచి యా సరులు చేతఁ బట్టుకొని నిజగృహమునకై పరుగుచుండెను. అంతలో రోహిణకున కెద్దియోమాటజ్ఞప్తికిరా నతఁడు “ నాగవల్లీ! నాగవల్లీ!” యని పిలువ నాబాలికయు విసుగుకొనుచు వెనుకకు వచ్చి “ మాటిమాటికి నిటు లభ్యంతరములు కల్పించుచుందువు. నాతో నిపుడేమి రాచకార్యము మించిపోవుచున్నది. అని యించుక యలిగి నిలుచుండ రోహిణకుఁడు మందహాసముతో “సుందరీ! పూలచెండొకటి యీయఁదలఁచి మఱొకటి యిచ్చితిని. ఇదె గుమగుమతావుల నెల్లదెసలకుఁ బర్వఁజేయుచున్న యీ సంపంగిచెండు. చూడు. దీని గర్భమున నొక దివ్య కుసుమంబమర్పఁబడియున్నది. దాని నొక సిద్ధుండొసఁగుచు నందలి తావుల నాఘ్రాణించు స్త్రీపురుషులకు మనోరథములు కరతలామలకములని యానతిచ్చెనఁట. అందుచేతఁబ్రత్యేకముగ మీనిమిత్తమయిదీనిఁ గట్టించితి” ననికాంచనకందుకమువలె కాంతుల వెదజల్లు నొక పూలచెండొసంగినదానిఁగైకొని మునుపటిదానినారోహిణకునకుఁగ్రమ్మఱ నొసఁగివెడలు

చుండ జేరమునకువచ్చి నిలువఁబడిన యొక వృద్ధాంగనయు నామె కన్న నించుక చిన్నయగు నొక పురుషుఁడును, ప్రసంగవశమున నుజ్జయినిమాట యెత్తినఁ బినకా నుడువు రుచించుటచే నాగవల్లి యించుక తాళి తానేమియు నెఱుఁగనిదానివలె నెఱుఁగున పటి సరస సంభాషణము నాలకింపఁ దొడఁగెను.

పు. రు.—అవునీసమయ మేనిచట లేను. ఉజ్జయినికిఁ జనినాఁడను.

స్త్రీ—వృద్ధుఁడైన విక్రమసింహ మహారాజు కుశలముగనున్నాఁడా

పు—ఆ, పరలోకమున.

స్త్రీ—పాపము, అతఁడు లోకాంతరమున కరిగెనా. కుమారునకుఁ బట్టాభిషేకమహోత్సవము జరిగెనా? అందుల కాటంక మే మందురు?

పు—అంతయు నాటంకమే, పితృవియోగముచే ఖిన్నుఁడయిన యాతని శోకమును వానితల్లి పాండురాజు మరణానంతరము న మాద్రి యెట్లుచేసెనట్లు తనపాతివ్రత్యముఁ జూపి ద్విగుణముఁ గావించెను.—తల్లిదండ్రు లిటులేక కాలమునందే మృతి నొందుటచే దుస్సహమైన దుఃఖవార్ధిఁ బాఁటలేక చిన్నరాజు రాజ్యసన్యాసముఁ గైకొని హిమాచలమున కరిగి తపమాచరింప నిశ్చయించుకొనెనని ప్రజలు చెప్పుకొనుచున్నారు.

స్త్రీ—అట్లయిన నింక నేల సన్యసింపలేదు?

పు—ఈనడుమ సింధురాజు తన దేశముపై దండువెడలుననియుఁ గౌరవులు వారికి సహాయము వత్తురనియువిని తానీసమయమున సన్యసించినఁ గౌరవులకు వెఱచి యట్లుచేసెనని లోకు ల పనింద మోపుదురని జంకి యాదండయాత్ర యేమోచు న వెనక తన సంకల్పము నెఱవేర్పఁ దలఁచుకొన్నవాఁ[illegible]

స్త్రీ—ఇది మునయూరిలోఁ గొండఱు ప్రజలకు సంతాపహే[illegible]వే

అని పూలదండలఁ దీసికొని యిరువురు ముచ్చటించుకొనుచుఁ బోయిరి. నాగవల్లికి వారిసంభాషణలో నొక్కొక్క శబ్దము వినఁబడుచున్నకొలఁది నామె మొగము తేటలో నొక్కొక్క-వన్నె దేలుఁగాఁ జొచ్చెను.

ఆపలుకు లామెపాలికి మంత్రాక్షరములు కా నాయొయ్యారి మాంత్రికునిచేతి యాఁడుపామువలె కదలఁజాలక నిల్చి వారి ప్రసంగము ముగియు నసంతరము వారిచేఁ జూడఁబడకుండ వెనువెంటఁ జని యాయిరువుర యిండ్లఁజూచి గుఱుతెఱిఁగి మన్మథునిచేతి యమ్మువలె నలరుచున్న యంబురుదండలతో సందిగ్ధమగు మనసుతో విచారాతిశయముచే మందమైన నడకతో గృహమువైపు రాఁదొడఁగె. అట్లు కొంతదడవు తత్ప్రసంగాయత్తమగు చిత్తముతో నడచి, యొకచోట రాజమార్గమున వలయాకారముగఁ బలువురు పౌరులుమూఁగియుండ నాసంభ్రమమునకు నింతఁ దానును నేత్రోత్సవముగ విలోకింపఁదలఁచి దండలు నలుగకుండఁ జేయి పైకెత్తి యామనుజుల నడుమకువచ్చి నిల్చెను. ఇట్లు నిల్చి కట్టెదుట బడుగుమేనితో నొకపీనుంగుచాడ్పునఁ బడియున్న యావృద్ధుని కాలినుండి తొరఁగురక్తముఁజూచి, మేనగగుర్పొడువ నటుచూడఁజాలక యించుక యావలిప్రక్కకు మోముఁద్రిప్పి లోనుండి తనంతఁ బట్టరాని వేగముతో బయలువెడలు జాలికి వగపునకు లోనై యామె యిట్లు విచారించెను. "కటకటా పట్టెఁడన్న మడుగుకొని పొట్టఁబోసికొను నీముదిబిచ్చగానికి దైవమీ యాపత్తుఁగూడఁ గల్పింపఁజననా? ఇట్టి నిఱుపేద కాపత్కాలమున నుపచరించిన నాపుట్టువు సార్థకమగునుగదా! కావున నాయోపిన కొలఁది వీనికి సాయమీయఁబూనుకొనియెదను" అని కుడిచేత దండలు నెడమచేతఁ బుచ్చుకొని యెల్లరు తెప్పవాల్పక చూచుచుండ నాజీవచ్ఛవమును సమీపించి నాసికాపుటములకడ

ప్రేళులుంచి కొనయూపిరితో నాతఁడుండు టెఱిఁగి పరుగుపరుగునఁ బొరుగింటికిఁ జని గ్రుక్కెఁడు గంజియుఁ గొంచెము శీతలోదకమును దెచ్చి నీట మొగముఁ దుడిచి బలిమిచే నోరు తెఱచునట్లు చేసి యందు గంజిఁబోసి కడుపుపైఁ జేతితో నిమురసాగెను. వాఁడందు గొంత చప్పరించి త్రావి మిగిలినదాని నుమిసి యింతకు నేఁడఁ దేఱి యంధుఁడగుటఁ దన కుపచారమొనర్చు బాలికను దన్ను మున్ను నిలుపఁబెట్టిన పలుగాకి పడుచులలో నొకర్తగా భావించి, చేరుకొన్న సత్తువతో నల్లనల్లనఁ గఱ్ఱయెత్తి యోపికకొలఁది నాగవల్లిని దానితో మోఁదెను. అప్పటికిఁ గొన్నిదినములక్రిందట నామె కౌముదీమహోత్సవమునకు మనసుపడి తొడిగించుకొనిన వింతగాజులాదండప్రహారమునకుఁ బొడిగాఁ జిట్లెను. తోడనె వేడుకఁజూడవచ్చిన జనులు ముక్కున వ్రేలువైచుకొని యక్కజపడి యుపకారమునకుఁ బోవ నపకారమెదురువచ్చెనను మాటయసత్యముకాదు. ఇతఁడెన్ని కానిపనులు చేయుటచే నిట్టి దుర్దశ సంప్రాప్తమయ్యెనో బాలా! యీదోసకారికి నీవుపోసినగంజి విసమై తల కెక్కెనది. చచ్చినఁ జచ్చు నీవీవలికిరమ్ము వీనితో 'నేల'" అనిమందలించిరి. ప్రాణతుల్యముగఁ జూచుకొనుచున్న తన దినుసుగాజులు పగిలెననియైనఁ గోపింపక చివురుటాకువంటిమేను గఱ్ఱతాకునఁ గందెననియైన వగవక వారిమాటలు సరకు సేయక వారితో "మీపలుకులు చాలింపుఁడు వీనికాలినుండి నేలఁగాఱు రక్తబిందువులతోఁడ నాకన్నులనుండి వేఁడి కన్నీటిచుక్కలు గాఱుచున్నయవి. ఇంతసేపటినుండి యీతీరున నతఁడు గాసిపడుచుండఁ జూచుచు నూరకుంటను నను తెప్పను! మీఁదు మిక్కిలి సాయముచేయు నన్ను వెనుకకుదిగలాగనరేల? మీరెఱుఁగుదురేని వైద్యుని యిలు నాకుఁజూపుఁడు. తే పరుగుఁడు" అని తననెమ్మొగమునఁ గెంపుగదుర వారిఁ గస

దొరకఁడామెను మెచ్చి "అమ్మా! ఈమూడుకాళ్ల ముసలి భూషించిన నేమి దూషించిననేమి నీయుద్యమము సంస్తవనీయము. రాజుగారి యుద్యానవనమునకు పుష్పకరండసమీపమున ధావకుఁడను మంగలి వ్రణవైద్యమునఁ బేరుమోసినవాఁడొకఁడు గలఁడు. ఆతని కడకుఁ దీసికొనిపొమ్ము" అని పలికి తనదారిం జనియెను. నాగవల్లియు ముసలివానిపాలి తల్లియై యొకబండిఁ దెప్పించి, యిరువురు మనుజుల సాయమున నీతని నందెక్కించి, దాని ధావకుని గృహమునకుఁ దోలించుకొనిపోయి, గాయమువైద్యునకుఁ జూప నతఁడు రెండుమూడు లిచ్చినఁగాని మందిడననియె. అనుడు నావఱకుఁ దనహస్తము నలంకరించుచున్న విరిసరముఁ గ్రొవ్వంబోవు నొకవన్నెకానికి మూడుమాడలకు విక్రయించి, వైద్యునకును, బండివానికిని వలయుపైకమొసంగి, ధావకుని యింట నారోగినిఁ బుండుమానుదనుకనుంపఁ దలఁచి, యాతని భోజనమునకు మఱినాలుగు మాడల నీయ నొప్పుకొని, యీమొత్తము తనకిపుడు లేమి తనముక్కుపోఁగుం గిరవు నాతనియొద్ద కుదువపెట్టెను. ధావకుఁడు ప్రతిపట్టికి వైచిన వెనుకఁ దన్నక్కడకుఁ గొనితెచ్చినందులకు నోటికి వచ్చినట్లెల్లఁ దిట్టుచున్న మతిమాలిన యీముసలి నందుపడిచి జాగరూకతతోఁ జికిత్సఁ జేయువలయునని ధావకునితోఁ బలుమారు నొక్కిచెప్పి కన్నబిడ్డ నడబాయు తల్లి వలెఁ బ్రేమతో నామె నిర్గమించి స్వస్థానముఁ జేరెను.



## మూడవ ప్రకరణము.

---

జయసేనుఁడు విజయసేనునకుఁ గడుఁ గూర్చెడు తనయుఁడు. విజయసేనుఁడు మగధరాజు సేవలలోఁ గొన్నిటి కధికారియై, రాజున కత్యంతము హితుఁడై ప్రసిద్ధివడసిన క్షత్రియవంశ భూషణుఁడు. జయసేనుఁడు తల్లిదండ్రులకుఁ జిరకాలమున కుదయించిన నోముల పంటయగుట నెంతయు గారాముచేఁ బెరిఁగి చిన్ననాట హస్తిపురమున ద్రోణాచార్యునియొద్ద విలువిద్దె నేరిచి, వేదములు వేదాంగములు కాశికానగరమున భ్రమరేశ్వరుండను నొక సన్యాసియొద్ద నభ్యసించి తండ్రియనుమతిఁ బెండ్లియాడఁదలంచి చక్కదనంబున రతీదేవియు గుణముల దీవియునగు తారామతిని బాణిగ్రహము చేసికొనెను. ఆదంపతుల మోహలత పూచిన పూవుచందమున వారికి నిరుపమానమైన సొగసయు సోయగమునుఁ గల రాజసేనుఁడను కొడుకల్లారు ముద్దుగా నుదయించి, వృద్ధులగు సవ్వకుం దాతకుఁ బ్రొద్దులుపుచ్చు ముద్దులబొమ్మయై వర్ధిల్లుచుండెను. తండ్రికొలుచుచున్న రాజు లక్ష్మీకటాక్ష సంపన్నుఁడయ్యు, గుణసంపన్నుండు కామి యెఱిఁగి జయసేనుఁ డాతని సేవింపఁదగదని యూరకుండెను. అయినను లావు [illegible] మగఁటిమి రాజెఱిఁగి యప్పటికిఁ గొన్నిదినములకు [illegible]ట శ్రీకృష్ణునితో జరిగిన మహాయుద్ధమునఁ దనకుఁ దోడునమ్మని జయసేనునిఁ బిలిచెను. మనసులోఁ దన కట్టికార్య మిష్టముగాకున్నను, దనతండ్రి కాగ్రహము పుట్టునను భయముతో సాహాయ్యమునకుం బోయి యాదవులెల్ల జెల్లాచెదరై పఱచునట్లు చేసి తన స్వామియగు జరాసంధునకు విజయముఁ గల్పించి వాసుదేవుని బరాజయము నొందించెను. సకల సద్గుణరాశియని జయసేను

ంచెలు పొగడుచుండినను, రాజును, రాజునుంబట్టి తండ్రియు, తం
డ్రింబట్టి తదనుచరులును, గొన్ని సమయములయందు "మన జయ
సేనుఁడు సర్వవిధముల యోగ్యుఁడే కాని వానికి వాసుదేవునిపై భక్తి
ఱెంపు. అతని హృదయమునుండి యావజ్జీవితమునుఁ బాఱఁదోల
కలయుఁజుఁడీ" యని తలంచుచుందురు. ఒకనాఁడు జయసేనుని
సమారుఁడు రాజసేనుఁడు, సంజవేళఁ గార్యాంతరముమీఁదఁ దన
పుత్రునిఁ గనఁబోవుచున్న తండ్రితోఁ బోవఁ బయనమై, యాతఁడు
రా వలదని కసరఁ జిన్న మొగము జేసికొని పోరుపెట్టి వెక్కి వెక్కి
యేడువసాగెను. తండ్రిపోయిన దిక్కు మొగముద్రిప్పి బాలకుఁడు
కన్నెఁద ఊఱడించిన నూఱడక, చేతికిచ్చిన బొమ్మల దూరమ్మున
బాఱవైచి, యోదార్పవచ్చిన తల్లిచంకను నిలువక, యవ్వయొద్దకును
పోవక మువ్వలందెల రాపిడి నేల మొరయునట్లు కాలు నేల రాయు
చుఁ గన్నులనీరు నించుచు గ్రుక్కవెట్టి యేడుచుచుండెను. ఇంతలో
కోటనుండియో వచ్చిన దాసి బాలుని జూసి, చనువులనఁదనవంకకుఁ
జేతులుసాఁచు రాజసేను నెత్తుకొని, కన్నీరుదుడిచి, చెమటలార్చి,
తల్లి దండ్రులపయి నిప్పసిపాపఁడు తనతోఁ జెప్పునేరముల నాల
కించి, తలవాకిటికిఁబోయి, సంజకెంజాయఁజూపి, మెల్లమెల్లవ్యా
పించు వెన్నెలలంజూపి, రాజవీథినరుగు పౌరులంజూపి, తండ్రిమాట
మఱపించి, వాని నూఱడించి, తనవద్దనున్న యొక పూలచెండును
నండయు నాడుకొమ్మని వానిముందువైచి, క్రిందఁ గూరుచుండఁ
బెట్టెను. అవికంటఁబడినతోడనే విలక్షణమైన యొక యానందము
బాలునకుదయింప వడివడి నారెంటిని జెఱి యొకచేతను బట్టుకొని
తాళము వాయించుచుఁ, దనముందున్న దానిపై విసరి నవ్వుచు,
కొంతసేపు నోటఁబెట్టుకొని పంటఁ గొఱికి, యొక్కొకపూవు నేల
రాల్చుచు, రాణివాసివంక రెప్పవాల్పక చూచుచుఁగిలకిలనవ్వుచు

నూడిన కుసుమములఁ బట్టి పరీక్షించుచు నత్యానందకరములగు శై శవక్రీడా వినోదములఁ దేలి తేలి యొక నిముసములో నాదండను జెందును నూడఁజెఱికి పూలకుప్పచేసెను. మఱి కొంత సేపున కారాజనేనుఁడు పూలకుప్పను విరజిమ్మి దానినడుమఁ గానఁబడు మడఁచిన తెల్లని మొగలిరేకు నొకదానిని బైటకుఁదీసి యిదె బూంచి బూచియనుచు బెదరించుచు దాసిపై నైచెను. దాసియు బాలుని చాపలమును రెట్టించు తలఁపున జడిసినదియుఁ బోలె వెనుక వెనుకకు జరిగి భయము నటింపుచుండఁ గుఱ్ఱఁడును మరలమరల దానిపై రేకు వేయఁదొడఁగెను. రేకు ... బడినప్పుడెల్ల దాని యందలి ... ... యము ... నాసకి యుద... ... నది మెల్ల మెల్లగఁ బల్ల... దీపికవద్దకుఁ జని యందు లిఖితములగు ముత్యములవంటి యక్షరము లఁ జదువుకొనుచుండెను. అంతఃపురమునుండి తారామతి బాలుని నూరడించినందులకు దాసిని మెచ్చుకొనుచువచ్చి, దాసిపై నెక్కి బంతుకొనియున్న చిన్నకొడుకు నెత్తుకొని ముద్దాడి దానిచేతి కేతకీ దళమును బుచ్చుకొని చదివి యందలి యర్థము గోచరింపమి నీకిట్టి యుత్తర మెక్కడిది, నీకెవ్వరు వ్రాసినారే, రాజలేఖా! ” యని యడుగుచు నించుక యలుక బూని చీటి మరలఁ గడముట్ట లోలోపలఁ జదువుచుండెను. అంతలో మిత్రదర్శనముచేసి సఫల మనోరథుఁడై మందహాస మొనర్చుచు జయసేనుడు గుమ్మముదాటి లోపలఁ బ్రవేశించెను. దాసియుఁ దారామతియు, దివ్యావంక దిరిగి రేకుఁ జదువుకొనుచుఁ బరాకుననుండి యాతనిం జూడరయిరి. అట్లు సందడిలోనున్న కులకాంతను దాసినిఁ జమత్కారార్థము జడి పింపవలయునని రాచకొమరుఁడు చిరునగవు నగుచు వెనుకనెవచ్చి ... చేతులతో భార్య కనులమూసి చెప్పవలదని దాసికిఁ గనుసన్న

సేయ సింహళలోఁ బంకనున్న రాజసేనుఁడు చప్పటులు చఱచి యప్పప్ప
యని యఱచెను. ఆమాటలు వినఁబడుటయు దాసి వెలవెలఁబోయెను.
తారామతి తెల్లతెలఁ బోయెను. దాసి నెమ్మనఁ జెమర్పసాగెను. తా
రామతి తనులత గడగడ వడంకఁదొడఁగెను. బాలుఁడు తనఁ
దల్లిచంకనుండి దిగఁజాఱెను. తారామతి చేతనున్న కేతకీదళ మప్ర
యత్నముగ నేలరాలెను. యజమానురాలు దాసివంక దా
సి యజమానురాలి వంకయుఁ జూడ నారంభించిరి. ఈవిలక్ష
ణముగని జయసేనుఁడు కారణ మారయఁజాలక నివ్వెఱపడి యిరువుర
ముఖంబుల నవలోకించుచుండెను. కార్యము తప్పివచ్చినదని సమ
యోచితమగు యోచనముజేసి దాసి [illegible] గ్రీనికొనిలచి మొగలి
[illegible] దనవైపు లాగుకొనుచుండఁ బాలు
డడిచూచి "త్రీ! అది నాది యదినాది" అని యఱచి యాగేకుఁ
[illegible]నెను. తండ్రియుఁ గుమారకుని చేతినుండి చల్లగా దాని గ్ర
హించి చూచునప్పటి కందు ముత్తియముల కోవవలె వ్రాతఁ గనఁ
బడియె. ఆవ్రాతఁ దనలోఁ దానె చదువుకొనుచుండఁ దారామతి
యక్కడ నిలువక బాలునైనఁ బిలువక శయనాగారమునకుఁ జని
యెను. దాసి నిలిచినది నిలిచినట్లెయుండి కాఁగల దైవకృత్యమున
కెదురు చూచుచుండెను. అందు లిఖింపఁబడిన మాటలలో నొక్కొ
కదానిం జదువునప్పుడు దాసీశిఖామణి యెుడలు యొక్కొక మొ
క్కయుత్తరము చదువుట పూర్తియగువఱకు కాకాశమంటెను. అనం
తరము జయసేనుఁడు లేచి, రాజలేఖ నుద్దేశించి "ఏమే దీని వృత్తా
ంతమేమి? దీని లిఖించినవారెవ్వరు? పూబడందయును నమ్మకముతో
నింతకాలమును నాలోఁగిటఁ దాసిదపామును బాలుపోసి పెంచు
కొంటినిగదా! అని యించుక యోచించి తనునుద్దేశించుకొని "జయ
సేనుఁడా! నీవు నిర్హేతుకముగా వంచింపఁబడితివో భ్రాంతి నుంతు

నై యపోహపడుచుంటివో యింకను నిర్ణయింపఁదగియున్నది సుమీ నీనమ్మకములును, నీయనురాగములును శోధింప నిదే యదను."

అని పలికి, తనకాళ్ళు చుట్టుకొని విడవకున్న కొడుకును విదల్చి లోనికిం జనుమని యానతిచ్చి యొక పీఠముపైఁ గూరుచుండి, తలమీఁదికెత్తి చూచుచు నెడమమీసముపయి నెడమచేయి వైచి దువ్వుచు నంతరాయములేని యోచనము సలుపఁదొడఁగెను. దాసి కొండొకసేపటికి కటుడాసి, రాజసేనునిఁ జంక నిడుకొని మందిరంబున కరిగి సంతాపతప్తమతియగు తారామతికి మగని తెగువమాటలు నతఁడున్న యునికియు విన్నవించుచుండనాపడఁతి చెప్పరానిరోసము దన్నావేశింపఁ బానుపునుఁ బవ్వళించి కారణములేక పతిమనమునకు సందియము గలిగినందులకుఁ దద్దయుఁ బొక్కుచు నెద్దియునుపాయము గానక, వెక్కసపడుచుండెను. ఈవల నీమగువయు నవస్థయు నానలనాము మగని యవస్థయుఁ గని రాజశేఖు తన కాములు నింత పుట్టెఁగదాయని చింతిలనారంభించెను. జయసేనుఁడు కేళికకీడల వృత్తాంతముఁగూర్చి దాసిచేఁ జక్కఁగా వినకయు, లోనికింజని తారామతితోఁ బ్రసంగింపకయు, నామె పూర్వచారిత్రము జ్ఞప్తికిఁ దెచ్చుకొనకయు, గాటమగు ననుమానము నెమ్మనమున బూని పరితపింపఁజొచ్చెను. ఆదినమున నెద్దియో కార్యాలోచనము పైయవలసియుండుటచే రాజు, విజయసేనునిఁ దనకోటకుఁ బిలుపించుకొనియె. పరిజనములు జయసేనుని యవస్థఁజూచి దేవితోడనను, దేవి యవస్థఁజూచి జయసేనునితోడను జెప్పఁబోయి కళవళపడఁజొచ్చిరి. అనుదినమును సంజవేళఁ దల్లికిఁ బాదాభివందన మాచరించువాఁడుకయున్న నానాఁడు దేవతాపూజయు మాని దేవతాపూజయుఁగూడ మఱచి జయసేనుఁడు, భోజనార్థము సేవకులు పిల్చినను, జనక యొక్క మొగివితర్క సముద్రమున మునింగియుం

డె. తల్లియుఁ గుమారుని యొద్దకు వచ్చి సంతాపకారణ మడిగి యుఁ దెలియఁజాలక భోజనమునకు రమ్మని బ్రతిమాలి నిరుత్తరుఁ డయిన కొమరుని దెస నిరాశచేసికొని లోనికిం జని మగని దారిని వగఁగూరిన కోడలివలనఁ గారణ మంతకన్న నెఱుఁగలేక యీయా కస్మికమగు మార్పున కక్కజపడుచుండెను! సతీపతులు వేడుకలవె ల్లిలో మునిఁగినప్పుడు నిమిషములవలె జాములు పరుగులెత్తినట్లుచే సినకాలము, నేఁటిరేయి నిముసములను జాములుగాఁ జట్టుపఱిచివారి నలయించెను. దురంతమయిన ప్రళయకాలపు రాత్రియోయిదియని జయసేనుఁడు సందేహమందుచుండ సంతలోఁగాముకుల చెవులకుఁ బిడుగుపాటయి నాలవజామున కొక్కొరోకోయని కుక్కుటముల కూ తవినవచ్చెను. అనంతరము రాజకోటవయిపునుంచి వేకువఁ జరుగు తూర్యాది మంగళధ్వనులును వందిమాగధవైతాళికుల కయివార ములును, తెల్లవాఱుట తెలియఁజేసెను.

---

## నాలుగవ ప్రకరణము.

---

మితిమీఱిన బిట్టులుకచేఁ గెంపుగదరియున్న జయసేనునిముఖ మండలమువలె సూర్యమండలము బద్మరాగ మాణిక్యములకాంతు లు దిగంతముల వెదజల్లుచు, నుదయపర్వతముపైఁ దోఁచెను. దినాం తమునఁ దాను విడిచిపోయిన ప్రపంచమంతయుఁ బరికించుటకో యన సూర్యుఁ డుదయశైలమున నించుక మీఁదికి లేచుచుండుట జనుల కగపడఁజొచ్చెను. ఒకరాజు నేలుబడిలో నెంతయు సంతసము నొందు వారు పరరాజు లాక్రమించుతఱి ధాటికోర్వఁజాలక స్రుక్కుదురను

నీతి లోకవిదితమగునట్లు చెంగలువలు మూతి ముడుచుకొనుటయుఁ దమ్మునేలిన స్వామి యేలుబడి వచ్చినప్పుడు ప్రజలుచెందు ప్రమోదము వర్ణింప నలవికాదని చాటునట్లు తామరపూవులు విచ్చుటయు మొదలగు చర్యలు జరుగసాగెను. పౌరులు తూరుపు రేక లారసముఁ బొడగట్టునప్పుడు లేచి సముచిత కర్మములు దీర్చుచుండ జయసేనుఁడు చింతానిమగ్నుఁడగుటచేఁ బ్రభాతమగుటయుఁ దెలియకఁ కొంత తడవుండి, గవాక్షములనుండి వేఁడి కిరణములు సూదులవలెఁ జుఱుకు చుఱుకున నాతని మేనుదాఁకుట తోడనే లేచి, ప్రాభాతికకృత్యముల నిర్వర్తించుటకు లోనికిం జనియె. పోవుచు నిద్రాభారమునను, మనోవికారమునను మొగలిరేకచ్చుటవిడిచి, కొన్నియడుగులు చనినపిదప జ్ఞప్తికివచ్చి మరల రానశ్రద్ధవాడమ నంతలో నేమగునని లోనికరిగె. పరిచారకులు యజమానునమేతముగ, లోననున్న యాసమయమున జయసేనునితోఁ బనియుండి యొకపురుషుఁడుమూప్ప దియేండ్ల ప్రాయపువాఁడు కవాటముదాఁటి లోనఁ బ్రవేశించి జయసేనా! జయసేనా! యని రెండుమూఁడులు పిలిచి యెూత్తఁడుపలుకకునికియు నెవ్వరుత్తర మీయకునికియుఁ జూచి ముహూర్తమాత్ర మచ్చట నొకపీఠముపఁ గూరుచుండెను.

అతఁడు మిగుల పొడవగు మేనితో మేని పొడవునకుఁ దగిన యంగపుష్టిలేక గడకఱ్ఱలాగుననుండును. మేనికాంతి పసిమికెక్కుయు నేమికతమునవో యుండవలసిన నవకము గానంబడదయ్యె. మొగము బాల్యమున మిక్కిలి చక్కనిదని పలువురు వర్ణించిరికాని యతఁడు బాల్యమును విడిచి యౌవనమునఁ బ్రవేశించునప్పుడు మీసకట్టు రామిచే పేడిమూతి యతనిలావణ్యమున నొకకళతగ్గించెను. అంతతోఁ బోవక లోనికిదించుకొనిపోయిన చిన్నకన్నులు పానిసొగసున కంతకు భంగమునాటిలజేయుటచే నాతనిషైఁ గిట్టని కొందఱిష్లు వాండుపు

త్రిలోకంబుకుఁ డని పరిహసించుచుండురు. ఇవియొక్క తక్కినయంగసౌష్ట వమునం దాతనికిఁ గొరంత గోరంతయు లేదు. నాఁడతఁడు తాల్చిన వలువలు విలువగలయవి. మెడలో నిహారములును, ముంజేతుల కంకణములును శ్రేష్ఠములవజ్రపుటుంగరములును హానిసంపదను వెల్లడిజేయకపోవు. ముఖలావణ్యవిహీనమయిన వానిమోము చంద్రదర్శనము లేక కేవల నక్షత్రకాంతిగల యాకసమట్లు భూషణకాంతులచే సంతతగాఁ బ్రకాశింపకుండెను. జరాసంధుని కాపురుషునిమీఁద ప్రేమము మెండు. ఆకారణమున నీతఁడు నలుపు దుండగముల కెల్ల రాజునకు వెరచి పౌరులు సహించుచుండుదురు. చక్కఁదనమెట్లున్నను గుణముల నీతని కీడగువా రాకాలమున నెక్కాలమునను లేరు. అంతిపురమున నుండు పరిచారకులఁ గూర్చియు, మంత్రి, సేనాధిపతి, లోనగాఁగల యుద్యోగులఁ గూర్చియు, సత్కుటుంబములఁ జనియించి గౌరవమున గాలక్షేపము సేయు పౌరులఁ గూర్చియు, నీతఁడు రాజసన్నిధిని యథేచ్ఛముగ నోటికివచ్చినట్లెల్లఁ బలికి, పలికకు వారిపై నిగ్రహానుగ్రహములను బర్యాయముగఁ గలిగించుచుండును. పరిపైనెపఁ జెప్పువాఁడుకయొకటిఁ పగవారివలనఁ బుట్టిపోక్కినప్పుడు, కల్ల నిజమ్ముగలరయక తానదియెఱిఁగినవాఁడపోలె రాజునకు విన్నవించి నమ్మించుచుండును, ఉద్దేశపకారము సలుపుమని జేనితో నొక్కనిగూర్చియుఁ, జెప్పియెఱుఁగఁడుగాని మాపినకొంపలు వేనవేలు. అతని మాటవలన జైక్కంద్రపు నిరపరాధులు రమయుపురులు గోల్పడుటఁబట్టి ప్రజనులు వానినాలుకకుసెల్లుత్రాచనియు, మొత్తనికత్తియనియుఁ బేళ్ళువెట్టిరి. ప్రపంచమున మాయలై ముందు బయలువెడలెనో యీతఁడె ముందు జనించెనో కాలనిర్ణయము సేయుటకుఁ దగిన యాధారములుగనఁబడవు. అయినను వీనికుచ్చితములకుఁ గపటోపాయములకు, మాయలకు మెచ్చి, జరాసంధుఁడు రత్నములకుస్థానమగు సంద్రము

నకు రత్నాకరశబ్దము సార్థకమగునట్లు, మాయలకుఁ బుట్టినిల్లగు
వానికి మాయాకరుఁడని పేరువెట్టుట యొప్పదాయని యాముద్దుపే
రం బిలుచుచుండెను. శ్రీకృష్ణపక్షచరులందఱు వీఁడు రాక్షసాంశ
మునఁ బుట్టెననుకొందురు. గిరివ్రజపురమున నెవ్వఁడేమూల నేర
హస్యముఁ బలికినేమి, నెవ్వఁడేయుత్తరము నెవ్వరికి వ్రాయు, నెవ్వఁ
డెవ్వరితో నెట్టిపలుకులు పలుకు, నవియెల్ల నాపూఁట నీతఁడు తెలి
సికొని సర్వాంశమే విభునకు నివేదించుటచే నితఁడు రాజునకు మూఁ
డవకన్నుగానుండెను.

అతఁ డట్లానిర్మానుష్య మైనచోట రెండుగడియలు జయసే
నుని నిమిత్తముఁ బ్రతీక్షించి, కొంచెము యోచించి రెండుసారులు
తొంగిచూచి యిటునటుఁ బరికించి, యెంతకు నాతఁడు రామికి
విసిగి యటనుండి లేచిపోవ నునుకట్టి యెట్టయెదుట, రాత్రియెల్ల
జయసేనుని చేతనుంట, మెయికాకం గమలి, నలిగి, వాడియున్న
మొగలిరేకుం గని యెత్తి యందలి యక్షరములఁ జదివి చదివి చప్పుడు
గాకుండ దానిఁ గత్తియొఱలోఁ బదిలపఱిచి, యొక్క నిమేషమయి
న నచ్చట నిలువక, వడివడిగ నడచుటలోఁ దనకుఁగల బలమంత
యు వినియోగించి, తిరిగియైనఁ జూడక, యిల్లుదాఁటెను. ఇతఁ డిల్లు
చొచ్చుటయు, నిలువెడలుటయు నింటివారెవ్వరెఱుఁగరు. అంతటనా
తఁడు చనినమఱియొక గడియకు జయసేనుఁడు ప్రాతఃకాలోచితముల
నిర్వర్తించుకొని యథాస్థానమునకు వచ్చి కూరుచుండి, తనకు సం
తాపకారణ మగు లేఖలోని కొన్నిమాటలు జ్ఞప్తికిరామిఁ దానిఁ
జదువ తలఁపున రేకున కిటునటు వెదకుకొనియెను. ఎంతవెదకిన
నది దొరకకపోవ నంతస్వల్పకాలములో నది యేమయియుండునని
తలపోఁతలకుఁ జొచ్చి, యిట్లనుకొనియెను. "నేనీస్థలము వాయు
నప్పటికిక్కడ నెవ్వరు లేరు. ఒరులు వచ్చినారనుటకు వీలులేదు.

వచ్చిరనుకొనుము. వారు మా యుత్తరవులేక యిచ్చట వస్తువుల నేలగైకొని పోవుదురు ? కైకొనువారు కలరన్నను వారికది యెట్టి ప్రయోజనకారియగు ? ఏమీ ! యీయాశ్చర్యము. ఇది యుత్తర ముకన్న నెక్కుడు వింతగానున్నది. తారామతియు, రాజలేఖయుఁ దమమీఁద నాకుఁ గల యనుమానము మాన్పుకొనుటకు రేకుమాపు మాపఁ దలఁచి యిట్లు సేయవలయు, వారికన్న నన్యులకీకేతకీ దళముతో నక్కఱయున్నట్టు నామతికిఁ దోఁపదు. ఈగడియవఱకీయు త్తరమునకుఁ దారామతికినిఁగల సంబంధ మస్తినాస్తివిచికిత్సా హే తువయి యుండెను గాని మొగలి రేకు మాయమగుటవలన నాయను మానము దీరిపోయినది. ఈసాహసము తప్పక యీమెదియే య యియుండనోపు. ఇట్టి నెఱజాణయగు దాసి యింటనుండ నామెకి ట్టిపనులు కరతలామలకములగుట కేమి యాశ్చర్యము ? హా ! తా రామతీ ! ఎంతపనిచేసితివి? కలంక మెన్నఁడెఱుఁగని నీ పుట్టినయిం టి గౌరవమును, నీకన్నతండ్రి పరువునయిన దలపోయవైతివి. ఈవల నామాటకేమిగాని పావనులలోఁ బావనుఁడగు మాతండ్రిని మావంగడమునయినఁ దలంపవయితివి. అచ్చపుఁ గొలములకు రెం టికి మచ్చదెచ్చిన నీవు నామనస్సునియెడు దూదిబుంగకు రవులుచు న్న కొఱవివి సుమీ? నాఁటి నీముఖస్తోత్రములఁ దలఁచి నేటియీ కేతకీదళమునందలి వాక్యములఁ దలఁప నీకడ నింత సాహసము క లదేయని సందేహ మొదవును. రాచపుట్టుకపుట్టియిట్టి చెట్టచేసిన పడఁతికి మగఁడనయి యసుఱులు నిలుపుకొనుటకన్న యీవాడిఁ వాలున నన్ను నేఁబొడుచుకొన్న నొప్పదే. గుణసౌందర్యముల నా కన్న నిన్ను వలపించిన యప్పురుఁ డెవ్వఁడో యెఱుఁగనయితి. స్త్రీల సాహసములు గ్రంథములలోఁ జదువుటయుఁ బెద్దల నోట వినుట యుఁ గాని యనుభవ సిద్ధముగ నెఱిఁగిన వారుండరు. నీ స్త్రీ

స్వభావమును నాకనుభవసిద్ధముగ నేర్పిన యొజ్జవగుట నాకు వందనీయురాలవయితివి గనుక మానసిక నమస్కారము సింహాసనబత్తితో నీకు నే నొనర్చెదను. ప్రత్యక్షవందన మొనర్చుటకు నీముఖము చూచియేను భరింపనోప. హా! మాలదైవమా! జయసేనుని బ్రతుకింత యాఱడివోనఁ జేయుదువే. ఇంకబౌరుల మొగము తెత్తెఱఁగున గాంతు? మాయయ్యతో నేమొగము పెట్టుకొని మాటలాడుదును? ముద్దులాడు రాజసేనునకు నాకు నింతటితో ఋణము దీఱెనోకో! యేమి సేయుదు? యెద్దియుపాయము? అయ్యో! కేశక్లేశమా! నీవు సన్నిధినుండియు లేకుండియు నాకలమటఁ గలిగించుచున్నావుగదా" అని వగచుచుఁ బ్రాణముపయి నిరాశ నొందుచు, దైవమును దూఱుచుఁ, గులకాంతను నిందించుచు, నడుమ నడుమఁ దన్నుఁ దామఱచుచు, నాఁకలి యగుటయుఁ, దప్పిగల్గుటయుఁ బ్రొద్దెక్కుటయు నెఱుఁగఁడయ్యెను.

అటఁ దారామతియు స్పృజ్ఞపయిఁ జేర్చిన మేను చేర్చినట్లె యుండ, కనులనుండి రాలుచున్న బాష్పములు రాలుచునేయుండ, పీడిన కచభారము పీడినట్లయుండ, నూరక పతిమతము తెలియక వాపోవుచునుండెను. ఆమెనూఱడింపఁ బలుమాఱు దాసి దగ్గఱియునోరు రాక, దేవికంటె నెక్కువకన్నీరు కాలువలుగట్టఁ దన తెలివిమాలినతనమునకు జయసేనుని కారణ మరయని యలుకకు వగచుచుండెను. తారామతియు నొకమాఱు దాసి మొగమువంకఁ జూడ్కులు నిలిపి తనయవస్థయె యదియు ననుభవించుట యెఱిఁగి యిట్లని విచారించె. ప్రాణేశ్వరుఁడు మొగలిరేకు నాచేతఁ జూచినది మొదలు లోనికిఁ రాడయ్యెను. నిద్రాహారములు లేక డస్సియున్నవాఁడు. నాపయిం గట్టియనుమానము నెమ్మనమున నుదయింపనోపు. దాసినో నన్నో, చేరంబిల్చి కారణ మరయఁడు. మును

ముందు నేనే యీబాబు పూర్వోత్తర సందర్భములవిన్నవింపుదమను కొన్న, నాయనకట్టి యనుమానము కలిగెనో, లేదో తెలియరాదు. ఏమనుకొనుచున్నవారో, యేమి యోచించుచున్నవారో తెలిసికొనక మగవారియొద్దఁ జనవుఁ గయికొని సంభాషించితిమేని మానహాని వాటిల్లు. నిజము విన్నవింపకున్న హృదయేశ్వరుని మనంబెంత దవ్వుల కరుగునో యని భయము పొడముచున్నది. అయిన నటులేల యగు! ఇంతకాలమునుండి యీమహాత్మునితోడఁగూడి కాపురము సేయుచున్న యిల్లాలి సుగుణ దుర్గుణముల నరయక మనోనిశ్చయముఁ జేసికొనుటకు విజయసేనుని కుమారుఁడు సామాన్యుఁడా! కటకటా! మొగలిరేకువజ్రపుబాకువలె నాహృదయమును హృదయేశ్వరునిహృదయమును వ్రక్కలించుచున్నది. జీవితేశ్వరుఁడడుగకున్నను నేనైనను నిందలి నిజ మరయవలయుఁగదా” అని దాసినిబిలిచి, దాని వెఱపుఁదీర్చి లాలనముతో “రాజలేఖా! ఇంతకాలమునుండి నీవు నా యంతఃపురమునఁ దలలో నాలుకవలె మెలఁగుచు నెఱిఁగియో యెఱుఁగకయో పంజువంటి నాకాఁపురమునకుఁ జేతులార ముప్పు తెచ్చితివి. గిరివ్రజపురమున నీకెవ్వరయిన మనోహరుఁడుండి యీయుత్తరము లిఖించెనా? లేక తారతమ్యమెఱుఁగక నానిమిత్తమే దోసకారియెవ్వఁడైన నిది యుద్దేశించెనా? ఇందలి నిజముదాఁపక నీకు నేను దల్లివంటిదాననగుట నాతోఁ జెప్పు”మని మందలించెను. రాజలేఖ యమ్మాటలవిని గడగడవడఁకుచు గద్గదస్వరముతోఁ గన్నీరు దేవిపవ్వళించిన పానుపుం దడుప నిట్లనియె. “అమ్మా! నేను నిక్కము దాఁపక తెలిపెదను. నే నిందే పాప మెఱుఁగను. ఇందలి సత్యమును క్రమముగ నెఱుఁగవలయునుగాని యిది యిట్టిదని యిప్పుడు తెలుపఁ జాలను. మీపాదములాన.

# అయిదవ ప్రకరణము.

అట్లు నాగవల్లి బయలుదేరి పెద్దయుం దడవగుటకుఁ దనచెలి కత్తె చీవాట్లుపెట్టునోయని శంకించుచుఁ గడువడి నడువ నుంకించుచు రాజమార్గమునఁ దన కెదురై తిరుచుగ వచ్చు జనులగుంపునకు దొలఁగి నిలచుచుఁ దనతోఁ బని కలిగియో, తన్నానవాలెఱిఁగి యో పలుకరించు స్వపరిచితుల మాటల వినుటకు వ్యవధిఁ గానక సత్వరముగ నిలుచేరు నభిలాషతో నరుగుచుండఁ దాను విక్రయిం చిన పూలవృత్తాంతము దన మనమునకు ములుగుగ్రుచ్చుకొన్న తెఱఁ గున స్ఫురణమునకు వచ్చెను. వచ్చుటయు నాసుందరి ముందడి కడుగిడఁజాలక యించుక నిలచి "ఆహా! యిదియేమి? ముసలివాని పయిఁ గలిగిన యక్కటికము మిక్కుటమగుట నొడలెఱుఁగని సేవ మెత్తి పూలదండను చెండును మొగమెఱుఁగనివాని కెవనికో విక్ర యించితిని. చెండునందు దివ్యకుసుమదళ మమర్పఁబడి యున్నదని పూలవర్తకుఁడు నన్నుఁ బిలచి నొక్కిపలికి దాని నిచ్చెను. సాధా రణమైన చెండుగదా యని విక్రయించితిని. కాని యామాట తప్పి మయమున జ్ఞప్తికిరాదయ్యె. ఈమాట మాచెలికత్తెకుఁ దెలియ కుండ దాఁచియుంతునా? కాలక్రమమున నిది పొక్కకపోదు. అప్పుడు మాగుణోత్తమకు నామీఁద నలుక వొడముటయు, నీవఱకు నా యందుఁగల విశ్వాసము, గౌరవము నశించుటయు, సంభవించును. కావున నిజముపల్కి తప్పు నొప్పుకొని యప్పడంతి పాదములపైఁ బడుట యుచితమని తోఁచెడిని. దీనసంరక్షణమన్న మాగుణోత్త మకుఁ జిత్తానందకరముగదా. ఈముసలియనద యసురుల నిలు పుటకు నేనొనర్చిన యీసాహసమునకు నన్ను నామె సైరింపదే. నాయొద్ద నాచారిడుగొన్నవాఁ డెవ్వఁడో గురుతుపట్టజాల, నైన వెద

కేదఁగాక" యని ముందునుండి వెనుకకును వెనుకనుండి ముందుకును రెండుసారు లాపీక్షించిదిరిగి వానిం గనంగొనన నేరక నిబిడమగు నెవ్వగచే నిట్టూర్పువిడిచి దైన్యముప్పై భారమువైచి యింక నిలుసేరుట మంచిదని తలఁచుచున్నది. ఇది యిటులుండ నాచేతి ముద్దుటుంగరముఁగూర్చి యేమిమూఁడనున్నదో యని జంకుచు యోచనసేయుచు మనమున సంశయించుచు నెట్టెటో తనవు నింటికిఁ జేరవేయఁదొడఁగెను. ఆమె తెరవువ నడచుచుండిన నామె మనస్సు మాత్రి మాఘాంగ నిలక పలుతావులఁ దిరుగులాడుచుండుకతన నాయింతి గమ్యస్థానము మఱచి తన యిలుదాఁటి కూఁతవేటు దవ్వరిగి, యచ్చట నిటునటు నలుదెసలు పరికించిచూచి క్రొత్తక్రొత్త మేడలు, వింతవింత గోపురములు దనకంటఁ బడ నయ్యారే దారితప్పి క్రూడని తావులకు వచ్చితిని. ఈయుదయమున నేరిమొగము గనుగొంటినో యన్నియు సంకటములవలెఁ దటస్థించుచున్నయవి. ఇది జరాసంధుని యుంపుడుకత్తె కొడుకును రాక్షసాంశమునఁబుట్టిన దుండగీఁడును నగు రణార్ణవుని యిల్లని తలఁచుచున్నది. ములుకంపఁ దవులొన్న సన్నచీరెవలె వీని కంటఁబడిన పడుచు సిలుగులఁబడక యూరక నీవలకు రాదు. అదియునుగాక మాఘుణోత్తముప్పై గను వేసినాఁడు. ఇటనుండి సత్వరము దాఁటుట కర్జము." అని తలపోసి కదలుటకు యత్నించుచుండ నింతలో వెనుకనుండి యెవ్వఁడో చప్పటులు చఱచుచు భాగవల్లీ భాగవల్లీ, కాదు, కాదు రాగవల్లీ! యిటురా, యిటురా యని పిలువఁ దొడఁగెను.

ఆ నుడుగు పిడుగువలెఁ జెవులఁ బడుటయు నామె వానికడ కరుగుటకిష్టములేక ముందునకు సాగిపోవుటకు ధైర్యమురాక కదలక నిలువంబడి యుండెను. అంతలో నొక విశృంఖలాంగుఁ డగు పురుషుఁడు వికవిక నవ్వుచువచ్చి ఓసీ! త్యాగవల్లీ !పిలుచుచుండఁగనే బొంకకాకి

వలె నిలిచెదవేమి ? ఇంతమాత్రము రాఁగూడదా మాసామి నిన్నుం బిలుచుకొని రమ్మని యానతిచ్చె. ఒక్కమాట వినిపొమ్ము. రాయని యెదురుబెదురు గొనక, యీపలుకులు ములుకులవలెనాటి స్థంభము లేవనున్న యాయన్నుం గుడిచేయిపట్టుకొని నిన్ను నేను బెండ్లియాడు నప్పుడు నీ కేలుదమ్మి నిటులే గ్రహింతును జుమీ యని లాగ నాగవల్లి కన్నులనీరు నించుచుఁ దనకు సాయముసేయుమని దారిం బోవువారిఁ జీరుటకునైన సత్తువలేమి నూరకుండెను. అంతట నాసే నకుఁడు కోపముతో సహజముగఁ గాఱుకల్లఁదన్నముగల తనమొగ ము బిగఁబట్టి నీవిపుడ రావేని రావణుఁడు దమయంతి నెత్తుకొని చన్నవితమున నిన్నెత్తి మాయజమాను సముఖమునఁ బెట్టగలను జుమీ. జాగ్రత్త. హస్తినాపురమున ధర్మరాజు తమ్ముఁడగు కుంతి భకర్తునితోఁ జిన్ననాఁడు దండపట్టులుపట్టి గెలిచిన సర్వావకుని సన్నె ఱుఁగవు గాఁబోలును. నడు నడు. ప్రాణేశ్వరీ ! యని యసందర్భ ములగు పలుకులు పలుకుచు మందలించెను.

మద్యపానముచేతనో బుద్ధిమాంద్యముచేతనో రానిమాటలు, పురాణగాథలు, నాగవల్లి కర్థముగాక వచ్చియురాని చిఱునగవుం దెచ్చి యామె మొగమునకు భయములో నొకవింతశృంగారము గలి గించెను. ఆమొఱకుని యాకార మెంత వికారముగనుండెనో మాట యంత మోటదై యుండును. ఇంతలో లోపలినుండి వేఱొక సేవకు డరుదెంచి సర్వావకుని నివారించి కనుచీఁకటిగానున్న యత్తఱి నత్తె ఱువున నేను ననకుంటఁజూచి నిలుచున్న నాగవల్లిని సందిటఁబట్టి యె త్తి గరుడుఁడు నాగకన్యనుంబోలె పట్టి "దింపు దింపు నేనే యా మెనెత్తికొనివచ్చెద" నని వెనుకకు దిగలాగుచున్న సర్వావకుని మాట సరకుగొనక లోనికిం జనియె. ఐంద్రజాలకునిచేతి కీలుబొమ్మ బోలిన నాగవల్లి సందిట నిముడియుండి భయకంపితయై పాని

చేతులలో మూర్ఛనొంది కనుదమ్ములు మూసికొని కాలభుజంగమం బుచాడ్పున వీడివ్రేలాడుచు నేలదాక కచభారముతోఁ దన్నేలుఁగిక యుండెను.

నాగవల్లి లోనికిం గొంపోవఁబడుటయు రణార్ణవుఁడు కనుసన్నయొనర్ప నద్దాని కర్థమెఱిఁగి సర్వపరిచారకులు తటాలునఁ దలుపు మూసి తమ యనార్యకృత్య మొరులకుఁ దెలియకుండఁ జేయ యత్నించె. మూర్ఛిల్లిన నాగవల్లిని రెండవసేవకుఁడు మెల్లమెల్లగ రణార్ణవుని పడకటింటనుండిన యొకమెత్తని సెజ్జఁజేర్చి మూర్ఛదేఱునట్లు గాలోచితములగు శైత్యోపచారములు గొన్నిటి నెరపసాగను. కొన్నినిమిషముల కాబాలిక తెలివిదెచ్చుకొని కనుదమ్ములు విచ్చి చూచునప్పటికి రణార్ణవుని ముఖచంద్రమండలము కన్నెదుటఁ గానఁబడి యామె నేత్రపద్మముల ముకుళింపఁజేసెను. అనంతర మినువురు సేవకుల నావలకుఁ బొమ్మని యానతిచ్చి రణార్ణవుఁడు నాగవల్లిపక్కఁ జేరి తనమూలమునఁ గ్రమ్మఱమూర్ఛ నొందునేమో యని భయమునొందుచు నొకమాఱు మీఁదఁ జేయివైచి, 'బాలా! నీకింత వంతయేల' యని యేమోపలుకయత్నించుచుండ, "అయ్యో! చచ్చితి చచ్చితి" నని బిగ్గరగ నఱచి తన్నితఁడు తుదముట్టించునని గడగడ వడఁకి పునర్మూర్ఛావస్థ నొందెను. అంతట నాసూరుఁడు మరల నామెను మూర్ఛదేర్చి యల్లనల్లన నిట్లనియె. "ఓ సుందరీ! నాగవల్లీ! నీకు నేను కీడుచేయఁదలఁచి యిటురావింపలేదు. నీతోడఁ గొన్ని రహస్యముల ముచ్చటింపఁగోరి చిరకాలమునుండి సమయము నిరీక్షింపుచుండ నేఁటికిశంకరుఁడు నాకుతగునదను గల్పించెను. మఱ్ఱు వగదురనిన్ను నేనెట్లుపిలిచినను నావలననెద్దియో భయముదలఁచి నీవు రాకుందువని యిట్లు బలిమిచే నినురావించితి. మరల సుఖముగ నిన్ను నీచెలియలిక కనుచుభావము నాయది. వగవక నాపలుకు

లాలకించి నన్నుఁ గృతకృత్యుఁజేయ వేఁడుచున్నవాఁడ. ఇవిచేతులు కావు కాళ్లుసుమ్మీ” యని హస్తపల్లవములు స్పృశించి దైన్యము తో నడుగుటయు, నాగవల్లి తన కాతనివలన భయకారణములేదని కన్నులు తెఱచి యాతనిదిక్కు మొగమై యాతనిమొఱ యాలించు నట్లు కనంబడియె. అంతట రణార్ణవుండు తనకథ నిట్లు చెప్పనా రంభించెను.

“పాల సంద్రమునకు లక్ష్మియు, మంచుగొండకు గౌరియుఁ బలెఁ జంద్రపాలునకు మున్ను నోఁచిన నోములపంటవై వొడమి యీనాఁటి రాచపుట్టువులనెల్ల గిళవళము పాలుసేయు మీనెచ్చెలిం గూర్చి యించుక ముచ్చటించెద. దయార్ద్రహృదయవై యాలకించి నామాటపలుకుల నాపలుకులుగనె విన్నవింపక నీవే నీదు కులుకు ముద్దుమాటలతో నించుక మేళవించి యామెతో మనవి యొనర్చి నాయెడఁ గరుణ గల్గింపవలయు. చక్కఁదనముంబట్టిచూడ మీ గుణోత్తమ కీడువచ్చునట్టి రాచవాఁ డీజగమునఁ గానరాఁడు. ఆకా రణమున నెవ్వనిఁజేకొనక నొక్కటియేగదా ! కావున నన్నుం జేసి కొనినను దప్పులేదుసుమా. నేను మీనడుమనుండఁబట్టి యిట్లు సామాన్యునిగ నన్ను బరిగణింతురు; కాని నావంటి ధైర్యసాహస ములు పోయగమునగల క్షత్రియుఁడు లేఁడని నీవుమాత్ర మెఱుఁ గవే! నాచక్కఁదనమును వేఱ వర్ణించుటకంటెఁ బలువురు రాచ కన్నియలు నాచెట్టఁబట్ట దపసులు ధారవోయుచు నాకీడుజోడుగామి నిరాకరింపఁబడి రనుమాట చెప్పిన నే నెట్టివాఁడనో నీవెఱుఁగఁగలవు. నాసాహసమునుగూర్చి యొక్కముక్క నీచెవిని వేయవలయు. ఈమధ్య కాలమున మాగధ శ్రీకృష్ణులకు జరగిన కయ్యమున నేను గారణాం తరమున నూరివై పొంటరిగఁ జనుచుండ నన్నుఁ జూచి పిఱికివై పో రువిడిచి పరుగెత్తుచున్నాఁడనియు, రణార్ణవుఁడు నేతిబీరకాయవలె

లోని సారములేనివాఁడనియు, గిట్టని వాండ్రు పరిహసింపఁ దలచి నాపై వేసిన చెడువాడుక నీవునమ్మినఁ జెప్పఁజాలనుగాని యుద్ధము వచ్చినప్పుడు పగవారిఁ బొడుచుటయో, ప్రాణములు విడుచుటయో నాపనిగాని పాఱిపోవుట మాయింటి కుక్కయు నెఱుఁగదు. జయసేనుఁడు తెంపరి కళానందుఁడు పోటుమానిసి యని పక్షపాతమునఁ బాపపులోకులు కాకులట్లు చెప్పుకొని యఱచుచుందురు. నాకు వారెందును సరిరారు. ఇంతయేల? నేను నీవెఱుఁగనివాఁడనుగాను. మీగుణోత్తమ నాహృదయము దొంగలించినయది. నాగవల్లీ! నీకడ నేను దాపక నిక్కము నక్కాణించెద. ఈసుందరిపై వలపునిలుపుటమొదలు నోరికన్నముఁ గంటికిఁ గునుకు మదికినిండువేడుకయు మాన్చె. మాసదాశివుని యడుగులాన! చూచిన సౌందర్యతిలకనే. తలచిన సౌందర్యతిలకనే. పలవరించిన సౌందర్యతిలకనే. వేయేల? ఆగుణోత్తమ యిల్లాలు కాదేని రణార్ణవుని ప్రాణములు నిర్హేతుకముగఁ దీసినదోషంబు మీచెలిం జుట్టుకొనును. ఆమెయందు నానిలిపినంత మక్కువ యెవ్వరు నిలుపరు. ఇట్టినన్ను విడిచి కళానందుని, గళానందుని గేలుపట్టుట కులమునకు వన్నెయఁదగ్గించుటకాదా? ఈ వామెపై కారణములు పరసి యామె మదికి వచ్చునట్లు, నితరుల మీఁద ననురాగము లొచ్చుగ నామీఁద ప్రేమహెచ్చుగఁబలికి మా సమాగమము నీవుఁ గూర్పవలయు" అని పలుక సోత్కర్షము పరనింద ప్రధానములుగఁ జేయఁబడిన యుపన్యాసమంతయు నా యింతి జాగరూకతతోఁ గొనముట్ట గమనించి చివచివలేచి పానుపుపైఁ గూరుచుండి, తన ప్రస్తుతావస్థకును రణార్ణవుని యాదరణకు ననువగునట్లు మృదూక్తుల నిట్లనియె.

"అన్నా! నీమనంబట్లు మాగుణోత్తమ కారణముగ నుత్తలపడుట మున్నెన్నఁ డెఱుఁగనైతి. నన్ను బలాత్కారముగ మీ

యింటికిఁ దీసికొనిరానే? కాకిచే వర్తమానమంప నేనునీయడు గుడమ్ముల సన్నిధికివచ్చి వ్రాలకుందునే. మానెచ్చెలి గుట్టుమట్టు నీతోడ మనవి యొనర్పవలయునని పెక్కునాళ్ళుగ నామనమునఁ దలంపుగలదు. ప్రథమమునుండి తెలివిగలిగిన వెనుక నాతలం పుఁ దెలుఁగ జేయుట కవసరము నేటికి విషమున వచ్చెఁగదా" యని సంతసించు చుంటిఁగాని బలిమిని సన్నురావించితివని వగచుటలేదు. నీమాటయందలి చమత్కృతియు, నీయర్థగాంభీర్యమును, నీనోట నుండి వినినకొలంది నాకుఁ జెవులవిందగుచున్నది. అహాహా! నిజ ముగా నిట్టి మనోజ్ఞములగు ద్రాక్షపండ్లవంటి తీయనిమాటలు మా చెలి యొకమారు చెవులార వినిన నిన్ను విడువఁగల్గునే. చక్కఁద నమున్నయెడ సాహసౌదార్యము లుండుటయరిది. ఇది యున్నచో ట సిరియు, విద్దియయు నంట గగనకుసుమము అన్నియు నున్నగు ణముకుదిరి నలువురలో మెలఁగి ఛీ యనిపించుకొనుటయరిది. అన్ని టందక్కువ లేకయున్న నినుఁబోలు పుణ్యజనవతంసముకొలకు నోము లునోఁచిన మాచెలికి వేయిపుట్టువులకయిన లభించునే. అయినను మాచెలి లేనివారియెడల నసూయఁ జూపునదికాదు. మనసునమిముఁ బాణిగ్రహణము నొనర్చుట కిచ్చగించియుఁ బ్రౌఢయగుట నది మీనోట వినఁదలంచి యసూయ నప్పుడప్పు డభినయించుచుంట జూచి వివేక నిధియగు నామెయయ్య చండ్రపాలుఁడు బిడ్డయను మోమోట నొకమూలఁద్రోసి యామెంగసరి నీకేలువట్టుమని చెవి నిల్లుగట్టుకొని పోరుచుండును. దాసినగుటచే నాకంత స్వాతంత్ర్యంబు లేమి నవసరమగునప్పుడెల్ల నూరకుండక నాశక్తివంచన లేకుండ నా యంత నేను గలుగఁ జేసికొనుట యుచితముకాదని మాట సాయము చేయుచుండు. కళానందునకు నేను సాయమెట్టిదియుఁ జేయఁజాలఁ జుమీ. నీ వింకజెంగగొనక మనోధైర్యముఁ జిక్కఁబట్టి యుండుము. ఆ లతకూన నినువిడిచి యుండ్లని సైకొనదు."

ఈ పలుకులు రణార్ణవుని మోహార్ణవమున ముంచి తాండవ నృత్యము చేయించెనని వేరచెప్ప నావశ్యకతలేదు. కాని క్రొత్తగా నంకురించిన యావేశముచే నాతఁడు లేచి నిండువేడుకచే వ్యక్తముకాని మాటలతో నాగవల్లికి మ్రొక్కి, వహవా! వహవా! నాగవల్లీ నాకు నీవు తల్లివనినను దప్పులేదు. నీఋణము నెన్నిపుట్టువులెత్తియుఁ దీర్పనాతరమే. మఱవరానిమేలు నీవునాకొనర్చితివి. ఇంక నొనర్పఁదలఁచుకొంటివి. కళానందునిపై నాయిందువదన కపూయఁ గలిగించుటకు నీవు జతన సేయవలయు. ఆపాపి చెడిబ్రతికినవాఁడు. నేనాగర్భశ్రీమంతుఁడ. వాఁడు మన నగర మునకు మహాశత్రుఁడు, వాసుదేవానుచరుఁడు. నేను జరాసంధ పక్షపాతిని. నాకామె నొసంగక కళానందునివంటి మందున కర్పించుట కాకిముక్కునకు దొండపండుఁ గట్టుటకాదే. ఇది యటుండనిమ్ము. నీవు నాపక్షముదాననగుటచే నీకెఱింగించినను దోసములేదు. ధృష్టకేతుని కుమారుఁడు వజ్రదంతుఁడు మొదలగు నేస్తకాండ్ర సాయమునఁ గొన్నిదినములలోఁ గళానందుని దుదముట్టించెద. చూడు నా దెబ్బ. అంతియకాదాతని మిత్రుఁడగు నుజ్జయినీపతి విక్రమదేవ్రునిపై మగధరాజు దండువెడలి మాళవదేశమునకు నన్ను రాజుగాఁ జేయఁ బ్రయత్నించుచున్నాఁడు. ఈపలుకులు నీ హృదయమున నిలుపవలయుఁగాని యేరితో ననఁగూడదు. నీ వీరాత్రి మా యింటనుండి నా యొసంగు నాతిథ్యము నంగీకరింపవలయు" నన నాగవల్లి మొగము వెలవెలఁబోవఁ దన ప్రియసఖి తన నిమిత్త మెదురుచూచుచుండు ననియుఁ బా నరుగక తప్పదనియు నెన్నెన్నో నెపములఁ గల్పించి యాతని మనసు గరిగింపఁ బ్రయత్నించియున్నట్లు చేయలేక యాకేయి తనకు రణార్ణవునివలన రాఁదలఁచిన యుపద్రవ సముద్రము నీఁదఁదలఁచి యచ్చట్లఁ గూరుచుండెను.

# ఆఱవ ప్రకరణము.

---

మగధమహారాజగు జరాసంధుఁడు నివసించు మందిరముదక్క గిరివ్రజపురమునందు మందిరము లన్నిటఁ జంద్రపాలుని గృహమునకు సాటివచ్చెడునిల్లు గానఁబడదు. పొడవును నిడివియుఁ గల చుట్టుగోడలును, నాలుగు గోడలనడుమ వసంతుని విడిదియట్లు రాజిల్లుసుందరోద్యానవనమును, వనమధ్యమునఁ బాలమున్నీటిలోఁ బెరిదీవి చాయఁ బురజనులకన్నులకుఁ బెనువిందుసేయుమేడయు, మేడపైఁ జిత్రితములై నానావర్ణములు నింపుగొల్పు సాలభంజికలును, నిరుపమానమైనసౌందర్యమును గిరివ్రజపురమునకుఁ దెచ్చుచుండెను. ఆ మేడ మూఁడవ యంతస్తుగోడకుం గల గవాక్షములు రాజమార్గమున కభిముఖములై యుంటగృహలక్ష్మి కన్నులుదెఱచి నగరముంజూచుచున్నదో యనితోఁచు. గృహలక్ష్మి విలాసార్థము తనువల్లిం గప్పికొనిన తెల్లని దువ్వలువ చందమున వెల్ల గనంబడుచుండు. చంద్రశాల యనఁబడు మూఁడవ యంతస్తునందు వ్రాయఁబడిన చిత్తరువులసొగసుఁజూడ నగరవాసు లనుదినము వచ్చుచుందురు. అచటి యడుగుభాగము స్ఫటికశిలానిర్మితమయి, గృహలక్ష్మియనఁ జెక్కుటద్దమట్లు మెఱయుచుండును. ఆమేడ కలంకారమ్ముం దెచ్చుచిత్తరువుల కలంకారమొసంగునదియు, గృహలక్ష్మికి నగలువెట్టి వన్నెలు దిద్దునదియు, సౌందర్యతిలకయను నామాంతరముగల గుణోత్తమ యుత్తమోత్తమమై యందువసియించు. ఏలావణ్యనిధి యుదయమగుట మొ[illegible]ద్రియగు చంద్రపాలునకు నింద్రసమానవైభవులగు మహారాజులుచేతులు మోడ్చి చేయుమనవి సనవులు నిరాకరించునంతటి గౌరవము లభియించె, నేబంగరుబొమ్మ లావణ్యము నృపకుమారకుల హృదయసముద్రముఁ గలఁచుఁ గవ్వపుఁ గొండయై మోహంబను నమృతంబుద

యమొందు కారణమయ్యె, నేయింటిసన్నిధానవర్తినులగుట నాగవల్లి మొదలగు దాసీజనంబునకు రాజాంతఃపురముల నింతింత యనరాని మన్నన సంభవించె, నే మంజువాణి వీణవాయించువేళ దాసీజనం బును వేడి తెలిసికొని రాచకొడుకులు ప్రచ్ఛన్నవేషులై సుధారసము లుకుపాటల నాలకించిధన్యులగుచుందు, రేచుక్కనికూతుమొగము కనులనిండఁజూచిన దృష్టిదోషంబు ప్రాపించునను భయమునఁదలిదం డ్రులు,నెచ్చెలులు, చుట్టములు మనసారజూడ వెఱతురాపూబోడి, యా మెలనాఁగ యాకనకాంగి యామేడనునివసించు. నాగవల్లి పూవుల దేరనిలువకుండుట మొదలాపోనిమిత్తముగుణోత్తమయుఁ బ్రియసఖి యుసరాగలతికయు క్షణక్షణ మెదురుచూచుచుండిరి. "రోహణకుఁడు పూవులేయిక యింతతడవు మసఖిని నిలిపెనో, యామెయే మార్గవశ మున నేరయినఁ గనఁబడిన మాటలాడుచుండెనో, దురాత్ములేరైనఁ జెరగొనిరో!" యని రాగలతిక విషాదమొందుచుగుణోత్తమతత్తరపాటు నివారించుచుఁ జీఁకటిపడునంతదనుక నెట్టులో ప్రియసఖి వియోగము సయిరించెను. కాని సూర్యుఁడు పడమటసముద్రమునం గ్రుంకుటయు, వీరిమనోధైర్యములు జంకసాగెను. చంద్రపాలుఁడు కూఁతుమనోవేద నఁజూచి నాగవల్లిని వీథులంబడి వెదకి తోడ్కొనిరమ్మని మువ్వురు పరిచారకుల ననిచెను. తలవాకిటికి రాగలతిక మాటిమాటికిఁజనిసఖి వచ్చుచున్నదోయని మార్గమునఁబోవువారిఁ బలుకరించుచు మఱల నావార్త చెలియకు విన్నవించుచు మనశ్శాంతినొందక కాలుగాలిన పిల్లివలె నట్టిటుతిరుగఁదొడఁగెను. హృదయమునకు హృదయమగు ప్రియసఖియెంతకురామి, గుణోత్తమ రాగలతికతో "ఓసీ! యింకమ నము దానిదెస నాసవిడువవచ్చును మనలఁబాసి యదియిన్నినాళ్లుగ నెన్నఁడైననింతతడవొండొకచోటనుండెనే! కటకటా! అదియొక్కర్తు లేకున్న నెండలోలేనట్టు లీమందిరమెంత చిన్నవోయి కాననయ్యెడు

నోచూడు. అది యెక్కడఁజూచిన నక్కడనేయుండి చిలుకలఁ గూయించుచుండు గొడమ కోయిలల బెదరించుచుండు మనల నవ్వించుచుండు నన్ని పనులం జక్కఁబెట్టుచుండు. అది పదుగురుపెట్టుగదమ్మా అయ్యో! దాని నింక నెటఁజూతు రాగలతికా! యని వాపోవుచు నుత్ఫుల్ల పుండరీకముల చాడ్పుననున్న కన్నుఁగవనుండి నీళ్లు దొరఁగ సెజ్జపై మేనువాల్చెను. రాగలతిక యారాగము నందుకొని కొంతయాలాపముసేసి తనచేత నైనంత కన్నీరు సఖినిమిత్తము విడిచి కొండొకసేపటికి నెచ్చెలి నూఱడించి కన్నీరు చీరచెఱఁగునఁ దుడిచి మరలఁ దలవాకిట నిలిచె. అంతటఁ గొన్నినిమిషములకు రాగలతిక జూచు దిక్కునుండిగాక యొండొకవైపునుండి గమనవేగముసూచించు చెమ్మటతోడ నొకతేమవచ్చి యామె యెదుట నిలిచెను. రాగలతిక యాపడఁతి నెమ్మోముఁ గనుంగొని "నాగవల్లీ! నాగవల్లీ" యని యఱచి "ఓసీ, నీవు జీవనముతో నున్నావే! నిన్నెన్నఁడో చూచి నట్లున్నదిసుమీ. నీ నిమిత్తము మనగుణోత్తమచిత్తము పొందు తత్తరము వర్ణింపఁ దరముకాదు. అయ్యో! నన్ను నీవొక్కసారి బిగ్గఁగౌఁగిలించుకొని నా మనస్సంతాపము మాన్పవే" యని యాలింగనము చేసికొని, దాసిరాక యెఱిఁగి సత్వరమె మేడమీఁదికి రమ్మని పిలుచు గుణోత్తమనుఁజూడ, సౌధముమీఁదికిఁ దీసికొనిపోయెను. నాగవల్లియు గుణోత్తమం గనుంగొని కంటనీరుపెట్టుకొని "అమ్మా మిమ్ము నందఱఁ జూచుభాగ్యము మరల సంభవించునని నేననుకొన నయితి. ఈవేళనెట్టిదుశ్శకునమునాకయ్యెనో చచ్చి మరిమ్మఱఁ దల్లికడుపునఁ బుట్టితిఁజుఁడీ" యని యంగలార్చుచుఁజెప్ప నాయిరువురు దద్వృత్తాంతము నెఱిఁగింపుమని యడుగుటయు నాగవల్లియుఁ దా నిల్లువెడలి రోహిణకుని పూలయంగడి కరుగుట మొదలుగ నిలుసేరువఱకుఁగలకథ దనవాక్చమత్కృతితో రసపుష్టిచేసి కవి కావ్యమునకు వన్నెవెట్టు

నట్లు దానికండముదెచ్చి వినువారికి విసువురాకుండఁ జెప్పెను. సౌందర్యతిలకయు రాగలతికయు నా వృత్తాంతము విని కరుణాద్భుత రసముల మునిఁగి మనచెలి సాహసమునకు మెచ్చుకొని రణార్ణవునిబారినుండి తప్పించుకొన్నందులకు నదృష్టవంతురాలవని దాని సంభావించిరి. అనంతరము నాగవల్లి చేతులుజోడించి యాజవ్వనియెదుట నిలిచి "నన్ను క్షమియించి మీరు రక్షింపవలసినదని వేఁడుచెప్పుకొన నక్కఱలేదు. చిన్ననాఁట నీవునాకు మక్కువమీరఁ జిటికెనవ్రేల నిడిన యుంగరము గుదువఁబెట్టి ముసలివాని యుసురులు గాపాడితిని. అదిగాక రణార్ణవుని పెండ్లియాడునట్లు నిర్బంధింపఁబడుదునని వాగ్దానము చేసివచ్చితిని.

పాణిక్షితినాడిన నిల్లుగాపును క్షమింపఁబడఁదగినది. అమ్మా! ఈరణార్ణవునకి జడిసియుంటినన్న వానికడనున్న సార్థకనాముఁడగు సర్వభక్షకుఁడను వానికి నా పడిన భయ మింతింతనరానిది. నాయుసురు తగిలి రణార్ణవుని వంశ మెన్నఁడు నిర్మూలమగునో! ఒక్క గడియ నాపడిన మనఃక్షోభంబె వానికులాంతమునకుంజాలు. వాని సేవకుఁ "డేమమ్మా! అమవసచీఁకటికన్నఁ గారునలుపువాఁడు. ముందున కెదిగివచ్చిన మిట్టపండ్లువాఁడు. మీఁదుమిక్కిలి మతిలేనివాఁడు. కోకిబికి వేసంబువాఁడు. మిడిగుడ్లవాఁడు. పగలుచూచిన రాతిరి కలలోనికివచ్చును. నీవొక్కసారి వాని మోముగన్న నాఁటి మాసము లన్నము రోఁతచే ముట్టవు సుమీ! ఇది యతిశయోక్తి కాదు. వానిగుణరూపాదులు వర్ణింప నా నేర్పుపలుకులు చాలకునికి నేనట్టిటో యిట్లు రవిదీపన్యాయముగ వర్ణించితిని. రణార్ణవుని చర్యల నాలకించియే యుంటివి. కళానందాదులు మూర్ఖులఁట తా నొక్కఁడు నిష్కపటహృదయేశ్వరుఁడగుట కర్హుఁడట. చెప్పనేటికి? వానిచిన్నెలన్నియు విని తీరవలయు. పిడప నన్నిఁ జేయి

తనయింట నుండుమని చాల నొక్కి చెప్ప రావణుని లంకనున్న జానకివిధమున నే ముండ్లమీఁద నిలిచినట్లుండి వానిని గడు నమ్మించి యాతఁడారగింప లోనికి జనునప్పుడు నాకడ కావలియున్న మందుఁ డగుసర్వవక్రుని కెద్దియో పని గల్పించి యావలకుఁ బనిచి చప్పుడు కాకుండ పెరటితలుపుం దెఱచి యావలంబడి మెల్ల మెల్ల నిలు సేరుకొంటి". అని తనచరిత్రము ముగింపఁబోయి మరల నెద్దియో స్ఫురణకురా జంకుచు నల్ల నల్లన నిట్లనియె. — "అమ్మా! ముద్దుటుంగరము కుదువబెట్టుటకన్న నాడరాని కల్లలాడుటకన్న నెక్కుడు నేరంబు నేఁడు జేసితి. కొంతవెఱచియుఁ గొంతమఱచియు నింతదనుక దానిం జెప్పక యూరకొంటి. రోహణకునొద్దఁ దీసికొని ముసలివాని నిమిత్తమువిక్రయించిన పూలచెండులో నొక దివ్యకుసుమంబుగలదనియు నద్దాని ధరియించినవారికి మహోరథసిద్ధి కరతలామలక మగుననియు నీకు దానినిమ్మనియుఁ బలుమాఱు చెప్పి నా కతఁడొసఁగెను. ముసలివానిపైఁ బ్రేమం జేసి నీమాటమఱచి యద్దానిని మొగమెఱుఁగనివాని కొకనికి విక్రయించి నీకుఁ గడునపకార మొనర్చితి."

అని నాగవల్లి తనయొనర్చిన తప్పొప్పుకొని, పూలమాలికకు వగచుచు నరుణచరణ పల్లవములకడ దిగులు దెలుపు ముఖవైఖరికిఁ గూరుచుండె. అప్రియములగు నానుడువులు చెవులఁజొచ్చుటయు, రాగలతిక యదరిపడిలేచి, అయ్యో! నాగవల్లీ! యెంతపని చేసితివి. నీసలిపిన యీయవివేకపుఁ బనికతమున, శాశ్వతమైన యపకారము మనకు మనవారికిఁ బ్రాప్తించెడునని నాకు నడలు వొడముచున్నది. నీకింత యొడలెఱుఁగని శివమేల యెత్తెనే? తన కుమాలిన ధర్మము మొదలు చెడిన బేరము నెరపువెంగలి నిన్నొక దానినిఁ గాంచితి. ఆపాపపుముసలిదయ్య మెక్కడ దాఁపురమయ్యె?

అయ్యయో! యెన్నినోములునోచియు నెన్నిజన్మములనెత్తియునెందఱ నుపాసించియు దివ్యకుసుమంబు నందుకొన నేరికిందరిమగునే? అట్టిది మన పూర్వకృతవిశేషమున స్వయంప్రాప్తముగా సిరిరా మోకా లొడ్డినతీరున చేతులార దానిని గంగపాలు చేసినట్లు పోఁగొట్టితివి. నీవు తలక్రిందుగఁ దపముచేసి యట్టికుసుమ మొకటి క్రిమ్మఱ సంగ్రహింపఁగలవే? నీమది కీయోచన మేలతట్టక పోవలయు? నీకడఁబైకమున్న దానధర్మముల నిర్వర్తింపఁదగుఁగాని పరుల సొమ్ము విక్రయించి యనదల రక్షించుట యుచితేతరము. దాసివై యొడలుదాఁచుకొనక పనిచేసి పొట్టపోసికొను నీవంటిదా నికిఁ దలకుఁ దగనిబరువులు బూనుకొనుట కేవలము నింద్యముకా దా? యజమానురాలి కార్యము చక్కఁజేయుటకు మాఱు చక్కఁ బడినదానిని భంగముచేసిన నీసాహస మెట్టిదియో నే నూహింపఁ జాల. మనము దాసీజనమనుమాట మఱచి యజమానుల మను కొంటివో! మనమెంత, మన మనికయెంత, మన యునికియెంత! యింతనుండి జాగ్రత్తగ నడుచుకొనుము. ఇది నీమేలునిమిత్తమే నుడివితిఁగాని నానిమిత్తముగా దలఁపకుమీ, చెలీ, యని నెఱకులు నడలఁ జేయు శూలమువంటి వాగ్జాలములతోఁ దలవాచునట్లు నాగ వల్లిని జీవాట్లుపెట్టెను. స్వయంకృతాపరాధమున నోరెత్తఁజాలక సిగ్గునఁ దలయెత్తనోపక రాగలతికనోటనుండి వెలువడు వాగ్బాణ ములు ప్రాణములు దీయుచుండ నాగవల్లి తన చెయిదాఁటిన పనికిఁ బశ్చాత్తాపమొందుచు మనోగతదుఃఖమును గన్నీటఁ దెలియఁ జేయసాఁగెను. అట్లు పెనుగినుక నెట్టని మొగముగల యారాగ లతికను బెనువగపున దీనవదనయైన నాగవల్లిని జెంగలువయు, నల్ల గలువయుఁబోలె నలరుఁ దనయొక్కొక్క కంటఁజూచి గుణోత్తమ యలుక మానుమని రాగలతికకుఁ గనుసన్నయొనర్చి యెట్టి సమయ

ములనైనఁ గలకల వెన్నెలలుగాయు నాగవల్లి మొగము మితిలేని జాలి గొల్పుటచే మసకఁబాఱి యిట్లనియెను.

"ఓసీ ! రాగలతికా! నాకడ దానికింగల చనవునుబట్టియో పారమార్థికచింతనో, చేసిన యీనాగవల్లి యవివేకమునకుఁ గనర నేల ? ధర్మకార్యము నెఱపువారు తమ్ముఁదామెఱుఁగక సంచరింతురు. నాగవల్లి జాలిగుండెగలయది గావున దానిమనస్సు వృద్ధ సంరక్షణమునందే నిలిచి పూల చెండుపై, నందలి దివ్యకుసుమంబు పై నరుగదయ్యె. మఱి పెంతమనీషావంతుల కయినను సహజ మట్టిచో జేలయగు మన నాగవల్లికిఁ గల్గుట యేమియక్కజము! మనః పూర్వకముగాఁ జేయనలయునని చేసినపని కాని నీతప్పు సైరింపఁ బడఁదగినయది. ధర్మకార్యార్థము పుణ్యపురుషులు, స్త్రీలు, సర్వ మహీరాజ్యమును, దారపుత్రాదులను, పతిసుతాదులను, వేయేల యవసరంబగుచోఁ దమ ప్రాణములఁగూడ నిశ్చింతతోడ నర్పించుచుండ, నొకచిన్న దివ్యకుసుమమును, పరోపకారార్థము వినియోగించి తనకును తనయజమానురాలనగు నాకుఁగూడ మంచిపేరు దెచ్చిన దీని నేమనుటకు నాకు నోరు రాకున్నది. దైవికము లొక్కొక్కయప్పుడు కొండలవంటి విపత్తులు సంఘటించునట్లుగఁ బడి తుదకునెంతయు మేలొడఁగూర్చుచుండు. ఇయ్యదియు దైవికముగాన నేమి మేలు గానున్నదో తెలియఁజాలము."

ఈమాటలనియెడు తేటనీటిసోనలు వెలువడ నాగవల్లి, ముచ్చ రాగలతిక పలుకులములుకులఁ జెందిన మనోవైకల్య ముజ్జనసేసి తెలివినొంది తనకింక భయము నొందవలసిన కారణము లేదని కినుక జూపిన సహచారిణికిని, గరుణఁజూపిన యజమానురాలికి నిట్లని విన్నవించె. "నాసలిపినది యవివేకపుఁ బనియని నే నెఱుఁగుదు. యజమానురాలి కపకారంబు దీనఁ బుట్టుననియు నెఱుఁగుదు. ఆదిక్కు

మూలిన వానిపై నాకా పాటుజాలి యుదయింప విహ్వలచిత్తముతో నేనంతపనిచేసిన యనంతరము నాకాదివ్యకుసుమంబుమాట జ్ఞప్తికి వచ్చె. నాయవివేకము, నాకలుగఁజేసికొన్న లేనిపోని స్వాతంత్ర్యము, మీరుపెట్టిన చీవాట్లకన్న మిన్నగ నామనసుఁ గాల్చుచున్నయవి. అయినను నాచేతులార నేఁబోఁగొట్టితిఁ గావునఁ దద్విషయమై నాయొనర్చు ప్రతిజ్ఞనాలకింపుఁడు ఆదివ్యకుసుమంబు మనగిరివ్రజంబున నెట్టియెట్టి సామంతునిచేతఁ జిక్కినఁ జిక్కనిమ్ము. ఎవ్వరియింట నేయంతఃపురమున నేమాఱుమూలనుండిన నుండనిమ్ము. నేనీగడియ మొదలహోరాత్రములు కన్నునిండ నిదురింపక, కడుపునిండ గుడువక, పురినెల్లమూలలు గాలించి వెదకి యాకుసుమము మఱల నీకు సమర్పించుదానను. ఇట్లు నెఱవేర్చనైతినేని నీమొగము మరలఁజూచుదాననుగాను. నాకాఱుమాసము లీయుత్కృష్టకార్యమునకుగడువు దయసేయుము. ఈకాలంబున నాయందు నీనగరమునందు నీవెట్టి చరిత్రములఁ గనివినియెదవో నేనిప్పుడు చెప్పనోప."

అని రోసమునఁబలుక దనచెలికత్తెలిరువురు, గనుమూయక యామెవంకఁ జూచుచు నిదియెంతకయిన సాహసురాలేయని తమలో ననుకొనిరి. అంతగుణోత్తమ యీపలుకులకు సంతసించిసిద్ధదత్తమైన దివ్యకుసుమంబు తప్పక దొరకునని యించుక యూసవాడమ నాగవల్లితో సఖీ! నాకిప్పుడు మనసార యూపిరిపుచ్చుకొన్నట్టులున్నది. నీమనసు చిన్నవోవునేమోయని నేనింతదనుకఁ గొంతగాంభీర్యముం దెచ్చిపెట్టుకొని యిటులుంటికాని నిజముజెప్పవలసిన దేని నాహృదయమంతయు మఱుగుచుండుట యొప్పుకొనకతప్పదు. ఏమహాత్ముఁడు దయారసైకత్తమున దానినొసఁగెనో యెట్టికార్యములు దానిసాయమున నవలీల సిద్ధింపఁగలవో యెయ్యది యుండిన సాటి రాచకూఁతులలో నేనెంతటిధన్యనగుదునోగదా! అట్టివన్నియు నీశ్వ

రేచ్ఛ భగ్నమైందనవని నిర్విణ్ణహృదయనై యుండి నీమనసు నొవ్వ నాడఁజాలక యూరకుంటి. నీకింత రోసము ఒకానికయుఁ గల్గినవి గావున నేఁగరమదృష్టవంతురాలని యెన్నుకొనుచుంటి. నీకొఱు నెల గడువుకాదు. రెండుఱునెలు గడునైనన్ గడుంగుదు. కార్యసా ఫల్యముఁ జేయవలయు. ఇది క్రమమ్ముఁజలపించునేని నీవు నాకుఁగాకు కాని నేను నీకాజన్మాంతము పరిచారికనై యుండెదనని చిఱునగవు నగుచుఁబల్కి మీఁదఁజేయివైచి నిమిరి " యింక నిదురింపఁబొమ్మ. పాపము నీవీదినముఁగడుకష్టి చెన్ను చెదరియుంటివి. రేయి చాల గడచుట నాకునిద్రాభారమున నావులింతలుమెండుగ వచ్చుచున్నవి. రాగలతికా నీవుంబన్నుండవే" యని మెల్ల మెల్ల మల్లెపూవుసెజ్జపై మేనువాల్చె. రాగలతికయు జరిగినవృత్తాంతమంతయుఁ దలఁచుకొ నుచుఁ గొంతసేపు తదేకధ్యానమున నిదురరాక పాన్పుపైఁబొరలు చుఁ దుదకు నిదురించె. నాగవల్లి తననెయ్యురాండ్రిరువురు నిదురిం చువఱకుఁ దానుఁగూడ మంచముపైఁ బన్నుండి నిద్రినభినయించి వారు గుఱ్ఱుపట్టిన వెంటనే నిద్రచాలించి మంచముమీఁదఁగూరుచుం డి చెక్కిటఁ జెయిచేర్చి తనలో నిట్లని విచారింపఁజొచ్చె. "ఈదివ్య కుసుమంబు నేమురల సంపాదింపఁజాలనేని కార్యభంగంబు జేసిన యప నింద నామీఁద నాచంద్రార్కము నిలుచును. అంతేటిరహస్యముఁ లున్నయవియో! ఆయుంశము లన్యజనము తెలుఁగఁదగినవో కావో! అవి యెఱుఁగఁదగనివేని నాకతమున నెంతలాపదలైనవాటిల్లు. సిద్ధుఁ డొసఁగినది సాధారణమైనదయి యుండదుకదా? హా! మాయదైవ మా! నాకెంతమనఃక్షోభములఁ దెచ్చిపెట్టితివి. అయిన విచారించినఁ గార్యమేమి? నానెఱజాణతనమింతయుఁ బరులకుఁజూపి యీదివ్య కుసు మమును దొంగకు దొంగనై సంగ్రహించెద. ఎవఁడు వానిని మా చెలినిమిత్త మొసఁగె వాని పేరరసి కనుఁగొని యెవ్వఁడు పూలచెం

డులో నిమిడ్చి వానివృత్తాంతముఁ దెలిసి, యెవఁడు నావద్దఁ బువ్వులు గొనియె వానిగుఱ్ఱుమట్లు విచారించి యెవనికడ నిప్పుడది యుండు వానియిల్లుత్రవ్వి యందలిహృదయములఁ జిచ్చువెట్టి కాల్చి యాజరాసంధుని రాజధాని నొకకడకుఁ దెచ్చి విడుతు. నాయంతె మదిరమో, దానియందేమి నేను కనుఁగొనవలయు. ప్రాంగణములో దివ్యకుసుమ సమన్వితవాఁడు నొహాంకుఁడగుటచే గనియద్ధమాత్రని నడుగఁ దేట పడును. తరువాత నాతనితో ముచ్చటింపనగు" నని కొంతసేపు వితర్కించి మనఃక్షోభము నగపడకుండఁ జేయునంతటి వేగముతో వచ్చుచున్న నిదురికలోనై కనులుమూసికొని పండుకొనియె.

---

## ఏడవ ప్రకరణము.

---

వెనుకటిప్రకరణమునందు వర్ణింపఁబడిన యంశములు జరిగిన కొన్నినాళ్లకుఁ దరువాత నొకనాఁడు, సాయంకాలమున, సమూల్యాభరణములు విలువలేని వలువలు మేనఁదాల్చి శుభలక్షణములు ముద్దులుమూటగట్టు పారసీకహయమునెక్కి యొకపురుషుఁడు రాజాంతఃపురమువైపు పరుగుచుండెను. ఆతనిఁజూచి వీథియరుగులపయిఁగూరుచుండువారందఱు లేచి జోహారొనర్చి వినయము గదుర సెలవుగైకొని పోవుచు నాతఁడు దాఁటి చన్నపిదప "రణార్ణవుఁడు కోటకుఁ జనుచున్నవాఁడు నేఁడెవ్వని యాయువు మూఁడినదోగదా" యని తమలో రహస్యముగఁ జెప్పుకొనసాగిరి.

ఆబాటనరుగుపౌరు లాయాశ్వికునిఁ గని యొత్తిగిల్లి భయముతో దారియొసంగుచుండ నాతనికెదురైన మంత్రి సామంతాదులగు నుద్యోగులు సామాన్యులట్లు తమతమ యరదములు గుఱ్ఱములు దూ

రిముసనిల్పి యాతఁడు చన్నపిడప సాగిపోవఁదొడఁగిరి. ఇట్లు కొంత దవ్వరిగి రాజాంతఃపుర సమీపమునకుఁ జని క్రొత్తగా సలఁదఁబడిన సుధావిభూతితో సందము మీఱి యౌన్నత్యమున ధావళ్యమున, హిమాలయమును మించు తెనిమేడముందటఁ దనగుఱ్ఱము నాపి మెల్లనదిగి మహారాజదర్శనార్థమరుగ సమయమగునా కాదా యని కావలివాండ్రి విచారింపకయె మేడమీఁదికరుగ మెట్లెక్కఁ దొడఁగెను. రాజభటు లెక్కడివారక్కడఁ దొలఁగి యూరకుండిరి. ఈపు రుషునకు రాజునొద్ద రాజాంతఃపురమునందుఁగల స్వాతంత్ర్యము, చనవు నెల్ల వారెఱింగిన దగుట నెవ్వరు నాతనికెదురాడరు. అట్లు మెల్లమెల్ల మెట్టులన్నియు నెక్కి యంతస్తువెనుక నంతస్తుదాఁటి కడ మేడమీఁద స్ఫటిక శిలావినిర్మితమై తనప్రతిబింబము గనఁజేయు నొకచోట నించుకనిలిచి యరమూయఁబడిన తలుపునందునుండి లోనికిఁ దొంగిచూచి మహారాజు ప్రధానులలో నొకరితో రహస్య ము మాటలాడుట యెఱింగి యది యదనుగాదని శంకింపక తలుపులఁ దోసికొని గుభాలున లోనికింజనియె.

చని సవినయ సంభ్రమ చిత్తంబుతో కరములు మోడ్చికట్టె దుట, నున్నతపీఠముపై సుఖాసీనుఁడై యున్న జరాసంధుని చరణరా జీవములకు మ్రొక్కియవి కన్నులనద్దుకొనియెను. పాదములపై నున్న రణార్ణవుని లేవనెత్తి జరాసంధుఁడు దనప్రక్క నొకపీఠముపైఁ గూ రుచుండ నియమించి యెద్దియో కార్యవిశేషమున నాతఁడువచ్చుట యెఱింగి మంత్రికి సత్వరము సెలవొసంగెను. అనంతరమురణార్ణవునిఁ గుశలమడిగి రాజు పురవార్తల వినఁ గుతూహలము నొందుచున్నట్లు ముఖవైఖరి తెలుపుటయు వారిరువురు నిట్లు ముచ్చటించిరి.

జరా.—కుమారా! గిరివ్రజమున జరుగుచిత్రములన్నిటిఁ జూ పునటి నిలువుటద్దమువై నీవు నాకడనుండఁబట్టియే యింత నిర్విచార

ముగా నేనీమహీభారమును వహించుచున్నాఁడను. నగరమునఁ గొ్రత్తగఁ గొండలు వాసుదేవానుచరులు బయలుదేరుచున్నారు. వారి నిర్మూలించుట మనకు మొదటిపనిగదా.

రణా.—దేవరవారియనుగ్రహము నాపయిఁ గలుగ నేను స్వామికార్యమున సప్రవృత్తుఁడనై యుండి వాసుదేవానుచరులపయిఁ జిచ్చుఁబిడుగులాగునఁబడి కొలఁకటివేళ్లతో వారినంత మొందించెద.

జరా.—ఇప్పుడేవనుచు వింతలవిన్నవింపవచ్చితివా! యేమిక కూడ నెఱుఁగించితివా?

రణా.—నిమిత్తము లేక యిట్టివేళల రాజార్ణవుఁ డెన్నఁడేని మిముదర్శింపవచ్చునే? మునుపటివానికన్న నెక్కుడు చిత్రమైనదియు ముఖ్యమైనదియు, ముందుగా విచారింపఁ దగినదియు, నగునొక యంశమున్నది. నాకు మూఁడునాళ్ళకిృందట మొగలిరేకుపై లిఖింపఁబడిన యుత్తరమొకటి చేఁజిక్కినది.

జరా.—కుమారా! ముందుగా లేఖ ననుఁజూడనిమ్ము. నామనసు తత్తరపడుచున్నది.

రణా.—అయ్యో! నేనే యీలేఖను జదువువాఁడ. తాము వాక్యసందర్భములను,దానియందలి యంశములను జక్కఁగాఁబరిశీలింపుఁడు. చదువుచున్నా నిదిగో వినుండి,—

"త్రిలోకసుందరీ! నాఁడు గోరువంక నిమిత్తము నిన్నుఁగలసికొని నీముఖారవిందము గనుఁగొనుటమొదలు నాహృదయము నిన్ను విడువదు. నీకును నాపైఁగరుణ యించుక కలదని కర్ణాకర్ణిం బహుమారు వినియున్నందున విదేశమునందుండియు మునుముందు నేను నీకు లేఖనంప సాహసించితి. మనసమాగమము సర్వవిధముల నసంభావ్యమని తోఁచెను. ఈకార్యసంఘటనమునకుఁ 'జుమీూ' యేనిట్టు

వెడలి నామిత్రుఁడును, నీకు సర్వదా మేలుగోరువాఁడు నగు నొక పుణ్యపురుషుని సందర్శింపవచ్చితి ”

జరా.—ఇది కేవలము కాముకవ్యాపారముగ నున్నది. ఇందు ద్దేశింపఁబడిన యంగన యొకనియిల్లాలో కన్యయో తెలియరాదు.

రణా.—దేవా! ముచ్చటయంతయు ముందున్నది. ఉత్తరము నందలి మిగిలినభాగముకూడఁ దమరు చిత్తగింపవలెయు.

“భర్త, మరణమునొందు నుపాయము నన్వేషించుటలో నీ దాసుఁడు మెలఁకువగ వర్తించుచున్నాఁడు. మన రాజ్యలక్ష్మికి వైధవ్యమును, మనకుఁగళ్యాణమును నేకముహూర్తమునందె యయ్యె డునని నాకుఁ బొడగట్టుచున్నది. ఊరక బేలవై చింతింపవలదు, సుమీ? ” అని యుత్తరమందున్నది.

జాబులోనున్న కొదువమాటల వినునప్పటికిన్ని నీకడపటి వాక్యములు వినినప్పుడు జరాసంధుని ముఖము జేవురించి యెల్లప్పుడు చూచు రిణార్ణవునికే మది నతిభీతిగొలుపఁ జొచ్చెను.

వజ్రపంజరముచాడ్పున నతిదృఢమై యాయుధదుర్భేద్యమగు తన నెమ్మేను బిట్టలుకఁ గంపింపఁ బటపట పండ్లుగీటుచు “ రే రే దురాత్ములారా రాజద్రోహులగు మీకులకాంతలు, వైధవ్యము వహింపకమున్న, మీరందఱు యమగృహమునకు నతిథులుగఁ జనక మున్న సర్వధారుణీచక్రమునఁగలఁ రాజచక్ర మట్టుడికిన ట్టుడుకక మున్న రాచపురు గనుపేరుగూడ నశియింపకమున్న మగధరాజ్యల క్ష్మికి వైధవ్యము ప్రాప్తించునే! రణార్ణవా! యీ కేతకీదళ మేదురా త్మునియింట నెవనిచేత నెన్నండు నీకు లభించెనో ముందుగా నెఱుఁగఁ జేయుము. ఈ నాయలుకచే రాజద్రోహులు మన గిరివ్రజమున నింక నుండరుసుమీ” యని తనమందిరములు, మేడలు, ప్రతినాద ముసేయ గంభీరస్వరముతో నాతఁడు పలికెను. రాజునకుఁ గోపాగ్ని

జ్వాలలుగా మండుచున్నతఱి నందు సమయోచితముగ సమి ధలు తగిలించుట రణార్ణవునకు వెన్నతోఁ బెట్టిన విద్యయగుట నదను దాఁటనీయక, నిజానిజములు నిదానమునఁ బరిశీలింపక పాప పుణ్యములకు వెఱువక, తన మందబుద్ధికిఁ దోఁచిన తెఱఁగున నిట్లని యాతఁడు విన్నవించె. "మహారాజా! ఈలేఖ వ్రాసినవాఁడెవ్వఁడో నిర్ణయించుటకుఁ నాకుఁ బ్రస్తుతము తగిన యాధారములు గానరా కున్న వయినను నాయెఱింగిన యంతవఱకు తమకుఁగల యనురాగము. నాచేఁ జెప్పింపకపోదు.

మూఁడునాళ్లకిందట నమఃకాలమున తమ కత్యంత ప్రేమా స్పదుఁడగు విజయసేనుని యింటికి జయసేనుని సందర్శించునిమిత్తము మెల్లమెల్ల నరుగునప్పటికి నాకంటికి జయసేనుఁ డగపడఁడయ్యెఁగాని యొకపీఠముమీఁద నీమొగలిరేకు చిత్రితములైన వర్ణములతోఁడఁ గానవయ్యె. అట్టివి కంటికిఁ గానవగుటయు నాచేఁ జిక్కుటయు నొ క్కమారెయగునని తమతో వేరుగ నేను విన్నవింపనక్కఱలేదు. 'రాజకార్యమున దొంగతన మొనర్చినను దాన దోషము వాటిల్ల దను దృఢవిశ్వాసముతో దీనిని సంగ్రహించి యేలినవారి కర్పించు టకు నామనసు నామనస్సులో లేదు. ఈయుత్తరము మనపురమున వివాహిత యగునొకకన్యఁగూర్చి యొక తేజోలావణ్యరాశియైన రా పట్టిచే వ్రాయఁబడినదనియు నాతఁడు ప్రస్తుతము దేశాంతరమున న్నవాఁడనియుఁ దన హృదయపీఠమునఁ బాదుకొనియున్న యా ంతి కీఁబాబిమ్మని జయసేనుని బంపియుండవచ్చుననియు నాకుఁ ఁచెడు. మీఁద దేవరచిత్తము.

అనవుఁడు మగధేశ్వరుఁ డాశ్చర్యము నాగ్రహము నేకకాల నఁ దన్నుఁబురిగొన నాకు బాల్యస్నేహితుఁడగు విజయసేనుని నం ఁడు జయసేనుఁడుఁగూడఁ గుట్రలోనివాఁడని యనుటకు నాకు

నోరాడకున్నది. హా! జయసేనా, మగధరాజ్యలక్ష్మికి సైదోడవై యుండి వాసుదేవ బలరామప్రముఖుల సంగరమున నిర్జింతువనియెంచితిఁగాని యిట్లు నిర్హేతుకముగ సంబంధములేని కుట్రలంజొరఁబడి నాకోపాగ్నికి మిడుతవై యకాలమరణము నొందుదువని తలంపనైతి. అల్పాయుష్మంతుఁడనగు నిన్నుఁ దలఁచి నాకుఁ గోపాగ్నిలో జాలివొడముచున్నది. విజయసేనునకుఁ బుత్రశోకమహాదుఃఖమును శాశ్వతమగు నపనిందఁ దెచ్చుశత్రుఁడవెకాని పుత్రుఁడవు కావుసుమీ!" అనిపల్కి యాక్షణము జయసేన విజయసేనుల నిరువుర వెంటఁబెట్టుకొనిరమ్మని యిరువురు సేవకులనంపఁదలఁచి మఱల నట్టిపని కావశ్యకతలేదని, మరునాఁడుదయమునఁ బ్రధానవర్గముతోఁ దగుయోచనసల్పి, విచారింపవచ్చునని రణార్ణవునితోఁ గొంతసేపు ముచ్చటించి వాని నింటికంపెను.

---

## ఎనిమిదవ ప్రకరణము.

నాఁడు కేతకీదళ మట్టుల కృశ్యమగుటయు జయసేనుఁడు రాజలేఖమీఁద రాజలేఖకన్నఁ దారామతిమీఁద గట్టియనుమాన మూనిరేకునిమ్మని దాసినిఁ గొంతతడవడిగి భయకంపితయై యామె నిరుత్తరురాలుకాఁగా నామెనువిడిచి కడుదిగులు గొనియుండెను. సాయంకాలమగునప్పటికి జయసేనుని మొగమంతయుఁ దొంటివికాసముజ్జగించి, నిట్టూర్పులయావిరిచే వన్నెసడలి మలినమైయుండుటయుఁ దండ్రి, యాతనియెడ నెద్దియో భయము కలుగునని వానివిషయమై యత్యంతము జాగ్రత్త వహించి యారాత్రి మేలుకొని తనసంగతి కుమారుఁ డెరుగకుండ నప్రమత్తుఁడై మెలఁగెను.

అప్పుడు రమారమి రెండుయామములు రాత్రియై యుండ నోపు. అత్తరి మనసునందలి కలతయును మున్నీరు పెల్లుబ్బి పొరలు కతమున రివ్వున జయసేనుఁడు లేచి యెవరినింబిలువక తలుపులం దెఱచి యుత్తరీయముఁగూడ గదిలోన నవలి యిలువిడిచి యొంటరిగఁ జనుచుండెను. ఆనిమిషమున నతని మొలలో నాతఁడు సర్వకాలసర్వావస్థల ధరియించు కత్తియుఁ దండ్రి కొన్నినాళ్లకిందట ముద్దుగా వ్రేలనిడిన పచ్చలయుంగరము దక్క నితరవస్తువు లెవ్వియులేవు. విజయసేనుఁడు కుమారుని చేష్టలఁ గనిపెట్టియుండియుఁ జెవులకించుక వినఁబడి వినఁబడకయున్న తలుపుచప్పు డస్యముగా భావించి, ఒద్దకముచేఁ గదలఁజాలక యించుక సందేహించి మరల నదియేమో చూడవలయునని లేచి కొడుకు నిజస్థానమునం దగపడకుని కింతయుఁ దొట్రుపాటునం దలవాకిటికిం జని చూచునప్పటికి వడివడి జయసేనుఁ డెందులకో యరుగుచుండెను. సేవకులను దన సహాయార్థము రమ్మనిపిలువ వ్యవధిలేమి విజయసేనుఁడు దానొంటరిగ నలక్షితుఁడై కొడుకువెంటఁ జనుచు నాతని గమ్యస్థానము నెఱుఁగఁ దలఁచెను. నిష్కాముఁడై యందఱ విడిచిచను శుకయోగి వెంట నంటి తిరుగు బాదరాయణునివితమున జయసేనువెంట విజయసేనుఁ డరుగ నరుగఁ గొండొకసేపటికి నెట్టయెదుట వికసించిన కల్వలుగల్గి ముకుళించిన తెలిదమ్ములుగల్గి, యలసి సొలసివచ్చు బాటసారులం దేర్చు తేటనీరుగల్గి నలుకట్లబారుతీర్చిన జోడులపగిదినున్న చెట్లుగల్గి వారిరువురకు మనోవ్యధల మఱపించు నొకసరస్సు గానవచ్చెను. గవ్యూతిదూరమున నది పొడగట్టుటయు, శీతలజలకణములతో వి[illegible] [illegible]ంది పుష్పాదులతో నసఁగి పెనఁగి, దక్షిణ దిశనుండి వెడలెడు మలయమారుతము తండ్రికొడుకుల నానందవార్ధి నోలలాడించెను. ఆనందముఁ బయికిఁదోఁచనీయక జయసేనుఁడు మూఁగచాడ్పున నొ

రెత్తక ముందుసాగిపోవుచు నాకొలఁకునఁ జొరఁబడి మీఁగాళ్ళు, చీలమండలు, పిక్కలు, మోకాళ్ళు క్రమమునఁదడియునట్టు లంతకంతకు లోఁతుగఁ జనుచుండెను.

ఆజలాశయమునఁ జొచ్చి బలవంతముగ ముద్దులపట్టి యాత్మహత్యఁ గావించుకొననో యనుభయమునను, భయముతోఁ దొట్రుపాటును దన్నుఁ బురికొలుప, విజయసేనుఁడు పట్టరానికడుపుదీపిచేఁ గనగొలఁకుల వెచ్చనినీరు గాఱఁ గొలఁకులోనున్న కొడుకు నుద్దేశించి “నన్నా! న ఖలుసాహసమ్ న ఖలుసాహసమ్, అహమస్మి అహమస్మి” యని గీర్వాణభాష యతని కభిమానభాష యగుట నందు మంకలించెను. ఆమాటలు విని యదరిపడి జయసేనుఁడు వెనుకకుఁజూచి తనవైపువచ్చుచున్న యాపురుషునిఁ బొడగని తెరచినకన్ను మూయక వానివైపొక్కరీతిగఁ జూడనారంభించెను. అంతలో విజయసేనుఁడు పరుగెత్తుకొనివచ్చి కుమారుని చేయిపట్టుకొని “వత్సా! ఇదియేమి సాహసము. నీకేతకీదళవృత్తాంతమంతయు రాజలేఖ నాకువిన్నవించినది. తారామతియు దాసియు నిందు నిర్దోషులు. ఆత్మహాని యొనర్చుకొంట పౌరుషమే? నిన్నునమ్ముకొని దినములకై యెదురు చూచుచున్ననన్ను దుఃఖజలధినిముంచి యీజలముల నీవు పడఁదలఁచితే? రా నాయనా” యని తటాకమునుండి బైటికిఁ దీసికొనివచ్చి యనేకప్రశ్నము లాతని నడిగెను. గాని యందొక్కదానికేనియు నాతఁడు ప్రత్యుత్తరమొసంగక బొమ్మవలె కనులప్పగించి చూచు చుండెను. కూరుచుండు మన్నప్పుడు కూరుచుండుటయు, నిలువుమన్నపుడునిలుచుటయు, సాగి నడువుమన్నప్పుడు నడుచుటయు మొదలగు చర్యలే కాని వానికి నోటిమాటలు లేవయ్యె. ఈవైపరీత్యముఁజూచి కుమారునకు మనోవైకల్యము కతమున మతిచెడినదని తండ్రినిశ్చయించి తగిన చికిత్సఁజేయింపఁ దలఁచి యెంతవఱకు నిది రహస్యముగ నుం

ఁడగునని ప్రియపుత్రుని నొకచాటుగదిలో నుంచి తలుపుమూసి తద్ద్వారమునఁ దానె గావలియుండి యేరిని లోపలికిఁ జననీయ కుండెను.

అట్లు గణాగ్రవ్యుఁడు జరాసంధునకు మొగలియాకుజాబునొసంగి చెవులోఁ గొండెమును విషముఁబోసి యారాత్రి యరిగినపిదప రాజు మఱునాఁడె నజువాత లేచి యంతిపురమునడాఁగిన యుదయ భాస్కర బింబమోయనునట్లు లావణ్యమునఁ జెరయు ముఖవైరితో నొకచోటఁ గూరుచుండి జయసేన విజయసేనులఁ దోడుకొని రమ్మని యిరువురు యమదూతలవంటి కింకరులనంపెను. అప్పటికి జయసేనునకుఁ జిత్తచాంచల్యముపయించి మూఁడుదినములయ్యె. స్వామియాపతినేగాని, పిలువనంపిన కారణములం దెలుపక రమ్మని త్వరపెట్టుచు నిరువురు సేవకులువచ్చి నిలుచునప్పటికి విజయసేనునకు నేమికతమునన్నో గుండెలు చెదరిపోయినవి. సేవకులు పెట్టుతొందరఁ జూడ శిక్షనిక నుమానము నెమ్మనమున నెంతయుం బొడమి కళవళ మొందఁజేయ నాతఁ డిట్లని తనలో వితర్కింపసాగెను. "అక్కటా! ఈవిధముగానున్న కుమారుని మహారాజుసన్నిధి కెట్లుతీసికొని పోవువాఁడను. ఈసేవకుల వైఖరిఁజూడ నెవ్వరో మామీఁద చేనితోఁ గొండెములు చెప్పి యలుక వొడమించినట్లు కానఁబడుచున్నది. అయినను విజయసేనునకు నాపత్తులలో ధైర్యము మిక్కుటమని జనులు చెప్పుకొనువాక్యము నేఁడు నిజముగావింప యత్నింతు. నాతనయుఁడు వాసుదేవునిపాదరాజీవములు మొదటినుండియు నమ్మినవాఁడుకదా" యని కొడుకుం బిలుచుకొనిపోక తానొక్కఁడ యరదమెక్కి సేవకులతోఁ గాలినడకఁ గోటకుఁ బయనమై యరిగెను. సేవకులు మెల్లమెల్లన వానిం దోడుకొని రాజునెదుటికిం గొంపోయివిడిచిరి. విజయసేనుఁడును దాను బలుమాఱు చనిన యాయంతిపురమునకుఁ దొంటి

వలె సాహసముతోఁ జనక వెనుకకు లాగుచున్న యంతరాత్మతోఁ దనముందటఁ గడాని గద్దెమీఁద భుజపార్శ్వకారద్వయము నడుమ మగధ రాజ్యలక్ష్మియను శుద్ధాంత కన్యక చిఁదులుద్రొక్కననువగువ జ్రిపీరమువంటి విశాలవక్షస్థలముతోడను, మొగమను నచ్చుపట్టము నుండి వెలికిఁ బ్రతిబింబించు కోపాగ్ని జ్వాలాకాంతియో యను సందియమొదవించు ముఖవైఖరితోడను, రాక్షసక్రౌర్యమును క్షాత్రధర్మమును జంటగా మూర్తిగైకొనెనో యనిపించు తేజముతోడను గూరుచున్న జేనిఁగాంచి యెదుటనిల్చి జోహారొనర్చెను. రాజసభలో విజయసేనునకు మున్నెంతయు గౌరవం బుండెను. నాఁడు జరాసంధుఁడు విజయసేనునిపైఁ బొడమిన కినుకచే నాతనికిఁ గూరుచుండ పీఠ మొసఁగక మునుపటియట్లు చిరునగవు మొగమున నంకురింపఁ బలుకరింపక తొంటిచనువాతని కొసంగక రూక్షవీక్షణములతో నాతని కిట్లనియె. “విజయసేనా! వాసుదేవ పక్షపాతివైన నీకూర్మి కొడుకెక్కడ?”

విజ.—దేవా! క్షమియింపుము. నాకుమారుఁడు గృహమునఁ గలంతకతమునఁ జిత్తచాంచల్యము నొందియున్నవాఁడు. అందుచే రాలేదు.

జరా.—మగధరాజ్యలక్ష్మికి వైధవ్యము సంఘటించుటలో నీకుమారుఁడు కడుప్రమత్తుఁడైయున్నాఁడుగదా. అతని కీచిత్తచాంచల్యమేల?

విజ.—రాజభక్తికి నిధి యగు మాకుటుంబముపై మహారాజుగారి కట్టియనుమాన ముదయించుట మాదురదృష్టఫలము.

జరా.—రాజభక్తికిఁ గాదు. ఇప్పుడు రాజద్రోహమునకు నిధి, భక్తిమాట యటుండనిమ్ము ఇప్పుడు ముఖ్యముగా నీ కుమారుని నిమిత్తము మేము వార్త నంపితిమి. అతఁడు చిత్తచాం

చల్ల మొందినను సరియే, ఏమయినను సరియే వచ్చితీరవలయు, వచ్చితీరవలయు—ఓరీ! పలువురు సేవకులు విజయసేనుని యింటికిఁ జని జయసేను నొకబండిపైఁ గూర్చుండఁబెట్టి సత్వర మిటకుఁ దోడుకొనిరండు.

అని భటుల సంపుచుండ విజయఁసేనుఁడుచూచుచు నూరకుండి రాజుమాట యర్థముగాక చింతిల్లుచుఁ గుమారునిదెస నాసవిడిచెను. అట్లుకొన్ని నిముసములు జరాసంధ విజయసేను లొండొరులతోఁ బలుకక మనోగత కోపదుఃఖములకు లోనై యుండుతిప్పటికి వాకిట నెద్దియో యరదము నిల్చినచప్పుడు వినఁబడి విజయసేనకుఁ దనకుమారుని దురవస్థ సమీపించెనని విధి చాటుచున్న చప్పుడు వలెఁ దోఁచె. అంతఁ గొన్ని నిముసములకు జగము నెఱుఁగక యున్నవాని, వివర్ణవదనుఁడగువాని జయసేనుని సేవకు లిరువురు తోడుకొనివచ్చి రాజుముందర నిలువఁబెట్టిరి. మహారాజునొద్ద గౌరవము భయము భక్తియు నెఱపునట్టి విజయసేనునికుమారుఁడు నేఁడు రాజందున్నట్లు దలంపనివాఁడువోలె, నిశ్శంకముగ ముఖమెత్తి చూచుచు బెదరిన యాలబోఁతువితమున తెప్పవేయక యామాగధుని జూడసాగెను. మగధరాజతని ముఖైఖరి నవలోకించి విస్మితుఁడై యించుక చూచి "శరీముస నెట్లున్నది? ఆలాగున నున్నా వేమి" యని యడిగెను. జయసేనుఁడు యథాప్రకారముగఁ దన్నుఁ గాని యట్లు లూరకుండెను. అంతట శాంతినొందక జరాసంధుఁడు మొగలిరేకు బాబునఁగూర్చియు, మగధరాజ్యవ్యవహారములఁ గూర్చియుఁ ననేకప్రశ్నలడిగి నిరుత్తరుఁడగు జయసేనునిపై నెంతయు నలుకఁ బూని నిందించి యొక్కొకమాటతని విలక్షణపుఁ జూపులకు నగుచు మదకు విసిగి యిట్లనియె. "ఓయీ! విజయసేనుఁడా! మగధ రాజ్యమున కపాయము సూచించు మాటలుగల మొకమొగలిరేకు

జాబు నీకొడుకునొద్ద మాసేవకులలో నొకనికి లభించినది. నీతనయుఁ డిదివఱకే వాసుదేవానుచరుఁడన్న నానుడి జగత్ప్రసిద్ధము గదా ! అందుచే నాపైఁబన్నఁబడిన దుస్తంత్రములో నీపట్టి చేరి పనిచేయు ననుమాట విశ్వాసార్హము. ఇప్పుడీజయసేననియం దారోపింపఁ బడిన చిత్తచాంచల్యము, కుమారుని ప్రాణరక్షణార్థము నీవు బోధించినమంత్రమో స్వయముగా నాతఁడే యభ్యసించిన విద్దియయో మాకుఁ దెలియకున్నది. అంతవఱకు నీతనయుని శత్రురాజమండలముతోఁ గారాగృహబద్ధునిగావించెద. నీవు నీగృహమున కరుగ వచ్చు. ఓరీ యెవఁడవురా యక్కడ ! ఈ జయసేనుని చెఱసాలనుంపుఁడీ " యని మాసతిచ్చి పీఠముమీఁదనుండి లేచెను. విజయసేనుఁ డు గొడ్డలిదెబ్బల నేలరాలు వృక్షమువలె మూర్ఛిల్లెను. జయసేనుఁడు తొంటియుల్లు కంటిచూపెమాని నోటిమాటలేక రమ్మని సేవకులు చెఱసాలకుఁబిలువ గంగిగోవువలె వారివెంటఁ జనియెను.



## తొమ్మిదవ ప్రకరణము.



నాగవల్లి యారేయి కలంతనిద్దురనొంది కోడికూఁత వినఁబడు నప్పుడు మేలుకాంచి తానొనర్చిన దుస్తరప్రతిజ్ఞలను దలఁచుకొని యట్టికార్యము తాను సాధింపనలవియగునాయని తన యశక్తతకును జేయవలసిన కర్జమునందలి కష్టమునకును వగచుచుఁ బ్రభాతమయి న వెనుకఁ జిత్తము కార్యాయత్తము గావించి దేహము గృహకృత్యములకు నప్పగించెను. అట్లు తనకార్యసాధనతకు నుపాయము పయి నుపాయము వెదకి వానియందుఁ దనకు వాటిల్లు నపాయములను దూరదృష్టిగలిగి యెఱుఁగుచు నాలుగుదినములు రాగలతికతోడను,

గుణోత్తమతోడను బుచ్చి నైదవనాఁడు నిశి భోజనానంతరము నెచ్చెలులకిరువురకు నిట్లనియె. "పూవులచెండుమాట రోహణకు నడిగితిని. అతనిం గాలుకడుపులు బట్టుకొని నేనెంతయుఁ బతిమాలి యీరహస్య మన్యులకు నెఱుఁగఁజేయనని యెన్నోబాసలు చేసి యడుగఁగా నాతఁడు మిగుల కష్టముమీఁద నాతో నిట్లనిచెప్పె:—

"ఓనాగవల్లీ ! దీనివృత్తాంతము కడు రమణీయము. నీకుఁజెండు నేనొసఁగిననాఁటికిఁ బూర్వదినమునఁ గడసంజయగుతఱి బేరగాంఢ్రతోఁ బూలవిక్రయించుసందడిలో నేనుండ నాచెవులకు "నారాయణ నారాయణ" యనుశబ్దము వినవచ్చెను. వెంటనే బేరగాంఢ్ర నించుక తొలంగుఁడని చూచునప్పటి కొక్కసన్యాసి నాదృష్టిపథమున నిలిచెను. కోరికలనెల్ల జయించిన పరివ్రాజకులు, గాముకజనోపభోగ్యములగు నెత్తావి పువ్వులు గోనవత్తురా యని నేను సందేహమొంది లేచి వందనమొనర్చి స్వామీ యిందు వేంచేయుఁడనిపూలబుట్టనిడుకొను ముక్కాలిపీట నాయనకు"సంగికార్యమున్నఁగాని మహాత్ములు నన్నుఁ బోలు నల్పుల ననుగ్రహింపరారని నిశ్చయించి బేరగాండ్రనందఱ వడివడినంపి యాస్వామి యనుగ్రహమునకు నెదురు చూచుచుఁ గట్టెదుట నిల్చితిని. ఆకారము దాల్చినవినయముచాట్పున నిలువఁబడియున్న నన్నుఁ గూర్చుండుమని యానతిచ్చి యాయతి "నీవా రోహణకుఁడ" వని యడిగెను. దేవరవారుసెలవిచ్చినట్టి యీతమసేవకుఁడే రోహణకుఁడు స్వామీ యని నేనంటిని. అనంతరము మహాత్ముఁడతఁడు నన్ను నఖశిఖపర్యంత మొకమాఱు చూచియుం గడిమీఁద నెవ్వరు లేరుగదాయని యడిగి "రోహణకా! నీతోఁ బరమరహస్యమొండు దెలుపవచ్చితి, నాయుష దేశింపఁ బోవునదియు, నీవొనర్పవలసినదియు నగుకార్యము దైవహితము. దీనిఁదప్పక నెఱవేర్పనన్నియుఁ గుట్టుదాఁపగలననియుఁబ్రమాణ మొనర్తువేని నావ

చ్చుపని నీకెఱిఁగించెద” అనవుడు బ్రహ్మతేజముట్టిపడ నెదుటవారి వాగ్బంధనముసేయు నాతని మొగముసౌరు నాడెందమునఁ గ్రొత్త బత్తిఁ గల్గించుటచేఁదప్పక యట్లు సలుపువాఁడనని యతీశ్వరుని పాదములంగొట్టి బాస జేసి సిద్ధముగనుంటి. అంతట నాతఁడు కమండలములో నుండు వేళ్ళుజొనిపి యొక తెల్లని మొగలిరేకు నీవలకు లాగి తన కాషాయవస్త్రముతో, దాని తడియాఱఁదుడిచి నాతో “రోహణకా! కలదుగదా యీనగరమున సౌందర్యతిలకాభిధాన యగు గుణోత్తమ. ఈయుత్తం మాపుత్తడిబొమ్మ కెట్టులేనియు నందఁజేయువలయు. మన ప్రసంగ మన్యులచెవులఁ బడఁగూడనట్టు మొగలిరేకు నెవరికంటఁ బడఁగూడదుసుమీ” యని యది నాచేతి కిచ్చి “ఇక్కడ నేఁ దడయరాదు. గౌరీమఠమునందలి సన్న్యాసులు నానిమిత్త మెదురుచూచు చుందురు. ఈ యమరహితకార్యము నిర్వర్తించు భాగ్య మిందఱు నర్తకులలో నీకొక్కని కబ్బినది. జాగ్రత్త” యని చివ్వున సంగడిమీఁదనుండి లేచి నాలుగడుగులు పోగనంపఁబోయిననన్ను రావలదని నిల్పిన తిరస్కరిణీవిద్యచే నదృశ్యుఁడయినమాదిరి నెటకోఁ జనియె. అగ్నిహోత్రుని వర్చస్సు వంటి ముఖవర్చస్సుఁగల్గి నిలువెల్లఁ బూయఁబడిన బూదియకాని వేఱొక యైశ్వర్యము నెఱుఁగక, కాషాయవస్త్రముల రక్తిమగాక యొండొక రాగమెఱుఁగక, వేల్పుటేరుడించి, వేఁడికన్నుడాఁచి, మేనితెల్పు, మెడనల్పు గుట్టుబఱిచి, పులితోలు ముమ్మొనవాలు నింటమఱచి, లేఁతనెలను లేడిపిల్లనువిడిచి, నింపు మగవేషముతో నేలఁగుమ్మఱు శంకరుఁడేమోయని నాకాతనియందు భయము భక్తియుఁ గుదిరినందున నాతఁడానతిచ్చినభాతి మరునిచేతి చికిలిబాకుఁబోలు నారేకు చెందునందమర్చి నీకిచ్చితిని. నాగవల్లీ ! ఈవృత్తాంతము పరమ గోప్యముసుమీ. నీవు నోరుజాఱి నెచటనైన దీని నూఁదితివేని ని

కౌతుకముగ నేను యతిశాపహతుఁడనగుదునుమీ ! నన్ను మిగుల జాగ్రత్తతో వర్తింపఁజేయవలెనని యాతఁడది యమరకార్యమునియెనేకాని యది నిక్కమరసి చూడఁ గాముకవ్యాపారము. ఆ రేకుపై నక్షరములు లిఖియింపఁబడినవి. నేను జదువను వ్రాయను నేరని వర్తకుండనగుట నేమివ్రాయఁబడెనో యెఱుఁగనైతి. మీ గుణోత్తమ యాలేఖ "జదువుకొనియెనా" యని రోహణకుఁడుదశముచరిత్రము పూసగ్రుచ్చినట్లు నాకరమరలేక తెలుపుటయు, నేను నఁ గొంతగాంభీర్యమునుసహించి లేఖపోయినదని వ్రాసినావుల వేయక గెనలు మబద్ధమాడక పాముచావకుండఁ గఱ్ఱవిఱుగకుండఁ బ్రత్యుత్తరము చెప్పినచ్చితిని.

నాగవల్లి చేసిన యుపన్యాసము గుణోత్తమను దత్తఱమొందఁజేసి రాగలతికను విషాదమున ముంచెను. అందు గుణోత్తమ "హా చెలులారా ! మనమనుకొన్నదానికన్న మిన్నయగునంశములు నేఁడు నాచేత వినఁబడినవి. ఈయుత్తరము, దేశాంతరమునందుఁ బ్రస్తుతము కొన్ని కారణములవల్ల వసించుచున్న మనమిత్రుఁడు వ్రాసియుండును. అది యీజరాసంధ పక్షపాతులగుచెనంటులచేతఁ జిక్కనేని చంద్రపాలుఁడు కూఁతు కతమునను, మనమిత్రులు మన కతమునను నెంతయు దుఃఖపడుదురుగదా? హా! యెంతకష్టము. అది క్రిమ్మఱ నాకెట్లులభించు, నేమి యుపాయము?"

అనవుడు రాగలతిక మాలతి యానలకుఁ ద్రిప్పి కోపమున "మాతాత నాకగపడుటయు నాగవల్లి రేకు మరలఁ దెచ్చుటయు నొక్కనాఁడె నీకన్నీరు దుడుచుటకు నాగవల్లి యల్లినయల్లిబిల్లికల్లలకు నీవూరక యుద్విగ్నురాలెదవు. గుణోత్తమా! నిన్నుఁబోలుబేల నాకేలోకంబునఁ గానఁబడదు. ఏవానిచేత నిది చిక్కియుండు నాతఁడందుండు పలుకుల కర్థముగాక చింపిననుజింపు, అది. లోపాదారు

నిర్మితముకాదు. కావున జరిగి యీపాటికి నామూవశిష్టమైనను గా నొప్పు. నాగవల్లి తన్నుఁ గనుంగొనుదాక లేకు కనిపెట్టుకొని యుం డునా!" యని నిరుత్సాహజనకమగు నిష్ఠురోక్తులు బలుకఁ జొ చ్చెను. అంతట నాగవల్లి మెల్లమెల్ల రాగలతిక కుత్తరముఁ జెప్పు నట్లు గుణోత్తమ చిత్తవైకల్యము నిర్బంధముగాఁ దొలఁగింపనలయునని యిట్లనియె. "అమ్మా! నాకళ్లలు, పొల్లుపలుకులు, చిన్నతనము నుండియుఁ జెవులు తడకలుకట్టినట్లు విని వినివి యున్నారు. ఇంకఁ గొన్నినాళ్ళుకూడ నాలకించినఁ దొంటికన్న నెక్కుడుకీడుమీకురాదు. పుట్టినవెనక యుజుమాంసరాశిమొదలు నాగయొనర్చిన నేరమిగి గొంక్కు- టియేయని నాయభిప్రాయము. దీనికి నేనొక్క- యుపాయముఁబన్నితి. గిరివ్రజపురమునకుఁ గ్రొత్తగా జ్ఞాననిధి యనుపేరుగల యొకపరివ్రా జిక వచ్చి యెచ్చటనో విడిసియున్నదఁట. ఆమె భూతభవిష్యద్వర్త మానవేదిని యనియు నడిగిన సందేహము లున్నవున్నట్లు తూచాత ప్పకుండఁ జెప్పుననియు వాడుకకలదు. ఆమెనిండుజవ్వనమున నున్న యంగనయగుట దుశ్శీలురగు పురుషులకంటఁ బడనొల్లకయో యింక నెందుననో తెరమఱుఁగున నుండియె ప్రత్యుత్తరము లొసఁగుఁగాని స్త్రీలకయినఁ గానఁబడదఁట. జగదీశ్వరియగు భవాని ప్రసాదమున నాపరివ్రాజిక యిట్టిమహిమలకుఁ బుట్టినిల్లయ్యెనని చెప్పుదురు. నేను రెండుమూఁడు మాసములలో నామె దర్శనముచేసి నాసందియ మ డిగి తెలిసికొని నీమనోరథమును నెఱవేర్తును."

ఎట్లయినఁ గార్యముసాధించుటయేపూనికగా నేర్పఱచుకొన్న చెలికత్తెను బల్లవిరుపుమాటలాడి యుల్లము రాయిచేయుట కన్న నామెపూనికకుఁ దోడుపడి యుత్సాహముఁ గొల్పినఁ గార్యము శీ ఘ్రసాధ్యమగునని నిశ్చయించి కార్యవాదమునందె బుద్ధినిల్పి, గుణో త్తమ, యాపల్కు-లకు సంతసించి యటుసేయ ననుజ్ఞనొసఁగెను. అ

నంతరము కొన్నిదినములకు, నొక్కనాఁడుదయమున గుణోత్తమ విరిసెజ్జనుండి లేచి యప్పాన్పుపైఁ గూరుచుండి యప్పుడప్పుడే నిద్ర మేల్కొను బడ్ధకముచే, నావులింతలు మెండుగ వచ్చుచుండఁ గన్నుల దుడుచుకొనుచు, వీడి వ్రేలాడు కచభారము జారుముడివైచి నిద్రా సమయమున నలఁగునని యొకచోనిడిన చంద్రహారము మరలఁ గంఠమున నుంచుకొని "నాగవల్లీ! అద్దమొకసారి దేవే" యని కేకవేసెను. పిలువఁబడిన నాగవల్లి రెండుమూఁడు పిలుపులకైనఁ బ్రత్యుత్తరమొసంగుటయు,వచ్చుటయు జరుగదయ్యె. ఈలోపల నాగలతిక చేతనున్న పనిమాని యామెకద్దముఁ దెచ్చియిచ్చి "యీదినముసఁ దెల్లవారుటాదిగ నాగవల్లి నాకగపడలేదు. నేనామెను గూర్చి మనజంబుకుని తఱచి యడుగ నాతఁడేదో విపరీతమైనకథ చెప్పుచున్నాఁడు. అది నానోటనుండి వినుటకన్న జంబుకునిముఖమున వినుట నీకత్యానందము గల్గించునుగాన నాతనిఁ బిలిచెద" నని యట్లుచేసెను. జంబుకుఁడు చంద్రపాలుని తండ్రియగు శశిపాలుని కాలమునుండియు నింటనుండుటచే నాతఁడు చేయునది సేవకవృత్తియైనను గౌరవాస్పదముగనుండెను. అతనినొకచోటఁ గ్రిందఁ గూరుచుండుమని నియోగించి గుణోత్తమ నాగవల్లి పోయిన తెరువునుగూర్చి కొన్నిప్రశ్నములడుగ నాతఁడిట్లనియె. "అమ్మా! తెల్లవారుజామున నాగవల్లి నేనింక మంచముమీఁదనుండి లేవకమున్నె నాకడకువచ్చి నన్ను "జంబుకా! నాయొనర్చిన తెలివిమాలినతనమునుబట్టి నాగలతిక నన్నుఁ గరము నిందించుచున్నది. దివ్యకుసుమంబుఁ గనుఁగొనఁగలననివట్టిబీరములు పల్కితిఁగాని యదికనుఁగొనుట నాతరముకాదు. అందుచే నాగలతికపోరుపడలేకయు, గుణోత్తమ మొగముఁ జూడలేకయు, నేనీయూరువిడిచి, యొకపల్లెయుక్కుఁజని యందు వసియింతు. నాతెక్కలు చల్లగనున్న నాపట్టెడన్నముఁ దెచ్చుకొని నేఁబ్రదుకఁజాలనే నేనిలు

దాఁటుదాఁక నీరహస్యమేరికిం జెప్పక తెల్లవారినవెనుకఁ జెప్పుము. దయయుంచవలయుఁజుమీ" యని యెచటికోఁ జనియె. ఇంతకుమించి నేనేదియు నెఱుఁగనని జంబుకుఁడూరకుండెను. పరులవశమగు కేతకీదళము మరల నాగవల్లి తెచ్చునని గంపెడాసతోనున్న గుణోత్తమ యాముసలివానిమాటలకు నిశ్చేష్టయయ్యె. రాగలతిక తనమాటయే పయినున్నదికదా యని పరిహాస మొనర్ప నారంభించెను.

---

## పదియవ ప్రకరణము.

అవనీతలమున వెలసిన వైకుంఠమని భక్తవరులును, దమకోడి మున్నీట నందనందనునిచే నిర్మింపఁబడిన దాఁగుడువోటని వైరులును దేని నభినందించి హృదయ సంతుష్టి యొనర్చుకొనుచుండి రట్టిద్వారకానగరమున ద్వాపరయుగమున రాచవారు కట్టిన ప్రోలులలో విభవమున మొట్టమొదటిదియుఁ గాలమునఁ గడపటిదియునై తనరెను. ఉపేంద్రునకు రాజధానియగుటనో, దాసజనుల మనోరథ ఫలముల నవలీలనొసఁగు వాసుదేవపారిజాత మందుండుటనో విలాససంపద నిది దానికి దీటుకొనుటనో, సత్యభామ నిమిత్తము మున్ను వేల్పులేని నందనవనమునుండి యచ్యుతుండు తెచ్చి పెరటిచెట్టుగా నాటిన నిజమయిన పారిజాతవృక్షమందుండుటనో యకౄరప్రముఖులందఱు నాద్వారకను రెండవ యమరావతి యని పిలుచుచుండుదురు. పొగడ్తకుఁ గాక నిజముగ సిరికి నెలవని ఘంటాపథముగఁ జాటఁదగిన యాద్వారకాపురమున నొకరాచబిడ్డ సంజతఁజేవచ్చుచుం దోడనున్న సేవకునితో దినమెల్ల శ్రమపడి పయనముఁ జేసిన జాడ మొగము మీఁది చెమ్మట తెలుపఁ గొంతదవ్వు నడచినడచి పురము

వెలి యొక చెట్టుక్రింద నాయాస మపనయింపఁ దలఁచి యించుక విడిసి, తనకన్నమున్న దుస్సహమార్గఖేదమున నేలఁ జతికిలఁ బడి యున్న శాత్రవఘ్నునిఁజూచి యిట్లనియె. "శాత్రవఘ్నా! ఎన్నఁడిల్లువిడిచి యెఱుఁగని నీవు నానిమిత్త మింతింతయనరాని బాధలుపొందుచున్నా వుగదా? పాపము పలుమాఱు నావెంట రావలదని నేనెంత నొక్కి చెప్పినను వినక నాపైఁగల ప్రేమపెంపునవెంటవచ్చి యనుభవించు చున్న సుఖమిదియేకదా! ఐనను కైవల్యామృత చంద్రమండలమగు భూలోక వైకుంఠ మల్లదె కనుదోయి కఱవుదీఱఁ గనఁబడుచున్న ది. కన్నులారఁజూడ మనమిరువురి యాయాస మొక్కమాఱు పటాపంచలయి నశింపఁగలదు." అనిన శాత్రవఘ్నుండును యజమానునికిం దనపైనున్నయించు నపార కృపకు సంతసించి వినయముగదుర నిట్లని ప్రత్యుత్తర మొసఁగెను.

దేవా! సేవకమే జీవనముగాఁగల నేను మీయొద్దనో మఱి యింక నొకరియొద్దనో దేహాయాసము మనోవ్యధయు నొందుచునే యుందును. నాకయి మీరు వగవఁబనిలేదు. ఆగర్భశ్రీమంతులరగు దేవరవారు నాకొఱకే విచారింపనొప్పు. చెట్టునుండి కోయఁబడిన పూవు చందమున నింటనుండి వెడలిన వెనుక మీరు దినకరకరస్పర్శనమువలనఁ జెన్నుచెదరి పట్టరాని సెంజిలి నాకుఁ గల్గించుచున్నారు. అని తన నిమిత్తముపొక్కు సేవకుని సమయోచిత శాంత వచనముల నూఱడించి తనవలె నతి దూరప్రయాణమున డస్సి జేవుఱించిన నెమ్మోగంపుఁ గాంతులచేఁ గకుబంతరాళముల శోణము గావించుచుఁ బడమటి కొండపై నెక్కియున్న సూర్యునిఁగని కను దమ్ములవికసింపఁగు నాతని బింబమునకు జోహారొనర్చి భగవానుఁడా! లోకబాంధవా! జగత్త్రయనేతవు. సకలచరాచర సంతానము పెరుగుటకు ముఖ్యాధారమవగు నిన్ను నేఁ గొనియాడఁ జాలుదునే!

ధరణీనాటకరంగస్థలమునందు పగలను తెల్ల తెఱయు తేయి యను నల్ల తెఱయు దింపి జంతుసంతానమును జాగ్రత్స్వప్నావస్థల నందించి యాడించుసూత్రధారుఁడవు. ఆహాహా! నీ యారుణ్యమునకు శంకరుని లలాటనయనాగ్నితేజము సిందూరదరివారణ్యము లోనగునవియే నీచోపమలగుచుండ లోకమున నితరవస్తువు లెవ్వి దానికి సవతువచ్చును. వేయినోళ్ళ పాపతేఁడు, వేయికన్నులవేల్పుతేఁడును వేవెలుఁగులు గల నీ దేహకాంతిఁ బొగడనేరరు. నావంటి యల్పజ్ఞుఁడు రెండుకన్నులఁ గని నుతిసేయ సాహసించుట నాపయి నాకుఁ గల యభిమానముసుమీ యని నుతించి కొన్నియడుగుల దవ్వున నిన్నని నల్లిక్కు నల్లని తెలనీటిజిగి నాకసమును విడంబించుచుఁ దెలిదమ్ముల వెలుఁగున నక్షత్రభ్రమఁ జేయుచు నింపుఁ బెంపారు నొక కొలను గని కాలుసేతు లందుఁ గడిగి సాయాహ్నకృత్యములు దీర్చి దోసెఁడు నీరుద్రావి తానును సేవకుఁడును నగరమును బ్రవేశించిరి. పురబహిర్ద్వారమున నడుగు వెట్టినదిమొదలు పట్టణపు టడుగుభాగమునఁ గనవచ్చు రామణీయకమును మేడల మిద్దెల సౌరును మన సార నీక్షింపఁదలఁచియు నొక్కొకమేడరీవిఁ గనుంగొనునప్పటికే తద్దయుఁ దడవగుచుంట నెన్నిదినములు దినములననేల యెన్నిసంవత్సరము లిచటనుండి యాయందముఁ గనుఁగొన్నఁ దృప్తియుండదనుచు శ్రీవత్సుఁడు దాను నొండొరులతోఁ జెప్పుకొనుచు వాడలంబడి నడువసాగిరి. అంతలో భాస్కరుండు పడమటి కొండమీఁదనుండి గుభాలున నపరవార్నిధిలోని కుఱికిన చందమున నంతర్ధానము నొందెను. రౌద్రరసము నభినయించు పాత్రమై కొంతసేపు గగనరంగమున విహరించి యాకథ వినుపించు ననంతరము శాంతరసమభినయింప వేసము మార్చుకొని క్రమ్మఱవచ్చిన యాటకాని విధమున నుదయరాగముపిడిన చందమామ జనులకు దృష్టి గోచరుం

డయ్యెను. అయ్యది వసంతసమయమగుట నాసాయంకాలమున నచటి యువతీజనములు మేనులనిండఁ బూలదండలు రతనంపు దొడవులు ముత్తియంపుసరులు పెట్టుకొని వాడలం దిరుగుచు మేడల నిండఁ విహరించుచుఁ జలసముదాల్చు గొమ్మలచాయ నలరుచు నీ రాజనందనుని కమితానందముఁ గొల్పసాగిరి. నాఁటిరేయిఁ గాయు పండువెన్నెలతోడ యదుకుమారకుల ముఖచంద్రమండలముల వెల్గు వియ్యమందుచు నాపాంథు నాశ్చర్యసముద్రమును మేలమిూఱఁ జేసెను ఇట్లు కతిపయదూరము నడచి తన మనంబునఁ బెల్లుబ్బిన మోదము చేత మైమఱచి కొంతవడికిఁ దెలివొంది తన వచ్చినపని జ్ఞప్తికిరా. మాధవాంతఃపురమునకుఁ బోవ నమకట్టి "వేయికన్నులదొరమొదలగు జేజేలును బడిగాపులుపడియున్న దర్శనము నేకురని దక్కటక్కటా! ఊరుపేరులేని నా కానందనందనపాదారవిందదర్శనంబు లభించుటెట్లు? పుణ్యవశమున లభియించు ననుము. పాండుసం న సంరక్షణమును సుయోధనాది దుష్టశిక్షణమును జేయ ననేకరాజ కార్యములఁ జక్కఁబఱుపఁ గంకణముఁ గట్టుకొనిన యామహామహుడు నాయొనర్చు మనవి ననవుల సాకల్యముగ నాలకించుటెట్లు. ఒక వేళ నాలకించుననుము. ఆపుండరీకలోచను నాకుసమకూర్ప నీపుండరీకలోచనుం డంతశ్శ్రద్ధవహించి యట్టి మహత్కార్యమునకుఁ గడఁగునే. అయినను నాకార్యము లోకసామాన్యమైనదికాదు. నా యెఱిఁగింపఁబోవు నంశమునుగూర్చి భగవంతుఁడగు దేవకీతనయుండు పెద్దకాలమునుండి యోచించుచున్నవాఁడని మధురాపురమున వినుచున్నాఁడను. అని యాయాదవరత్నము దర్శించు నభిలాషతోఁ దన్మందిర ద్వారమునకుఁ జని శ్రీవసునిఁ గొండొకచోట నిలిపి ద్వారపాలకులంగని మాగధుండొకఁడు వచ్చి తనతోఁ గొన్ని యంశముల ముచ్చటింపఁ దలఁచుచున్నాఁడని భగవంతునితో

మనవి యొనర్పుమని యావేత్రహస్తునితో నుడువుటయు వాఁడును గ్రొత్తమొగమును జక్కఁగాఁ బరీక్షించి వాసుదేవ భూవరులు తమచుట్టములు కొందఱితోఁ గొన్ని రాజకార్యముల ముచ్చట లాడుచున్నారు. నిన్నిప్పుడు లోనికిఁ జననీయరాదని వాక్రుచ్చుచు నించుక మనోరథ భంగముఁ గలుగఁజేసెను. అంతట నాతఁడు సేయునది యేమని యోచించుచుండ నంతలో నొక సేవకుఁడు పరుగు పరుగున వగర్చుచు వచ్చి స్వామివారు నిన్ను రమ్మనియానతిచ్చినారు రా రమ్మని పిలిచెను. ఆనాఁటిరేయి యాపండు వెన్నెలలోఁ జెమ్మటలార్చెడు మలయంపుఁ బిల్లగాడుపులు చెల్లాచెదరుగఁ బరుగులెత్తు నాసమయమున యదుకులచంద్రుఁడు చందమామరాలమేడమీఁది గడపటియంతస్తుపైఁ గూర్చుండి సత్యభామయు, మిత్రవిందయుఁ గరారవిందములఁ జామరములఁబూని మంజుకంకణక్వణనము లెసఁగ వీవఁ బాండవమధ్యముం డగుపార్థునితోఁ గొంత మంతనముండి చిఱునగవంకురింప సత్రాజిత్కుమారిం బలుకరింపుచు మిత్రవింద వదనారవిందమున నెలకొన్న మందహాసముం గని యుప్పొంగుచు నర్జునుని మాటల కెడనెడ నుత్తరములం జెప్పుచు రుక్మిణీదేవి చుట్టియిచ్చు తమలపాకుల చుట్టల నందుకొని నములుచుఁ భారములేని వినోదసముద్రమునఁ దేలుచుండెను. చిత్తపారవశ్యముఁ గలిగించు నావినోదరత్నాకరమునఁ దేలుచుండియు మాగధుఁడు వచ్చెననుమాట యెవ్వరో నివేదింప సత్వర మాతనిఁ దోడ్కొనిరమ్మని ముదల యొసంగి సత్యారుక్మిణీమిత్రవిందల మొగములవంకఁజూడ నాతలోదరులు తమతమ పనులఁ జాలించి యంతిపురమునకుం జనిరి. అంత నామాగధుఁడు దౌవారికునిచే మాధవుని సమ్ముఖమునకు దోడ్కొని పోఁబడి రాతిమెట్టులెక్కి యెక్కి బహుద్వారములు గడచికడచి యంతస్తుల దాఁటిదాఁటి దనరూపు

ప్రతిబింబించుచున్న పటికంపు నోడలసౌరున కచ్చెరునందుచు మెల్ల మెల్ల నడుగులిడుచు వాసుదేవుఁడు పార్థసహితముగ నున్న నెలవు నకువచ్చి యాయదుకులజలధికౌస్తుభమగు కౌస్తుభలాంఛనుని కట్టెదుటనిల్చి కనికరము నంబగాంకుల వెన్నెలజిమ్ము విశాలపుండరీకలోచనములును లోచనాంతసీమలు సోఁకు శ్రీకారములు బోలు వీనులును వీనులమీఁదినుండి నునుజెక్కుటద్దములఁ జిందులాడుచుఁ బ్రతిబింబించు మణికుండలద్వయధావళ్యమును నిందనీలముల కమ్మలగొప్పైన హత్తినమీసంపు నిగనిగయుఁ దొలుకారు మబ్బుతీరున వెలయు కోమలశ్యామలశరీరమును బాలకడలి కూఁతురు సుఖోపవిష్టయగు నింద్రనీలంపుబీరమనఁదగు విశాలవక్షమును గనుఁగొని తనయంతనుదయించి హృదయపేటిక నాఁగక బయటఁబడు మహాభక్తి నోడలెఱుఁగక వ్యాసశుకప్రముఖ మహాయోగి వాగమృతధారాశిరోచ్ఛ్రయుఁడును, ప్రహ్లాదనారదాంబరీషాది భక్తజనహృదయనివాసపీఠుఁడును జరాసంధశిశుపాలాదివైరివర్గ ప్రళయాంతకుఁడు నగు యాదవపారిజాత మితఁడెకదా యని యొకమాఱు కనుదమ్ములు విచ్చి కలవుదీఱ నవలోకించి, తనివివోమి మఱలఁజూచి కేలుమొగిచి తనకుఁ దోఁచిన లాగున నభినందింప యత్నించి యప్రయత్నముగ నీక్రిందిపలుకు నుచ్చరించెను.

---

## పదునొకండవ ప్రకరణము.

---

"శ్లో॥ దామోదరాయ దళితాఖిలదానవాయ
ధారాధరోపమతనుద్యుతిశోభితాయ
దాసావనోత్సవనిరంతరలీనచిత్త
పంకేరుహాయ మహితాయ నమోనమస్తే."

శ్లో॥ యదుకులాంబుధి పూర్ణసుధాకరం
భువనమోహనవిగ్రహధారిణం
సృజనధారణమారణకారణం
మనసి సంతతకీర్తి ముహుస్స్మరేం".

అని వందించి "కాళీయఫణిఫణాగ్రములనురంగస్థలములఁ జిందులు ద్రొక్కి, మున్ను బలిచక్రవర్తి మాణిక్యఖచితకిరీటముపైఁ గొంత సేపు విడిసి, జగత్పావనహేతువగు నాకాశగంగకుఁ బుట్టినిల్లయిన నీచరణద్వంద్వమున కిదె ప్రణమిల్లెద"నని యంగంబులెనిమిదియునేలఁ దాఁక నమస్కరించి నిలిచెను. అట్లు పరమభాగవతునిలీలఁ దనయెట్టయెదుటఁ జేతులుమోడ్చి నిలిచిన రాచకొమరునను గన్నులువిచ్చి చూచి, పుండరీకాక్షుండు విస్మయమును, నెనరును, వెలికిఁ దోఁపనేయుతరమొగ మాతనివైపు త్రిప్పి యాతఁడేదో మహత్కార్యముపై వచ్చియుండఁబోలునని నిశ్చయించి యొక యుచితాసనమునఁ గూర్చుండ నియమించి యిట్లనియె-

"చిలుకవారువము నిప్పుడే దిగి, చెఱకువిల్లును బూవుటమ్ములు నెచ్చటనో మఱచివచ్చిన మన్మథునిలాగుననున్న నీ వెవ్వరివాఁడవో యెఱుఁగునంతదాఁక నామనము తత్తరమొందుచున్నది. రాచవాఁడవే యగుదువేని నీవంటివాని పుట్టుకచే రాచకులము నిక్కముగఁ గృతార్థత సందెనని నే నమ్ముచున్నాను. సత్వరము నీచరిత్రమును, నాతోడ నీకుంగల కర్జము నెఱిఁగించి యీ మన పరిచయము నిక్కపు నెయ్యమగునట్లు హృదయము మఱుఁగుపఱుపక బలికి నాయింట నతిథివి గావలయు" నని సన్మానపురస్సరముగఁ బ్రత్యుత్తరమొసఁగుటయు ధైర్యముఁ దెచ్చుకొని తన వృత్తాంతమిట్లు వినుపింపఁ దొడఁగెను. "మధుసూధనా ! నావసించు నూరుపేరు చెప్పినంతనే నన్ను శత్రుపక్షమునఁ జేరినవానిగా నెంచకుండు వసుధృథ

విశ్వాసముతో నేను మగధరాజ్యములోనివాఁడ ననియు, గిరివ్రజ పురనివాసుఁడననియు, జరాసంధమహారాజు పాలనకు లోఁబడినవాఁడ ననియుఁ జెప్ప సాహసించుచున్నాను. నందనందనా! నీకుఁ బగతుఁ డగు నాజరాసంధుని యేలుబడినుంటచే నన్ను నీవెఱుఁగవు గాని నేను నిరంతరము నీచరణారవిందములను నమ్ముకొనిన భక్తగణములోని వాఁడను. అది యిఁకమీఁఁద నేనెఱిఁగింపఁబోవు నాచరిత్రమునుబట్టి నీవెఱుఁగఁగలవు. నేనన్యుఁడనుగాను. దేవా! నీజన్మకారణమున భువన పావనతఁగాంచి యేకులంబు మించు నాచందమామకులమె నాకును జన్మకారణము. నన్నుఁ గళానందుఁడని జనులుపిలుతురు. మాతండ్రి విక్రమవర్మ జరాసంధుని మహాసేన కధిపతియై చాలకాలము రాజ భక్తి నిండార నాతనిఁగొల్చి, మీకును మగధరాజునకును గొన్ని సంవత్సరములక్రిందట జరిగిన మహాయుద్ధమున నాదురదృష్టవశము ననో, తన యదృష్టవశముననో, నీచేత సంహరింపఁబడియెను. అతఁ డదృష్టశాలియో కాకున్న దుర్భగుఁడైన నీచేతిమరణ మెట్లు వానికిసిద్ధించును? తండ్రి బ్రతికియున్నకాలమున నాకుఁ జెల్లిన గారామును, నాకు నడచిన ముద్దుముచ్చటలును, నన్ను నేఁబొగడుకొనుట కాదు గాని మాధవా! మీప్రద్యుమ్నునకైన జరిగియుండదని నానమ్మకము. అశ్వారోహణము, గజారోహణము, విలువిద్దె, యస్త్రశస్త్ర సంధానమోక్షణంబులు, చతుర్వేదములు, నానాశాస్త్రములు, కావ్య నాటకాలంకారములు, నాకనిరాఘాటముగఁ బదునెన్మిదేండ్ల ప్రాయములోపుననే నేర్పి యేవిద్యయందును నాకు సమానుఁ డుండకుండఁ జేయవలయునను మాయయ్య యెంతయుఁ బాటుపడియె. మందభాగ్యుఁడనగు నాకు నాతండ్రి యెట్లుదక్కును! అట్లు నాతండ్రి నన్ను విడిచి పరలోకమునకుఁ జనుటయు, నాతల్లియు, నేనును నిరాధారగతిఁ గాలముఁ బుచ్చుచుండ నింతలో నీనడుమ మీతో జరిగిన కయ్యము సంప్రాప్తమయ్యెను.

నాకు విల్లువంచుటలోఁ గత్తిద్రిప్పుటలోఁ గల నేర్పునుబట్టి నేను విల్లెక్కువెట్టి పోరుసనిల్తునేని, మహాత్మా నీవును నీయన్నయగు బలభద్రుఁడును నిలువఁజాలరని మారాజునకును బ్రజలకును గట్టినమ్మకము గలదు. ఇది స్వోత్కర్షమని నాపై నలుగవలదు. ఇది యన్యుల యభిప్రాయముగాన నేనుడువవలసివచ్చె. అందుచేత మాతండ్రి తీరిన కొన్నినాళ్లకు జరాసంధుఁడు మాయింటికివచ్చి నన్ను గౌఁగిలించిపితృవియోగదుఃఖము గొంత తనశాంతవచనముల నుపశమింపఁజేసి నాకన్నఁ బెద్దలు, ధనుర్విద్యలం గృతపరిచయులు, పెక్కండ్రుండిన, వారి నిరాకరించి సైన్యాధిపత్యమునకు నన్నభిషేకింప సమకట్టెను. ఐనను నాకది యిష్టము కాకయుండుటచేఁ గొన్నినాళ్ళుకడచినవెనుక నట్లభిషేకము గావింపవచ్చునని దినములు జరుపుచు వచ్చితిని. ఇంత మహాపదవి యింత చిన్నతనమున నాకువచ్చి స్వయముగాఁ బైపడుచుండ నిరాకరింపవలసినంత యవసరమేమని మీరడిగిన నడుగవచ్చును. దాని కుత్తరముఁజెప్ప సిద్ధముగా నున్నాఁడను. మాయయ్య జీవించియుండఁగ నించుకించుకయు, నాతఁడు గతించినవెనుక నెంతయు నెక్కుడుగను నాకు మాయేలికపై నాతని దుర్గుణములఁబట్టి యసూయ యెంతవారించిన నిలువకపోడమి తుద కుద్యోగము మానిపించునంతటి యౌద్ధత్యంబు వహించి, మాతండ్రియుండఁగా నాతనికిజంకి కొంతనా యభిప్రాయమును దాఁచితినిగాని, తదనంతరమున నాయిచ్చవచ్చినట్లు వర్తింప స్వాతంత్ర్యము లభింపఁజేయుటం జేసి నేనే కొలువుతోఁదలఁగికొంటిని. ఆకడపటి కయ్యమున సైన్యాధిపత్యమునకేనంగీకరింపకున్నను మీపైఁగత్తికట్టి తక్కినజోదులతోఁ గలసి పోరుమని నన్ను బలవంతపెట్టి జరాసంధుఁడు స్వయముగా బతిమాలెను. కఠినమైన నామనస్సు విఱిగెనందున నేనియ్యకొననైతిని. నాఁటనుండియును నాయేలిక నన్ను మ్రింగివేయవలయునని

యున్నాఁడు. ఇది నాచరిత్రముం బూర్వభాగము."

ఈకథ లిట్లు కళానందుఁడు వాగమృతధారలుగురియ నుపన్య సించుచుండ శ్రీకృష్ణుఁడునాని మొగమువంక తెప్పవాల్పక చూచుచుఁ బొల్లయినఁ బోకుండ నాలకించుచుండ నర్జునుండును బాహుబలమునఁ విలువిద్దియ నీతఁడు తనకుఁ దుల్యుఁడగుటకు సందియము లేదని యను కొని తనకార్యమున కాతఁడు తోడుపడుటయే సంభవించునేని యది నెఱవేఱుట సిద్ధమని నిశ్చయించెను. అనంతర మారాజకుమారత్రయ మిట్లు ముచ్చటింపఁ బొచ్చిరి.

కృష్ణుఁడు—కళానందా! నీచరిత్రమునఁ బూర్వభాగముకడు వినసొంపయి యున్నది. నీయుత్తరభాగమునుగూడ వినపింపవే.

అర్జునుఁడు—ఇప్పుడు వచ్చినపనికూడ సందుఁ దేటపడునని తోఁచెడును.

కళా—అయ్యో! ఇంకఁ జెప్పఁబోవు పలుకుల స్వప్రయోజన మును బరోపకారచింతయుంగూడఁ గలసియున్నవి. అందునాలాభ మెటులున్న లోకోపకారార్థము తమరు నాయుడిగిన సాయమైనఁ జేయుదురని మీయిరువుర వేఁడుకొనుచున్నాను.

కృష్ణు—ఆరెండునుగూడ నిర్విఘ్నముగఁ గొనసాగు. నీవు మాకిపులఁబోయు వాగమృతమే యింతవఱకు యోచించుచున్న కార్యమునకు జీవమును గల్గించుఁగాక యని దీవించుచున్నాను.

కళా—చిన్నతనమున విద్దెకఱచునాఁడు మొదలు నాడెంద ము మగధరాజు నలుపు చెడుగుల సేవగించుచున్నది. ఇప్పు డది వేయిమడుంగు లెక్కుడగుటకుఁ గారణము కల్గినది. చంద్రపాలుఁ డను క్షత్రియకులభూషణుండు గిరివ్రజపురమునఁ గలఁడు. తను జూచినవారి హృదయములనెల్ల నాకర్షింపుచు మోహనయంత్రమువలె నలరు సౌందర్యతిలకయను కూఁతు రాతనియనకుఁ గలదు. ఆచం

దరిముఖిని గనులార శుకయోగియే నొకమాఱుచూచిన నియమభంగము నిశ్చయముగ నొందునని యానాఁటివారందఱు వేయినోళ్లఁ బొగడుచుండ నావంటి ప్రాకృతుఁ డా యలరుఁబోఁడిని వలచుట యొకవింతకాదు. ఒకనాఁ డాజవ్వని గోమునఁ బెంచు గొఱువంక యొకటి దాసి చేసిన పొరపాటుకతమున గూటినుండి యెగిరి మామేడమీఁద వ్రాల నామెచెలియగు నాగవల్లి వచ్చి దానింబట్టియిమ్మని నన్ను వేఁడుటయు నేర్పున నేను దానింబట్టి స్వయముగ నామెలనాఁగకడకుం గొంపోయితిని. సౌందర్యతిలకయుఁ డెంపుడుపిట్టపయిఁగల కనికరముపెంపున యౌవనవతులను గప్పుసిగ్గుఁ ద్రోచివైచి నాహృదయమును లాగుకొన్నట్లు గొఱువంకను నాచేతనుండి లాగుకొని యనంతర మెంతయు సిగ్గువడి తన సాహసమునకు నొచ్చుకొనెను. నాఁడు మాయిరువురకు బ్రథమదర్శనము. ఆమె నాఁటనుండి నాయందు వలపు నిలిపినట్లు నాగవల్లిముఖమున విని యెంతయు విరాళిఁ జెందుచుంటిని.

ఆ యిందువదన నను వలచె ననుమాట వినకమున్న రణార్ణవుండనువాఁడు జరాసంధుని యుంపుడుకత్తెకొడుకు, దానిపయినెయ్యంబునిలిపి, కొన్నినాళ్ళ కామెచిత్తంబు నాపయి హత్తెనని విని, తండ్రికాళ్ళపయిఁబడి బలిమిచేఁదనకా ముద్దుగుమ్మ నిప్పింపుమని వేఁడుకొనుటయు నా నేలఱేఁడు నాపయిం గోపమునసేసి యాలేమతండ్రియగు చంద్రపాలునిఁ బిలువనంపి రణార్ణవున కాజవ్వని నిమ్మని యడుగ నతఁడు పెండ్లితఱి సంప్రాప్తించునపుడు చూడవచ్చునని విభునకు బదులు చెప్పి పుత్రికావివాహార్థమై దురంతచింతం గూడియున్నవాఁడు. పండు జవ్వనంబు పెంపున యువతీజనంబు లొండొరులపయిఁ దెల్పరాని వలపు నిలుపునెడ వారి కలయికలకు నాటంకములు పొడఁగలుడు వారిహృదయము లెట్లు నిర్విణ్ణతఁ జెందునో, యెంతటి

యాపద వారికి వాటిల్లునో రుక్మిణీకళ్యాణకాలమునకు మున్నె నీ వనుభవించితి. కావున నే వేఱుగఁ జెప్ప నక్కఱలేదు. ఈకార్యమున నీభక్తునకు నీవు తోడుపడవలయును. దీనిఁ బట్టి యాత్మ్మలాభపరాయణుండనయి యిందువచ్చితినని నన్నుఁ దలంపకుము. నేను బరిత్యేక మీకార్యార్థినయి రాలేదు. నే నొకవేళ నబద్ధమాడినను సకలలోకాంతర్యామి వగు నీవెఱుఁగకపోవుగదా.

కృష్ణు—నే నొనర్పవలసిన లోకోపకారముఁగూడ వాకుఱిచ్చి నీ సందేశము ముగింపుము.

కళా—నేను రాజద్రోహినని నాయందు మీరు దోష మారోపించిన నారోపింతురుగాక. నావిషయమునను మీర లింక నేమనుకొన్న ననుకొందురుగాక. మాయేలిక యగు జరాసంధుని చేయుగుల విన్నవించు తలంపున ధరణీభారంబు మాన్ప నవతరించిన మిమ్ముల దర్శింప వచ్చితిని. ఆదోసకారి కతమున రాజమండలము పొలియుపాటు చూడఁజాలక నాకుఁ గల భూతదయ రాజభక్తిని డెందమునుండి పాఱఁదోలి నన్నిందుఁ దెచ్చినది. మిహుతలదండుఁ బోలు సేనతోఁ బలుదేశములపయి దాడివిడిసి పురముల నాక్రమించి జయించి పుష్పశరసుకుమారులగు రాచకొమరులం దెచ్చి చెఱసాలను బంధించి యనుదినమును భైరవపూజఁజేసి తన్నివేదనకు నీరాజులలో నొకరినో యిరువురనో బలియిచ్చుచుండును. ఇంద్రసమానపదవిఁబాసి యంతర్దైన్యమునొందుమూర్ధాభిషిక్తులఁజూడఁజాలకయుఁ దండ్రులకుఁ బాసిన బిడ్డలగోల వినఁజాలకయు మగలకుఁ బాసినపతివ్రతల యార్తనాదముల నాలకింపఁజాలకయుఁ గన్నులు కాయలు గాచి చెవులు చీములు కట్టుచున్నవి.

"ఈవల సాక్షాన్నారాయణ స్వరూపుండవగు నీవు వేంచేసియుండ, నావల నీకు మేనమఱందియో, మగఁటిమి నీనాఁటి రాచకొల

మునకుఁ దలపూవగు నీయర్జునుండుండ, భీష్మద్రోణాదిమహాయోధులుండ మీకన్నులయెదుట నొక దురాత్ముఁ డింత ఘాత లోకమునకుఁ జేయుచు బ్రతికియుండునా? ఇట్లుదాసీనులై మీరెల్లరు వాని కట్టుసేయ సెలవిచ్చుట మీకప్రతిష్ఠయేగాని యశస్సంపాదకముకాదు. మాధవా! నీభక్తజనపాల బిరుద మెందరిగెనది? కవ్వడీ, నారాచపాడి యేది! నందనందనా! నీవు మనసారఁ దలఁచుకొన్న నీచక్రధార కాజరాసంధుని యుసురు లెంతపాటివి! ఈవఱకు నీవు కడతేర్చిన రక్కసుల మూఁకకన్న నీతఁ డెక్కువవాఁడా? ఈతని జంపుటయే చంపుట. వేయేల? జగత్కంటకుండగు నీమనుజాధమునిఁ బిల్కుమార్చి రాజచక్రమున కభయమొసంగవేని, యారాజభార్యలయుసురులు తగులకపోదు. దేవా! భూతదయపెంపున నిట్ల నరానిమాట లంటిని. క్షమింపవలయు" నని యాకళానందుఁడు ముగించుటయు, వాసుదేవుఁడు వానితోఁ దా నాకార్యము దలపెట్టుటకుఁ గాలము సమీపించుచున్నది. భయపడవల" దని పార్థుని మొగమువంకఁజూచి "మన మనుకొను పని కిది శుభసూచకముగా నున్నదిసుమా" యని చిఱునగవునగి యప్పటికిం బ్రొద్దాయెనని కళానందునితోఁగూడ విందారగింప లోని కరిగెను.

---

## పండ్రెండవ ప్రకరణము.

---

ఆరేయి బంధుమిత్రులతో నందకుమారుఁడు విందుల నారగించి; పండువెన్నెలలోఁ బూలసెజ్జవేయించి యద్దానిపైఁ గళానందుని పండుకొన నియమించి, పార్థునకుఁదగు పాన్పు నమర్పం బనిచి యంతిపురమునకుంజని తాను యథేచ్ఛముగఁ బవ్వళించెను. కళానం

దుఁ డామృదుశయ్యపై మేను వాల్చుటయుఁ దనమనసు హరియించి
న పూవుఁబోఁడి జ్ఞప్తికివచ్చి, కంటికిఁ గొంతతడవు కూర్కు లేకుండఁ
జేసినను నకుమనకుమ వీచు చందనాచలపుఁ గమ్మతెమ్మెరలు మ
నస్తాపమును హరింపఁజేసి యించుకనిద్రాసౌఖ్యమును గలుగఁజేసెను.
గోవిందుఁ డంతకన్న ముందుగఁ బ్రాతఃకాల మంగళతూర్యారావ
ముల మేలుకని, మేలు కొంచియు నిద్దుర బద్ధకమున లేవలేక కను
లు మూసికొనియున్న పార్థుని లేపి యాతని వెంటఁ బెట్టుకొని తన
యుద్యానవనమునకుం జని ప్రభాతవాయువులు గమ్మపుప్పొళ్లమీఁ
దఁ జల్లు నొక మాధవీలతాగృహమునఁ గూరుచుండి, పార్థునితో
నిట్లనియె. "అర్జునా ! నీవువచ్చినకార్య మెఱుంగఁ జేయవైతివి.
చుట్టఱికము పెంపున మముం గనంగోరి వచ్చితివో, రాజకార్యము
మీఁద నాయాలోచనముఁ గైకొననేగుదెంచితివో, విస్పష్టముగ నె
ఱుఁగఁజెప్పుము. దురాత్ముఁడగు దుర్యోధనహంతకుఁడు మరల నె
గ్గదయిన మీకుఁ దలపెట్టలేదుగదా!", అనవుడు "మధుసూదనా !
దుర్యోధనహతకుఁడు లక్కయింట మమ్ముంచి దానికిం జిచ్చుముట్టిం
చుట మొదలు, మాయభ్యుదయముం జూచియో, తన నింద్యచరిత్ర
ముం దలఁచియో, కడుసిగ్గుపడి సగము చచ్చియున్నట్లు గానవచ్చు
చున్నాఁడు. అతనివలన మాకు రవంతయు భయకారణము లేదు.
తక్కిన రాజచక్రమునకుఁ గృష్ణుఁడు పాండవపక్షపాతియను వాడుక
యే పిఱికి మందుగదా? సకలహృదయవర్తియగు నీవు నావచ్చినపని
యెఱుఁగవే? నిన్నఁ గళానందుండు జరాసంధ నిర్మూలమునుగూర్చి
యుపన్యసింపుచుండ "మన మనుకొనుపని కిది శుభసూచకముగా
నున్నదిసుమా" యని నీవనలేదా? అదియు నీవ యెఱుంగుదువు.
నానాటినుండియే వినఁదలఁతువేని నేనిప్పుడు మనవి యొనర్చెద నాల
కింపు" మని పాండవమధ్యముండు సవినయముగఁ బలుకుటయు, నం

దనంజనుంను మందహాసంబు ముఖారవిందమునకళవన్నె యిడ "బావా నేను గార్యమెఱిఁగి యటులనలేదు. ఈవఱ కనేక పర్యాయములు నీవును నేనును గలసికొనినపుడు జరాసంధ సంహారమునుగూర్చి ముచ్చటించుచుంటిమి. కనుక నట్లంటిని. ధర్మనందనుం డేమి సెప్పుమని నాకడకు నిన్నుఁ బుత్తెంచె. అతనికోరిన నావశాభిధరించుంచి నిర్వర్తింతు నప్పు" మని గోపాలకృష్ణునకుఁ గౌంతేయుఁ డిట్లనియె. "అచ్యుతా! దయామయుఁడగు మయుఁడు మాకొసంగిన యపూర్వ సభామంటపమున నానా మహారాజకిరీటమణిరాజములు చరణరాజీవములకు నీరాజనమిడుచుండఁ గార్యపరతంత్రులగు మంత్రులుఁ జుట్టములుఁ నెయ్యురుఁ బరిచారకులు సైనికులు మొదలగువారు తన్నుఁగొలువ నిరుకెలఁకుల గదాగాండీవములు కేలమెఱయ, మాభీమసేనుఁడును నేనును నిలువ, గద్దెకుముందు నిలిచి వందనములుసేయురాచవారల పేరులు దనకు నకులసహదేవులు విన్నవింప, మాయన్న యుధిష్ఠిరుఁ డొకనాఁడు, నిజముగా నాఖండలవిభవముతోఁ గొలువుదీర్చియుండ నారదుఁడు మహతియను వీణ మెల్లమెల్ల మీటి, దాని మృదునాదముతోఁ దనకంఠస్వరము మేళవించి, నీలీలలంగొన్నిఁటిఁ బాడుచు నాసభామధ్యమునకుఁ గన్నులు మిఱుమిట్లుగొలుపునట్లువచ్చినిల్చెను. స్ఫటికముగబోలు దేహకాంతితో సభకుఁ గ్రొమ్మెఱుఁగులు వెట్టుచు నామునిచంద్రుఁ డట్లు నిలువ యుధిష్ఠిరుండు మొదలు ప్రతిహారివఱకు, రచ్చనున్నవారెల్లరును మోడ్పుఁగేలున నిల్చి మెదలకయుండిరి. అనంతరమున గద్దియుడిగ్గి మాయన్న జడదారికిఁ బాదాభివందనమొనర్చి, యర్ఘ్యపాద్యములఁ బూజించి, యుచితాసనమునం గూరుచుండఁజేయఁ బ్రసన్నుండై రాజనీతి యొక్కింత మాకుపదేశించి, యామునివల్లభుండు మాసభను నలుదెసలఁ గనుఁగొని, వర్ణించి యేలికవైపు మొగమై యీకీతిం బల్కెను. "యుధిష్ఠిరా! అఖిలక్షత్ర

ష్ములలోఁ దలిదండ్రులసేవ యుత్తమమని ధర్మపథులు పలుకుదురు. అట్టియు స్వర్గోత్కృష్టమగుటఁగాదె? ఏల సమస్త ప్రపంచ సౌఖ్యమ్ములు విడిచి మున్ను రాఘవుఁడు తండ్రి పంపున నన్నవస్త్రములకు దూరుఁడై కారడవుల సంతవంత నొందుట! సర్వలోక సందర్శన కుతూహలినగు నేనొకపుడు నొకనాఁ డింద్రలోకమునుండి మరలుచు మార్గవశమున యమలోకముం గనుఁగొనఁబోయితిని. రాజా! ఈచెడు వార్త మీకుఁ దెలుపకుండినన్ను వలనుపడదు. తనకంటె సర్వైశ్వర్యవంతులు నల్పబలాఢ్యులునగుమహీపాలురింద్రమందిరమున నక్షయ సౌఖ్య మనుభవింపుచుండఁ, బాపము, మీతండ్రి పాండురాజు దీనాననుండై, చూచువారలకు గుండెలు నీరగునట్లు జాలిఁగొలుపుచు, నాయమలోకమున నొకమూల దిక్కులేనివానివలెఁ గూరుచుండెను. భూలోకమునందుండుకాలమున మీయప్పకును నాకును బరిచయముఁ గొంతకలిగెను. కావున యమలోకమంతయును జూచినపిదప, నేను పాండువిభుని సమీపించితిని. నన్నుఁ జూచినతోడనే పంచప్రాణములు లేచివచ్చినట్లు కడుభక్తి నన్ను సమీపించి, "మునీంద్రా! చూచినారుగదా నాదురవస్థ, ఈపాపాత్ములనడుమ నింక నేనెంత కాలముందును? మీరు శ్రమయని యోచింపక నానిమిత్తమొకసారి మర్త్యలోకమునకుఁజని, నాకుమారులగు యుధిష్ఠిరాదులకు, నా దురవస్థఁదెలిపి, వారిచే నెట్లయినను, రాజసూయముఁ జేయింపవలయు. ఆమహాధ్వరము నిరంతరాయముగ ముగియునేని, నే నక్షయలోకమున నం పురందరతుల్యుఁడనై మహాసుఖముల ననుభవింపుచుందును. మాయుధిష్ఠిరుఁడు లోకముబిడ్డలవంటివాఁడుకాఁడు, మాభీమార్జును లతిసాహసులు, కుఱ్ఱలగు నకుల సహదేవులు గడుయోగ్యులు, మా వాసుదేవునకు నేనన్నఁ బ్రాణముగదా! ఇఁక రాజసూయము నెఱవేఱకుండ బెట్టని యముఁడు వినకుండ నాచెవిలో మెల్లమెల్లనఁ

బలికెను. అజాతశత్రూ ! యెంతభోగ మనుభవించిన నేమి ? ఎంత పరితాపవంతుడయిన నేమి ? ఎంతెంతవారలు కుమారులున్న నేమి? ఎవనికైనం గర్మమనుభవింపక తీరదుగదా యని యప్పుడు నామనస్సునకుం దోచినది. మీరు, కీర్తికిని, దేశాక్రమణమునకును గాదుగాని పితృసంరక్షణార్థము రాజసూయము జేయవలయు" నని చెప్పెను. వాసుదేవా ! ఈపలుకులు నారదుని నోటినుండి వెలువడుటయు నన్నగారు, గద్దియ మీదగనే, క్రోధావిష్టులైపోయిరి. భీమసేనుడు చేతినుండి గద తనంతనె జారి నొకపీఠముపై జతికిలబడియెను. నేను యుధిష్ఠిరుని పాదపద్మముల సన్నిధి నున్నవాడనై చూచుచుంటిని. తక్కినవారందఱును నివ్వెరపడి చూడసాగిరి. సర్వమహీపసింహాసనములను మాఱుమ్రోగించుచు లేవనుండి దిక్కుమాలిన వానిచందమున పితామహ్య యమలోకమునందుండి వనటం జెందునే, తనకొడుకు లప్రమోజకులని పాపము మాయప్పయెంత మఱుగుచున్నవాడోగదా ! దుర్యోధనునకుంబోలె, మాకుం గూడం దండ్రిజీవించుటయు, నాతని గన్నుల నద్దుకొని పూలం బూజించి సుఖించుటయుం బ్రాప్తము లేదు నరేకదా, పరలోకమునందైన జనకునకు సద్గతిగల్గు కర్మములు నేయనైన మేము నోచుకొనమైతిమే" యని యంగలార్చుచుం గన్నీరునెట్టుకొని దీనాననుండై యున్న పార్థునిపై ఖరియు, చేతనమును, బిత్రుభక్తియుం గని నగి, మాధవుడు, తనమేనమఱందిమీదం జేయిచాచి నిమిరి "పార్థా ! ఈ విషయమున కింత కష్టపడగిలి వాపోయెదవేల ? రాజసూయము నేయుటమాట యాలోచింతము. రాజసూయముం జేయుట చులకన గాదు. అభిమాన ధనులగు సూర్యచంద్రవంశపు రాజులు తమకుం దారై మనకు వశులు కారు. జగత్కంటకుండగు జరాసంధగంధసింధురుడు మనశత్రువులకు మొనగాడై యున్నవాడు. అతడు

జీవించియున్న యెడల యాగము జరుగుట సున్న, మఱియు శిశుపాల సాళ్వప్రముఖులు మహాబలశాలురు, జరాసంధవహ్నికి శిశుపాలవాయువు తోడగునేని యార్పు మనతరముగాదు. శక యవన పుళింద తురుష్క బర్బర పారసీకాదులు మ్లేచ్ఛనాయకులున్నవారు. ఇందఱతోఁ గత్తిగట్టి పోరి గెల్చికద యజనము ముగించుట. ఐనను మనవారందఱకుఁ బెద్దయుఁ బూజనీయుఁడునగు యుధిష్ఠిరుఁ డిందులకియ్యకొనియెనో యెఱింగింపుడి నీయభిప్రాయమును గూడఁ దెలియఁ బఱుపుము. అనవుడు ఫల్గును డన్నగారి మత మెఱింగించువాఁడై మాధవుని జూచి యిట్లనియె. "బావా! మాయన్నగారి సంగతి యెఱుఁగనివానివలెఁ గ్రొత్తగా నడిగెదవేమి? వాసుదేవుని యభిప్రాయమే నాయభిప్రాయమని భారమంతయు నీపై మోపినాఁడు. కరుణామృతము వెదజల్లు నీదల్లని కేగంటిచూపులును, నావింటితూపులు నక్షయములై యుండెనేని యిట్టి రాజసూయములు వేయియైనను నవలీలగ నిర్వర్తింపఁబడు. తృణీకృతకృశానుండగు మాభీమసేనుని ప్రతాపాగ్నిలోఁబడి యీసాళ్వాదిశలభములు మ్రగ్గవే? నీవు తలఁపు మాత్రము నిలిపిన రాజసూయము నిర్విఘ్నముగ నగుఁగాన మాకు ననుజ్ఞనీయవలయు" ననిచేతులుజోడించి ప్రార్థింప నాతనిమనవి నాలకించి మాధవుండు తలయూఁచి "సరే యుధిష్ఠిరుఁడు మనమున నుత్తలపాటు నొందుచుండును. నీవిఁక నింద్రప్రస్థపురమున కరుగుము. రాజసూయము నెఱవేఱు నుపాయము వెదకి కొన్నినాళ్లలోన నీకు వర్తమానముఁ బెద. కళానందుఁడు మనపని కుపయోగించుఁగాత" మని హెచ్చరించి, యుత్సాహంబుఁ గల్పించి, యాపూఁట పార్థుని సబహుమానంబుగ సాదరంబుగ ధర్మనందనునికడకుఁ బుత్తెంచెను. కళానందుఁడు పార్థునియొద్ద సెలవుగైకొని శ్రీకృష్ణునియింటఁ గొన్ని దినములుండి ద్వారకానగరమునందలి విచిత్రములను, వాసుదేవుని లీల

లను, గోడుకులబలగము గావించు వినోదములను, గన్నులారఁగను గొనుచు, హృదయేశ్వరి నిమిత్త మెడనెడ విచారించుచుఁ బ్రొద్దులు పుచ్చుచుండెను.



## పదుమూఁడవ ప్రకరణము.



చ. అరమరలేక నే మొగలి యాకుపయి న్లిఖియించి యంపు ను
త్తరము లతాంగి కందినదొ దానిహరించిరొ త్రోవ దుర్జనుల్
సరసిజనేత్ర యెంతటి విషాదము నొందెనొ నానిమిత్త మె
క్కరణినిఁబుచ్చుచున్నదొకొ కాలముదుష్టులమధ్యనుండుటన్.

కూఁతును రణార్ణవున కిమ్మని యా జరాసంధుఁడు బాధించుటఁ జేసి ముదుకఁడగు చంద్రిపాలుఁడు రాజున కెదురాడనోపక మెత్తవడి యియ్యకొనెనో, నాహృదయేశ్వరియే నాపై నిరాశఁజెంది, రణార్ణవునో, మరియొకనినో చెట్టఁబట్ట సమ్మతించినదో, దైవమా! ఏమికా నున్నదో తెలియదు. తీయవిల్తుఁడు ప్రాణములఁ దీయుచున్నవాఁడు. హా! హృదయేశ్వరీ! పౌరుషవంతమగు రాచకొలమునఁబుట్టిన నీవు తుచ్ఛభోగముల కాశపడి, మున్ను నామీఁద నిలిపిన చిత్తమును మరల నింకొకనిపై నిలుపవను ధైర్యమున నోడలఁ బ్రాణములతో నుంటిఁగాని, మఱియొకలాగునఁ దోఁచునెడ, నేనీపాటికి మాయయ్యె క్కడ నుందునుజుమీ! శశానందునిఁ దక్క నితర రాజనందనుని కేలు బట్టనని మున్ను చెలులతో నీవుచేసిన ప్రతిన నాగవల్లి నాకు వీనుల విందుగా విన్నవించిననాఁటి యానందము మరల నెన్నఁడును గలుగ గయ్యె

తే. గీ. పంజరమునుండి విడివడి పరుగులెత్తు
చిన్ని గొరవంకఁ బట్టి నీ చేతికిచ్చు
వేళ నామీఁదఁ బఱపిన వాలుఁజూపు
లించువిలుకానితూపులై ధృతినిఁ దూల్చె.

అని పెక్కువితముల మదనవికారముఁబొంది కళానందుఁ డా నాఁటిరేయి విలపించుచు, నించుకయు నిద్దురలేక మఱునాఁడు కెంపు బాఱిన కనుదమ్ములతో మాధవుని యెదుటఁ గూరుచుండ నీతని యవస్థ నాతఁడు గ్రహించి కార్యము సత్వరముగ ముగింపకున్న నిర్హేతుకముగ నీ రాచపటి కృశించిపోవునని మనమునం దలఁచి యా తనితో నిట్లని ముచ్చటించె.

కృష్ణ.—కళానందా! నీయిచ్ఛాప్రకారముగ జరాసంధునిఁ బరి మార్చునుపాయ మరసెదఁగాని మాకుఁ జేయు సహాయమేమో చెప్పుము. ఇందు నీలాభముఁ గూడఁ గొంతయున్నది గదా?

కళా.—దేవా! సర్వశక్తుఁడవగు నీకు నేను సహాయమేమి చేయఁగలను? అయినను మీరెద్దిసేయుమనియెద రద్దియ కావింప నుద్యుక్తుఁడనై యున్నాను.

కృష్ణ.—నీవిది నీమనసులోనుంచి ప్రయత్నము సేయవల యును. దగ్గఱగారమ్ము నీకీరహస్యము నెఱిఁగించెదను.

అని చెవిలో నెద్దియో యొకరహస్యము నూఁది యథాస్థానమునఁ గ్రమ్మఱఁ గూరుచుండ నియమించి యిట్లనియె.

కృష్ణ.—నీవును మీ శ్రావణుండును గలసి నాసందేశముం గైకొని యింద్రప్రస్థముననున్న యుధిష్ఠిరునకు నొసంగవలయును. ధర్మజుఁడు రాజసూయముఁ దలపెట్టినపుడె జరాసంధుని మరణముఁ దలపెట్టితి. కావున నీవింద్రప్రస్థపురమునకుఁజని కుంతీనందనునితోఁ బార్థుఁడు తెలిపినయంశము విని దాని పూర్వోత్తర సందర్భములఁ

జక్కఁగ విచారించి రాజసూయము సేయింపఁగృతనిశ్చయుఁడ నైతి ననుము. దానినారంభించుటకుమున్నె వసుంధర జరాసంధ శూన్యము కావలయుననుము. ఆపనిదీర్పఁగలమేటిమగఁడు మనభీమసేనుఁడొక్కరుఁడ యనుము. ఈనడుమ గిరివ్రజముఁ బ్రవేశించుటకు జరాసంధునాయువుపట్టెఱుఁగుటకు నెన్నియుం బన్నగడల నేను బన్నుచుండుననుము. ఇది శిశుపాల దుర్యోధన ప్రముఖులకుఁ దెలియునేని కడుమోసము వాటిల్లుననుము. నాచెప్పినట్లు మెలఁగుదురేని రాజసూయము నొక్క వ్రేల్మిడిఁ జేయించి యుధిష్ఠిరుని భూలోకదేవేంద్రునిగా నొనర్చుభారము నాయదియనుము. మఱియు నేనక్కడకుఁ గతిపయదినములలో వత్తుఁగాన నీవందె పాండవులఁ గలిసినవై యుండుము. అదియునుఁగాక శిశుపాల దుర్యోధన జరాసంధుల వేగులవాండ్రు వేషములువేసికొని దేశములు సంచరించుచు మీవంటి బాటసారులకు నమ్మకముఁ బుట్టఁబల్కి గుట్టుమట్టెఱింగి హానిసేయుచుందురుగాన కడునప్రమత్తుండవై మెలఁగవలయును. ఈయాలోచనలు పరమగోప్యంబులనుమాట నీవ యెఱుంగుదువుగదా" యని సందేశము హితోపదేశముతోఁ గూడఁజెప్పి మఱునాఁడు వానింబంపఁదలఁచుచుండ సంతలో సాత్యకి యరుగుదెంచి యన్నకుం బ్రణమిల్లి నిలిచె. వాసుదేవుఁ డాతనినెమ్మొగమ్మునఁజూచి "తమ్ముఁడా! తొట్రుపాటున వచ్చితివేమి? ఎప్పట్టుననైన వింతలు పుట్టెనే" యని పలుకరించెను. సాత్యకియు నలుగడలు బరికించి పరులేరును లేరని తెలిసికొని "అన్నయ్యా! మనవేగులవాండ్రలోఁ గడుఁజుఱుకుఁగలవాఁడగు సారంగుఁడిదె వచ్చియున్నవాఁడు. జరాసంధుఁడదెద్వారకపై దండువిడియఁదలఁచి యీమహాయాత్రకుఁ జెక్కుసైనికులఁ బసులఁ బసులకు మేతల గుఱ్ఱములఁ దగినరౌతులఁ బోగుసేయుచున్నాఁడట. ఇంతకన్న వింతలేవియుండు" నని విన్నవించె. ఆమాటలు విని దేవకీతనయుఁడు

సారంగుని బిల్చి కొన్ని ప్రశ్నముల నడిగి వానిమూలమున వాఁడు విన్నమాటలోని నిజమెంతవఱకున్నదో యరసి సాత్యకితో "తమ్ముఁడా ! మాగధుఁడు మనపై కింతలో రాఁజాలఁడు. హంసడిచికుల నిరువురఁ దెగటార్చి తెక్కలులేని పక్షివిధముఁ జేసితిమి. సన్నాహమొనర్చి మనపై వచ్చునప్పటికి కొన్ని నెలలకన్న నెక్కుడుకాలముపట్టునని తోఁచెడును. నేనొనర్పఁదలఁచు కార్య మీలోపున జరుగవలయు. అయినను మనము జాగరూకులమై మెలఁగుటకర్తవ్యము. కళానందా ! నీవు రేపు రేపకడ బయలుదేఱి కార్యనిర్వాహము నెఱపుము. మగధరాజునకు శిశుపాలాదులెవ్వరయిన సాయముసేయ నుద్యమించుచున్నారేమో యరసి నాకువర్తమానమంపుమని మాపార్థునితోఁ జెప్పుము. అట్లులేకయైనను ముందువారి పీచమడఁచి వెనుక మాగధుని నుక్కడంచెద. అని మఱియుఁ గొన్ని రాజనీతులు వానికుపదేశించి మఱునాఁడాతనిం బొమ్మని సెలవొసఁగె. ఉదయమునఁ గళానందుఁడు లేచి పయనమయి వాసుదేవుని చరణారవిందములకుఁ బ్రణమిల్లి తన సౌకుమార్యము, దేహకాంతియుఁ జౌరులుచూచి యచ్చెరువడ నాశ్రావణునితోఁగూడ పోవుచుండెను.

ఈయిరువురు నిట్లు బయలుదేఱి మార్గమున ననేక పుణ్యనదులఁ గాంచి యందు గ్రుంకులిడి, బహు దివ్యక్షేత్రములమెట్టి, యున్నతపర్వత శిఖరముల నెన్నియేనినెక్కి, పలుదేశముల గ్రామముల బట్టణముల వీక్షించి, వారివారి భాషావైచిత్ర్యములకు, నాచారభేదములకు రూపభేదములకు నెంతయు వినోదము నొందుచు మానవస్వభావము నేర్చుకొనుటకుఁ బ్రపంచజ్ఞాన ముపార్జించుటకు దేశాటనమెంతయు మూలంబని తెలిసికొని, యామాచోటులఁ గలవింతలన శ్రావణునకుం దెలియఁజెప్పుచు సంజవడినచోట విడిదిగాఁ జేయుచు గడునుల్లాసముగా నడచుచుండిరి. ఇట్లుప్రొద్దులు జరుగుచుండ

నాఁడు కళాసందుఁడు శ్రీవరానితోఁగూడ నెద్దియో ముచ్చటింపుచు మాటలసందడి దారితప్పి, కొంతదవ్వు చని యొక కుగ్రామముఁ జేరి యందు విడియందలఁప నది మాదిగపల్లియయని యందలి నివాసులు తెల్పిరి. వేదాధ్యయనముఁ జేసిన కర్మిష్ఠుఁడగు నుత్తమ ద్విజునకు జండాలవాటియందు నోటికన్నము నీరు నెట్లుపోవునని పసువులఁగోసి యెండవేసిన తోళ్ళకంపును ముక్కుమూసికొని యందు నిలువలేక యక్కడకు దగ్గఱగ్రామ మెద్దియని యొక మాదిగవాని నడిగిమూఁడుక్రోసులదూరమున నున్న వేఱొక యగ్రహారికింబోయి వంటజేసికొన నిశ్చయించి సాగిపోవుచుండెను. ఆనాఁటి మట్టమధ్యాహ్నము చండభానుఁడు తన సహస్రకిరణములతోఁ వసుమతీమండల మంతయుం గాల్పఁజొచ్చెను. గాడ్పులు నిప్పులం జెఱుగుచు, మొగిమెత్తినడుచుటకు వీలులేకుండఁజేయ జంతుసంతానములు హాహాకారములం జెలంగిమహాతాపోపహతములై పానీయములకు నలుదెసలఁ బరువులెత్త నారంభించెను. కారుచిచ్చు వృక్షములరాపిడివలన జనించి రాజుల కలహములవలెనే బహువంశంబులఁ దహింపుచుండ విస్ఫులింగములు చెదరి యెంతయు దూరమునబడి యచటి పల్లెలంగూడఁబరశురామప్రీతి సేయఁదొడఁగె. దూరమున రవులుచున్న కాఱడవుల పొగమెగసి బ్రహ్మాండమంతయుఁ గప్పి కాలపురుషుఁడేయు నల్లని తెరచాపువ నొప్పియుండె. ధూమమునం జేసి కన్నులఁగానక కొన్నియు నాసెగఁదాఁకి కమలికొన్నియును, ప్రాణసంరక్షణార్థమై పఱువుచు నిప్పునంబడి కొన్నియు బహుమృగములు మ్రగ్గెను. నాల్కలిగిరి పిడుచకట్టుకొనిపోవుచుండుట దాహబాధకోర్వక మృగములు చూపుమేరదవ్వున జలాశయములట్లు గాన్పింప నత్యాశ నందునీరుద్రావఁగోరి సమీపించునప్పటికది మృగతృష్ణయగుట నిర్విణ్ణములగు మనస్సులతో నవిదప్పివాఁడమి యంగలార్చుచుఁ గడుశ్రమనొందఁజొ

చ్చెను. క్షుత్పిపాసాదు లఖిలజంతువులకును సమానములుగదా! మాదిగవాఁడుచెప్పిన గ్రామమెంతనడచినను సమీపింపకునికియు మట్టమధ్యాహ్న మాఁకలిదోఁడయి మేరమీఱిన వేఁడిననుగలుఁగఁజేయుటయు శ్రావణునితోఁ బలుకనైనఁజాలకఁ గళానందుఁడుగూడ జంతుధర్మమగు క్షుత్పిపాసాబాధకు లోనై యడుగుతీసి యడుగిడలేక దానెట్టులో యోపికపట్టి కొన్నియడుగులు నడచి తుదకునరములబలిమి సడలుటయు వచ్చియు రానిమాటలతో "శ్రావణా! యుదక ముదక" మని యొక చెట్టుక్రింద మూర్ఛిల్లెను. తలవంచుకొని వెనుక నడచివచ్చు శ్రావణుఁ డాపతనధ్వని నాలకించి యజమానునివైపు కన్నెత్తి చూచి పరుగుపరుగున నటుపోయి "యయ్యో! యయ్యో" యని కుయ్యిడసాగెను. కళానందుఁడు మాటలాడ నోరురాక తనకు దాహము నిమిత్తము నీరుదెమ్మని సన్నఁజేసెను. ఆసన్న నెఱిఁగి శ్రావణుఁడు చల్లనియుదక మెందు లభియించునని నలుగెలంకులఁ బరికించి, కన్నీరు పెట్టుకొని హా! దైవమా! గంపెడుబలగముఁ గలవాఁడయ్యు సకల సంపదలఁ గొఱంత లేనివాఁడయ్యు, దిక్కుమాలినవాని తీరున నీభూలోక మన్మథుండు పట్టెఁడన్నము గ్రుక్కెఁడు నీరును లేక మృతి నొందును గాఁబోలు నని వగచి, తనకన్నీటిధారలంబోలి నేలనంటు నూడలుగల పెనుమఱ్ఱిచెట్టు నొక్కదాని నెక్కి పాఱఁజూచు నప్పటికి నరక్రోసుమేర నొక సరోవరము గాన్పించెను.

కాంచి యచ్చోటికి సత్వరము యరుగఁదలఁచి మంగలములోని పేలగింజలవలెనున్న జంతువులను వేఁచుచున్న యాపట్టపగఁటి యెండలోఁ దలయుఁ జరణములు మాడుచున్న సరకుఁగొనక నడుచుచుఁ ద్రోవలోఁ దమవలె పిపాసార్థు లొకపాత్రములో నీరుదీసికొని పోవు బాటసారుల నిరువురు పురుషులఁ గని యించుక జలమిమ్మని వేఁడెను. కాని వారు వానిమాటలను లెక్కసేయక యరిగిరి. శ్రావ

ణుండు వారి కఠినత కచ్చెరువడి యతిత్వరితముగ సరోవర్ణమును జేరి, యచ్చటి శీతల మలయానిలునకుఁ బారవశ్యము నొంది కడుపు పట్టినంతనీరుఁద్రావి మఱ్ఱియాకుల దొప్పలుకుట్టి యందుఁగళానందుని నిమిత్తము గొంత జలమునుబోసి కొనిమ్మరల బయలుదేఱెను. అంత శ్రమజెంది స్వామిప్రాణరక్షణార్థము నీరుదెచ్చి యాచెట్టు క్రిందికివచ్చి చూచునప్పటి కాస్థలమునఁ గళానందుఁడుండఁడయ్యెను. కాని వెలపుగోలుపు గొని నెత్తుటఁ దడసినకత్తియుఁ గళానందుని యుత్తరీయము మాత్రము గానసయ్యెను.



## పదునాలుగవ ప్రకరణము.

నెత్తుటఁ జొత్తిల్లిన యుత్తరీయముఁ గత్తియుఁ గంటఁబడిన తోడనే ప్రాఁతపగచేతనో, ధనము ముచ్చిలనెత్తిన యాసచేతనో యెవ్వరో నరహంతకులు తనయజమానునిఁ దెగటార్చిరని శ్రావణుండు తలఁచి గుండెపైఁ జేతితో మోదుకొని, హా! కళానందా! నీ పాదసేవకు నొంటరిగ నట్టడవిం దిగవిడిచి పరలోకమునకుఁ జనఁగడఁగినాఁడవే. వివాహమునకు విఘ్నములు వాటిల్లినవని వాని నివారింపఁ దలఁచి ద్వారకకువచ్చి యిట్లగుదువని యెన్నఁ డనుకొనసయితిని. నూతేండ్లునిండి కాటికికాలుచాచుకొని నీరాక ప్రతిక్షణమునిరీక్షించు మీయమ్మతో నేనేమని విన్నవింపుదు? అయ్యా! నీమీఁదనే పంచప్రాణములు నిల్పికొనియున్న యాముసలి యవ్వ యీమాట విని గుండెపగిలిచావదే. ఆమెమాట యటుండనిమ్ము. రూపున రతియు, విద్యను భారతియునై, యౌవనమున జనించు మోహ సముద్రమె గళానందుండను తెప్పసాయమున నీఁదఁ దలఁచిన సౌందర్యతిలక

మాటయేమి? నీయకాలమరణమున మగధరాజ్యమున నెన్నియేనివింతలు వొడమకపోవు. చిదిమినఁబాలుగారు నీసోయగఁపుమేనెంతలో నేలపాలాయెహా! భూలోకమన్మథా! బ్రతికియున్ననాలుగుదినములు నెంతలెంత లద్భుతకార్యములు సేసితివి! శ్రీకృష్ణుసంతవాని నిరువదియొక్కసారులు పోరులోగెల్చిన మేటిమగఁడగు జరాసంధు సంతతి వానిఁ జెరికిఁగొనక ప్రతికతృబూనఁగల సాహసికుఁ డిఁక ద్వాపరమున జన్మింపఁడు. అయ్యో! నిన్నుగురించి మ్మనకలుకువాలుతో నాఘాతకుఁడు నన్నేల క్రమ్మఁడయ్యె. ఇట్టి ఘోరవార్త నువినిచుట్టములకెటుఁగించువారిత నామొగమువారిసియుండ నాకేలమరణము సంభవించును. నీతోడఁబయనముఁ జేసినన్నినాళ్లు నీమాటలనేర్పువలన నీ దయారసమువల్ల నాకు మార్గాయాసమైనఁ గానఁబడదయ్యె. పెద్దకాలపువాఁడనను నాదుముప్పు నీవ గనుఁపదువని యాసఁజేసి కొలిచి కారడవులలో నీముప్పు నేనే గడపితినిగాని నాకు నీవు కావైతివి. ఎండటిని పడుచువారిని దిగ్భ్రమింగకుండ నీశాత్రవుఁడు నేనుదొలఁగునానాతండ్రీ ప్రపంచమునకు నిష్ప్రయోజనుఁడైన నావంటివాఁడుండి సర్వవిధములను గనకవృకమవగు నీవు కడతేఱుటనాపాపముగాదా! నిన్నెత్తుకొని మోచినకాయలు నాబుజమున మాయనైన లేదు. నాకన్నులముండట నీకొకగడియలో రూపుమాసె. ఏమిసేయుదునయ్యో యని తన దైన్యముంగూర్చి పెక్కువిధములఁ బొక్కుచు వేఁడికన్నీళ్లు ముడుతలుపడిన ముసలిచెక్కుల మీఁదనుండి జారి నేల రాలనేటువసాగను. అట్లు కొండొకతడవు వాపోయి యాప్రాటకూడు దొరకకునికి నాయాసముతన్నలమినం జేవయతి యొకచెట్టునకుఁ జేరఁబడి యున్నరస్సరినచుఁ గొంతసేపు వగచ్చి కన్నులుమూసి పరవశుఁడై యుండెను.

ఇంతలో నానసికిఁగునకుఁ హట్టి యుంచుక నిదురించుచుండ భూ

నుఁడు గ్రుంకి యపరజలధిఁ బడి జగముం బెంజీఁకటుల ముంచెను. పట్టపగటనే సూర్యరశ్మి కానరాని యాఁకారడవిలోఁ బొద్దుగ్రుంకిన వెనుక నెట్టు లుండునదియును వర్ణింపనెవ్వరితరము! పొద్దుగ్రుంకు నప్పటికి శ్రీవత్సుఁడు కునుకుఁ జెందినందున భయంకరమగు చీఁకటి నుండి తొలఁగి యెటకేనియుఁ గానఁడయ్యె. చీఁకటిపడినవెనుక మేలు కాంచి చూచునప్పటికిఁ గళాసందునినిమిత్తము పడుచున్న నెవ్వగ యంతయు నడంగి యపూర్వమగు భీతివాడమి యొడలు వడఁకఁ జేసెను. ఎంతవడఁకిన నెంతభీతిలినఁ దన్నుఁదానె యూశ్వాసించుకొన వలయునుగాని యాయరణ్యమునఁ దనకు శరణ్యులగువారు లేనందున నెట్టకేలకు మనము నిబ్బరముచేసికొని యెదుట నెద్దియున్నదియో వెనుక నేదియున్నదియో యెఱుఁగ లేశమైన నవకాశము నొసంగకఁ దన్నుఁ జుట్టుముట్టిన గాఢాంధకారముచేత మది నేవెరపుఁ దోఁచకునికి మెల్లనవాతఁడు జేరఁబడిన చెట్టునకు వీఁపునానుకొనెను. తోడనే యాతని కర్మవశమునఁ జటుక్కున నెద్దియో విషజంతువు కుట్టెను. నిప్పు పెట్టి కాల్చినయటుల నెమ్మేను బగ్గునమండుటయు నావృద్ధఘటము తాళఁజాలక యబ్బాయని కుట్టినచోటనఁ జేయివైచి రాచికొనుచు నది నొవ్వఁగుట్టినందున మిక్కిలి బాధపడుచుండెను. ఆయవస్థలో నాదీనుని మనోవ్యాకులత యెట్టులుండునో వ్రాయుటకన్న నూహించుట సుకరము. తాను సర్పదష్టుఁడనైతినని యొకమాఱు భయపడుచు మందైన వేయువారు లేమికి వగచుచు, నెట్టులయిన నాకట్టడి మేనువాసి పరలోకమునున్న తనయజమానుని గలయుట సంభవించునని సంతసించుచు నేదియుఁ జేయఁజాలక తనపల్కు లరణ్యరోదనముగా విచారపడఁజొచ్చెను.

ఇట్లు రెండుగడియలు మేరకుమీఱిన బాధపడుచుఁ జీఁకటి సముద్రములో మునిఁగియున్న యాముదుసలికిఁ బాపాత్ముని కీశ్వర

సందర్శనము లభియించినట్లు రవంతవెలుఁగున కానఁబడియెను. మొట్ట మొదట శ్రీవణుఁడు దానిఁగనుఁగొని యది తన మనస్సునఁ జెందు భ్రాంతియో, లేక యరణ్యముననుండు వింతపురుషులమేనికాంతియో యదియును గాదేని కొండలలో విద్యుల్లతలుండునని పెద్దలుచెప్పుదు రు గాన వాని వెలుఁగోయని శంకించి క్రమముగా సూర్యకిరణముల వలె దానికాంతులు వృక్షముల సందునుండి తనచాయ కరుదెంచి వచ్చుటయుఁ జూచి నిజముగా వెలుతురై యుండనోపునని యూహిం చె. అది సమీపించినకొలఁది శ్రీవణునకుఁ నించుకధైర్య ముదయిం చుటకుమాఱు, యక్ష కిన్నర గంధర్వ పిశాచ రాక్షసుల మూఁక లు కాఱడవులఁ గాఱుఁజీఁకటులఁ గ్రుమ్మరుట విందుము. ఈవచ్చు వాఁ డందెవ్వఁడేని నైయుండి నాబడలినమేను దనకు సంజకబళము గా వినియోగింపఁబోవునని శంకింపుచుండ నంతలో నలుఁగఁగొట్టిన కొఱవిపోలకట్టెఁ గాగడాగా వెలిఁగించుకొని దీపపుఁ గ్రీనీడతో వియ్య మొంది యచ్చటి కాఱుఁజీఁకటికి వన్నెలు సవరింపఁగలయంత నలుపు దేఱిన మేనిచాయతో బలముగల పొడవువాఁ డొకఁడు శ్రీవణుని కట్టెదుట నిలిచెను. అతని కన్నుగొలుకు లెఱుపుమీఱి చింతనిప్పుల చొప్పునఁ జూచువారి గుండెలకు భయోత్పాతముఁ గలిగింపఁజొచ్చె ను. ఎడమచేతఁ బాలకట్టెయు కుడిభుజముపై గండ్రగొడ్డలియు నప్పు డప్పుడే పట్టివధించి జఠరాగ్ని కింధనముఁగాఁ జేసికొన్న కారెనుపో తుక్రొన్నెత్తుటఁ దడసిన కఱకుమీసములను జూచి యాతఁడు రా క్షసుఁడని యెఱిఁగి శ్రీవణుఁడు తన యంత్యకాలము వచ్చినదని జంకుచు ఖేదపడుచుండెను. అంతట నారేదిమ్మరీఁడు ముసలివాని యవస్థఁజూచి రాక్షసజాతికి విరుద్ధమగుజాలి తన్నుఁబొదువ వానిఁగడ తేర్పక "ఓరీ ఏమిరా నోటనుండి చొంగలుగ్రక్కుచు నటుబాధపడి యెదవు. నీ కేమిరోగమురా?" యని యడిగెను. ప్రత్యుత్తర మొసఁ

గుట కిష్టములేకున్నను, బదులుచెప్పకున్నను నాతఁడు తనొ్కకచఱపు జఱచి చంపఁగలఁడని శార్ఙ్గవణుఁడు మెల్ల మెల్లగ "సన్నిట నెద్ది యో కుట్టినది. చెట్టునకుఁ జేరగిలఁబడినప్పుడు నావీఁపు బగ్గునమండి నది. నాయనా" యని పలికెను. ఈపలుకులువిని వెంటనే వాఁడందు నిలువక వడివడిఁ గొన్నియడుగులదూరమరిగి యందిటునటు నెమకి యెద్దియో గ్రహించి క్రమ్మఱవచ్చి ముసలివానిఁ బలుకరింపకుండ నే రెండురెక్కలుపట్టివానిని లేవనెత్తి యక్కటా ! యిదియేమిదైవ మా యని యాతఁడు మొత్తుకొట్టుచున్నను సరకుగొనక గొన్నియా కులు నలిపి యాపసరాతనివీఁపున గట్టిగా రాచెను. ఆమోటురక్క సుఁడు చేసిన మోటువైద్యముతో ముసలివానివీఁపుమంట రెండుగ డియలలో నుపశమించుటయు నాతఁడు సేదఁదేఱి సంతసించివానితో నిట్లనియె.

శ్రావ.—అయ్యా! నన్ను రక్షింపవచ్చిన దైవమువలెఁ దోఁచు నీవెవ్వఁడవు. పాము పూదండయైనట్లు నీవు నాకు మొదట భయము గొల్పి రక్షకుఁడవైతివి.

రెండవవాఁడు—ఓరీ! వినలేదా జ్వాలాజిహ్వుఁడను రాక్షస రాజుపేరు? నేనామహాత్ముని సేవకుఁడను. నాపేరు కపాలమాలి. ఈ యరణ్యము మాప్రభువుగారికి జరాసంధుఁడు శిశుపాలుఁడు బట్టము గట్టి యొసఁగినారు. నేను రాక్షసదండనాథుఁడను. పాండవపక్షులను వాసుదేవానుచరులనుబట్టి శిక్షింపుమని మారాజు నాకానతిచ్చె. నీవు వానిలో నొక్కఁడవైతివేని యిదిగో నానోటఁబడుము.

అని తన పెడఁదనోరుఁ దెఱచి మేకువంటి పండ్లను జిన్నప లకరాయిఁబోలు తపనాలుకను జూపి శార్ఙ్గవణునదలఁబెట్టెను. శార్ఙ్గ వణుఁడామాటలు విని ద్వారకనుండి వచ్చుట వానికిఁదెల్పినఁ దన్న తఁడు నంజుకొనునని తనరాకఁ మాటుఁజేసి చెప్పఁదలఁచుచుండ నిం

తలో నాపోలసుదిండి "యోరి నీవెవ్వఁడవో చెప్పవేమిరా! యని బిగ్గరగా నడిచెను. అంతట శారివణుఁడు మెల్లమెల్లన నిట్లు విన్న వించుకొనియెను. "కపాలమాలీ! నీకు నేనుబరమాప్తుఁడను సుమా! ఏపురము నీనెచ్చెలియగు జరాసంధునకుఁ గాపురమాపురమే మాకుఁ గాఁపురము. నేనజ్జయినీపురమునకుఁబోయి యచ్చటనున్న మాచుట్ట ములను జూచి మరలనింటికిఁబోవుచు దారితప్పి యిటవచ్చితిని. నాకు దారిజూపి కాపాడఁగల భారము నీయదిసుమ్మీ" యని నోటికివచ్చి నన్ని యబద్ధములుచెప్పి రాక్షసునకు నమ్మకము గల్గించెను. అంతట దైత్యుఁడు తలయూఁచి "సరే యెట్లయిన నీవుమాత్రము మాశ్రి భువగు జ్వాలాజిహ్వుని దర్శముజేసి యాతనియొద్ద సెలవుఁగై కొనిపోవలయు రమ్మ"ని ఱెక్కలుపట్టుకొని యాతని లాగఁదొడఁ గెను. ఈనడుమఁ గాగడాగా నుపయోగించు పాలకట్టెతుదయైపోవు ట నాతఁడు చంకనున్న రెండవకట్టె నంటించుచు గాలికెదురుగాఁ దిరిగి నోటితో నప్పునియూఁదుచుండ నాసందెరిఁగి యజమానుని క త్తియు మున్ను గృష్ణుఁడాతనికిచ్చిన లేఖయు నేలఁబడియున్నందున వానిని సంగ్రహించి యుత్తరముదాఁచి వాలుఁ గేలఁబూని శారివ ణుఁడు రక్కసునివెంటఁ బయలుదేరెను.

---

## పదునైదవ ప్రకరణము

అట్లు కపాలమాలి తనయేలికయగు జ్వాలాజిహ్వునియొద్దకు వృద్ధుఁడగుశారివణుని వెంటఁబెట్టుకొని యరుగుచుండ, బహువిధము లగు పులుఁగుల యెలుఁగులు, ఘాతుకజంతుసంతతుల యఱపులు, నం దు ముఖ్యముగా బెబ్బులుల గాండ్రుగాండ్రుమను కేకలు దాఁచు పాములబుసలు శ్రావణుని కమితభయము నాపాదించెను. ఎంతయు

దిగులున నరచేతఁ బ్రాణంబుల నిడికొని యేగుచున్న వాని దుర్దశఁ గైకొన్నమూర్తియో యన్నట్లు వారి కట్టెదుట తఱువాత మొదలు నాహారింప నెట్టిజంతువు లభియింపమింజేసి పేరాఁకలిచే నకనకంబడుచుండి మనుష్యదర్శనంబగుడు సంతసంబునఁ జవాలున లేచివచ్చు నొక వ్యాఘ్రము వారికంటఁబడియె. వెంటనే శ్రావణునకు కాళులు కంపమెత్తె నందున “నయ్యో! యేమిసేయుదు నేమిసేయుదు” నని కపాలమాలినిబిగ్గరగఁగౌఁగిలించుకొనియెను. ముందు శాత్రవుఁడు, వెనుకఁ గపాలమాలియు వచ్చుటంజేసి యాశాస్త్రులు మందభాగ్యుఁడగునాసేవకుఁ దుదముట్టింప మీఁదికి వచ్చుచుండ దానినెదుర్కొని కయ్యము సేయుటకుఁ గపాలమాలి సంరంభించుచుండెను. కాని మొఱకువాఁడగు ముదుసలి వానిని వీడఁడయ్యె. రక్కసుండును బెబ్బులికన్న భయంకరాకారముఁదాల్చి తన్ను గౌఁగిలించి విడువకున్న యాయనదను జేతులతో నెత్తి వెనుకప్రక్కకు విసరివైచి యప్పటి కొక్కయడుగుదూరములోనికి వచ్చిన క్రోలుపులిపైఁ గవిసెను. అదియును హుమ్మని యొక్కసారి రక్కసుమీఁదఁ బడుటయు నాబండ తనబాహుబలమున దుండగఁపుఁ బులిని నేలం గూలద్రొబ్బి తన రెండుచేతుల దానితోఁకఁబట్టుకొని ముమ్మాఱు భీమసేనుఁడు గదాదండమును ద్రిప్పుచందమునఁ బిఱబిఱఁద్రిప్పి యొకపాషాణముపైవైచికొట్టె. కొట్టుటయుఁదల వ్రయ్యలై నెత్తురు గ్రక్కుచు నది యొక్కయుఱపఱచి మృతినొందెను.

క్రౌర్యమునందెకాక బాహుబలమునఁగూడ బెబ్బులినిమించినట్టి రక్కసునిప్రజ్ఞకు నరుఁడు తాత్కాలికానందము నందియు వాని చేతినుండి తాను మృత్యుదేవత బారిఁ బడకుండ మరలఁ దనవారి నెన్నఁడేనిచూడఁగల్గునా యని వగచుచుండ నాదుండగీఁడరుదెంచి తలపై నొక్కదెబ్బవైచి “యోరీ పికిలిగాడ్దా! ఈదినము నీవు చచ్చు

టమేగాక మీఁదుమిక్కిలి ననుఁగూడఁజంపుదువుసుమీ. అపాయము వచ్చినప్పుడు నాకుఁ దోడగుటకుమాఱు ననుబట్టివిడుసనవైతివేమిరా! నీనిమిత్తము నేనీవాహనము దెప్పించితి నెక్కుదువు రమ్మని బలిమిచేఁ జేయిఁబట్టుకొని యాసేవకుఁడా వ్యాఘ్రకళేబరము మీఁదఁగూరుచుండఁబెట్టి "శ్రీవణమహారాజుగారు! మహారణ్య రాజ్యమునకుఁ బట్టముఁ గట్టుకొనుండీ" యని పరిహాసింపఁజొచ్చెను. ముసలివాఁడును బుద్ధిలేని యాపాడు రక్కసునిచేతఁ దానింక నెన్ని యిడుములఁ గుడువవలసియున్నదోగదా యనియు, యెట్టివాఁడైననేమి ప్రాణదానముఁ జేసిన పుణ్యజనుఁడనియు నెంచి యప్పాడుదయ్యమునకు ముచ్చటతీఱునంతదనుక వాని చెప్పినచొప్పున పులిపీనుఁగుపై నాసీనుఁడైయుండ వాఁడు దనచేతి పాలకిఱ్ఱకొఱవితో ముమ్మారు వానిమొగముకడఁ ద్రిప్పి "మహారాజుగారి కారతియిచ్చినాను లెండీ" యని తెక్కుగా డూడివచ్చునట్లు లాగెను. "ఎట్లయిన నాతని వెంట నరుగక తప్పదుగదా" యని శ్రీవణుఁడులేచి మెల్లమెల్లన నడుగులిడుచు నిస్సత్తువచే నడువలేక తోవలో నిలుచుచుఁ బోవుచుండ రేదిరిమ్మారి రెండుమూఁడుసారులు వానినిమిత్తము దానుఁగూడ మెల్లఁగ నడచుచు నతని కిట్లనియెను. "ముసలిదయ్యమా? నీవు నడపీనుఁగుచాడ్పున నున్నావు. ఇపుడు చాల ప్రొద్దాయెను. మా స్వామి నాయొనర్చిన యాలస్యమునకు నాపైఁ గినుకఁబూను. నీ వడుగిడఁజాలకున్నావు. నిన్ను విడిచి నేఁజనరాదు కావున నీవు నా భుజముపై నెక్కుము. నిన్ను ముహూర్తములోన మాయింటియొద్ద దింపివైచెద." నని తన మాట లింక ముగియకమున్నె వానినువ్వెత్తుగఁ బట్టియెత్తి భుజముపైఁ నిడుకొని నడువసాగెను. ఇప్పకల్లు చిత్త మెఱుగకుండఁ ద్రావిన వానిమూఁపునఁ గూరుచున్నందుకు శ్రీవణునకు మనశ్శాంతి యొకింతయుఁ గానరాక "యింక నీ చంద

లచిత్తుఁడెందుఁ దన్నాకస్మికముగఁ బాఱవేయునో" యని భయమందుచు, వానికంఠమునకుఁ జేతులు పెనవేసికనులుమూసి, భగవంతునిపై భారమువేసియుండెను. అట్లు కతిపయదూరమరుగునప్పటికి వాఁడొక్క మిట్టు నేలనెక్కి నడచుచుండె. మీఁదఁగూరుచున్న శ్రీపతునకుఁ గన్నులముందటఁ బెనుమంటలనెగసెడు నాలుగునెగళ్ళును వానిచుట్టును గూరుచున్న కాలకింకరులఁబోలు పదుగురి భీకరాకారములును, చెవులు వ్రక్కలుసేయు వారల యార్పులును గనఁబడి వినఁబడి కూరుచున్న ముసలివానిని భుజముమీఁదనే పరవశునిగావించెను. ఆపారవశ్యతనుండి, వాఁడు మేల్కనునప్పటికిఁ గపాలమాలి యాప్రదేశమునకు వానిఁ దోడ్కొనివచ్చి, యొకచోట మూటదింపినచందమున వానిని గుభాలున నేలఁ బాఱవైచెను. ముసలివాని కీళ్ళకలన్నియుఁ జూర్ణమగునట్లు దెబ్బలు తగిలెను. కాని విసైలేక తత్క్షణము నిలువఁబడెను. నిలువఁబడి చూచునప్పటికి నక్కడనున్న మూఁకలలో "మానిసి మానిసి" యని యొకకోలాహలము బయలువెడలెను. అంతలో నచటనున్న స్త్రీపురుషులందఱును వచ్చి వానిచుట్టును మూఁగి, కపాలమాలి ననేకప్రశ్నపూర్వకముగ వానియిక్కమెద్దియనియు నామ మెద్దియనియు నరయఁజొచ్చిరి. కొంతికి పారవైచిన యెముకలు, నెండవైచిన జంతువుల చర్మములుఁ గుళ్ళిన మాంసపుముద్దలు నేలఁ బ్రవహించి యెండి యట్టకట్టిన నెత్తురులు ముక్కుబ్రద్దలగునట్లు దుర్వాసనఁ గల్గించి శ్రీపతుఁడు నిలుచుటకు వీలులేనట్టుచేసెను. వానికిఁదోడై తన్నుఁ జుట్టుకొన్నరక్కసి మూఁకలదేహములనుండి వెడలు గబ్బు వర్ణింపఁ దరముగానంతదై యదియె నరకలోకమై యుండవచ్చునను సందియము శ్రీపతునకుఁ గలుగఁజేసెను. కిక్కిరిసిన రక్కసుల నొక్కప్రక్క కొత్తిగించి కపాలమాలి, శ్రీపతుఁ దనయేలికకుఁజూపు తలంపున వానిని వెంటఁ

బెట్టుకొని వేఱొకచోట నేలపైఁ నెత్తుగాఁ గట్టిన యొకమం
చెపైఁ గూరుచుండి సేవకుఁడు నెగడిలోఁ బేల్చియిచ్చు నేఁదు
బందినంజుడుఁ గడుఁ దమకముతో మెసవుచు నెడనెడ హరిణ
శాబకముల మాంసముఁ జవిజూచుచుఁ బులివలె నందఱకు భయం
కరుండై మంటలవెలుఁగున సంపూర్ణముగఁ గనఁబడు చిన్న
కొండవంటి మహాకాయము సేవకులకు భీతిఁగొల్ప నానందపారవశ్య
ముచేత నసుమసుమ గుండియలు పగుల నఱచుచున్న జ్వాలా
జిహ్వునిఁ గని జోహారొనర్చి, యొకమూల నొదిగి నిలచెను.

తనువున నసుఱులెగిరిపోయెనో నిల్చెనో యను సందియము
గలిగించునట్లు శాత్రవుఁడు వడఁకుచు వానివెనుకఁ దన యొడలి
క్రీనీడయె రాక్షసేశ్వరునకుఁ గనబడునట్లు నిలిచెను. మూఁడేదు
బందులు నాలుగేడిపిల్లలుఁ గొన్నిపక్షుల నాహారించి యొకరీతిగా క్షు
దానలముఁ జల్లార్చుకొని యెదుటనున్నవా రదరిపడునట్లు దేన్చి
కనులవిచ్చి తలయెత్తి యెదుటనున్న కపాలమాలిం గాంచి "యోరీ!
నీవింత యాలస్యముగ వచ్చుటకుఁ గారణ మేమి? నీవెనుక నక్క
పోతులాగు నక్కి ముక్కుమిక్కుమనకుండ నగము చచ్చినవాఁడెవఁ
డురా?" యని మెల్లగాఁబలికెను. కపాలమాలియుఁ జేతులుజోడించి
"యీపాపాత్ముఁడు మనుష్యుండు. మార్గవశమ్మున వీఁడొక చెట్టు
క్రింద నీకాఱడవిలోఁబడి యెటు నరుగఁజాలక నటమటంబడుచుం
డ నీతనిం గలసికొని మాగధుండనియు జరాసంధుఁడు మనకాప్తుఁ
డు, కావున వీఁడును మనకాప్తుఁడని యెంచితిని. మీఁదఁ దమ
చిత్తముదేవా" యని విన్నవించెను. అనవుడు నాదనుజనాయకుఁడు
నగి "యీతఁడు మనుజుఁడా! ఓరీ యిటురారా" యని పలికెను.
తోడనే నలువురు రక్కసిజెట్టు లరుగుదెంచి భయమున వడఁకుచు
న్న శాత్రవుని రెక్కలం బట్టుకొని ఱేనిముంగలఁ బెట్టిరి. ఱేఁదిమ్మ

రితేఁడు వానిం గనుంగొని యీముసలిదయ్యమిట్లున్న వాఁడేమిరా!" యని వాని కాలుకీలుపట్టినొక్కి- వీఁడు స్పృశించినమాత్రమున జచ్చునట్లు తోఁచెడును. ఓరీ నీకాపురము మగధరాజ్యమేనా? అని యడుగ వాఁడును సభయముగఁ జిత్తము నేను మాగధుఁడనే యని ప్రత్యుత్తరమిచ్చెను. అంతట రక్కసులసామి యొకచిన్నరక్కసుఁబిలిచి "మనయిందుమతి యీతని నెఱుఁగునేమో యడుగుదమామెనిటు గొనిరమ్ము" అని ముదల యొసఁగ నాసేవకుఁడు లోనికరిగి యొకముహూర్తమున నాయిందుమతిని వెంటఁబెట్టుకొని వచ్చెను. ఇందుమతి యనుపేరు వినఁబడినతోడనే యది రాక్షసాంగనయై యుండనోపుననియుఁ దనమీఁద లేనినేరము లెవ్వి సెప్పునోయనియు శ్రీవణుఁడు జంకిఁదొడఁగెను. కాని యామె వచ్చునప్పటికి నాతఁడనుకొన్న దన్యథాయయ్యె. ఆవచ్చిన యిందుమతి వికృతవేషిణియగు నొకరక్కసికన్నియగాక దివ్యసుందరవిగ్రహయగు నొక మానవకన్యయైయుండెను. మణిభూషణములు చీనాంబరములు లేకయున్న ననాగరికులనడుమ కాలముబుచ్చుచున్న యామె మేననలంకరించిన ముదుగుచీరెయు, వేనలిని ముడువఁబడిన యడవిపూవులును, బదునెనిమిదియేండ్ల నిండుజవ్వనముచేఁ బరిపూర్ణదశఁ బ్రాపించిన యందమునకు వన్నెయిడుచుండెను. కాఱడవులఁ జిరకాలము సహవాసముఁజేసి గజరాజునొద్దనుండి నేరిచికొనినగమనవైఖరి నాఁడు ప్రదర్శింపఁజేయుచున్నదో యనునటుల మందగజగమనంబుతో ముద్దులు మూటగట్టుచు సింగారముట్టిపడు వదనచంద్రబింబముతోఁ జేరలం గొలువఁజాలిన కనుదామరరేకులతో విచారమును సూచించు వైఖరితో సార్థకనామధేయమగు నిందుమతి వచ్చి నెగళుల వెలుగునఁ దన యంగసౌష్టవముఁ గని ముక్కుడి రక్కసిబాలకులలోపల మదనతాపమొందవచ్చి జ్వాలాజిహ్వుని కట్టెదుట నిలిచెను. రాక్ష

నుఁడాపెనఁజూచి "బిడ్డా! యీమనుజునిది గిరివ్రజపురమఁట, నీకెఱుఁగుదువే" యన నాపె శ్రావణుని ముఖాంబుజమును దప్పక ఱెప్ప వేయక చూచి "నే నెఱుఁగ" నని పలికెను. "ఔను నీవేమి యెఱుఁగుదువు, అప్పటికి నాఁడేండ్లదానివేగదా !" యని రక్కసిఱేఁ డుత్తరమొసెప్పి యామెకు లోనికరుగ నానతిచ్చెను. ఇందుమతియు నెద్దియో యించుక యోచించుచు రెండుమూఁడుసారులు శ్రావణుని నెమ్మొగముఁగాంచి మెల్లమెల్లగ లోనికరిగెను. అనంతరము రాక్షసేశ్వరునకు నిద్రవచ్చుటచే నాతఁడంతఃపురమును సెలవొసంగి యామంచెపైఁ గొండవలెఁ బండుకొనెను. కపాలమాలియు శ్రావణునకు బట్టెడన్నముఁ బెట్టించి యాతని నొకచోటఁ బండుకొన నియమించి తానును దక్కిన రక్కసులును గడుపు పట్టినంత యిప్పకల్లుఁ ద్రావి దూరముగ నరిగి యఱచుచు నేల దొర్లుచు బహువినోదములం దేలుచుండిరి. శ్రావణుఁడు పంచాగ్ని మధ్యమున నున్నటులున్న తన యవస్థం దలఁచి యించుక వగచి యిట్లని తనలోఁదాను వితర్కించుకొనఁజొచ్చెను. అహాహా ! తుమ్మచెట్లనడుమఁ గమ్మసంపెంగ మొక్క మొలచుటవిచిత్రముగనున్నది. ఈలావణ్యపయోనిధియగునిందుమతి యీరాక్షసుని పుత్త్రికయైయుండునా? ఇది యసంభవము. ఈమె తప్పక మనుష్యాంగన. కారణాంతరమున నిందుండఁబోలు. నేనిందున్న దినములలో నెట్లయిన నీమెస్థితి నరసి యీమెకేదయిన నుపకారమొనర్చి చెఱబాప యత్నింతు" ననుకొనుచుఁ గన్నులుమూసి నిద్రించెను.

---

# పదునాఱవ ప్రకరణము.

---

మఱునాఁడు శ్రావణుఁడు రక్కసులకన్న మున్నె మేలుకాంచి యెట్లయిన నిందుమతి చరిత్ర మెఱయుతలంపున నామె పండుకొన్న చోటికరిగి చేరవేసియున్న తలుపుఁ దెఱచెను. మువ్వురు రాక్షస స్త్రీలనడుమ నిద్రించుచున్న యాయిందుమతిని గనుంగొని యాతఁడు మేలుకొలుపుటకు సంశయించి యెద్దియుఁ దోఁచక నిలిచి యుండ నంతలో నొక్క రాకాసి యొత్తిగిలినందున నాతఁడదలి వాండ్రు తన్నుఁ గనుఁగొనిరేనిఁ దుత్తునియలు గావించి నంజుకొనఁగలరని గిఱుక్కున వెనుకకు మరలి తనతావునకుఁ జేరెను. రక్కసులందఱు మెల్లమెల్లఁ బ్రొద్దెక్కి లేచిన వెనుక జ్వాలాజిహ్వుఁడు జాముప్రొద్దెక్కు నప్పటికి మేలుకాంచి సేవకులు పరిచర్యలు సేయఁ గాల్యములఁ దీర్చి యంతక మున్నె యాయత్తము సేయఁబడిన కొన్ని మెకముల నంజుళ్ళు మెక్కి రక్కసులతో ముచ్చటలాడుచుండెను. తక్కిన ముక్కిడిరక్కసులెల్ల తమతమ పనులందరిగిరి. శ్రావణునకు వారిచర్యలెంతయేవఁ గల్గించు చున్న నెంతత్వరితముగ నిందుండి యతఁడు దాఁటఁదలఁచిన నించుకయు వీలుగలుగదయ్యెను. అది యటులనుండఁ దనప్రాణముఁ గోలుపోయియైన నిందుమతిని గాపాడవలయునని యాతఁడు కృతనిశ్చయుఁడయి యుండెను. కాని నోరెత్తి యామెను బలుకరించుటకైన నవకాశమతనికిఁ జిక్కకుండుటచేఁ దనమనంబున "దైవమా! మేలిమి బంగారుబొమ్మంబోలు నీమెను రాక్షసుల కప్పగించి నేనెట్లునాయునుఱుల రక్షించుకొందును? నేను సకల సుఖదుఃఖముల ననుభవించిన వృద్ధుఁడను. నేనెట్లయిన భయములేదు. ఇందుమతిని మాత్రము చెఱనుండి విడిపించి తీరవలయు" నని నిశ్చయించుకొని సమయమున కెదురుచూచుచుండెను.

ఇట్లు పదునాఱు దినములు సనియెను. అంత నొక్కనాఁడు రక్కసిమూఁకలన్నియు మహాసంరంభముతోఁ బరవశములై తిరుగుచుండెను. "అంతటి మహాసంతోషమునకుఁ గారణమేది" యని తన మిత్రుఁడగు కపాలమాలి నడుగ నాతఁడిట్లనియె. "ఈదినము మా రాక్షసకులచక్రవర్తియగు హిరణ్యాక్షుఁడు భూమి నంతయుఁ జాపగఁ జుట్టినదినము. అందుచేత మాకందఱకుఁ బండువ. నీవునీవేడుక ననుభవింతువుసుమీ" యన శ్రావణుని మొగ మెందుచేతనో సంతసమున వికసించెను. అంతటఁ గొంతసేపటికిఁ గొందఱు రాక్షసులు వేడుకలకొలఁది నిప్పకల్లుఁ దాటికల్లు సీతకల్లుఁ దెచ్చి వరుసగ డింపిరి. వేఱొకకొందఱు బహుమృగజాలములఁ జంపి గుట్టలుగా వేసిరి. అంతయు నాయత్తమయినవెనుక నొక ముసలిరక్కసివచ్చి యందఱఁ గూర్చుండఁబనిచి గంభీరస్వరముతో నిట్లనియె. "ఓరక్కసులారా! యీదినము సుదినము. మనకులమునకుఁ బెద్దయు, మనకుఁ బూజనీయుఁడును, భగవత్స్వరూపుఁడు నైన హిరణ్యాక్షులవారు భూమినిజాపగాఁజుట్టిన దినము. ఆపాపపువిష్ణువు వానిఁగడతేర్చెను గాని లేకున్నచో మన యధికారమే యధికారముగానుండి యుండును. దినములు బాగుండిపాపాత్ములయిన దేవతాధములు గెల్చుటయు మన మోడుటయు సంభవించినది. ఆమహాత్ముని పేరు చెప్పుకొని యీసురను మీరు దప్పిదీఱఁ గ్రోలి నంజుళ్ళు మెక్కి మెక్కి సుఖించి కులగురువును గౌరవింపుఁడు" అని ముసలిరక్కసి ముదలయొసఁగుటయుఁ దక్కినవాండ్రందఱుఁగడవలయొద్దఁజేరి తమపని నారంభించిరి. ముంతలతో ముంచి త్రావువారును గడవలనెత్తి కల్లంతయు నొక్కమాటె వంచుకొనువారును, జెటియొక చేతఁ జెటియొక బానవెత్తి యవలీలఁ గ్రోలువారునునైయాయా సురద్వేషులు శ్రావణున కద్భుతముఁగొల్పిరి. త్రావుటకు విసుగుఁ దోఁచిన మాంసమును దినుటయు, పలల భోజనమునకు విసుగుదోఁ

చినఁ గలుద్రావుటయు నను రెండుపనులయందుఁదగిలి వారువలికిం పఁదొడఁగిరి. ఒకఁడు సురఁగ్రోలి విడిచినకడవఁ గిరీటముగ ధరించి వికవికనవ్వెను. ఒకఁడు, దాని నెగరవైచి తనవీఁపొగ్గి వేయిద్రయ్యలుగ గుభాలున వీఁపుపైఁబడ నానందమొందు. ఒకఁడు చెట్టెక్కి యొడలెఱుఁగక యొకకొమ్మపైఁగూర్చుండి నేలఁబడు. ఒకఁడు మృగచర్మములఁ గప్పుకొని కిచకిచలాడును. వేఱొకఁడు మేనుమఱచి దొర్లును. ఇట్లు దనుజులు స్త్రీపురుషులు శిశువులుఁగూడ మద్యమాంసలోలురై మహాకోలాహలముచేయుచుండ సాయంకాల మయ్యెను. ఈ యొడలెఱుఁగని యావేశమునఁ దన్ను దనుజులెక్కడ బలియొనర్తురో యను సాధ్వసమున శ్రావణుఁడు తరులచాటునునక్కి కానఁబడకుండ జాగ్రత్తపడియెను. ఇందుమతియు వీరివిలక్షణములు గనుఁగొని తన నిరంతరదుఃఖ మించుకమఱచి మందహాసముచేయుచుండెను. అంతటఁ గొంతతడవున కంధకార మెల్లదెసలఁగ్రమ్మె. అందఱును మద్యపాన విహ్వలురగుట నాఁడా యడవి నెగళ్లు వేయువారు లేరైరి. స్త్రీపురుషులు దానవులెల్ల మత్తున నొడలెఱుంగక వజ్రాయుధముచే నఱకఁబడిన కొండలెక్కలచాడ్పున నేలఁబడియుండిరి. అంతట శ్రావణుఁడు తన డాఁగినచోటునుండి యిందుమతియున్న తావునకు మెల్ల మెల్ల నరుగఁదలఁచి ముందుగాఁ జచ్చినట్లు పడియున్న సోఁకుమూఁకలనెల్లఁ బరీక్షించి వారిదెస భయములేదని యాకన్నియయున్న గదియొద్దకరిగి నిలిచెను. ఆగదిలో నామెయు నొకచిన్న నెగడువేసికొని యొద్దియోతలపోయుచుఁ జెక్కిటఁజేయిఁజేర్చి మంచముపైఁగూరుచుండెను. శ్రావణుఁడు తలుపుఁదెఱచి లోనికిఁ దొంగిచూచుటయు నామె లేచి "శ్రావణుఁడా రావచ్చును. అపాయదయ్యము లేవియు లేవులే" యని ముద్దుముద్దుగాఁ బలికెను. శ్రావణుఁడును ధైర్యముతో లోనికరిగి యొక వ్యాఘ్రచర్మముమీఁద నాసీనుఁడై యాకాంక్షోత్సవమును

గూర్చి తనకుఁగలిగిన యబ్బురమంతయు నామెకుఁజెప్పి ప్రసంగవశమున నిట్లనియె.

"బిడ్డా! నిన్ను గన్నదిమొదలుకన్నవానివిధమున నాహృదయము మితిమీఱి మఱుఁగుచున్నది. నీచక్కదనము, నీజవ్వనముఁగా అడవులపాలు కావలసినపాపమెట్లుసంభవించె? నీవెవ్వతవో, నీతలిదండ్రులెందున్నవారలో, నీయునికిపట్టెయ్యదియో. యిందుంటయే నీకిష్టమో నాకెఱుంగఁజేయవలయు. ఈపదాఱు దినములనుండియు నేనెన్నిమాఱులు నీశోక ముచ్చాటింపఁగలఁచిన నదను సంభవింపదయ్యె. నీగుట్టుదాఁపక నాకెఱిఁగింతువేని నాయోపిన సాయము నీకొనర్చి నాజన్మము కృతార్థత నొందించుకొందును. బిడ్డా! నన్నన్యునిగాఁ దలంపకుమీ" యని హెచ్చరించుటయు నించుక యూఱకుండి యాబాల కన్నుదమ్ములనుండి నీరుదెచ్చుకొని వెక్కివెక్కి యేడువసాగెను. శ్రీవసుఁడును దగ్గఱి కన్నీరుదుడిచిభయములేదనిచెప్పి మఱలమఱల వృత్తాంతమెఱుంగఁజేయుమన నామెయూఱడిల్లి యిట్లని వినిపింపఁదొడఁగెను. "అయ్యా! నీవు నాయందతి నిర్హేతుక కృపఁగల్గి యడుగుచుండునపుడు నీతో మర్మమువిడిచిచెప్పకతప్పదు. కాఁబట్టి నాచరిత్రమును నుడువుచున్నాను వినుము. మాకాపురము జరాసంధపరిపాలితమగు మగధరాజ్యములోని పాటలీపురము. నాతండ్రి వసుమిత్రుఁడను క్షత్రియుఁడు. రాజునొద్ద నుద్యోగములెవ్వియుఁజేయక మాతండ్రి పిత్రార్జితమగు భూమికొంత యుండుటచే దానిపైవచ్చుసొమ్ముఁ దెచ్చుకొని గౌరవముగాఁ గాలక్షేపము సేయుచుండెడువాఁడు. చిన్నతనమందు మాయయ్య క్షాత్రమున కనుకూలములగు సాము విలువిద్దల నేరువక విరాగులగు సన్యాసుల వెంటనంటి తిరిగి, దేశాంతరముల సంచరించి, కాశిమొదలగు సకలదివ్యక్షేత్రములు సేవించి నలువదియేండ్ల వయసువచ్చునప్పటికి, మరల నిలుసేరెను, సంసారముపై విరక్తి

తోనున్న యాతని మాచుట్టములందఱును బలవంతముఁ జేసి యతఁడు వలదువలదనుచుండ వివాహముఁ జేసికొనునట్లొడంబఱిచిరఁట. గుణములపేటికయు, లావణ్యసీమయు, నగుమాతల్లినతఁడు వివాహమాడి యామెయందు సంతానముఁగనక చిరకాలము వగచుచుండెను. మాయమ్మయుఁ బెక్కుక్షేత్రములను సేవించి యెన్నియో నోములునోఁచి పెండ్లియైన యిరువదియేండ్లకు నన్నుఁగనియెను. కటకటా! అవ్వలనేమి చెప్పుదు! ముద్దుముచ్చటలొకకొన్నియైనఁదీఱకమున్న సంతానము గనినవెనుక పట్టుమని పదినాళ్లు సుఖింపకమున్న, నన్నుగన్న యేడవ నాఁడె మాయమ్మ పరలోకమునకుఁ జనియెను. అదిమొదలుమాయయ్య, మాయమ్మపోయిన వెలితి నాకుఁ బాటిలకుండఁ బెంచుచుండ మాకు దైవవశమున దరిద్రస్థితివాటిల్లెను. కూటికిఁ బేదయైనను గులముఁ గాచుకొనుటచేత మాయయ్య యొరుల యాచించి, యుద్యోగములఁ జేసియుఁ బొట్టపోసికొనుట కిచ్ఛలేక భూముల నమ్మి కాలముఁ గడపుచుండ మామేనమామ గిరివ్రజపురనివాసి ప్రియశ్రీ, నీవెఱిఁగియే యుందువు. కనికరమ్మున మమ్మిరువురం దోడ్కొని పోయి తనయింట నుంచుకొనియె. ఆబీదతనమునందే యాద్రవ్యహీనతచేఁ గాసిఁ జెందుచునే లేకలేక కలిగితి ననియుఁ దల్లిలేని పిల్ల ననియు నన్ను మాయయ్య చేసిన గారాబమెంతయో వాక్రాన లేను. గిరివ్రజమున నున్నకాలమున నా చక్కఁదనముం బట్టియు నాసుగుణసంపదం బట్టియుఁ బౌరులలో ననేకులు నందు ముఖ్యము బుష్పకేతుఁడు మొదలగు మంత్రులు, విజయసేనాదులగు దండనాథులుఁ ద్రిలోకమల్లుఁడు లోనగు రాజబంధువులుఁ దమతమకొడుకులకు నన్నిమ్మని పలుమారు మాతండ్రినడుగుచురా నతఁడు చూతము తొందరయేమని కడపుచువచ్చెను. ఇట్లుండ నేనాఱువత్సరముల వయసుఁ గలదాననైయుండ మామేనమామ కుమారుని కజ్జయునిలోఁ బరిణ

యమహోత్సవము తటస్థమయ్యెను. మామేనమామరమ్మని మాయ య్యి నెంతేబలవంతేముఁ జేసిన నతఁడు బయలుదేఱక నన్నుమాత్రము పెండ్లి వారితోఁ బంపెను. మేనమామకొడుకులు కూఁతులు నాయీడు జోడువారు నుండుటచే నాపయనము నాకపరిమితానందముఁ గలుగఁ జేసెను. మేమందఱమును వడివడి నడచుచు నరదములపై నెక్కి వనాం తరములు విడియుచు సరోవరములు జలక్రీడలు సేయుచుఁ గడువినో దముగాఁ బయనము సేయుచు దినమొక్క నిముసములాగునఁ బుచ్చు చుంటిమి. ఇట్లుండ నొక్కనాఁటి రాత్రి మహారణ్య మధ్యమునఁ బయనము సేయుచుండ గాలియు వానయుఁ బ్రచండగతిని మమ్ము వేధింపఁజొచ్చెను. ఘుభల్లుభల్లుభల్లని మహావృక్షములు మహావాయు వుచే నేలఁబడుచుండుట నేవకు లిరువురు చెట్లక్రిందఁబడి చచ్చిరి. అందఱమును వానకుఁదడిసి గజగజ వణఁకుచుంటిమి. మనుష్యులు కూఁడ గొట్టుకొని పోవునంతటి ఝంఝూమారుతము వీచెను. అంతలో నాటవికులగు దొంగలువచ్చి మాపయిఁబడిరి. అప్పుడు స్త్రీజనముఁబి ల్లలు సల్పిన యాక్రందనధ్వనియు "దోఁచుకొనుఁడుదోఁచుకొనుం డని చోరులువేయు కేకలును బ్రహ్మాండకర్పరమును భేదించి యుం డునని నేనెంచితిని. చోరులతోఁగొంతతడవుపోరాడి మామేనమామ హతుఁడయ్యెను. భయంకరాకారుఁడగునొక కిరాతుఁడునన్నుబండిలో నుండిలాగి తనమూఁపురముపై నెక్కించుకొనిపోవఁజూచుచుండ నస హాయనై కెవ్వున నఱచి మూర్ఛవడితిని. అనంతరము మాగుంపెడు బలగముమాట యేమైనదో యిప్పటికిని నేనెఱుఁగను. మఱునాఁడు నే నీరాక్షసులమధ్యనుండుటఁదక్క నెట్లిందువచ్చితినో నీకుఁ జెప్పఁజాలను. నన్నా చోరుఁడెత్తుకొనిచనుచుండ జ్వాలాజిహ్వుఁడు మార్గమునవాని కెదురై వానిందెగటార్చి నన్నిందుఁదెచ్చెనని కొన్నినాళ్ళకు రాక్షసాం గన యొకర్తు నాతోఁ జాటుగఁజెప్పినది. నాఁటఁగోలెజ్వాలాజిహ్వుఁడు

నాకడ రాక్షసకృత్యముల నెవ్వియుఁ జేయక నడుగోముగఁ గోరినదెల్ల నిచ్చి పెంచుచున్నాఁడు. ఈరక్కసులనడుమ నీపదియేండ్లు నేనెంతజాగరూకతతో మెలంగితినో శ్రీమన్నారాయణుఁడెఱుంగును. ఇంతటిగారాబము నాకీదానవులు సేయుచున్నను నాకీయునికికన్న మరణమే మేలనితోఁచెడును. ఈజ్వాలాజిహ్వునకు శిశుపాల జరాసంధులాప్తమిత్రులు. ఒకతూరి చేదిరాజు మృగయాక్రీడకిందువచ్చినన్నుఁగాంచి తనకుఁబెండ్లి సేయుమని రాక్షసునడుగ నాతఁడువల్లెయనియె. నాకు శిశుపాలుఁడు భర్తయగునేని నాచేతి వజ్రపుటుంగరము నాకు సుఖమీయఁజాలును. ఈచెఱనుండి తప్పింప నీవేదయిన నాకు సాయమొనర్తువేని నిన్ను వేయిజన్మాంతరములుదాఁక మఱవను. నీకెంతయుఁ బున్నెముండుఁజుమీ" యని తనదీనచరిత్రమును విన్నవింప శ్రీవణుఁడు విని యక్కజమొంది "నీకు నేను సహాయమొనర్తును. ఇపుడు రక్కసులొడలెఱుఁగక పడియున్నారు. ఇదె తగుసమయము. నీవుసిద్ధమై యుండుము. ఈరాత్రి పోవుద"మని పలుక నామెయువల్లెయని తత్ప్రయత్నముఁ జేయసాగెను.

శ్రీవణుఁడీనడుమఁ దనవిడిసినచోటికిఁబోయి, మున్ను గళానందుఁడొసఁగిన యుత్తరమును బదిలపఱచి యాతనికత్తిఁ దనప్రాణసంరక్షణార్థము కేల గ్రహించి, తనగుడ్డలమూటభుజముపై నిడుకొని రక్కసిమూఁకలలో నేరికైన మెలఁకువ వచ్చినదో యని యొకసారి చూడవచ్చెను. ఒక్కొకరక్కసియొద్దకుఁబోయి యొక్కొక్క నిముసముండి నిదానించిచూచి గాఢనిద్రాసక్తుఁడై యున్నాఁడని నమ్మకము తోఁచినపిదప నొండొకయొద్దకుఁజనుచుఁ గొంతకాలముఁ బుచ్చెను. అంతలో దానవుఁడొకఁడు మేలుకాంచి తల విరియఁబోసికొని యా పెనుచీఁకటి నఱచుచుండ నాతఁడు కార్యవిఘ్నంబుఁ జేయనోపునకా యనివగచి వృద్ధుఁడుపాయము వెదకి యొకముంతెడు కల్లుదెచ్చి యా

తనిచేతికందిచ్చె. ఎవ్వరిచ్చిరో యారయకయే యాదైత్యుఁడు సుర గుటగుటఁ గ్రోలి నాలుగు నిముసములలోఁ గ్రిమ్మఱిమత్తుచే నేలకొ ఱగెను. ఒరుగుటయు శార్వణుఁ డమితానందమునొంది యిందుమతి యున్న నెలవున కరుగుదెంచి, "యమ్మా నీవు సిద్ధముగ నుంటివా" యనిపలుకరించెను. "ఎన్నఁడీయగ్నిహోత్రి మధ్యమునుండి దాఁటుట యని నేనున్న దానను. సిద్ధముగనుండక నాకేమియాలస్యమున్న" దని యబ్బాల తనకు రాక్షసుఁడొసఁగిన సకలాభరణంబులనటవదలి కట్టు బట్టతోనీవలకుఁజనుదెంచెను. వృద్ధుఁడాయరణ్యమునున్న కాలమున బట్టపగటనటనుండి దాఁటిపోవుటకు ననువగుమార్గములఁ గనుపెట్టు చు వచ్చుటచేత నాదినమున నాయాసములేకయే యొకదారిత్రొక్కి యిందుమతిని వెంటఁబెట్టుకొని నడువసాగెను. కొంతధవ్వంధకారము న నడచి రాక్షస సామీప్యమును బాయుటతోడన తనచేతనున్న పాఱకట్టుకాగడా వెలిఁగించి శార్వణుండు బాలికకుఁ జీకటివలన వె ఱపుజనింపకుండఁజేయుచు నెడనెడ మార్గమధ్యంబున నడ్డముగనుం డు ములుగంపలఁదొలఁగించుచు బెబ్బులిమెలుంగుల కాలతాంగి య లుకకుండ మీఁదఁజేయివైచి తట్టుచుఁ గడుజాగరూకతతోఁ గొనిపో వుచుండెను. కూరరాక్షసమధ్యమున వసించుటకన్న నెట్టి యాపద పాలైనను సరియేయని కాఁబోలు నాబాల, తన్ను వెంటఁబెట్టుకొనిపో వు నాతఁడు విదేశీయుఁడని శంకింపక వృద్ధుఁడని వెఱవక తన యస హాయత్వమునకుఁ గుందక యెట్టయిన నావలఁబడిసజాలునని పోవు చుండెను. అంతటిసుకుమారి యంతటి చక్కఁదనఁపుటిక్క తనవెం ట నొంటరిగఁదన్నునమ్మి యాచీఁకటినరుదెంచుటఁజూచి శార్వణుఁడు తనలో "అయ్యో నేఁజూడఁ గడు పెద్దవాఁడను. రాక్షసులు మాఁజా డఁ నెఱిఁగి తఱిమివచ్చి పట్టుకొన్న నేను వారినెదిర్చి యీయిందువద నను రక్షింపఁజాలను. అసాధ్యమగు కార్యమునకుఁ దలపెట్టితి. వారిబా

రినుండి బయటఁబడిన యామెను నాయొద్దనుండి యేకటుకుటెకుక్కయై నఁదీసికొనిపోవఁడుగదా. నాకతమున నీమె కెట్టియాపదలు మూఁడను న్నవో. ఏమయినను నాప్రాణములు కంఠమునందుండనీమె కాపద రానీయను. పరోపకారార్థ వ్యాపారమున బ్రాణముపోయినను మంచిదే' అని చింతించుచు నామెకు నెడనెడఁ జత్రములగు కథలు సెప్పి మనోవ్యథ దొలఁగించుచుఁ బయనము సేయుచుండెను.

---

## పదునేడవ ప్రకరణము.

---

శ్రీకృష్ణునకు మేనత్తకొడుకు, బద్ధవైరుఁడునై యజాతశత్రుఁ డగు యుధిష్ఠిరునకుఁ బిన్నతల్లిపట్టియైన చేదిరాజ్యమున కభిషిక్తుఁడై పారాశర్యుఁడు మొదలగు జడదారులచే రాక్షసాంశసంభూతుఁడని యెన్నఁబడుచు శిశుపాలుఁడు చేదిపురిమున నత్యంతవిభూతితో బ్రజాపాలనము జేయుచుండెను. దనుజుని యంశమునఁబుట్టుటచే శిశుపాలునకుఁగోపాలునిపైఁ బాలసాపడగుట మొదలు ననిష్టముండుట యొకవింతకాదు. కాని యాచిఱుతయలుక రవులుటకు భేదకారణము దైవవశమున సంభవించెను. త్రిలోకలావణ్యరాశియైనరుక్మిణిని,రుక్మి తనకీయ సమకట్ట వావివరుసలయినఁ దలపోయక యిరుగురకుఁగల చుట్టఱికమైన బాటింపక యాదేవిని వాసుదేవుఁడపహరించి రాక్షసవివాహ మొనర్చుకొన్న నాఁటఁగోలె చేదినాథునకు యాదవునిపై నలుక ముమ్మడియై నానాఁటికిఁ బెరుగుటయేకాని తఱుగదయ్యెను. నందనందనునకు జరాసంధునకు జరుగుపోరాటములలోఁ జేదిరాజు మగధరాజుపక్షమై యాతనికి బాసటవచ్చి వాసుదేవునిపైఁగత్తిగట్టి జయాపజయంబులవలనఁగలుగుసుఖదుఃఖములఁ దానుఁగూడమాగధునితోఁబా

టనుభవింపఁజొచ్చెను. వెనుకటిదటుండ మనకథ జరిగెడు కాలమందు నందనందన జరాసంధులకు మహాయుద్ధమగునని శిశుపాలుఁ డెఱిఁగి యాజరాసంధుపక్షఁ దోడుపడ నిశ్చయించి యాత్రనికిఁ దన మనో నిశ్చయవార్తఁ బంపి ద్వారకానగరమునుండి వచ్చు బాటసారులఁబట్టి పరీక్షించి చెఱనిడుచుఁ గృష్ణున కేరాజుతోడను వేగునడువనీకుండఁజే యవలయునని నిశ్చయించెను. సింగంబునకు బులియుఁ జిచ్చునకు గాలియు సాయమ్మై వచ్చునట్లు మగధరాజునకుఁ జేదిరాజు తోడుప డుటచే బలరామకృష్ణులుదక్క తక్కినయాదవులు జయమునందునం దియము నొందుచు సాధ్యమగు నంతత్వరితముగ జరాసంధ శిశుపా లుర కంతము నాపాదింపఁదలపెట్టిరి.

ఒక్కనాఁడుదయమున చైద్యుఁడు వ్యవహారవేదులగు కొంద ఱుమంత్రులు తన్నుఁ గొలువ విహారార్థము తన యంతిపురమునంటి యున్న యొక పూవుదోఁట కేఁగుదెంచి బండిగురివెండతీవ లల్లిబిల్లిగ నల్లుకొని చల్లదనము వెదజల్లు నొకమంటపముక్రింద స్ఫటికపు శిలలతో నిర్మింపఁబడిన యొకవేదికపైఁగూరుచుండి నానావిధ కుసు మసౌరభములఁ గ్రోలి యాపుష్పాళుల నొడలంటఁ బూసికొని మెల్ల మెల్ల మద్యపానమొనర్చి నగంధములందుకొనిచను కాముకునివ డువున దమపైఁ బ్రసరించు మందమారుతమువలన జనించు నానం దపారవశ్యమున నించుక కనుదామరల మోడ్చి బహు దేశములనుం డి తెప్పించి నాటించినపూలతీవల సౌరంభముల గుణవిశేషణంబులఁ జేతులు జోడించి నిలుచు మంత్రులకుఁ దెలుపుచు జరాసంధకృష్ణుల ప్రసంగము నడుమ౯ సద్గండయాత్రం గూర్చి కొంత ముచ్చటింప సాగెను.

అట్లు వినోదించుచున్న సమయంబున శిరమునఁ బెంజడలు వేలాడ మొగమున భస్మోర్ధ్వపుండ్రంబు మెఱయఁ బాదుకలఁ దొ

డిగి నల్లనిమేనిచాయగల యొకరాజభటారి వచ్చి వారికట్టెదుర నిల్చెను. వెంటనే శిశుపాలుఁడు లేచి చేతులుమోడ్చి నమస్కరించి "దేవా! దేవ యెవ్వరో యెందుండి రాకయో యెఱుఁగఁజేయ దాసుఁడు వేఁడుచున్నాఁడు. ఆగతియనాయు" నన నాతఁడు పక్కున నగి "ప్రసంగము నావు కనిపు మహాంతరముప నాయకంత్రమంగళయు నెఱిఁగించెద" ననిన మంత్రులు తేని యిచ్చ నెఱిఁగి తమకుఁ దాము యచ్చోటువాసి యరిగిరి. అనంతరమున నాజడదారి తేనిపాదములకు మ్రొక్కి "దేవా నన్ను మఱచితిరే, మందప్రజ్ఞుఁడను, నాకు మీ రంజలిఁజేయు న్యాయమే" యని పలికెను. రాజును వెనుకటి వృత్తాంతముజ్ఞప్తికిఁ దెచ్చికొని "యౌరా నీవఁటరా. అహాహా! నీవునన్నే యింత భ్రమపెట్టితివి. ప్రపంచమునందలి ప్రకృతిజనులకన్నల నెట్లు దుమ్ముగొట్టెదవో వేఱుగఁజెప్పనేల? నీ వంటి జగద్వంచకుండుండ నాకు లోపమెద్ది వాటిలనేర్చు? నీవేమి క్రొత్తవింతల మూటఁగట్టుకొని వచ్చితివో సత్వర మెఱుఁగఁజేయు" మని యుత్తరమిచ్చి పాదములపై నున్నవాని నెత్తి నిలువఁబెట్టెను. ఆ జడదారియుఁ గరములు మోడ్చి "యేలినవారికి నాయొనర్చినపని మాటలతో విన్నవించుటకన్నఁ బ్రత్యక్షనిదర్శనముఁజూపుట యుచితము. "ఓరీ కుఱ్ఱలారా! అందఱు నిటురండురా" యని తన శిష్యులనుద్దేశించి పలుకుటయు నంతవనుక నెందేని చాటుఁగఁబొంచియున్న యిరువురుసేవకు లొక్క దివ్యసుందర విగ్రహుఁడగు పసుమవానితోఁగూడఁ బ్రవేశించి వల్లభునకు జోహారొనర్చిరి. శిశుపాలుఁడును వారి నిరువురనొకసారి కనువిచ్చి చూచి వెంటనే తనచూపు మారుని తూపుచాఁప్పునను యీ లేఁబ్రాయపు మానిసిపైఁ బఱపి యెంతచూచినఁ దనివోని యాతని మేని సౌరున కచ్చెరువడుచుఁ గొండొకసేపటికి జడదారి కిట్లనియె. "మందప్రజ్ఞ! వీని నెందుండి తెచ్చితి వితనిఁబట్టితేక నీ మనసెట్లొప్పె.

నది? వీని వృత్తాంతమించుక నాకుఁ దెలుపవలయు" నన జడదారి నగుచు "స్వామీ! మేము భవదాజ్ఞచే సకలారణ్యములు సంచరించుచుండ నొకచెట్టుక్రింద నీ భూలోకమన్మథుఁడు వడఁగొట్టి మూర్ఛవడియుండి మాకంటఁ బడెను. అతని కించుక నీరుఁ ద్రావనిచ్చి యొడలుతిన్నఁగ నెఱుఁగకయున్న యొకబండిపై వీని నెక్కించుకొని మేము దేవరవారియొద్దకుఁ గొని తెచ్చుచుండ నంతలో నాతనికిఁ దెలివివచ్చుటయుఁ మీ రెవ్వరని మమ్మడిగి పరులమగు మాపై నలిగి తనయిచ్చవచ్చిన తెఱఁగునఁ బోవఁ దలంప నిరాయుధుఁడగుట నీతనిఁ బట్టుకొని పాఱనీక యిటులఁ దెచ్చితిమి. ఎన్నివిధముల నాతనిచరిత్రమడిగినను మిన్నకుండెనే కాని యుత్తర మీయఁడయ్యె. మీఁద దేవరచిత్తము" అని యూరకుండెను. శిశుపాలుఁడును దచ్చరిత్రము నాకర్ణించి యాతని నుద్దేశించి కొన్ని ప్రశ్నములు నడుగ వా రిరువురు నిట్లుమాటలాడిరి.

శిశు—అయ్యా! చక్కనివాండ్రలో మిగులఁజక్కనివాఁడవగు నీ వెందుండి వచ్చుచు మా సేవకులచేతఁ జిక్కితివో యెఱుఁగఁజేయవలయును. కుల గోత్రములు జన్మప్రదేశము నెఱుఁగఁ జేయకున్న మేము నిన్నెచ్చటికిని బోనిచ్చువారము గాము. కావున నిజమును వాక్రుచ్చుము.

పురు—అయ్యా! నేను గిరివ్రజవాసుఁడను.

శిశు—ప్రియమిత్రుఁ డగు జరాసంధుని పాలనమున నుండుటచే మా కాప్తుఁడవే మోయని తోఁచెడును. కాని నీవెందుండివచ్చెదవు?

పురు—ద్వారకానగరమునుండి యొకచోటికిఁ బోవుచు దైవవశమున మీ భటులకుఁ జిక్కితిని.

శిశు—వాసుదేవహతకునిపోలినుండి వచ్చుటచే శత్రుఁడవోయని తోఁచుచున్నది. అయినను నీకాదువచరిత్రమునుగూడఁ జెప్పుము.

పురు—రాజా! నేనేమిపనిమీఁద నెందుకరుగుచున్నవాఁడనో యది గోప్యమగుట మీకుఁ జెప్పనొల్లను. నాపేరు కళానందుఁడం దురు, ఉత్తమక్షత్రియుఁడను.

శిశు—అవురా! నీవు కులముఁజూడ సాటిరాచబిడ్డవు. ఆకార మునఁజూడ ద్వాపరయుగమునఁబుట్టిన మగనిఁడవు. జరాసంధుని పాలనమున నుండుటచే మాకు నన్నివిధములఁ బోరానిచుట్టమవు. కాని దురాత్ముఁడైన శ్రీకృష్ణునియొద్దనుండి యేగుచున్నట్లు నడుపు చున్నావుగాన మాకు విడువరాని పగతుండవేమోయని తోఁచెడును. అట్లని విడువరాదు. ఇట్లని విడువనుంచరాదు. సోయగముఁగన్న హృద యము గరిగుచున్నది. పూర్వోత్తరముల నారసిన జంకు జనించు చున్నది. కావున నీ నిజచరిత్రము తెలియునంతకు విడిచియు విడువ నట్లొకవిధమున నిన్ను జెఱలోనుంచువాఁడను. నిన్ను నిజవృత్తాంత మెఱుఁగఁ జేయుమనియెంత నొక్కియడిగిన నెఱిఁగింపవైతివి. కావున సందిలోపంబు నా యందుఁ గానరాదు. మంచిప్రిజ్ఞుఁడా! నీవును నీ యనుచరులును జని వీనిఁ గారాగృహమున నుంపుఁడు. తక్కిన నీచుల విధమునఁగాక వీనిని సగౌరవముగఁ నాదరింప వలయునని కారా గృహాధికారులతో నావచనముగఁ జెప్పుము.

అని శిశుపాలుఁ డనుమానముగఁ గళానందుని బందెలోనుంప నానతిచ్చి మందిరంబునకుం జనియె.

---

## పదునెనిమిదవ ప్రకరణము.



ప్రశాంతములగు జడదారుల యాశ్రమములు నిరంతరము నానందనిలయములయి యుండునుగదా. జ్వాలాపహ్వాని యరణ్యమునకుఁ గొన్ని యామడల దూరమున నానందాశ్రమ మనుపేర నొక ఋషివాటిక తనరుచుండును. అందు సాటిలేని తపము పెంపున బ్రహ్మర్షులనెల్లఁ గేలిసేయఁజాలినవాఁడు కరభూఁడను తపసిరాయఁ డొకరుఁడు వసియించుచుండును. పాలువిడువని పసితనమునాఁడె నారాయణ నామస్మరణము జనకుని వలన నాతఁడు నేర్చి నైదేఁడుల ప్రాయమువచ్చుతోడనె ప్రాఁజదువుల మొదలుపెట్టి మునికులమెల్ల నచ్చెరువడునట్లు పండ్రెండువత్సరముల యీడు రాకమున్న నాలుగు వేదముల భువనైకప్రజ్ఞాధురంధరుఁడై యవ్వల వేదాంతశాస్త్రము నభ్యసించి యనమానుఁడై యాత్మతత్త్వంబును బ్రకృతితత్త్వంబు నెఱిఁగి చిత్తము పరమ పురుషాయత్త మొనర్చియుండఁ దప్లిదంప్రిలు జ్ఞానమార్గమున యోగ బలంబునం జేసి మేనవాసిరి. నాటఁగోలె దారాస్వీకారము మనోవికార కారణమనియు సంతానప్రాప్తి పున్నామ నరకమునుండి తొలఁగించునదియైనను బహునరకంబు లనుభవింపఁ జేయుననియుఁ బరమేశ్వరుని సాక్షాత్కరింపఁ జేసికొనుటకన్న పురుషార్థము వేఱొండు లేదనియుఁ దెలిసికొని యామరణమును బ్రహ్మచర్యము నెరప నిశ్చయించి తమకుఁ దారు వలచివచ్చు ఋషికన్యకల ననేకుల నిరాకరించి, ఋష్యశృంగుఁడయిన నెట్టకేలకు మది నిబ్బరము విడనాడిమగువకేలు పట్టెఁగాని యీతఁడుమాత్రము మనోవికారమొందఁడని యానాఁటి మును లందఱునుచుండ నింద్రియ నిరోధముఁ గావించెను. కోపము వచ్చుటయు శపమిచ్చుటయు ననునవి రెచ్చిష్య లేకాలమునఁగాని యెఱుఁగరని లోకు లెన్నుచుండు గురుఁడగు నతనియందట్టివి లేవని

యుగ్గడింపనేల? వేయేల? ఆతఁడు వ్రతభంగముగాని విశ్వామిత్రుఁడు? నీచమగు రాజాశ్రమమున బ్రదుకని వసిష్ఠుఁడు. కలహప్రియుఁడు గాని నారదుఁడు. పూవిల్తుని పదును చిగురాకుబాకు లెవ్వనిమీఁద పనిచేయవన్నఁ గరభునిఁ బేర్కొనవలయును. శుకయోగికి ద్వాపరమున నెవ్వఁడు దీటువచ్చునన్నఁ గరభునిఁ బేర్కొనవలయును. పిపీలికాది బ్రహ్మపర్యంతమును సమాన దర్శుఁడెవ్వఁడన్నఁ గరభునిఁ బేర్కొనవలయును. అతని బ్రహ్మతేజముగనుంగొనియు నతని మహిమలు వినియు వేఁటతమకముఁగల రాచవారు రక్కసులు వాని యాశ్రమముపొంత కరుగ వెఱతురు.

ఈకరభమునికి నీకథ జరిగినకాలమునాఁటికి వయసుమరలి వృద్ధుఁడగుట లౌకికవ్యాపారములఁబొత్తుగవదలి పారలౌకికనియమముల యందు డెందంబునిల్పి యాశ్రమము వెడలి యెటకుంబోవకయుండెను.

ఆతనియాశ్రమమున నొకనాఁడు వేవెలుఁగు వేయి వెలుఁగులతోడ బ్రహ్మాండకటాహము సంతయుఁ గాల్చుచున్న సమయమున ముసలివాఁడొకఁడు జవ్వనినోర్తు వెంటఁబెట్టుకొని కరముడస్సి “పుడిసెడునీరును, బట్టెడన్నము దొరకకపోవునే” యని యెంతయు దూరమునుండివచ్చెను. వచ్చి వారిరువురు మునీంద్రునికృపారసములీల నెంతయుఁ జల్లఁదనమును వెదఁజల్లు నీడలుగలచెట్లను గని తమపున్నెము పండినదనువుననే యచటఁ బరిపక్వములై చెట్లవ్రేలాడు పండ్ల గెలలఁ గనుంగొని “రండు దయసేయుఁ” డని తమకు స్వాగతముఁ బలుకు శుకబ్రహ్మచారులఁగని చివురుగుత్తులమెక్కి క్రొవ్విన భాగ్యవంతులచందమున నొరులలక్ష్యములేక వ్రేలు శుకదంపతులఁగని సత్పురుషులకుజంకు పాపములతీరునఁ దమ్ముఁగాంచి వెనుకవెనుకకుం బోవు ఘాతుకమృగములఁ జూచి, పరస్పరవిరోధములవిడిచి యందు విహరించు జంతుసంతానములఁజూచి యానయు, ధైర్యము నక్కజ

ము సంతసము నొక్కసారితమ్మలమ, వటువులుసేయు సామగానంబు వీనులవిందుసేయఁ, గట్టెదురఁగనఁబడు పర్ణశాలయొద్ద కరుగుచుండిరి. అల్లంతదవ్వుల వీరలం గనుంగొని మునిశిష్యులుకొందఱు పరుగుపరుగునవచ్చి బహువిధోపచారములు నెరపిరి. ఒకఁడు రెండుదర్భాసనములు పఱచి యందు వారినిఁ గూరుచుండఁబనిచె. ఇరుగురు రెండు వింజామరలఁగైకొని వారికిఁజెమటలార్చిరి. ఒక్కఁడు తటాకమున కరిగి చల్లనినీరుదెచ్చి వారికిఁ ద్రావనిచ్చె. ఇంకనొకఁడు చెట్లంబడిన తీయనిపండులందెచ్చి వారికి సమర్పింప వానినారగించి సేదదేఱి శ్రావణుఁడును మన యిందుమతియు "అమ్మా యింకఁబ్రదికితిమి. సాహసించినందులకు, దురాత్ములకంటఁబడకుండఁ జేరవలసినచోటఁ జేరితిమి. దైవమే యింకతోడగుఁగాక" యని తమ్ముఁ దామూఱడించుకొనిరి. అనంతరము చపలత్వమున నడుగులడుగు ప్రశ్నములకు నుత్తరము లిచ్చి శ్రావణుఁడు తనవృత్తాంతమునంతయుఁ జెప్పక యిందుమతిచరిత్రమును వారలకుఁ దెలిపెను.

సాయంకాలమునందుఁ దనతపోనియమముచాలించి పర్ణశాలవిడిచి రెండవబ్రహ్మఁబోలు కరభమహాముని బైటికివచ్చి నిరుపమానశైత్యముతోడ మాంద్యముతోడ సౌరభముతోడ వీచు మలయమారుతమునుగ్రోలవచ్చి యొకచోట వ్యాఘ్రచర్మము వేయఁబడియుండ నందుఁగూరుచుండ నరుగుచుండెను. తెల్లనిజడలు నంతకన్నఁ దెల్లనిగడ్డము నెరసిన కనుబొమలమీఁదివెండ్రుకలు కరభమహామునివయస్సుచెప్పక చెప్పుచున్నవి. మాంసహీనములైన ముడతలువడి వ్రేలాడుచర్మముతోఁ జేతదండముఁబట్టి పాదుకలుదొడిగి కాషాయాంబరముఁగట్టి యెంతమూఢునయిన మ్రొక్క మనసుగలవానిగాఁ జేయునట్లుట్టిపడుచున్న యాతనిబ్రహ్మతేజమున కచ్చెరువడి మెడనున్న యొంటిజన్నిదఁపుబోఁగు బ్రహ్మచర్యముం దెలుపుచుండ నా మహాముని

దార్ఢ్యమునకు మిగుల నాశ్చర్యపడుచు శ్రావణుఁడు, నిందుమతియు నమస్కరించిరి. మూర్తిగైకొన్న ముసలితనమో యనునట్లున్న యాముని మూర్తిగైకొన్న జవ్వనమువలెనున్న యామెను గని "దీర్ఘ సుమంగలీ భవ" యని దీవించి "యీప్సితార్థసిద్ధిర' స్తని శ్రావణుని దీవించి "మీచరిత్రములువిన మాకుఁ జెప్పుటకు మీకిచ్ఛయేని విన గోరెద" నని పలికెను. ఇందుమతి తనకథ మునిపతికి విన్నవింపుమని సన్నచేయ శ్రావణుఁ డాతనితోఁ బూసగ్రుచ్చినట్లంతయు నెఱుఁగఁ జెప్పెను. కరభుంపు కథనాలకించి యాయబలపై జాలివొడముటయుఁ గరుణారసము చిప్పిలుపలుకులనిట్లనియె. "బిడ్డా! నీయిచ్చవచ్చినన్ని దినములు నాయాశ్రమమున నుండుము. నీ కేభయంబును వాటిలకుండఁ గాఁ జేసెదను. నీవు మీ గిరివ్రజపురమునకుం బోవలయునేని మాశిష్యులఁదోడిచ్చి యనిపెదను. ఇది నీపుట్టినయిల్లుగా మెలఁగు" మనియానతిచ్చి హస్తమలంకరించుచుండిన రుద్రాక్షమాలికనుద్రిప్పుచు వ్యాఘ్రచర్మముమీఁద గూరుచుండి ధ్యానము జేసికొనఁ దొడఁగెను. శ్రావణుఁ డది మొదలుకొని యిందుమతివిషయమై వగవఁబనిలేదనియుఁ బెద్దకాలపువాఁడగు తానెట్లయిన బాధలేదనియుఁ దనయొద్దనున్న కళానందుని కత్తియును, నందనందనుండిచ్చినజాబు నామెకిచ్చి దాఁచుమనిచెప్పి యా యాశ్రమప్రాంతముల సంచరింపుచు మునికుమారులవలన వనమునందలి చిత్రముల నరయుచు నెంతయువేడుకతోడ శ్రావణుఁడు ప్రొద్దులుపుచ్చుచుండెను. ఆఁడువాండ్రులేని యాయాశ్రమమున నిందుమతి మతిచెడినట్లుండి కొన్నినాళ్ళపిమ్మట వటువులు తోఁబుట్టువులుగవర్తింప స్వాధ్యాయముఁ జెప్పు శుకపికశారికాది శకుంతసందోహముతోఁ గాలము గడపుచు మునికన్యకవలె నుండెను.

ఇట్లు మద్యపానమత్తులైన రక్కసులందఱు నొడళ్ళెఱుఁగక

యీరేయిపొరలిపొరలి మఱునాఁడు పగలునట్లు వర్తించి సంజతటి కించుకమత్తువిడిచి లేవనేరక పీనుంగులచాడ్పునఁ జెట్లకు మేనులు చేర్చి కూరుచుండ నింతలో రాకాసియొకర్తు వచ్చి "యిందుమతిలే దిందుమతిలే" దని యఱచెను. వెంటనే మఱియొకర్తువచ్చి "శ్రావణుఁడు లేఁ" డని యఱచెను. రక్కసులందఱును బడలికమేనులతోడ నిటునటుఁ బరుగులెత్తి కలవరపాటు నొందసాగిరి. అంతట జ్వాలాజిహ్వుఁ డావార్తవిని యదిరిపడి "హా! యిన్నినాళ్లు పెంచి తుదకాబాలను గోలుపోయితిని. ఆమెనుబెంచి శిశుపాలునకుఁ బెండ్లి చేసి నాకు నతనికిఁగల నెయ్యమును బెద్దజేసికొనఁదలంచితిని. దాని కట్టిదుర్బుద్ధి యావృద్ధహతకుఁడు కఱపివెడలఁదీసియుండును. మీరందరును సకలారణ్యములువెదకి వారిని గన్గొని శాలికనేమరక యిరుగురతోడితెండ"ని యానతిచ్చెను. మఱునాఁడు వారినందఱ నానాదిక్కులకంపెను. ఆపాలసుదింట్లు వెదుకనియడవులు చూడనిగుహలు నెక్కనికొండలుఁ బరీక్షింపనిపల్లెలు నాచుట్టుపక్కలనెందును లేవు. అందుండదనియో కరభుని మహిమకు వెఱచియో వారాతని యాశ్రమమునఁజేరరైరి. ఇట్లు వెదకివెదకి వారిఁగానక విసిగి రక్కసు లూరకుండిరి.

అంత గొన్నినాళ్ళకు దైవయోగమున నొక్కనాఁడు శ్రావణుఁడు కరభాశ్రమప్రాంతములఁ గుమ్మరుచు నొంటరిగ నాశ్రమమునకు మఱల నరుగుచుండ నెవ్వఁడో వెనుకనేవచ్చి "హా! వృద్ధహతకా యెందుఁబోయెదవురా" యని వెన్నుపై నొక్కచఱపు చఱచెను. శ్రావణుఁడు వెంటనే యబ్బా యని నెత్తురులుగ్రక్కి నేలఁ గూలఁబడెను. అతని మూపుపై నెక్కించుకొని యారాక్షసుఁడు జ్వాలాజిహ్వుని సమ్ముఖమునకరిగి యప్పటికి మూర్ఛనుండి తెలివి నొందిన శ్రావణుని వానియెదుట నిలిపెను. జ్వాలాజిహ్వుఁడును

"ఇందుమతి నెంచుంచితి" వని పలుమాఱులు వానిని నయమున భయమున నెన్నివిధముల నడిగెను గాని యూఁతఁ డించుకయేనియుం జెప్పక మొద్దువలె నిలిచెను. రాక్షసరాజు బిట్టలుక నొంది వీనింజంపి తినుఁడని తన సేవకుల కాజ్ఞ నొసంగెను. శ్రీనివాసుఁడును తన జన్మము పరోపకారమునఁ సార్థకత్వం జెందెనని సంతోషించి, ఇందుమతి నిరపాయముగ నెల్లప్పుడు నుండుఁగాక యని మనమునఁ గోరి విచారము లేక మనమున వాసుదేవపాదారవిందములను నిలిపి యుండి గోవిందనామస్మ దాసపుత్రాదులను దల్చి యుంచుక వగచినను గాంభీర్యము లేని యొకింగి, గిరివ్రజమునుండి వేఱొకస్థానమునకు వెడలి రాక్షసులచే మరణమొందవలసినట్లు నియమించిన విధివైచిత్ర్యముల కచ్చెరుపడుచు మరణమునకు సిద్ధమైయుండెను. అంతట రాక్షసులువచ్చి వానింబట్టి కత్తిచేఁగోసి క్రొన్నెత్తురుఁద్రావి మాంసమంతగా లేనివాని వృద్ధకళేబరము సంతృప్తకరముగాఁ గాక కసిదీరున ట్లొకవిధముగ భక్షించిరి.

---

## పంహొమ్మిదవ పరిచ్ఛేదము.

ఇందుమతి పాణిగ్రహణముసేయ శిశుపాలుఁడు చాలకాలము నుండి తీవ్రముగనుత్కంఠతతో నెద్దియుందోఁచక వలనుపడినంత శీఘ్రముగ నది చేకుఱఁజేయుమని జ్వాలాజిహ్వుని వేఁడుకొనుచు వచ్చెను. అనంతర మీ చిత్రకథ జరిగినదనివిని చేదిరాజు చేతఁజిక్కినపండు జాఱవైచుకొన్నవాని తెఱంగున నెంతయు వదరుచుండెను.

అట శ్రీనాథుఁ డానందాశ్రమమున కెప్పటియట్లు రాక నికి సంజతటి మొదలిందుమతి యెంతయుఁ గలవరపడి మునికుమారకులఁ

జటి వృద్ధునినిమిత్తము వెదకుమని వేఁడుకొనుటయు వారుపలుదెసల కుంబోయి తామెఱిఁగినచోటునెమకి యందతనినిగానక యొక్కరొక్క రుగ సంకటాశ్రమమునఁజేరియుండుమతి కావార్తఁను దెలియఁజేసిరి. వసుగులలో నొక్కఁడు మహాశ్రియము మలికిలోంగఁజేసి గోసినప్పి బడలి కను పినగీఁదోఁచు నెమ్మొగముగఁ జెప్పినను మఁ గనత్రోసివారు, నిందుమతియును పినుక టిట్లనియె. "అమ్మా! మున్నాశాంబవుఁడు గుఱ్ఱమ్మురునెలవులెల్ల వెదకియెందునఁగానకనైతి. ఎవ్వఁడో యొకరక్క సుఁడు వృద్ధునొకని తనయుఱకటంబెట్టుకొని పరువెత్తుచుండఁదానగాం చినిసని యొకయెలుక నాకుఁ జెప్పెను. ఇఁక శాంబవుఁడు మనకు దక్కుటరిది. లోకంబు వెదసునింక్ఙచేఁ గలైనేపడరి నా సిద్ధికము" అనిపలుక నిందుమతి మూర్ఛిల్లి పెక్కుపలుకులఁ, శైత్యోపచార ములనించుక సేదదేఱి "హా మాదైవమా! చుట్టములు, నెచ్చెలులఁ గన్నవారి నెడబాపుటచాలక యించుక సాయము సేయవచ్చిన యీ నిఱుపేద ముసలివానినిగూడ మఱుఁగుపఱచితివే? పాడుదానినగు నా కెవ్వరుపకార మొనర్చిన వారికిఁగీడుమూడకున్నె? నానిమిత్తమాతఁడే ల చావవలయును. ఆ దేవుఁడునన్నుఁ గొనిపోరాదా" యని విలపింపఁదొ డఁగెను. కరభమహాముని తపోనియమములను జాలించి సమాధినుండి లేచి యీ దురవస్థఁదెలిసికొని తత్ప్రదేశమున నామెనగపును గొంతతగ్గిం చెను. అట్లామె మనమున శాంబవునిమిత్తము వగచుచు నానందాశ్ర మమున వసించుచుండ నొక్కనాఁడ నేకులు ఋషులు ఋషికుమారు లు నచ్చోటికరుదెంచి కరభునిచేఁ బూజితులై యొకదినమందుండి మ ఱునాఁడురాత్రి యిట్లనిరి. "కరభమునీంద్రా! జాబాలియచ్చటికనతి దూరమున నొకయాశ్రమముఁ గల్పించుకొనియుంట మీరెఱుంగుదు రుగద! ఆతఁడిప్పు డొక్కజన్నమును మున్నెవరును జేయనిదానిని జే యుఁదల పెట్టినాఁడు. వేదవేదాంగవిదులగు తామచ్చోటికి విజయము

చేసి మునులసదస్సు నలంకరించి జన్మము సఫలముఁ గావించితన్న ధన్యుఁ జేతురని జాబాలిమిమ్ము వేఁడుకొమ్మని మమ్ముఁబనిచె. తాము శిష్యసమేతముగ నెల్లి పయనమై రావలయును" అని కరభుఁడు మునీ మిచే నాశ్రమమువాసి యొండొకచోటికి నరుగ ననువుగాని సమయమయినను దనయందలి గౌరవమును జాబాలియంతటి జడదారి యన్నివిధములఁ బ్రార్థింపనరుగకుంట యనుచితమని పోవనిశ్చయించి యిందుమతికి సాయముగఁ గొందఱ శిష్యులను నిచ్చి కపటభద్రమని చెప్పి నాలుగుదినములలో వత్తునని యిందుమతి నోడంబఱచి చనియెను.

ఆమహాత్ముఁడరిగిన రెండవనాఁడు సాయంకాలమాయాశ్రమ సమీపమునందు మహాకోలాహల మొకటి వినఁబడియెను. పఱచెడు పులులు, పఱవంగాలక నేలఁగూలు నెలుఁగులు, పాఱునెడఁదమ కొమ్ములు గుల్మములకుం దగులుకొని ప్రాణభీతిం బెగడుచు లేళ్ళు, హతము లగుచు జాలివాఁడమున క్రందించుచు నితరమృగములును నాశ్రమ వాసులకుఁ గానవచ్చెను. అదియేమని మునికుమారులు బోయల నడుగ క్షత్రియకుల భూషణుండగు నొకనృపుని వేఁటయని చెప్పిరి. అంతఁగొంతతడవునకు రాజసేనకులంబులు నాశ్రమమునఁ బ్రవేశింప దొడఁగెను. మృగయావినోదమున నలసించి భూపాలురు కరభాశ్రమమున విడియుటయు మునివలన నాతిథ్యమును బడయుటయుఁ బ్రాయికముగఁ గలదుగాన వచ్చినపరిజనమును మంత్రులను సేనాధిపులను వటువులు గౌరవించి వారికిబసలొసఁగిరి. అనంతరమామహారాజు మందగమనముతో నరుదెంచు మదపుటేనుఁగునెక్కి యాశ్రమముఁ జొచ్చి యొకచోదిగి మునివటువులొసఁగిన వ్యాఘ్రచర్మముపైఁ బరి వారముగొలువఁ గూరుచుండి మునులపల్లెల వైచిత్ర్యములనుజూడఁ గోరి యించుకసేపిటునటు విలాసార్థము దిరుగఁజొచ్చెను. అట్లుతిరుగు చుండ నాతనికిఁ జిలుకపిల్లలకుఁ బండ్లు దినిపించుచు వానికిమాటలు

నేర్పుచున్న యొకజవ్వని త్రిలోకరాజ్యలక్ష్మియట్లు కనంబడి నేత్రి మునకు విందునొనర్చెను. ఆచిన్నారికన్నులంబడ నామెయెవ్వతెయని జేడు వడుగులనడుగ వా రామెకతనంతయు నెఱుఁగ మనియు జ్వాలాజిహ్వుని యాశ్రమమునుండి యొకవృద్ధుఁడు దెచ్చెననియు నామె పేరిందుమతి యనియుఁజెప్పిరి. ఆపలుకులు చెవులంజొరఁబడి నంతనె నృపుని నెమ్మొగము వికసించె. పట్టరాని యానందము హృదయము నాక్రమించెను. వెంటనే పరిజనమునుబొమ్మని సెలవొసంగి తానద్దేవి సన్నిధికరిగి మాటలాడనిశ్చయించి, మునిలేనిసమయమని శంకింపక తనసాహసమునఁగలుగు నష్టముం దెలియక యామెవంకఁజనియెను. చని యామెవెనకప్రక్కను నిలిచి చిలుకపలుకులకు రసపుష్టి సేయు నామె పలుకుల నాలకించి పూర్ణచంద్రమండలమట్లు ధావళ్యముఁ జూపు మొగము తనకు వెనుకనున్నకతనఁ గానఁబడకున్నను దానికాంతి కచ్చెరువడి మెడమీఁద ముద్దయైన చీకటిచాపునున్న ధమ్మిల్లము నజూచి, యంగసౌష్ఠవమునుజూచి యామహీవల్లభుఁడు పువ్విలుతుని ధాకలకాఁగలేక కట్టెదుటనిలచెను. నిలుచుటయు నాయెలనాఁగభయ సంభ్రమములతో నడుగులు తడఁబడఁ బ్రక్కనున్న పర్ణశాలలో నికిఁజని తలుపుచాటుచేసికొనెను. రాజునకప్పుడు తానున్న దాశ్రమ మనియుఁ బుణ్యాదాయకమగుచోట నట్టి కాముకవ్యాపారముఁ దలఁప నైనఁ దగదనియుఁ దెలియక కామగ్రహపీడచేఁ బరవశుఁడై యామెతో లోనికిఁజని యిట్లనియె. "బాలా! దైవము మనఘటనమునం దనుకూలభావము వహించినాఁడనుటకుఁ దప్పిపోయిన నిన్ను మరల సమకూర్చుటయేనిదర్శనము. రాక్షసరక్షణమునుబాసి యరిగిననాఁడె నీయెడ నాసవిడుచుకొన్నవాఁడను. అట్టియెడ నిన్ను నాకొనఁగూర్చుట పరమోపకారముగాదే. ఇంతదనుక నిన్నుఁగూర్చివినివిని యామాటలూ రితీఁగాని యెన్నఁడు నింతకనులపండువుగఁ గాంచనైతిని. ఎన్నిదిన

ములు నీనిమిత్తము కామాయత్తుఁడనై వేఁడినిట్టూర్పులు విడిచితిని! ఎన్నివసంతరాత్రులు కూర్కు లేక నీధ్యానమును సేయుచు జాగరము గావించితిని. ఎందఱు జ్యోతిశ్శాస్త్రవిదుల నాకునునీకునుసమాగమము గాఁగలదోయని యరసితిని. అంతయు నేఁటికిసఫలమయ్యెను. ఏరాజు నీపైఁగల మోహసముద్రమునఁబడి యాసయను నుడుపముచే నిన్నినాళ్లు మేన నసువులునిల్పెనో, యేరాజు జ్వాలాజిహ్వుని యొద్దనుండి తనకు నిన్నొసంగునట్లు వాగ్దానమును గ్రహించెనో యేరాజు నీ దాసుఁడై రాజ్యలక్ష్మిని నీకర్పింపఁదలఁచియున్నవాఁడో యాశిశుపాలుఁడనుజుమీ నేను. పుట్టుకచే రాచకన్నియవై కారణాంతరమునఁ దాపసకన్యకవైన శకుంతలను దుష్యంతుఁడువోలె నిన్ను నేఁగేలువట్టుట ధర్మేతరముగాదు. నాఁడు కణ్వుఁడింట లేఁడు. నేఁడుగరభుఁడింట లేఁడు. ఇది సర్వవిధముల శోభాకరము. నాతోడఁ జేదిపురమునకు రావమ్మని సరసోక్తులచేఁ దసయుటమటందెలుపుటయు నాపడతుక సిగ్గునఁ గొంతతడ వెద్దియుఁ బలుకనేరక మందమందమృదూక్తుల నిట్లనియె. రాజేంద్రా, నామనమున నిక్కముదాఁపక తెలిపెదను. నీపై నను రాగ మించుకంతయును నాకులేదు. నీవు రాజువు, ధర్మాధర్మముల నన్నియునెఱింగియు మునినిలయమునున్న నన్నిట్లాడుట యుచితేతరము. పాడిదొలఁగి వర్తించినవాఁడు భూలోకదేవేంద్రుఁడయినను నీచుఁడుగా నెన్నఁబడునుగదా" అని రోసమును నీసును డెందమున నందడింప శిశుపాలుఁడు స్త్రీలోలుఁడై "అన్నన్నా! నీజవ్వనము కారడవులపాలు గావలసినదే! చెట్టునంబుట్టి యెవ్వరికిని ననుభవయోగ్యముగాక తనంతనపండి యడవినిరాలి నశించుపండువోలె నీసోయగము నీతోనశించునదియే! నీనారచీరలకు మా చీనిచీనాంబరములుదగవో! నీదర్భశయ్యలకు మాహంసతూలికాతల్పములు దీటురావో! నీ ఫలములకు మాశాల్యన్నములుఁ బిండివంటలుసరిగావో! యేల

నీకింత మోటుతనము! ఎంత జేలవో, నీమేలునీ వెఱుంగవు. సౌందర్యము నందలి పారిశస్త్యము నెఱ్ఱుగఱుఁగని యీకటికిజడదారి వేదాధ్య యన మొనర్చి పశుపాయుఁడగునొక మోటబ్రహ్మచారి కిచ్చి నిను బెండ్లిసేయును. అపుడు నీవెంతయేని వగతువు. కాఁబట్టి నావెంట రా రమ్ము" అనిన నామె యలుకచే. మొగము జేవురింప "దురాత్మ! నాశాంతము నీకుమఱింత బొగరుఁ బుట్టించెడినో! ఛీ! నాయెదుట నిలువకుమ"ని యింకనేదియో యనుచుండ రాజు రాజబింబాస్య హ స్తముంబట్టుకొనియెను. ఇందుమతియుఁ "గర్భమునిందార్చి" యనియఱ చి గుభాలున మూర్ఛిల్లెను. రాజంచుకయు జంకకయదియ యదనని యిరుగురు సేవకులంబిలిచి పసిండి చిఱుగంటలు మొఱయుజయధ్వజ ముగలఁ తనయరదమునాయత్తముచేసియుంచఁదానెంతుక సుముఖుమని వారి కానతిచ్చెను. మునికుమారు లాయిందుమతి యాక్రందనధ్వని విని పరుగుపరుగునవచ్చి రాజున కెదురాడ వెఱచియుఁబరమవైదికులు ఛాందసులునగుట సమయోచితముగఁ బల్కనేఱుఁగక రాజును గొం తడడవు వేఁడి బతిమాలి యతఁడియ్యకొనమిని నోరు నెత్తి మోఁదు కొని జన్నిదములఁదెంచుకొని యంగలార్పసాగిరి. ఆయరదమునఁ దాను గూర్చుండి శిశుపాలుఁడు స్కంధావారమెల్ల బయలుదేఱవల యుననియానతిచ్చి తేరుసాగఁదోలుకొని పోయెను. సేనలన్నియు నారాత్రి యానందాశ్రమముఁ బాసియరిగెను.

అంతట నాఁలుగవనాటి సాయంకాలమునకు జాబాలికృతమగు జన్నమునుండి కరభుఁడు వచ్చునప్పటికి, గురువు తన్నేమనునో యను భయమున నొకఁడు దేశాంతరము బాఱిపోయెను. రెండవవాఁడు ప్రాణములఱచేతనిడుకొని కరభునిఁ గాంచినతోడనె బారుమనియేడ్చి యచ్చట జరిగిన వృత్తాంతమంతయు సవిస్తరముగ నివేదించెను. మునిపుంగవుఁడు శిష్యులజేలతనమునకు వగచి రాజు మోఁటుదనము

నకలిగి, బాలికయబలభావమున కించుక దుఃఖించి తనలో నిట్లని వితర్కించె. "కటకటా! పరిశాంతములుఁ బవిత్రములునగు తాపసాశ్రమములె యబలలగు స్త్రీలకు క్షేమము నొసఁగకున్న నిఁక నరక్షితలగు నేమమెందుండును? రాజధర్మముం దప్పి ప్రభుసముదాయము వారిం బసమర్థులు. హా నాశరణము జొచ్చి నా పాలంబడిన బాలను రక్షింప నేరని నాజన్మమేల. ఇది కలిద్వాపర సంధియగుట రాఁగలకలిపురుషునిఛాయం బర్వుటచే న్యాయపరిపాలకులగు రాజులకుఁగూడ దుర్బుద్ధులు పుట్టుచున్నయవి. ఇప్పుడు నేనలిగితినా చేదిపురము భస్మమగునట్లు, శిశుపాలుఁడు నిర్మూలమగునట్లు, జగతిని రాచపురుగు లేకుండునట్లు శపియింప నోపుదును. కానను గోపవ్యయము సేయనేల. అదిగాక శిశుపాలుఁడు వాసుదేవునిచేత నిహతుఁడగునట్లు మున్న శరీరవాణిపలికె. అచిరకాలముననదియుం జేకూరును. హా! శిశుపాల! నీయాయువు క్షయమగుటచేతనే మునులకుఁగూడ నెగ్గులు దలపెట్టుచున్నావుసుమీ" అని యొక శిష్యునిఁబిలిచి వత్సా! నీవు చేదిపురికినిబోయి శిశుపాలుం గాంచి నాపలుకులుగా నిట్లుచెప్పుము. "రాజా నీ సాహసము నీకుమేలు నాపాదింపదు. ఇందుముఖిని నీవుబలిమిచే నింటికిఁ గొనిపోవుట మృత్యుదేవతను నీగృహమునకుఁ బిలుచుటయె సుమీ. ఆమె నన్ను నమ్మి మాయాశ్రమముం జేరినది. శ్రేయఃకాముఁడవేని జరిపిన దుష్కృతమునకుఁ బశ్చాత్తప్తుఁడవైతివేనిఁ గొంతకాలము బ్రతుకఁదలఁచితివేని నాసమ్మతియు నామెసమ్మతియును లేక నీవాబాలిఁ బెండ్లియాడఁ దలపెట్టకుము. మునులతోడి పగలు తాచులతోడి సరసములు సుమీ! కరభునిమాట లన్యములుగాఁ దలఁపకుము" అని మఱునాఁడుదయమున నావటువుం బుత్తెంచి ప్రత్యుత్తరమున కెదురు చూచుచుండెను.

---

## ఇరువదవ ప్రకరణము.



అట గిరివ్రజమున నాగవల్లి యిల్లువెడలి యెచటికిఁ గానరాక యెందేనిఁ జనుటయు సిగ్గరస్తమాను నిర్వ్యాజసాహసంబు గూడ నెన్నినాళ్ళకుం దెలియకుండుటయు జరాసంధుఁడు దన్ను గన్యాన్నవునకిమ్మని జనకుని బలుమాఱుఁ బీడించుటయుఁ దలంచి యాబాలోత్తమయహోరాత్రములు హారము నిద్రయునుజ్జగించి చిక్కిశల్యమై చూడ మనోహరతర కార్యమునకు భయమొందుచుండెను. రాగలతిక యెన్నివిధములఁ నూరార్చిన నామె యించుకయు ధైర్యమూనదయ్యె. గిరిజోత్తమ కళానందునిపై వలపునిలిపెనదని చెలులవలన విని చంద్రపాలుఁడు కళానందునినిమిత్తమున యువరాజునలరఁ దనకుఁ గీడుమూఁడునని యాతఁడు దేశాంతరమున కేగి కతనాలకించి రాఁడనియుఁ గూఁతురు దక్కదనియు నిశ్చయించి భారము దైవముపై మోపి దినములు గడుపుచుండెను.

ఒక్కనాఁడు రాత్రి యొంటిగంటకు గాఢముగ నిద్రించుచుండ సౌందర్యతిలక నిద్దురలోనుండి యులికిపడి లేచి "యక్కా! రాగలతిక ఏమిసేయుదునే. ఇంకను మేలుకొనవైతివే" యని యెలుఁగెత్తి పిలిచి వెక్కివెక్కి యేడువ నారంభించెను. రాగలతికయు నదరిపడి లేచి రోదనమునకుఁ గారణము దెలియమి వీఁపుపైఁ జేయివైచి చఱచి భయపడవలదని సందిటఁ జేర్చి యనేకభంగుల దుఃఖకారణముం దెలుపుమని వేఁడుకొనియెను. ఆశాంతవచనములఁ గొంత యూరడిల్లి యబ్బాలిక మెల్లమెల్ల నిట్లనియె "ఓసీ! రాగలతికా! యేమనిచెప్పుదును. నేఁడు పాడుకలఁగంటిని. హృదయేశ్వరుఁడు కళానందుఁడు భువనమనోహరమగు తనతొంటియాకృతిఁ గోలుపోయి కడుమాసిన ప్రాఁతచీరలుగట్టి నాయెదుటనిల్చి యుచితాసనమునఁ గూరుచుండు

మని నేనెంత వేఁడుకొనిన నామాటవిని రాకరించి దూరమునందుండి నన్నుద్దేశించి యిట్లనియె. "ఓ సౌందర్యతిలకా! నీవు నాహృదయేశ్వరివి కావు. నీకు నాకు ఋణముతీఱినది. నేను పరరాజులచేతం జిక్కినాఁడను. ఎల్లియో నేఁడో వారు నన్ను యమపురమునకు నంపించఁ జూచుచున్నారు. కడసారి నిన్నుఁ జూడఁగోరి యిటువచ్చితిని. నా పోయియుండుట కుము'' అనిచెప్పి నడివడి నడచి మరల వెనుకకువచ్చి నాపై నీకుఁగల యభిమానము ప్రతిదినమును మాముదుసలితల్లిపై నిల్పి యామెంగనిపెట్టుచుండుమని నాప్రార్థనయనుచుఁ జెప్పెను యచ్చోటు బాసెను. అయ్యో! నన్ను బిగ్గఁ గౌఁగిలించుకొనవే. పిడుగులంబోలు నానుడువులిప్పటికిని నాచెవింబడుచున్నట్లున్నవి. ఆభయంకరాకార మిప్పుడు నాకన్నులఁగట్టినట్టున్నది. ఓసీ! నామాటనమ్మవుగాని మున్నెటి కళాసందుఁ జేగాఁడే. ఆమధ్యమలోకమునమ్మధునికంత మాయమూ పెట్టునచ్చినదే! హా! నాపుణ్యమెంతలో మఱిగొకలాగైనదే! అని వెండియు సంగలార్చుటయు రాగలతిక కన్నీరు తనకొంగునఁ దుడిచి పిడికిటఁ బొప్పునవరించికట్టి బాలా! నీవొక బేలవు. కలనిజమగునా? స్వప్నవృత్తాంతము లొకప్పుడు మున్నుమనమెన్నఁడుఁ గనివిని యెఱుంగనివిగానుండును. ఒకప్పుడు పూర్వదృష్టములుగ నుండును. ఎట్లయిననవి నిజములనివగచుట యెండమావులలోని నీటి నెట్లుతాగమాడుదుమని వగచుటగాదే! యన నాగుణోత్తమ యిట్లనియె. ఓసీ! కలలు సాధారణముగ నబద్ధములని నేనెఱుంగుదును. కాని యిం దేదియో నిక్కమున్నదని నాకుభయముకలుగుచున్నది. కొన్నిపాడుకలలువచ్చి నట్లైవచ్చి యన్నంతపనిఁ జేసితీరును. ఇఁకనా కానారాయుడుఁ జేదిక్కు. నాకా యదుటింకనుబోలేదు. నేనిదురించుపట్టుకు నాప్రక్కఁ జేయివైచికొని యుండుమని యామె యించుక కన్నుమూసి తిరుగ భయంపడి లేచి మరలఁ బండుకొని యెట్టకేలకు నిద్రించెను. రాగలతికయు నామెంకుఁ గునుకుపట్టిన వెనుక మేనువాల్చెను.

మఱునాఁడు రేయిఁ గలఁతనిద్దురచేతఁ గల్గిన బడలికచే సౌందర్యతిలక మేలుకాంచునప్పటి కించుక పొద్దువోయెను. ఆమె లేచి నిలువుటద్దములోఁ దననెమ్మోముఁ జూచుకొని వేణీసవరించుకొనుచుండ రాగలతిక పరుగులు పరుగ వచ్చి "అమ్మా! ధారుణీదేవిగారు మిమ్ములఁ జూడఁగోరుచున్నారు. అప్పగారితోఁగూడ నామెయిల్లువచ్చుచున్నది." అనిపలికెను. గవాక్షము తెరిగి చూచునప్పటికిఁ దండ్రియు ధారుణిని వెంటఁబెట్టుకొని మెల్లఁగ మేడమెట్లెక్కుచుండెను. వారు నెమ్మదిగ లోనికరుదెంచుటయు, సౌందర్యతిలక యెదురుగాఁజని యా దేవిపాదారవిందములకు వందన మొనర్చెను. ఆమెయు గద్గదకంఠయై యనుగూపరమణునిఁ జేబట్టుమనిదీవించె. అనంతరము రాగలతిక వేసిన పీఠములపైఁ జంద్రిపాలుఁడును ధారుణియుఁ గూరుచుండిరి. తరువాత వారిట్లు మాటలాడిరి.

ధారు.—బిడ్డా! సౌందర్యతిలకా! నిన్ను నేను చూచి చాల దినములయినది. ఈ నడుమ నెన్నఁడు నా కెన్నలు నిన్నుఁగాంచి యానందించుటకు సమయమబ్బనే యెన్నఁ. ఎల్లప్పుడును నిన్నుఁజూచుకొను భాగ్యమింక నబ్బలేదు.

చంద్రి.—అమ్మా! మీ రిచ్చినవచ్చిన పనియేమి? అయుష్మంతుఁడగు మదన విలాసందునిజాడ యేమైనఁ దెలిసినదా?

ధారు.—నాయనా! అంతటిభాగ్య మీమందభాగ్యురాలి కెట్లుకలుగును. మీ కేమయినఁ దెలియవచ్చినదాయని యడుగుటకే యిటువచ్చితి. తెలిసెనేని నా కించుక యెఱుఁగఁ జెప్పుము తండ్రీ!

చంద్రి.—అమ్మా! నీకుమారునిసంగతిగూడ నేనునెఱుఁగను.

ధారు.—హా కుమారా! ఎన్నఁడిల్లువిడిచి యెఱుఁగవు. ఎండకన్నెఱుఁగని సుకుమారుఁడవు. ఆఁకలి దప్పికల కెట్లోర్చుచుంటివో. వేళకుఁ బట్టెఁడన్నము నించుక దాహమనీరునిచ్చి నిన్నాదరించువారె

వ్వారు? ఏయడవులలో నేఁటిపుట్టలకిఁదఁబడి మూర్ఛిల్లితివో, ఏద య్యామునీకుఁ గీడునలుపునోగదా! ఎన్నఁడుఁ జలునవ్వోతోఁచు నీ మొగమింకఁ గాంచు పున్నె మీఘటమునకుఁ గల్గనే. ఏదుఃఖమైనఁ గకపోయిన మీయయ్యయే పుణ్యాత్ముఁడు.

చంద్రి—అమ్మ! అట్లువాపోవకుము. అతఁడు కుశలిమైరాఁ గలఁడు. అయినం బోవునప్పు డెందుకొఱకు బయనమై యతఁడు స నియెనో నాకెఱింగింపుము. అక్కడకు సేవకునిబంపి వెదకించెదను.

ధాను—అయ్యా! ఈదేశయాత్రకుమున్న గొన్నిదినములు మానవత్స పరాయత్తచిత్తముతో నేవన్నమాటలు వినిపించికొనక తానన్నమాటఁ గ్రమ్మఱనను చు నొకవిధముగా నుండెను. దానింబట్టియది నవయౌవనారంభ మగుటచే నెన్వతెరుమో మోహాంపు వితనముల హృదయక్షేత్రముఁ జల్లినదని యెంచుకొని యడుగుట యుచితము గాదని యూరకయుంటి. అంతఁ గొన్నిదినములు గడవ నొక్కనాఁడు మాయయ్య నిదురించుచుండుటయు నేను మేల్కనియుండుటయు సంభవించినది. అప్పుడు మానవత్సనిద్దురలో “ సౌందర్యతిలకా గొరువంకయిదుగో” యని పలవరించెను. అది యాధారముగ నాతని చిత్తమీముద్దుగుమ్మయందుఁ దగిలెనిన సంతసించుచు ధన్యురాలన నుకొని నీతోడవియ్యమొందుకాల మెన్నఁడువచ్చునని యు, నుభయకులపవిత్రయు రూపునగొనమున ననమానయునగు సీమె నాకుఁ గోడలై యిలుమెట్టు టెప్పుడనియుఁ జలుకయుఁ గొరువంకయులాగునఁ గొడుకుం గోడలును ముద్దుముచ్చటలతోఁ గాపురముసేయఁగన్నులార జూచుకొని వారిల్లుదిద్ది నాకుపచారముజేయ సుఖించుకాల మెన్నఁడు గల్గునని యు నెదురు చూచుచుండ నంతలో నొకవైపరీత్యము సంభవించెను.

చంద్రి—అంతట వచ్చిన వైపరీత్యమేమి ?

ధారు.—అమ్మా! యంతలో సౌందర్యతిలకను జరాసంధుఁడు రణాన్నవుసకిప్పింపఁ దలఁచినాఁడని యొకవార్త నగరిలోఁబొక్కెను. అదివిని మావాఁడు నిర్విణ్ణహృదయుఁడై దానికిఁ బ్రతిక్రియసేయఁ గాఁబోలు, నజ్జయునికిం బోయివత్తు నమ్మా! యొకనెలకు వత్తునని నన్నొడఁబఱిచి చని యిప్పటికి కాఱునెలలయ్యె. ఏపాపపుఁగడియలో నిల్లువెడలెనో గాని మరల నిలుసేరలేదు. నాకుఁ గాలము సమీపించి నది. ఆయొక్క కుమారునిచేతిమీఁదుగాఁ గడతేఱుయోగము నాకు లేదు. అమ్మా! మీరెన్నఁడైన వానివార్తవిన్న నాకు సత్వరముగ నెఱిఁగింతురుగాక.

చంద్రి—అమ్మా! అందులకు సందియమేమి? అతనిరాక నాకుఁగూడ సపేక్షణీయమేగద! కళానందుఁడు చంద్రిపాలున కన్యుఁడుగాఁడు.

ధారు—ఆవాత్సల్యము వానిపైనుంచుము. వాఁడు తండ్రిలేని పిల్లవాఁడు. ఇఁక నేనింటికరిగెద. నాకు సెలవిమ్ము.

అనిలేచుటయు సౌందర్యతిలక యామెకు రెండియు నమస్కరించి యాశీర్వచనములఁబడసి యామెను వీడ్కొనియెను. చంద్రిపాలుఁడామెను సాగనంపి యామెకుం దనకుఁజరిగిన సంభాషణముంగూర్చి తనలోఁదాను వితర్కించుకొనుచుండెను. అవ్వల గుణోత్తమ రాగలతికంజూచి యోసీ! పాపము! ఆకథవిని మనకే యింతజాలిగనున్నది. తల్లిదండ్రులెట్లున్నదో గదా! ఆహాహా! నెచ్చెలీ! నానిమిత్తమాసుకుమారుఁడెంత కష్టమునొందుచున్నాఁడే! ఈమహాదేవికిం గొడుకునై యాతనిచెట్టఁబట్టునట్టి యదృష్టము నావంటిదానికిఁ గల్గుట రిది. కోటినోములునోచి యెక్కుడు ఫలములు గొంఁదగునా! యనివేడి కన్నీరుధారఁగ వగపసాగెను. అనంతరము రాగలతిక సమయోచితములగు వచనచనల నూరార్చి భోజనంబునకుఁ దోడ్కొని పోయెను.



## ఇరువదియొకటవ ప్రకరణము.



రణార్ణవుఁడు మొగిలిమూఁకఁ బాఱఁ దినకరుం జూపెను నాఁటఁగోలె జరాసంధుఁ డాగ్రంథకర్త పేరెఱుఁగఁగోరి యెన్నియేని జతనములు సేయఁదొడఁగెను. మొట్టమొదట ననుమానము జయసేనుఁడే కుట్రలోనివాఁడని యాతనినెమ్మది నుదయించెను. గాని యారాక్షోమరుని మతిభ్రమణము నొందుటవిన్నపిదప మగధరాజు నిరపరాధిని జెఱసాలనుంచితిఁగాబోలు దైవసహాయుని యప్పుడప్పుడు చింతిలుచుండెడువాఁడు. అదియునుంగాక జయసేననియిల్లాలు భర్తదురవస్థకు బెంగఁగొని ప్రాణావశిష్టయైయున్నదని సేవకులవలనవిని యాపరమపతివ్రత నంత మనఃక్షోభంబుపాలు చేసినందు కాయసుఖము తనకుం దనవారికిఁ గలుగకున్నయని పొక్కప్పాటు పడుచుండును. ఇదియుండ రణార్ణవునకు సౌందర్యతిలక నిప్పించి పెండ్లిసేయింపఁ దలంచుటచే నదియెట్లు నెఱవేఱునని రాజు నిరంతరము నుపాయమున న్వేషించుచుఁ జండ్రిపాలుని మనసు నొవ్వకుండ రణార్ణవుని కోర్కె భంగముగాకుండ మెలఁకువతో వర్తింపవలయునని నిశ్చయించెను. కాని సౌందర్యతిలక చిత్తము కళానందాయత్తమైనట్లు కర్ణాకర్ణి నాలకించి యాకన్నియ నన్యునకిప్పించుటచే నాతనిమనసు చివుకుమనునని కొంత తలఁచుచుండెను. ఈతలపులన్నియు ముప్పిరిగొని నెమ్మనము నమ్మలికమ్మిన ముంప నొక్కనాఁడు మగధరాజు తామరాకులోని నీరు చందమున డెందము కుదురుపా టెఱుఁగక సంచరింపఁ డనయంతిపురమునఁ గూరుచుండి మగధరాజ్యలక్ష్మి భావిదశం గూర్చి యోచించుచుండ సర్వస్వతంత్రుఁడగుటచే రణార్ణవుఁడు తలుపులందెఱచి లోనఁబ్రవేశించి తేనియెదుటఁ జేఁదోయి మోడ్చి నిలువంబడియెను. జరాసంధుఁ డెప్పటివాత్సల్యముతో వానిఁగనుఁగొని

"కుమారా! యిటురమ్ము. కేతకీదళమున లిఖించిన మహాపాతకునిజాడయేమైన దొరకినదా" యని పలుకరించెను. రణార్ణవుఁడును వాని ప్రక్కనున్న యొకపీఠముపైఁ గూరుచుండి "దేవా! యెన్నిభంగుల నాతపమంతయు ధారవోసి నేఁగనుంగొనుచున్నను నాకానంతయు బాడ కాసఁబడదయ్యె. ఐనను నేఁడు దానికొక్క నిరపాయమైన యుపాయము నూహించినాఁడ. వినుండు, ఈగిరివ్రజపురమునఁగొన్ని దినములనుండి యొకవింత జరుగుచున్నది. పార్వతీదేవి యనతారామని పౌరులచేత మితిమీఱుపట్టు గొనియాడఁబడుచున్న యొకయోగిని మనపురముఁ జొచ్చినది. అదిమొదలు మనసగర మట్టుడికిన ట్లుడుకుచున్నది. ఎట్టిపరిశ్నలు నెవ్వరడిగిన వారికెల్లఁ దగినయుత్తరములు నొసఁగునఁట. ఒక్కపరిశ్నమునకేని తప్పుఁ జెప్పియెఱుఁగఁదట! గిరివ్రజపురవాసిగాక మగధదేశమున వసించువారనేకులు కడుమార్గాయాసమునకోర్చివచ్చి తమమనోరధముల నామెనడిగి సంతుష్టహృదయులై చనుచుందురు. రాత్రులయందెకాని పగటివేళనాపె యేపరిశ్నమున కుత్తరము నొసంగదు. రేలయిన నేరికంటఁ బడక యొకగదిలోఁ దలుపు మూసుకొనియుండి యావలనుండి యడుగువారికుత్తరము లొసంగునఁట. అది యేమిమహిమమో నేనెఱుఁగనుగాని యామె గుమ్మముముందిసుక వేసిన రాలకుండునట్లు జనులు గుంపుగూడి యుందురు. ఇమ్ముంగిలి రేకు నామెకుం జూపి దీనికర్తయెవ్వఁడని యడిగిచూచెద. దాన సంశయముందేలునని రణార్ణవుఁడు పలికుటయు రాజు చిఱునగవు నగి నీయిచ్చవచ్చిన తెఱంగునఁ బ్రవర్తింపుము. ఎట్టులైన దానిఁగనుగొనుటయె మాకావశ్యకము. అందు సఫలీకృత మనోరథుఁడ వయ్యెదవేని నీకోరినమేలు నీకొనర్చెద" నని వాగ్దానముఁ జేసెను. నిరాశయను గ్రిష్మమున నెండిన రణార్ణవుని హృదయలతిక యావాక్యామృత వర్షమున వెండియుఁ జవురొత్తె

నాతోఁ దత్యానందముతో నిట్లనియె. తండ్రీ నాకు నీవొనర్పఁ దగినదియు నేను నీవలన నపేక్షింపఁ దగినదియు నగు మేలు సౌందర్యతిలక కేలువట్టించుట గాక వేఱొకటిలేదు. అక్కన్య కళానందునిపాలగునని శోఁచెదను. చంద్రపాలుఁ బలుకరింపి నీకోసెట్లయిన వియ్యమందునట్లొడంబఱుపుము. ఈకార్యమున నాకాశాభంగము వాటిల్లెనేని నీపాదారవిందములపైఁబడి ప్రాణములు విడుచువాఁడను. ఇంక వేఱుగతిలేదు. కావున నీవు యావచ్ఛక్తిని వినియోగించి నా మనోరథసిద్ధిఁ జేయవలయుము. ఇంక నేనెఱిఁగి నాప్రయత్నము. నుండువాఁడ" నని ముకలఁగొని నాతోఁ బలుకుటయు జరాసంధుఁడు రెండు నిముసములు వానిపోయినవలనుఁజూచి తన మనస్సునను నిట్లువితర్కింపఁజొచ్చెను. "పసితనమునుండియు వీనిం బెనిచినకతమున నీతనిముద్దులన్నియుఁ జెల్లింపకతీరదు. ఈతనినిమిత్తము చంద్రపాలునితో మొగముఁ జెండుకొని ముచ్చటింపవలయును. అతనికూఁతురు సౌందర్యతిలక కళానందుని వలచినదనుట ప్రసిద్ధము. ఆమె రణార్ణవుని మెచ్చదు. చంద్రపాలుఁ డాయలరుఁబోఁడిని రణార్ణవునకు మనఃపూర్వకముగ నొసంగఁడు. తల పెట్టుక వెనుక బలిమినైనఁ గపటోపాయముననైన నామించుఁబోఁడిని హరించి పెండ్లిసేయక నేనుమానను. సాపరాధియో నిరపరాధియో యెఱుఁగక జయసేనునిఁ జెఱసాలనుంచినందులకు విజయసేననికుటుంబమును, సంపూర్ణముగ నొండొరుల డెందములు నాటుకొనిన మోహాలతఁ ద్రెంపి సిద్ధమైన పెండ్లి విఘ్నము గావించినందునఁ గళానందునికుటుంబమును, గఠినోక్తులచే నొప్పించి తనకూఁతు నపహరించి రణార్ణవునికి వివాహముఁజేయుటకుఁ జంద్రపాలుని కుటుంబమును, నాకుఁ బగతురకొలములోఁ జేరుటనిశ్చయము. మఱియు వారింబట్టి వారిచుట్టములుఁ బక్కములు నెయ్యురాష్ట్రులు బరిచయులును మాపైఁగత్తికట్టుట తప్పనిపని. రాజధానిలో స్వాసై

న్యకలహము గలుగుటకవకాశ మొసంగుట పగతురకుఁ దనలోతుఁ దెలియఁజేయుట యని రాజనీతివిశారదులు వాక్రుచ్చుట యెఱిఁగియు విధివశమునవో పుత్త్రివాత్సల్యమునవో యిందుఁ బ్రవేశించితిని. కాని సందసందనను నీగుట్టు తెలియకుండ జాగ్రత్తపడవలయును. నా సంభ్రముఁడు రాజసామ్రాజ్యమునకైన యింత లోతులకు జంకునే యని మీసముపైఁ జేయివైచి తలయూఁచి లేచి యిట్టిట్టుఁ జూచి సేనకు నొక్క నింబిలించి చంద్రిపాలుం దోడుకొని రమ్మని యానతిచ్చె. రాజు మనస్సుకన్న నెక్కుడు వేగముగఁ జంద్రిపాలుని గృహమునకు కానే నకుఁడు పఱచి తనస్వామి కూరవర్తి దెలుపుటయు నతఁడు మనమున నొక్కించుక శంకించి కొంచెకసేపటికి ధైర్యముదెచ్చుకొని దైవిక ములు మనమునందు పొసఁగినముగాఁ దోఁచి పిదప శుభపరిణామము లగునని నిశ్చయించి యానేవకునితో గూడ మలుదేఱవచ్చెను. నిష్కళం కమగు వంశమునఁబుట్టియు సుప్రసిద్ధమగు సచ్చరిత్రఁబట్టియుఁ జంద్రి పాలుఁడు రాజుచే నెల్లప్పుడు గౌరవింపఁబడుచుండెడువాఁడు. కావునఁ దనకు మున్ను నడచిన మర్యాద నడచునో లేదో యని యాతఁడు భ యపడెను. కాని మగధరాజాతనిం దొంటికన్న మిన్నగా గౌరవించి కూరుచుండఁబెట్టి యథోచితములగు కుశలప్రశ్నములఁ జేసి మగధ రాజ్యవిషయము నెంతయు ముచ్చటించి ప్రసంగవశమున నిట్లనియె. నెచ్చెలీ! చిన్ననాఁటఁగోలె నీవు రాజ్యతంత్రములయందు సైదోడు లాగునఁ దోడుపడుచుండ నీతోడఁగల నెయ్యమునకుం దనివోక చు ట్టరికము సేయవలయునని కోరుచున్నాఁడ. కలదుగదా భువనైక సుందరియగు సౌందర్యతిలక నీకూఁతురు. ఆముద్దుగుమ్మ సోయగము బుద్ధినేర్పు వినుటచే నాకుఁ గోడలుగ నబ్బాలిక నొనర్చుకొనుట కెం తయు నభిలాషవొడమెను. ఆయింతిచిత్తము కళానందునిపైఁ దవు లుకొనినదని వినినాఁడ. చక్కఁదనమున, బాహుబలమున నాతని

కీడువచ్చువాని వేఱొకనిఁగానవా? తన గరువంపుఁజేష్టలచే రెండు మూఁడు సారులు నాకలుక వొడమించుట నీవెఱుంగుదువు. మీకుఁ గడుంగూర్చువాఁడు సర్వవిధములఁ బూజనీయుఁడు నాకాప్తుఁడు నగు రణార్ణవుఁడు నీకల్లుఁడుగా నోపు. నారిదాంపత్య సుసుకుమారియను పేరం గు. నీకీడివియ్యము నాకుం బరిపూర్ణించినము. మిత్రమా! నా వచనంబు లసత్యంబులుగాఁ దలంపక నీకూఁతును రణార్ణవునకొసంగుము". అనిరోక్తి చెప్పుటయుఁ జంద్రపాలుఁడు భయమును మోమోటమును దన్ను మాఱువలుకనీకుంటచేఁ గార్యనిశ్చయము సేయనోపక నాలుగుదినములలో మీకుత్తరముఁ జెప్పెద. నాకుఁ బ్రస్తుతము సెలవొసంగుడని బ్రతిమాలి యాతని యనుజ్ఞవడసి యంతిపురిఁ బాసి బయలుదేఱి యిలుసేరెను.

---

## ఇరువదిరెండవ ప్రకరణము.

---

అట్లు రణార్ణవుఁడు మాగధునియొద్ద సెలవుగైకొని మున్ను జయసేనునియింటనుండి తాను సంగ్రహించుకొనివచ్చిన మొగలి యాకుజాబుఁ జేకొని గిరివ్రజపౌరులచే నత్యంతమును గొనియాడఁబడుచుఁ ద్రికాలవేదియని పేరుఁగన్న యోగిని యున్నమఠమునకుం జనియెను. చనునప్పటికి సాయంకాల మగుటయు యోగినిమఠము ముందు జనులు వేనవేలు గుంపులుగూడిచొచ్చుట కెడమునొసంగమి రణార్ణవుఁడది యసమయమనియు నట్టిరాజ్యకార్యములు రహస్యముగఁ బ్రవర్తిలుట యుచితమనియుఁ దనమనమునఁ దలపోసి వెనుకకు మఱలిపోయెను. యోగినియు నిజతపోమహిమచేఁ దన్నుఁ బ్రశ్నము లడుగవచ్చినవారికందఱి కుచితములగు నుత్తరముల నొసంగి సం

తృప్తమనస్కులఁజేసి యనిపి మరల స్నానమాడి భవానీచరణరాజీ
వములఁ గుంకుమతోఁ బూజసేయుచుండెను. అప్పటికి రెండుజాముల
రాత్రియగుటచే రాజవీథులు నిర్మానుష్యములయ్యెను. చండశాస
నుండగు జరాసంధునికూన మూర్ఖులగుకొన్నదో యన్నట్లు రాజ
భటులును వేగులవాండ్రును నగరమంతయుఁ దిరుగుచు నారాత్రి
జరగుసంగతులను స్వామికి నివేదింపఁజూచుచుండిరి. అంతలో రణా
ర్ణవుఁడు జరాసంధుఁడుం దనకు గారాము పెంపున నొసంగిన మణిభూ
షణములనన్నింటిందాల్చి విలువయెన్నరాని నలువలుగట్టి కుడిచేతఁ
బదునుబాకు నెడమచేత మొగలితేకుంబూని తెల్లనిగుఱ్ఱముపై నెక్కి
యోగినీమఠముస కరుగుచుండెను. రాజభటులచే నివారింపఁబడక
వేగులవాండ్రచేఁ బరీక్షింపఁబడక మఠమును కరుగునప్పటికి
యోగినియొద్దనుండు పరిచారిక యరుగుపై నిలుచుండి యాపురుషుని
జూచి వినయముతో నొకకుర్చీమువైచి వానిపేరడిగి యోగినితో మనవి
యొనర్ప లోనికిఁజనియెను. పరిచారికతో నామెయించుకముచ్చటించి
మరలనామె నీవల కంప నదివచ్చి "దేవా! మీరువచ్చినపనియేమో
యడుగు"మని యోగిని నాకానతిచ్చినది. చాలపొద్దాయె సత్వరమె
సెలవొసంగుడు రేని మాదేవి నిద్రకుంజనియెడు" నన రణార్ణవుఁడిట్టు
లనియె. మగధమహారాజు జరాసంధుఁ డీమెయొద్దకు నన్నతిరహస్య
మగురాజకార్యముమీఁదనంప నేనిందువచ్చితిని. మీదేవి నాతోడఁ
బ్రత్యక్షముగ సంభాషింప నననగునేని యటుసేయుట యుత్తమో
త్తమము" అని యింకనెద్దియో యనఁబోవుచుండఁ బరిచారిక వాని
మాటకడ్డమువచ్చి "చాలుచాలు! ఆదేవి కొమ్ములదిరిగినవారితోడ
నే మాటాడదు. రాగాదుల జయించిన మునీంద్రులకైన వసుంధర
యంతయుఁ బాలించు చక్రవర్తులకైన దర్శనంబొసంగదు. నీబోఁటి
సామాన్యులకా" యని మందలించెను. చోటుగానిచోటఁ గానిపట్టు

బట్టుట కార్యభంగమునకు హేతువని జంక యెప్పటివలె నీముఖము ననే యుత్తరప్రత్యుత్తరముల జరిగనిమ్మని యాతఁడుతనపని నిట్లని విన్నవించుకొనెను.

"మగధరాజున కపాయముఁజేయఁదలఁచి కొందఱు కుటిలాత్ములు దుస్తంత్రములు పన్నుచున్నారు. వారికుట్రలపట్టియుం బోలె మాకు వారిజాబొకటి లభించినది. కాని యెవ్వరాలేఖను లిఖియించియుందురో యెఱుఁగఁజాలకున్నారము. ఈయదియే యామొగిలి యాకుజాబు. దీనినా మూలాగ్రముగ మీరుచిత్తగించి వ్రాసినదురాత్మునిపేరు మాకుందెల్పి మగధరాజ్యమును మహారాజును రక్షింపవలయును." అని పరిచారికచే నామొగలియాకునలోనికంపెను. యోగిని దీపమును బాగుచేసి దాసియెదుట నాజాబుంజదువుకొని యందలి ప్రత్యక్షరమునకును మితిమీరిన యానందమునొందుచుఁ జదువుట ముగియఁగనె మరల రెండుమూఁడు సారులు చదివి కొండొకవడికిట్లని మెల్లమెల్లలోననుండి ప్రత్యుత్తరమిచ్చెను. "ఈజాబున కింత కలవరమొందవలసినపనియేమి? మీకింగిట్టనివాఁడు, విదేశమునన్నవాఁడు యువతీమోహమునఁ దవులొన్నవాఁడు దీనిని వ్రాసియుండనోపునని విస్పష్టముగాఁ దెలియుచుండ మీరింతమూర్ఖులై యోచింపనేరకుంట నాకక్కజముగనున్నది. అయినను మీయూహ నిజమగునో కల్లయగునో యనుసందియము మీకున్నదిగాపున మూఁడునాళ్ళలో వానిపేరును వానియున్నతావును మీకెఱిఁగించెదను. ఒకవేళ దీనినెఱుఁగ నాకు సాధ్యముకాదేని నాకుఁగల యద్భుతదివ్యశక్తిచేఁ గైలాసమున కరిగి శాంకరీముఖమున నదియెఱిఁగివచ్చి మీకుఁదెలిపెద. జరాసంధుఁడు భైరవపూజాధురంధరుఁడగుటచే మహాకాళికిని మహేశ్వరునకును వానియందుఁ బుత్రప్రేమ. నేను గైలాసమునకరిగినపుడెల్ల భవాని యాతనిమాటయె చెప్పుచుండును. భవానింబట్టినాకు

మగధరాజ్యమన్న నింతింతయనరానిపక్షము. అయినను మాకిందొ క్క సంశయమున్నది. జరాసంధుని రహస్యముల నీవెఱుఁగఁదగిన చుట్టమవో, టక్కరితనమున నాతనిరహస్యముల నెఱుఁగ నీవంకఁబె ట్టుకొనివచ్చిన పగతుఁడవో నాకు నిజము దెలియకున్నది. కావున నీకారహస్యములఁ దెలుపవచ్చునని నామనంబునకుదృఢ విశ్వాసము గలుగునట్లు జరాసంధుని వ్రేలియుంగరము నానవాలుగఁ దెమ్ము. ఆవల నంతయు శుభమగును."

ఆపలుకులు చెవినిబడ రణార్ణవుఁ డామెమహిమ కచ్చెరువడి యావలనుండియె వందనమాచరించి యెట్టులైన నాయుంగరమును మ అునాఁడుదయమునఁదెచ్చియిచ్చుటకొప్పుకొని సంతుష్టహృదయుఁడై యంటికేఁజనియెను. అనంతర మాయోగిని యాలేఖను మరలమరలఁ జదివి తలయూఁచి "హాదురాత్మా! నేఁటికిఁ జిక్కితివిరా! పాపాత్ము డెవ్వఁటికైనఁ జిక్కకపోవఁడుగదా."యని దానిం బువ్వులసెజ్జలోనుం చి పరిచారికయుఁ దానును నాఁటిసంగతులు ముచ్చటించుకొనుచు నిద్రించిరి.

పొద్దుపోయి నిద్రించుటచేఁ జాలినంతనిద్దురయుండమి రణార్ణ వుఁడు కన్నులు నలిమికొనుచు బద్ధకముచే నోడలువిఱుచుకొనుచు నావులించుచులేచి చీఁకటి వీడకమున్న రాజగృహమునకరిగెను. రణా ర్ణవుని సందేశమేగతిఁఫలించినదోయెఱుఁగఁగోరి పెందలకడమేలుకాం చి జరాసంధుఁడు వీనికొఱకెదురుచూచుచుండ నింతలోరణార్ణవుఁడువ చ్చి నమస్కరించి యెదుటనిల్చె. జరాసంధుఁడు యథోచితముగవాని నాదరించి యోగినీవృత్తాంతమంతయు వినఁగోరనాతఁడుపూసగుచ్చి నట్లు జరిగినకథయెల్ల తూచాతప్పకుండ విన్నవించి యామెమహిమలు వేయినోళ్ళఁబొగడి,యుమామహేశ్వరులకుమగధరాజ్యముపైఁగల యభిమానమునువక్కాణించి తమకార్యము నిరభ్యంతరముగనెఱవేఱునని

ధైర్యముతో నుండెను. జరాసంధుఁ డాసంభాషణమంతయు నాల
కించి యించుక సేపువానితోఁ బలుకక యోజించి యెట్టకేలకు "కుమా
రా మనకుఁ గిట్టనివాఁడు దేశాంతరమున నున్నవాఁడు, యువతీమోహ
మునం జిక్కినవాఁడు, నెవ్వఁడై యుండవచ్చును? ఈయర్థము మనకుం
దోఁచకున్నది. కళానందుఁ డూరనున్నాఁడా? ఈనడుమజాడ లేదేమి?"
యని యడిగెను. రణార్ణవుఁడును వెంటనే "కొంతకాలమునుండి యూ
ర లేఁడుసుఁడీ" యనియుత్తరముచెప్పి తనలో నిట్లని వితర్కింపసాగెను.
"కళానందునిపై రాజున కే యనుమానము తగిలినది. సౌందర్యతిలకకా
కళానందహతకుఁడు మనోహరుఁడగుటచే నెట్టులైన నాతనిఁ గడ తేర్చిన
పక్షమున నాయిందువదన డెందము నాపై నిలుపును. కొందఱు మం
త్రికుమారులు నేనునుం గలసి యీదురాత్ముని నిదివఱకే పరిహాస్యముగఁ
దుదముట్టింపఁ గుట్రలు పన్నినారముగాని యాతఁడపుడూర లేమి నది
సాగదయ్యె. ఈలేఖ నితఁడే వ్రాసియుండు. వ్రాయకున్న నేమి? రా
జున కాతనిమీఁద నలుక వొడమించితి. వాఁడు మరల నగరముఁ బ్రవే
శించిన తోడనే వధియింపఁబడును. కాని తేనితోఁ గాలానుగుణముగ
ముచ్చటించి మనోభీష్టముం దీర్చుకొందును. ఏఉపాయముచేతనైన
శత్రునాశన ముచితముగదా!" అనియెద్దియో మాటలాడఁబోవునప్పటి
కి రాజంతలో రణార్ణవా! పలుకవేమియని హెచ్చరించెను. అది
సందుగా రణార్ణవుఁడు తన క్రోధమహానలయుచేఁ గళానందవంశోద్యా
నమును మసిఁజేయ నిశ్చయించి యిట్టులనియె "దేవా! ఈసరికిఁ గొ
న్ని మాసములనుండి కళానందుఁ డూరలేఁడు. ఆతనిజాడ లెవ్వరు నె
ఱుఁగరు. ఇది యాతనిపనియై యుండునని యోగినీవచనముం బట్టి తో
చుచున్నది. ఎట్టులైన నాతనిఁ బట్టి తెచ్చినగాని మనకు సేమముండ
దు, ఇదె నామనవి" యనుటయు మగధరా జామాటలువిని యెద్ది
యో స్ఫురణకువచ్చినవాఁడువోలె హా! తెలిసినది! ఆపాపాత్ముఁడు

వాసుదేవునితోఁ గుటిలబుద్ధిని కరిగియుండు రానిమ్ము. హా దురాత్మ! కళానంద! వాసుదేవబలరామసమేతముగ నిన్ను భూతబలి యిచ్చెదనుగాక! కుమారా! అయినను మనతలఁపు నిక్కవమౌకల్ల యో మూఁడునాళ్ళలో యోగిని మనకువిన్నవింపక పోదు. ఒకవేళ నతఁ డాలేఖను వ్రాసియుండకపోయినను మనము నమ్మఁదగినవాఁడు గాఁడు. కావున వాఁడు పురము విడిచియుంట శ్రేయస్కరము కాదు. సత్వరమ పట్టి తెప్పించుట యెల్లవిధముల నుత్తమము. కటకటా! మగధరాజ్యలక్ష్మికిం జేటు మూఁడియుండనోపు. హా! హంసపడిచికులార! దురాత్ముఁడగు వాసుదేవుని కౌటిల్యమున మీరొం డొరులగతి దెలియకుండ నిధనముఁబొంది నన్నే కాకినిఁ జేసితిరికదా! ఇట్టిసమయంబున రెండు తెక్కలులాగున మీరలుండిన సేనాయాదవులకు జంకు వాఁడనే? ఇప్పటికైన నాకేమిభయము. అయ్యో! ఆలస్యమేల! పుష్పకేతునియొద్దకుంబోయి మనవేగులవాండ్రకు మాఱువేసములువేసి ద్వారకకంపి యచట వాసుదేవుని యాలోచనలును గళానందునిజాడలును దెలిసికొనిరమ్మని పనుపుమనుము. అదియునుఁగాక సేనాధిపతులలో నిట్లని నావచనముగఁ దెలియఁజేయుము. వాసుదేవుఁడు తన వేగులవాండ్రనుగూడ బహువేషములతో మనప్రోలికంపును. వారిం గనుఁగొనుటలో మెలఁకువ యెంతయుఁ జూపవలయును. బిచ్చగాండ్రని జాలినొందక మునులని బెదరక స్త్రీలని గౌరవింపక రోగులని సందియమొందక మనపురమునఁ గ్రొత్తమొగము కనఁబడఁగనె మాఱుమెదుటికిఁ దోడ్కొనిరండు. అటుచేయనివారు ప్రాణమునకుం బాసిన వారని యెఱుఁగవలయునని చెప్పి యోగినికిమ్మని యామెకోరిన ప్రకారము తినవ్రేలియుంగరముదీసి రణార్ణవునకిచ్చియనుప నతఁడేగి యోగిని కాయంగుళీయకము నర్పించెను.



## ఇరువదిమూఁడవ ప్రకరణము.

కూఁతును రణార్ణవునకిమ్మని తనయేలికి మోమోటవిడిచి త
న్నడుగుటచేఁ జంద్రపాలుఁడు మిగులఁజింతాక్రాంతుఁడై యామాట
యేటికిందెలుపక దీనాననుండై "రాజుతో నేమని మనవి యొనర్చు
వాఁడ. దైవమా! గడువు సమీపించుచున్నది. రణార్ణవునిపేరు మా
గుణోత్తమ యేవగించు. ఈదుహితావివాహముకతమున నాకు మర
ణము సంభవించునని తోఁచెడును. అయినం గాదలంచినది కాకపో
దు. మాయమ్మాయితో నొక్కసారి యీనాఁడునవస్థజెప్పి యామెకి
ష్టమగునేని రణార్ణవుని కేలుపట్టుమని ప్రార్థించెద. ఇష్టములేకున్న
నాకులాంతమైనను సరియకాని బిడ్డసుఖమున కడ్డువెట్ట"నని కొండొ
క సేపు తలపోసి కూఁతురొద్దకుం బోవసమకట్టి రెండడుగులు నడచి
"సీ ! నాజన్మమేల ? ఎంతకఠినహృదయుఁడనో కద, కళానందునియందు
డెందము వత్సకు నాటియున్నదని యెఱిఁగియు సర్వవిధముల నయో
గ్యుఁడగు పురుషాధముని వరియింపుమనియడుగ నాకునోరెట్లులాడు?
మున్ను గళానందుని వేనోళ్లనుబొగడి నేఁ డేమొగముబెట్టుక" నిరణా
ర్ణవుని విషయమై ప్రసంగింతు. అక్కటా! బిడ్డయొద్దకుం బోవమా
నుదునా? కాదు కాదు. పోయిచెప్పెదను. అనినిశ్చయించి మెలమె
ల్లన మేడమెట్లెక్కుచుండెను.

కడచిన రెండుదినములనుండియుఁ దండ్రిమొగము దైన్యము
ను సూచించుటచే సౌందర్యతిలకయు నది తనవిషయమైన విచార
ముగ నుండనోపునని నిశ్చయించి తనమూలమున జననీజనకులకుఁ
గలిగెడు మనోవ్యాధికిం బొక్కుచు నందులకుఁ బ్రతిక్రియ నరయు
చు నెంతయువ్యాకులము దానుఁగూడఁ నొందసాగెను. నాఁటియుద

యమున రాగలతికయు సౌందర్యతిలకయు మేడపై నొకచోటఁగూరుచుండి కర్తవ్యము నాలోచించుకొనుచుండఁగా నింతలో సోపానములమీఁద నడుగులచప్పుడు వినంబడియెను. వచ్చువార లెవ్వరో చూతమని రాగలతిక యించుక తొంగిచూచునప్పటికి మెట్లుదాటి చంద్రపాలుఁడు కొంతగూరిమునచ్చెను. తోడనే యువతులును లేచి నమస్కారముఁ జేసి దినసలఁబడసి నిలువఁబడియుండ నాతఁడు తానొకపీఠముపైఁ గూరుచుండి బిడ్డలారా! కూరుచుండుఁడీ యని యాసతియిచ్చి చేయిపట్టుకొని కూఁతు నొకపీఠముపై సమీపమునఁ గూరుచుండఁబెట్టెను. సౌందర్యతిలక సిగ్గునఁ దలవంచి పెడమొగమై యుండెను. రాగలతికయుఁ గొంతతడ వూరకుండి చనవు పెంపున నిట్లనియె. "రెండుదినములనుండి మీరు తొంటియట్టులుంట లేదు! మీ స్థితిఁజూచి మాచెలియుఁ దదనుగుణముగనున్నది. మీమనోవేదన బిడ్డల కెఱుఁగఁజేయఁ దగినదైన మేము వినఁగోరుచున్నారము." అనవుడుఁ జంద్రపాలుఁడు చిఱునగవుఁ దెచ్చుకొని యమ్మా! నేనుండ నాయులమట తీరునదికాదు. మీరడిగిరికావున నామనోవేదనము నంతయుం జెప్పెద నాలకింపుఁడు. మగధరాజ్యమున వసించుట పాముల పుట్టలోఁ గాఁపురముసేయుట. మొన్న జరాసంధుఁడు నన్ను బిలువనంపి బిడ్డను రణార్ణవునకుఁ బెండ్లిసేయింపుమని నాతోడనొక్కి చెప్పెను ఇంతకన్న నాకు దుఃఖకారణమేది? అతనికీయవలసిన యుత్తర మీవఱకే యొసఁగుదునుగాని వత్సతో ముచ్చటించి యవ్వలఁగార్య నిశ్చయముఁ జేయదలఁచితిని. అమ్మా! నీమత మెఱింగింపుము. రాజుమతమునకు వ్యతిరిక్తముగ నరిగినంతనె నాకుఁగల్గు పాట్లు నీవెఱుఁగుదువు. కళానందుని విడిచిన నీవేమగుదువో నేనెఱుంగుదును. కావున నీవన్నియు నరసి నీయభిప్రాయము నాకెఱిఁగింపుము. కూఁతురైనను గొడుకైనను నాకు నీవకాన ప్రాణాంతమయినను సరియే. కు

లాంతమైనను సరియు. నేను నీమనోభీష్టము నెఱవేర్పఁదలఁచియున్న వాఁడ. నాయెదుట జంకక మోమోటవిడిచి హృదయముననున్నదున్న ట్లు పలుకుము. నాకు నీకన్నఁ గూర్చుపదార్థ మన్య మొకటిలేదు గదా యని తనయుమ్మలికమును వచ్చినపనియు వెల్లడించిన భయ సంభ్రమమునంజేసి సౌందర్యతిలక పేరు చెప్పుటనొదలితో నిరుడసా గెను. రాగలతిక చంద్రిపాలునిమాట లన్నిటినిఁ జక్కఁగఁ బూర్వో త్తర సందర్భములతో నాలకించినదగుటఁ దనచెలికత్తెయభ్రాంతమైన కతనఁ దండ్రికిఁ దగినయుత్తర మీయఁజాలదని తానె యాతని కభి ముఖయై యిట్లనియె. "అప్పా! మీరువచ్చునప్పటికి నేనును మాచెలి యు నీయంశమును గూర్చియే ముచ్చటించుకొనుచుంటిమి. ఆమెయున సంతయు నాకెఱుఁగఁజెప్పుటచే నాబాలికయభిప్రాయము మీకు వి న్నవింపఁగలను. ఇవి నాపలుకులుగ గ్రహింపక వత్సపలుకులుగ గ్రహింపఁ బ్రార్థించెదను. కళానందుని విడిచి రణార్ణవుని జేపట్టుట, యిం ద్రనీలముఁ బాఱవైచి మసిబొగ్గుఁ గైకొనుట. కళానందునిపైనను రాగ లత నాఁటికొని వేళ్లుపాఱి చాలకాలమైనది కావున దానిఁ ద్రెంచుటకు మరల నాప్రేమము రణార్ణవునిపై నిలుపుటకు వేయేండ్లు తలక్రిందు గాఁ దపముఁ జేసినను నాతరముగాదు. ఉత్తమకులజుఁడు మఖ్యాతు లోకమన్మథుఁడునునగు కళానందుఁ దలఁచి నీచకులజుఁడుఁ గురూపి యునగు రణార్ణవునిఁ దలఁపనైనరాదు. రెండ మాతనిపై పుకలలో నైన ముచ్చటకైన నోరమూఁటకూడ నరుగదు. గాంధారురాగ సక్త ములగు కామికజన హృదయములు రాజాజ్ఞలకు లోఁబడిచెప్పినట్లు వినునవికావని జరాసంధునితో నామాటలుగా విన్నవింపుము. వివా హములు దేహసంబంధములుకావు. హృదయసంబంధములు. కళా నందునకు రెండమింతకుమున్న యర్పింపఁబడుటచే నేనాతని కిల్లాలను. ఆరెండవ మన్యులకొసంగుట పతివ్రత లక్షణముగాదు. తండ్రి! ఈక

తమున నీకుఁగూడ నాదురాత్మునివలన నపాయము వాటిల్లునుగాన, మనసుగలియనివరుని కేలు పట్టుటకన్నఁ గన్యాత్వమునఁ గాలముబు చ్చుదాన నని మావన్న వివాహమునే యుజ్జగించి బ్రహ్మచర్యవ్రత మాచరణము నిర్వర్తింపఁ దలఁచెనని రాజుతో మనవియొనర్చుమని కొంకులేక యుపన్యసించుటయు రాగలతిక మొగముఁజూచి చంద్రి పాలుఁడు మిగుల నక్కజముకొంది బిడ్డపైఁగడు జాలిపడి యమ్మాట కు సంతసించి కూఁతురుద్దేశించి యెట్లకేల కిట్లులనియె. "అమ్మా! నాప్రతినవినుము. పదునెనిమిదేండ్లు నిన్ను గారాబముఁబెంచి తుద కు రాజునకలుకవొడముననుభయముచే నేను బ్రతికియుండి నాక న్నులయెదుట నీచేత బ్రహ్మచర్యవ్రతముఁ జేయించుచుఁ జూచి యూరకుండుటకు నాహృదయ మొప్పునే? రాజునకుఁ బగతుఁడనైన నాదునుగాక. ఏమివాటిలిన వాటిలుఁగాక! నేను నీయిచ్చవచ్చిన తె అంగున వివాహమునెఱపెదను. బిడ్డా నాదెస భయపడకుము. నీకుఁ గానియెడ నాతనువు కాల్పనే" యని యూఱడించి యచ్చోటువాసి క్రిందికిం జనియెను.

తండ్రియరిగినవెనుక సౌందర్యతిలక తనమొగమెత్తి రాగలతిక యిచ్చినయుత్తరముచేఁ దనకత్యానందమ్ముం గల్పించిన నామెను గౌఁగిలించుకొని యోసీ! నాహృదయ మచ్చుదున్నయట్లు, నామనసు వచ్చునట్లు, మాయయ్యమనసు నీరగునట్లు, నాగౌరవమునకుఁ దగు నట్టుత్తరముఁ జెప్పితివే! నీప్రజ్ఞ నేమనికొనియాడుదు! మన మెంత దృఢనిశ్చయులమైనను నేమి లావణ్యరాశిజాడ తెలియదుకదా! ఓసీ! అన్నట్టు, నాకుజ్ఞాపకమువచ్చినది. ఈనగరికివచ్చిన యోగిని యడిగి నప్రశ్నముల న్నిఁటినిఁ జక్కఁగాఁ జెప్పునఁట. కళానందుని యు న్న తావుఁగూర్చియు నాకాతనిపొందు లభించుటంగూర్చియు నామెన డిగివత్తువా? దానంజేసి హృదయము కొంతయూరటఁజెందునేమో!

అనిపలికెను. అమాటకేదిమో మాఱునలుకఁదలంచి చెలికత్తెయు ద్యమించుచుండ సింతలోఁ దలవాఁకిటనుండి రాగలతికా రాగలతికా యని పిలుపు వినంబడెను. రాగిలతిక మేడగిదివచ్చి గుమ్మముదగ్గఱ నొక ముసలిదానింజూచి నీవెవ్వ రేమికతముస వచ్చితివనియడిగెను. ఆమెయు నాయూరుపేరు నీకేల? నీకొడ వియ్యమందఁదలఁచినప్పుడు చెప్పెదనుగాని ముందిది యాలకింపుము. నాఁడొకసన్యాసి సౌందర్య తిలక కెయ్యదైన సందఁజేయుమని పూలవర్తకునిచేతి కిచ్చిన దివ్యకుసు మం బిదిగో. యోగిని మీకందిఁజేయుమని నన్నంపినది. ఇంకనన్ను నీప్రశ్నలతో బాధింపకుము. నేనరిగెదను. అని యొక గడ్డమూట నిచ్చి రాగలతిక యేదో యడుగఁదలంచి యెన్ని పిలిచినం బలుకక వడివడి నడచిపోయెను. ఆయద్భుతపరిసంగముచే రాగలతిక మాఱి న్పడి కొంతసేపు వెఱ్ఱిచూపుఁజూచి తుదకు మేడమీఁదికిం జని యా వృత్తాంతము దనచెలికిం దెలుప నామెయు నమ్మలేకనమ్మి రాగల తిక చేతినుండి మూటలాగికొని పట్టరానిసంభ్రమముతో దానినివిప్పి యంగలత గడగడవడఁకఁ జెమ్మటలుగ్రుఱియ నలిగియున్న మొగలి యాకు టుత్తరమును దనలోఁదాను చదువుకొనసాగెను. రాగలతిక యు నింతకన్న నెక్కుడగు నాత్రముతో దానిం జూడఁగోరెను. కాని చెలి యేమనునో యని సందియమొంది యూరకుండెను. గుణో త్తమ తత్తరమున నుత్తరమెల్లఁజదువుకొని కనుదమ్ములనుండి యా నందబాష్పములు ముత్యాలచేరునట్లు చెక్కుటద్దములనుండి దిగజాఱ "రాగలతికా! ధన్యురాలను. ధన్యురాలను. నన్నుఁబట్టుకొనవే! అమ్మో! రావే యనిపిలిచి యదిరాకమున్న సెజ్జపై వ్రాలి "హా!ఇది యామహాపురుషుని యొద్దనుండియే వచ్చినది. ఇదిమనమనుకొనినటుల సిద్ధకుసుమముకాదు. మొగలియాకు. ఇదిగో చూడుమని రాగలతిక పైఁబాఱవైచెను. రాగలతిక దానిఁజదువుకొనుచుండ గుణోత్తమ

నడుమ దాసింబిలచి "యోసీ! ఆయక్షురయులపాంకమేమే! అసందర్భ శుద్ధియేమే! వచసరిచనఁ జూడుము. హా! ప్రాణేశ్వరా!" ఈమంచి భాగ్యరాలికతమున నిలువిడిచి దేశాంతరములపాలై పోతివిగదా! యనుచు నిట్టూర్పు నిగుడ్పసాగెను. రాగలతికయు గమొము మందహాసచంద్రికలచే వికసింప "చెలీ! నీవుకావుగాని మేముధన్యులమైతిమి. పాపము! సంతసించుటకు నాగవల్లి లేదయ్యె. పాంమిది దొరకదను నిరాశచే నదిమెందేనియరిగినది. ప్రాణసఖీ! దీనింబట్టి కళానందుఁడు సుఖియై యున్నవాఁడని తోఁచెడుసు. నీవింక వగఁగూలవలసిన పని లేదుసుమీ!" అని హెచ్చరించి యాలేఖ క్రియ్యలు నామొకిచ్చెను. కమ్మమరలఁగైకొని యింకొకసారి చదివిచూచి రాగిలతిక తఁచేష్టలఁజూచి నవ్వుచున్నను సరకుఁగొనక మొగలియాకును ముద్దుపెట్టుకొని కన్నులనద్దుకొని చేతులుమోడ్చిమ్రొక్కి చెలింగనుంగొని యిట్లనియె. ప్రియసఖీ! ఇందలి సువర్ణములు సువర్ణములు కుప్పవోసినట్లున్నవి చూచితే. ఈలేఖ పలువురిచేతులం దిరిగివచ్చుటచేఁ గమలినదయ్యెఁ జటుతమబ్బులచాటుననుండు లేఁతచందురులాగున శోభలీనుచున్నదిసుమీ! అంతదూరమున నున్నను హృదయమునామీఁద నే నిలిపియున్న యారాజకుమారున కేమి ప్రత్యుపకారముఁగావింపనోపుదునే! ఈలేఖలో వాసుదేవుమాటఁ దలపెట్టుటచే నీతఁడు ద్వారకానగరిమం దున్నవాఁడని తోఁచెడును. అతనిందోడితెచ్చుట కేదినయిన సంపుమని మాయప్పతోఁజెప్పవే" అని కేతకీదళము నుద్దేశించి "మోదళమా! ఎన్నినాళ్ళు నినిమిత్తము నిదహారములు లేక పలవరించితిని! ఎన్నిప్రియత్నములు చేయించితిని! నీ వచేతనపదార్థమనయ్యు నెంతకాలము నాకగపడకుండఁ డడవుచేసి నన్నలమట నొందించితివే! ఎంతజాగొనర్చినఁ బ్రాణేశ్వరుని కుశలవార్తఁ దెలిపితివి. కావున నీవు వంసనీయురాలవే యగుదువు. ఇదె నాయంజలింగై

కొనుము. అసుకుమారుని హస్తపద్మమునందుండుటకు నీవెంతపున్నె ముఁజేసితివో కదా! యని పరిపరివిధములఁ గాముకజనసామాన్యమగు చిత్రసంభాషణము సలుపుచుండెను. ఇంతలో భోజనమునకు రమ్మని పరిచారిక లరుదెంచుటయుఁ దద్భ్రసంగమువాని యాలేఖను భద్రముగా దాఁచుమని రాగలతికకు నొక్కిచెప్పి యిచ్చి లోనికి వికసించిన ముఖారవిందముతోఁ బులకన్నైన హృదయముతో నానందముం దెలుపుచూపులతోఁ గొంతకాలమునుండి యెన్నఁడులేని యొయ్యారముతోఁ బ్రాఁకసంబున కిరుగుచుండ సేవకులెల్ల నామె తొంటివగపువిడుచుటకు నెద్దియేని కారణముండినదయునని యూహించిరి. భోజనము చేయుచు యోగిని తనకుఁజేసిన మహోపకారమును దనపైనామెకుఁ గలనిర్హేతుక జాయమానకృపయుం దలంచి మనమున నామెకనేక వందనములఁ జేయసాగెను. భోజనానంతరమున రాగలతికయొద్దకు వచ్చి మఱునాఁడుదయమున యోగినికిఁ దనవందనము సమర్పింపుమని యానతిచ్చి యాదినమున వీణాగానముతోడను జిత్తరువు వ్రాయుటతోడను నాట్యముతోడను గడువిలాసముగాఁ బుచ్చెను.

మఱునాఁడుదయమున రాగలతిక యోగినిం దర్శించుటకుఁ బోవసమకట్టి తలవాకిటికి వచ్చునప్పటికిఁ బురజనులుకొందఱు బాటం బోవుచు "యోగినినిన్నరేయి శ్రీపార్వతీదేవి నారాధింపఁ గైలాసమున కరిగినదఁట. ఆహాహా! ఆమెమహిమము నెన్న నెవరితరమగు" నని తమలోఁ జెప్పుకొనుచుండఁగని చెలి కావార్తఁ దెలిపి పయనము మానుకొనెను. రత్నార్ణవుఁడుఁగూడ నావృత్తాంతము విని తనతో నామె మున్ను వాకొచ్చినట్టు చేసియుండునని యోగినిరాక నిరీక్షించుచు దినములు గడుపసాగెను.

మొదటిభాగము-సమాప్తము.






## ద్వితీయ భాగము.



### మొదటి ప్రకరణము.



పాండవులపాలికిఁ దనసందేశముఁ గైకొనిచనిన కళానందుం డెన్ని నాళ్ళకును ద్వారకా నగరమునకు మరలిరామి వాసుదేవుఁడు తద్దయుఁ జింతించి యాతని నమ్మకమును గూర్చి యించుక సంశయ మంది మరల నట్టివాఁడుగాఁడని నిశ్చయించి యుధిష్ఠిరుఁడు వాని నంపక జాగొనరించెనో మార్గమధ్యమున నాతఁడు దైవవశమున శిశుపాలాదులగు జరాసంధ పక్షపాతులచేతం జిక్కెనో యని తన వేగుల వాండ్ర నలుగురం గులకంపి యరయుచుండెను. ఎంతయారసిన నాతని జాడ రవంతయేనిఁ జిక్కకునికి విసిగి యసురాంతకుఁ డొక్కనాఁడు తన కనుకూలవర్తనుఁడగు నక్రూరునిఁ జేరఁబిల్చి కూరుచుండ నియమించి యిట్లనియె. " అక్రూరా! ఎఱుఁగుదువుగదా నాఁడిక్కడకు వచ్చిన కళానందుని ! కార్యాంతరము మీఁద నాతనిఁ బాండు నందనులపాలి కనిపినాఁడను. ఎన్నినాళ్ళకు నా రాజ కుమారుఁడు రాఁడయ్యె. నీవొక్కసారి యింద్రప్రస్థమునకుం జని జాగునకుఁ గారణము దెలిసికొని పాకముదప్పినఁ గార్యము సెడునని యుధిష్ఠిరునితో దృఢముగాఁ బలికి కళానందుని వెంటఁబెట్టుకొనిరమ్ము. జరాసంధ సంహారముగాక రాజసూయము నెఱవేఱుట యసాధ్యమని యా రాజు

తో నా పలుకులుగా విన్నవించి కార్యసాధనము గావించుకొని సత్వ రము రావలయుఁజుమీ. అనవుడు నక్రూరుఁడు వల్లెయని యెద్దియో పలుకఁజూచునప్పటికిఁ బ్రతీహారివచ్చి జోహారొనర్చి దేవా! నలుగురు శిష్యులతో నెన్నఁడును మనము కని విని యెఱుఁగని యొకముదుసలి జడదారి కరభుండనువాఁడు దేవరతోఁ గొన్నియంశములు ముచ్చ టింపఁ గోరుచున్నాఁడు. ముదలయయ్యెనేని తోడుకొనివత్తునని మనవి సలుపుటయు నందనందనుఁడు శీఘ్రముగ వారిందోడితెమ్మని యాన తిచ్చి యుచితాసనములు వేయఁబనిచి మునిరాక కెదురుచూచుచు నిలువంబడియెను. మూర్తిఁగైకొన్న నాలుగువేదములవడువునఁ గం ఠములెత్తి స్వస్తిపనసలు చదువుచు నలువురు శిష్యులు వెంటరా వేద పురుషునట్లు కరభుఁడు బహుద్వారములుదాఁటి మాధవుకడ కరు దెంచుచుండ నల్లంతదూరమునఁ గాంచి యాదవుఁడు మునిబ్రహ్మ తేజమునకును శాంతమునకు నచ్చెరువడి భక్తియినుమడింపఁ గేలు మొగిచి యెదురువచ్చి చరణారవిందముల కెఱఁగి పీఠముపైఁగూర్చుండ బెట్టి యర్ఘ్యపాద్యముల సమర్పించి సుఖోపవిష్టుఁడైన యాతనితో నిట్లనియె. దేవా! మీరు ద్వారకానగరమును మా గృహమును బావ నము సేయఁదలఁచి యరుదెంచిన మహేశ్వరులని తోఁచుచున్నది. సాటిలేని మహిమగలవారనియుఁ గోపమెఱుఁగని సుశీలురనియు బాల్యమునుండి వీనులవిందుఁగావిందుగాని కన్నారఁగన్న భాగ్యము లేదు. నేఁటికిఁగదా మాకన్నులకఱవుదీరినది. ఇప్పుడుగదా మానోఁచిన నోములు పండినవి, మా చేత నేకార్యముచేయించి తక్కిన రాజలోక ములో నన్నెక్కుడుగా గౌరవింపఁదలఁచివచ్చిరో యానతీ యాన తిచ్చి నన్ను ధన్యునిఁజేయ వేఁడెద.

అనవుడు కరభుండు వాసుదేవుని నెమ్మొగముఁజూచి మెల్ల మెల్ల నిట్లనియె. దేవా! జగమునఁగల వంశములలోనెల్ల రాచకొ

లము పాపభూయిష్ఠమైనది. పరిజాపరిపాలన మొనర్తుమని వంకబెట్టు
కొని పడతులఁ జెఱఁబట్టుటయు జనులం బీడించుటయు మునుల ధిక్క
రించుటయుఁగానివేఱొకటికానరాదు. క్షత్రియాన్వయములపై నాకింత
కినుక వొడముటకుఁగల కారణమేమనినఁ జెప్పెద నాలకింపుము. జ్వా
లాజిహ్వుఁడను మిక్కిలిదక్కనుని చేతఁ జిక్కి సరిక్కుచు నిందు
మతియను నొకరాచపట్టి యదృష్టవశమున నందుండి తప్పించుకొని
వచ్చి నాయాశ్రమముం బ్రవేశించి నాశరణముఁజేరి సుఖంబున నుం
డె. అంతఁ గొన్నినాళ్ళకు వేఁటతమకంబున శిశుపాలుఁడు మదీయా
శ్రమము నేనింటలేనితఱిఁ బ్రవేశించి యిచ్చవచ్చినట్లు పరివారసమే
తుఁడై మొఁగి కట్టడితనమున నెట్టకేలకు నిందుమతింబట్టి బలిమిచేఁ
దనపురమునకుం గొనిపోయెను. కటకటా! తన శభయప్రదానముగ
నుందునని నాచెలవుచేరినయాయిందుమతిని నేనుసంరక్షింపలేనయితిని.
ఆయింతి యెంతపొగులుచున్నదో! నారాయణా! నాటఁగోలె నామె
నిమిత్తమునాచిత్తమెందును త్తలపాటు చెప్పఁదరముకాదు. నాకలుక
సంపూర్ణముగఁబొడమిన బ్రహ్మాండములను గడగడవడంకఁ జేసి శిశు
పాలుని నిర్మూలింపలేనె? ఆదురాత్ముని సాహసముఁ జిత్తగింపుము.
నాయాశ్రమమున నున్నదనియైన నాపడఁతిని విడువక యెత్తుకొని
పోయెను. తెలియనివానిపై నలుకఁజూపరాదని నేను ధర్మమార్గోచి
తముగ నాతనికి నాశిష్యులవలన సందేశమంపి కన్యను నాయొద్దకుఁ
బుత్తెంచుమని వేఁడుకొంటిని. దానికిఁ బ్రత్యుత్తరముగ నాపాపా
త్ముఁడంపినసందేశము నాలకింపుము. "యువయువతీజనముల పరస్ప
రానురాగములును, జిగురుబోండ్ల వాలుచూపులవాడిమియు, మోదు
చెట్లవలె నామరణబ్రహ్మచారులగు నిరాహారు లెట్లెఱుఁగుదురు.
మీకుఁదెలియని యంశములలో సంబంధము గలుగఁజేసికొని యు
న్నగౌరవ మేలచెడఁగొట్టుకొందురు? అదియటుండ నాపడఁతుక యు

వివాహితకాపునని కరిసాత్తుకాదు. దీనినపహరించిన దోషంబులేదు. ప్రజల యర్థము, ప్రాణము, శరీరము, సర్వమును రాజుదేయని ధర్మశాస్త్ర ముద్ఘోషించుచున్నది. ఈముదిత నాదేశమున నుంకుటచే నాయిచ్ఛవచ్చినట్లు చేయుట ధర్మేతరముకాదు. పరిపక్వమైన ఫలంబు చెట్టుపైనఁగానఁబడిన రాచిలుక దానిస్థానమునకు పంటనొక్కి రసమూని యనుభవింపక విడుచునె! కన్యాత్వము గాయునిదియనుబాల కనఁబడుట రాజ్యముచేసిన నేమియనుచితము? 'ఈధర్మములు మీకుఁ దెలియవుగాన కొన్నినాళ్ళు శుశ్రూషజేసి నేరిచికొనుండు" అని మాధవా! సందేశమిది అని కోపావేశమున నించుక యూరకుండెను.

వాసుదేవుఁడును జరిగినచిత్రకథకును శిశుపాలుని సాహసమునకు నచ్చెరువడి యదియు నించుకమంచిదేయని మనమున హర్షించి చైద్యునకంత్యకాల మాసన్నమగుట నిశ్చయించెను. ఇంతలో సంధ్యాకాలము సమీపించుటఁజేసి మౌనియు శిష్యులును నారాయణుఁడును నియమితార్ఘ్యప్రదానము నొనరఁగఁజనిరి. అనుష్ఠానములు ముగిసినవెనుక యతి సతిప్రీతిమై లోనికింగొంపోయి వాసుదేవుఁడు కందమూలములు ఫలములు నావుపాలుపిండివంటలతో విందారగింపఁజేసి సంతుష్టహృదయునింజేసి కృతార్థుఁడనైతినని పలుమఱుగ్గడించెను. తరువాత వెనుకటి కథాసందర్భమందుకొనుటకు మౌనియత్నించుచుండ నింతలోఁ బ్రతీహారియరుదెంచి చేతులుజోడించి, దేవా! దివ్యపురుషునియట్టుల నున్నాఁడు. ఊరుపేరుచెప్పుమన్నఁ జెప్పఁడఁట. ఒక నిమేషమయిన జాగుసేయక మీతో మాటలాడవలయునఁట. సెలవేమియని యెదుట నిలువంబడియెను. అంతటిత్వరితమున వచ్చినవాఁడు రాజకార్యముమీఁదఁగాని రాడన లోనికి వేగముగరమ్మని యానతిచ్చెను. ప్రతీహారియు నావలకుఁజన యాపురుషుని మాధవుపాలికంపెను.

మునియును, శిష్యులు ముకుందుఁడును దివ్యసుందర విగ్రహమువాని, నతిచాకచక్యముగలవాని, మీసకట్టుబొత్తుగా రానివానినిరువదియేండ్ల వయసుఁగలవాని నారాచకొడుకుంగాంచి యీతఁడెందుండివచ్చెనో యని చింతించుచుండిరి. అతఁడు సమీపించుటయు వాసుదేవుఁడు చేసన్నచే నొకపీఠమునఁ గూరుచుండుమని చెప్పెను. ఆవచ్చినపురుషుఁడు వాసుదేవునిసన్నిధింగని యాతనికిం జోహారొనర్చి యెదుటనిలచి యిట్లనియెను. నాకుఁగల కార్యపువేగిరము నన్నుఁగూర్చుండనీయదు. నందనందనా నీమాట కడ్డుపలికితినని కోపింపక యొక్కసారి యొకగదిలోనికి వచ్చితివేని నాకులగోత్రములు నాపేరు నాయున్నయునికియు నావచ్చినపని నీకు విన్నవించెదను. అనవుడు నందకుమారుఁడు మునిపురందరుననుజ్ఞవడసి యప్పురుషుని లోనికిఁదీసికొనిపోయి. రెండుగడియలసేపు ముచ్చటించిరి. వారిసంభాషణ మెట్టిదో యెవ్వరు నెఱిఁగినవారులేరు. మునికిఁగాని శిష్యులకుఁగాని వచ్చినపురుషుని పేరైనఁ దెలియరాకుండ పురుషోత్తముఁ డాతనికి నత్యుపచారములన్నియుఁ బ్రశంసించి యెట్టకేలకు వానితో నింటనుండి బైటకువచ్చి వాని నా మునిసన్నిధానమునఁ గొండొకసేపుండుమని కూరుచుండఁబెట్టి యే కారణముననో ముని యచ్చటికి వచ్చినపని యంతయు నాతనికిం దెలియఁజేసెను. తనపని కొత్తవానికి నందనందనుండు తెలియఁజలుకుటచే నాతఁడెవ్వఁడో యెఱుఁగఁగోరి కరభుఁడు శాంతవచనములతో నిట్లనియెను. మాధవా! ఈపురుషుండెవ్వఁడు? ఈతఁడు మనకార్యమునకుఁ దోడగునే యనిన వాసుదేవుఁడు పురుషునివంకఁజూచెను. చూచుటయు నాపురుషుండు చిరునగవు మొగమున నంకురింప మునీంద్రా! నేను గిరివ్రజపురమునుండివచ్చితి. నాపేరు జాతవేదుఁడు. నేనొకరికి మిత్త్రుఁడగా నొకరికి శత్త్రుఁడనుగాను. మీసంకల్పము జనార్దనుండు నాకెఱుఁగఁజేసినాఁడు. నాయోర్పుఁగలసాయమున్న నే నొనర్చెద.

కాని నాకొక్కమాటఁ దెలుపవలయు. నాపోవుకార్యమున నాకుజయ మసిద్ధించునట్లు మీరాశీర్వచన మొనరించితిమనుటయే యనిపలికెను. కరభుఁడు వానిమాటలకలరి "యీప్సితార్థసిద్ధిరస్తు"ని దీవించి యట నుండి పోవసమకట్టి వాసుదేవునితో నిట్లనియె. "నేనింక నాయాశ్రి మముంగూర్చి పోవలయును. నీవు నిష్పక్షపాతమతివి. చుట్టముకడనేర మున్న నూరకుండవు. సామోపాయయుక్తినో దండోపాయ శక్తినో మాయచేతనో శిశుపాలుని శిక్షించి యిందుమతిని నాకర్పింపవలయు ను. అనంతరము నీయిచ్చవచ్చినవానికా మచ్చెకంటినిచ్చి పెండ్లిసే యుము. సంసారసంబంధములు తెగింపుకొన్న మాకును దైవవశమున ననురాగగుణములు సంభవించినవి. చేదనగరవృత్తాంతములు నీవేమై న నెఱుఁగఁగోరితివేని యిదె నాశిష్యుఁడు చారాయణుఁ డిక్కడ నుండి వచ్చినవాఁడు. వానినడుగవచ్చునని పలుకుటయు వాసుదేవుఁ డు చారాయణుంజూచి యిప్పుడుశిశుపాలుండెందులకై సఁ బయనమై యున్నవాఁడా? ఆతనినగరమున నూతనపురుషుఁడెవ్వఁడైన బంధీ కృతుఁడై యున్నవాఁడా? ఇప్పటికిందుమతి నింకను బెండ్లి చేసికొన లేదా! యని యడిగెను. ఆచారాయణుఁడును నారాయణునంకవడం కుచుఁజూచి "దేవా నేను చేదిపురినుండి బయలుదేఱునప్పటికి శిశు పాలుఁడు మగధరాజసందర్శనార్థమై యరుగఁదలఁచి ప్రయాణమునకు యత్నముసేయించుచున్నాఁడు. ఇఁక నాలుగైదుదినములలోఁ బోవ చ్చును. మఱియుఁ గ్రొత్తపురుషుఁడొకఁడు వానిపేరెవ్వరో నే నె ఱుఁగనుగాని యతిసుందరుఁడు మార్గవశమున నొంటరిగఁబడియుండఁ జారులచేఁబట్టువడి చెఱలోనున్నవాఁడు. ఏకారణముచేతనో యింత వఱకు నిందుమతిని రాజు పాణిగ్రహణము చేసికొనలేదు. నేనింతక న్న నేమియు నెఱుఁగనుజుఁడీ" యని విన్నవించెను.

అనంతరము కరభముని తన్నడిగినమాటలకుఁ దానొసర్పవల

సిన సాయమునకుఁ దగునట్లు గోవిందుఁడు వానికి వీనులవిందుగా ని ట్లనియె. మునివర్యా ! శిశుపాలుండు జన్మప్రభృతిఁ గడుదుర్వర్తనుం డై యున్నవాఁడు. కాలాగ్ని తుల్యుఁడగు జరాసంధున కీతఁడు దండ నాథుఁడై యాతని యండనుండి నన్ను సరకుగొనక నాతోడిచుట్టరిక ము మానుకొనియున్నవాఁడు. ఆదురాత్ములిరువురు జగత్కంటకులై యున్నవారు. అందు శిశుపాలుని ముందుగా శిక్షింపవలనుపడదు. జరాసంధుని గడతేర్చిన యనంతరమునఁ గోఱలూడిన పామును మో దినట్లు చులకనఁగా శిశుపాలు నేలపాలు జేతు. వాఁడు నాచేతఁగాని చావఁడని మున్ను వాఁడుపుట్టినయప్పు డశరీరవాణి పలికినది. నాబుద్ధి బలమునకుఁ బాండవేయుల బాహుబలమునకు మీయాశీర్వచనబలం బుతోడుపడునేని యీజగత్కంటకులపీడ తొలంగి యనతికాలమున వసుమతి సుఖింపఁగలదు. తమరాశ్రమమునకుఁ బోవఁ ద్వరపడుచు న్నారు. కావున నేను తమసెలవున కాటంకముఁ జెప్పువాఁడనుగాను. అన్నిఁటికన్నమున్న మీయిందుమతి మీయాశ్రమమున కనతికాల మున వచ్చును. దీనికి సందియములేదు. మీరిలింక నరుగవచ్చును. అని దండప్రణామము చేసి దీవెనలవడసి పయనమైనమునిని గొంత దవ్వు సాగనంపి మరలవచ్చి జాతవేదునితోఁ గొన్నిరహస్యములను ముచ్చటింపఁదొడఁగెను.

జాతవేదుఁడును శ్రీకృష్ణుఁడుఁ గొండొకసేపు మాగధునిచర్యఁ జెప్పుకొని సంతసించి శిశుపాలుని జరాసంధునితోఁగలియకుండఁజేయ వలయునని తలపోసి యుపాయము వెదకుచుండిరి. అంతలో వాసుదే వుని మనమున కేదియో తోఁచుటంజేసి యాతఁడు జాతవేదుని చెవి లో నొకరహస్యముపదేశించి తనవేగులవాఁడయిన కుశీలవుని వానికి సాయముగ నుండుమనిచెప్పి పొద్దగుటచే నిద్రింప నరుగఁదలఁచు చుండ నంతలోఁ బ్రతీహారి మరల కైవారము సలిపి "దేవా ! పాండ

వులపాలినుండి సూతకుమారుఁడు ప్రాతిగామివచ్చి దేవరచరణారవిం దములఁ దర్శింపనున్నాఁ"డని విన్నవించె. వాసుదేవుఁ డామాటలు విని చిఱునగవునగి "యేమి! యీదినమున రాజకార్యములనేకములు వితర్కింపవలసివచ్చె. ఇది కటుసుదినముగద!" యని వాని సత్వరము రానిమ్మని ప్రతీహారికానతిచ్చె. అంతటఁ గొన్నినిమిషములలో సూతులకుచితమగు వేషముతోఁ దనపొడుగు విగ్రహమునీడయే దనరాకఁదెలియఁజేయఁ బ్రాతిగామిమందిరముఁజొచ్చి దేవకీతనయుని చరణసరసీరుహములకుం బ్రణమిల్లి చేతులు మొగిడ్చి నిలిచెను. చిరునగవుతో నాతనిదీవించి వాసుదేవుఁడు పాండవుల యంతఃకుశలము వేఱువేఱుగనడిగి యాతనిఁ గూరుచుండఁబనిచి సందేశమెఱిఁగింపుమన వాఁడిట్లని విన్నవింపఁదొడఁగెను. "స్వామీ! నాఁడర్జునుఁడు దేవరసాన్నిధ్యమునుండి యింద్రప్రస్థమున కరుదెంచి తమరు పంపుదుమని సెలవిచ్చిన వర్తమానమున కెదురుచూచుచుండెను. ఏనాఁటికిని మీయొద్దనుండి యేమాటయుం దెలియకునికి యుధిష్ఠిరార్జునులు మనమున నెంతయుఁ జింతిలుచున్నవారు. నారాయణా! యర్జునునకును నీకును మేనులు రెండుగాని యాత్మయొక్కటి యగుటచే నీయొద్దనుండి రాఁదగిన వర్తమానము రానందుల కాతఁడొందు పరితాపమింతయని చెప్పరాదు. రాజసూయమహాధ్వరముం గూర్చి యుధిష్ఠిరుఁడు మీనిశ్చితాభిప్రాయ మెఱిఁగిరమ్మని నన్నుబుత్తెంచె" అనవుడు యాదవకుంజరుఁడు ముక్కున వ్రేలుపెట్టుకొని యక్కజపడి "కళానందుఁడక్కడికిఁ జేరనేలేదా! హా! ఏమివిధికృతము! అట్లయినఁ జారాయణుఁడు చేదిపురమునఁ జూచినవాఁడాతఁడై యుండునా!" యని వగచి ప్రాతిగామిఁగనుంగొని యధ్వరముంగూర్చియుఁ దక్కిన రాజకార్యములఁగూర్చియు నేనే కొన్నాళ్ళలో వచ్చి ముచ్చటింతునని యుధిష్ఠిరార్జునులతో నుడువవలయు. నీవుదయమున నింద్రప్రస్థపురము

నకు మరల నరుగవచ్చునని సెలవిచ్చి జాతవేదునకుఁ గొన్నిసంగతు లుపదేశించి యారాత్రి యిరువురును నిద్రించిరి. మఱునాఁడు జాతవేదుఁడు లేచి తనదారిఁ బయనమై యెందులకో యరిగెను.

---

## రెండవ ప్రకరణము.

కరభాశ్రమమునుండి యిందుమతి శిశుపాలునివలన బలిమిచే నిజపురమునకుం గొనిపోఁబడినదిమొదలు బెంగఁగొని యాయంగన యున్మాదినియుంబోలె వ్యవహరింపఁ జొచ్చెను. నాలుగైదు దినములాగతి మతిచెడియుండి యనంతర మలవాటుపడి తనపై నాపడఁతి వలపు తప్పక నిలుపునను నమ్మకముతోఁ జేదినాథుఁడు దానియాక్రందన ధ్వనులను రోదనమును సరకుఁగొనఁడయ్యెను. కాని యెన్నినాళ్ళకు నాయింతి యొక్కమచ్చుపనే చచ్చినదియుంబోలె నెవరుపలుకరించినం బలుకక, యేమియిచ్చిన మెచ్చక విరియఁబోసికొనిన కచభారముతో, డస్సినమేనితో శిశుపాలుని కులనిర్మూలముఁ గావించు మహారాక్షసియో యనఁ భయంకరాకారయై యుండె. పురజనులందఱుఁ జేదిరాజువంశమునకుఁ గీడుమూడుకాలము సమీపించుటచేతనే శిశుపాలున కట్టివిపరీతబుద్ధులుత్పన్నములైనవని చెప్పుకొని భయపడసాగిరి. పౌరులమాటలొక లెక్కలోనికింగొనక తనకు హితము నాలోచించి చెప్పునాప్తమంత్రుల యుపదేశము చెవినిడక శిశుపాలుఁడా యిందుమతిపై డెందమునిలిపి యామెకిష్టమున్నను లేకున్నను నెట్లులయినఁ బెండ్లియాడ నిశ్చయించుకొని తనభోగకామినులఁ గొందఱి నామెకడ నియోగించి తనపైననురాగ ముదయించునట్లు చేయుమనెను. తనశక్తికొలందిని వారునుమాటిమాటికి నిందుమతికి ధైర్యము

దెలిపి శిశుపాలుగుణములు స్తవముజేయుచుఁ బ్రియత్నము సేయుఁ దొడఁగిరి.

కళానందుఁడు చేదినగరమున శిశుపాలునిచేత నొకవిధముగాఁ జెఱనుంచఁబడియుఁ దనమాటల చమత్కృతిచేతను, పాండిత్యప్రకర్ష చేతను రాజుమనమున కానందము గలిగించుచు, బాధింపఁబడిన వానియట్లుకాక స్వేచ్ఛగా నున్నవానిచందమున మెలఁగుచుఁ దనకులగోత్రములునామధేయముమాత్రముజెప్పక యప్పటికప్పు డెద్దియోవంక జెప్పుచు సౌందర్యతిలకపై హృదయము నిలిపి వాసుదేవపాదరాజీవములపై మనస్సునుంచి యాతనికృపచే నీవిచారసముద్రము దాఁటవచ్చునను నాసతో మేను నిలిపి కాలముఁబుచ్చుచుండెను. కళానందుని చక్కఁదనమునకును, దెలివికిని శిల్పములయందుఁగల విజ్ఞానమునకును శిశుపాలుండు మెచ్చి యచ్చెఱువడి యతనిం దనదేశముననుంచుకొని యెద్దియో యున్నతమగు నుద్యోగము నొసఁగవలయునని పలుమాఱు తలఁచుచుండెను. ఇందుమతిని మహారాజు చేదిపురమునకుఁ దోడుకొనివచ్చుటయు, నామెనిరంతరసంతాపమున క్రుస్సుటయు, నామె ననునయింప భోగకామినుల దాసీజనుల నాతఁడు నియోగించుటయుఁ, గరభశిష్యుఁడగు చారాయణుఁడు సందేశముఁ దెచ్చుటయు, మునివాక్యముల రాజు నిరాకరించుటయు విని కళానందుఁడు దిక్కులేని యానెలంతుకపూర్వవృత్తాంత మెఱుంగఁగోరి సమయమున కెదురుచూచుచుండెను. అట్లుండ నొకనాఁడు శిశుపాలుండు వేఁటతమకమున నెందేనియరుగుటయుఁ గళానందుఁడిందుమతీసమీపమున నెల్లప్పుడుండు నొక్కదాసిం బిలిచి చమత్కారవచనముల దాని నవ్వించి దానిచిత్తవృత్తి యెఱిఁగి మెలఁకువతో బుజ్జగించి తనమాట లెవ్వరితోఁ జెప్పకుండునట్లు దానిచే నొట్టుబెట్టించుకొని యిట్లని యెను. "ఓసీ! ఇందుమతిజన్మాదికవృత్తాంత మడిగి తెలిసి నాకెఱిఁ

గింపవలయును. నాకీపనిఁ జేసితివేని నీఋణముఁదీర్చుకొందును. ఇక్కడివారందఱిలో నీవు గడుయోగ్యురాలవుగఁ గనఁబడుచున్నావు. ఎవ్వరు లేనిసమయమున నామెనడిగి యట్టిసమయముననే నాకుఁ దెలుపఁ గదఁజుమీ!" యని పలికెను. అదియు నాపలుకుల కలరి యిట్లనియె. "దేవా! యీమాత్రపుఁబని నేనొనర్పలేనే! యింతియగాదీ యిందుమతిచెఱ విడిపించు ప్రయత్నమేదయిన మీ రొనరింతురేని నా చేతనైన సాయము నేను జరపుదును. ఇది మా యంతిపురికి వచ్చిననాఁటఁగోలె నామనస్సు విచారాగ్నిచే సంతప్తమగుచున్నది. నాకీశిశుపాలుని కొలువునఁనుండ నిచ్చలేదు. నిరంతరము మద్యపానాసక్తుఁడై సుందరియగు పరాంగనఁ దన కంటఁబడువేగమే దానిం దనకుఁ గూర్చుమని మమ్ము శ్రమపెట్టుచుండును. వీనిపెట్టు నిక్కట్టులు పడఁజాలక యేదేశాంతరమైనఁ బోవఁజూచుచున్నాను. తమ రీ చెఱనుండి విముక్తులగుటతోడనే నన్ను మీయొద్దనుంచుకొనవలయునని వేఁడుకొనుచున్నాను. అదిగో నావల నెవ్వరో వచ్చుచున్నారు. మీ చెప్పినపనియం దప్రమత్తముతో వర్తిల్లెద." అని సాగిపోయెను. తాను శత్రుమండలమధ్యమున నుండుటచేఁ దనహృదయ మొకింత వెలికిఁబొక్కినఁ దనకుం దానురక్షింపఁ దలఁచినవారికింగూడ చేటు వాటిల్లునని మెలకువతో వర్తింపఁ బ్రయత్నించి కళానందుఁడు కృషి చేయసాగెను. తరువాత మూఁడునాళ్లు గడచుటయు నాఁటి సాయంకాలమున దాసిమెల్లమెల్లనవచ్చి కనుచీఁకటి నొకమల్లెపందిరి యొద్ద నెద్దియో చింతించుచుఁ గూరుచున్న కళానందునిఁగాంచి చెవిలో నిట్లనియె. "అయ్యా! యీదినమున నంతఃపురకాంతలు మద్యపానముజేసి విలాసముతో నాట్యమాడుదురు. నా కాయుత్సవమున కరుగనిచ్చలేదు. నీవు రెండుజాముల రాత్రి యగునప్పటికి కిందుమతి యున్న గదిలోనికివత్తువేని యామెచారిత్రము నీవువినునట్లు పలికిం

చెడ. నీగుణములు నీచక్కఁదనము నీకామెపైఁ గలిగిన నిర్హేతుకకృపయు నేనామెకు విన్నవింప నంతయు నామె సంతసించి నిన్నుఁజూడఁ గోరెను. వత్తువే" యనవుడు నాతఁడు వల్లెయని చెప్పినకాలమునకు సిద్ధముగనుండెను. దాసివచ్చి యాసమయమున కాతని నాగదిలోనికిఁ దీసికొనిపోయి యామెయెదుట నొకపీఠముపైఁ గూర్చుండఁబెట్టెను. వెంటనే యిందుమతి సిగ్గుచే లేచి తలుపుచాటునకుంజని మున్ను తన్నలమియున్న నెవ్వగయంతయు నెందో యరుగ దాసింబిలిచి యేమియో గుసగుసలాడెను. కళానందుఁడు దాసికిం గనుసన్న యొసఁగుటయు నది యిందుమతికి సంజ్ఞచేయ నామె తన చారిత్రమునంతయు మున్ను శ్రావణునకుఁ జెప్పినచందమున విన్నవించి శ్రావణుఁడు తన్ను రాక్షసమధ్యమునుండి బ్రతికించి తననిమిత్తము మేనుదొఱఁగెనని చెప్పెను. తోడనే కళానందుఁడు వేఁడికన్నీరు కొలఁకుల వెడలి చెక్కులదిగజాఱ "హా! శ్రావణా! కడతేఱితే" యని మూర్ఛిల్లెను. ఇందుమతియు దాసియు నిదియేమని యక్కజపడి శైత్యోపచారముల నాతనికిందెలివిఁగలుగఁజేసిరి. "హా శ్రావణా! సేవకుఁడనను పేరే కాని తండ్రిలాగున ననుబెంచితివి. పెద్దకాలములో సుఖముగా నింటఁ గాలముబుచ్చవలసిన నిన్ను నిర్దయాత్ముఁడనై కాఱడవులనడుమను మహాశైలములమీఁదను ద్రిప్పి నీకు మరణముఁ గలిగించితిని. హా కళానందుఁడా! మోహసముద్రమునఁదగిలి నమ్మిన సేవకుని ప్రాణములు పుచ్చుకొంటివే! అయ్యో! శ్రావణా! మరణసమయమున నేమనుకొంటివో! ఎంతనీప్రాణముకొచ్చెనో! కఠినాత్ముఁడైన కళానందుఁడు నను విడిచినాఁడని తలంచితలంచి పొక్కితివికాఁబోలును. నామీఁదఁ బ్రేమచేత నను వెంబడించితివి. మార్గమున నొక్కనాఁడైన విడకుండ గాపాడిన నిన్నెట్లు మఱతునని వాపోవఁజొచ్చెను. విలాపముబట్టి శ్రావణుఁడు కళానందుని సేవకుఁడని యిందుమతియు దాసియునెఱిఁగి

వాని నూరార్చిరి. తనకథయంతయు ముగిసిన వెనుక నిందుమతి కంట నీరుబెట్టుకొనుచు రాజనందనునితో నిట్లనియె. "రాజకుమారా! మాతృగర్భమునుండి ధాత్రిపై బడిన దాదిగా నింతింత యనరాని యాపదలపాలైతిని. పుణ్యశీలుఁడగు శ్రీవత్సుఁడు రాక్షసులబారినుండి రక్షించినాఁడని సంతసించుచు నేనుండ నింతలో సంతకిస్నెక్కుఁడు చెఱ నాకు సంప్రాప్తమైనది. ఏనాఁటికిని నా దుఃఖములకంతములేదు. పాపిష్ఠదైవము నాకాయుష్పోసి చిరకాలజీవినిగాఁ జేసెను. నాకంత్య కాలము రారాదా! అయ్యో! నాయందు దయయుంచి నాదురవస్థ మాన్పుట కెద్దియేని సాయము జేయ వేడెదను చిరోగివముఁ జేయసాగెను. కళాసందుఁడు దీనసంరక్షణముం దాసక్తిగలవాఁడగుట నామె కభయహస్తమిచ్చి గిరివ్రజవాసిని గావున నధిమానము హెచ్చి యెటులైన నామెకు సాయమొసర్పఁ నిశ్చయించుకొని యాగదివిడిచి తన తావునకరిగి నిద్రించెను. ఇందుమతియు ధైర్యముఁదెచ్చుకొని చూసి మాటయుఁ దనమాటయునొక్కటిగ నడవందలంచి యారాత్రినిద్రించెను. ఇట్టులొక కొన్నినాళ్ళుచనెను. మఱునాఁడు శిశుపాలుఁడు వేఁట నుండి వచ్చెను.

అట్లుండఁ గొండొకనాఁడు గిరివ్రజమునుండి జరాసంధుని వేగులవాండ్రలో నొకఁడగు తురంగికుఁడు తనసామియానతి నెద్దియో పనిగలిగి బహుదేశములు సంచరించుచుఁ జేదిగిరిమును బ్రవేశించి మహారాజు శిశుపాలుని దర్శనము జేసి యతని యిచ్చచొప్పునఁగొన్ని నాళ్ళందుండి యొక్కనాఁడు కళాసందునిఁజూచి యక్కజమొంది "హృదయమా! ఇంక గుదురుపడుము. స్వామి మనోరథమును నాప్రయత్నమును బండినవి" యని తనలో సంతసించి జాగుసేయరాదని చేనియెద్దకుంజనియె. చని యాతని నొక్కచాటుచోటునకుంబిలిచి చెవిలో రహస్యముగ "మహాప్రభూ! యీకళాసందుఁడు పరమదుర్మార్గుఁడు.

మగధరాజ్యలక్ష్మికపాయము నాపాదింపఁ బ్రయత్నించి దేశమునుం చి పాఱివచ్చినాఁడు. జరాసంధుఁ డీతనిఁ బట్టి తెచ్చినవారికిఁ బారితోషికము నిత్తునని వేగులవాండ్రనెల్ల నానాదేశములకుఁ బంపియున్నాఁడు. వీనిని స్వేచ్ఛగా విడుతువేని మనలను భంగపఱచిపాఱిపోవును. చిక్కక చిక్కక చేఁజిక్కిన యిక్కపటిని విడచిన మనపై జరాసంధునకుఁ దీని యలుక వొడమును కావున విచ్చుకత్తులు గలభటులఁజుట్టునిల్పి వీనిని కారాగృహమున బంధింపవలయును. ఈతఁడు దొరికినాఁడనువార్త మగధరాజునకుఁ దక్షణము నేఁబరిగి విన్నవించి బహుమానములు నందికొందును. నాకు సెలవొసంగుఁడని కొండెములు సెప్పి ధనము దొరకుననియు రాజునకు దయగలుగుననియు మహాసంతోషమున మగధకుం జనియెను. శిశుపాలుఁ డాపలుకులు విని కళాసందునిపైఁగల యభిమానమెల్లనశింప నతికఠినముగఁ గారాగృహమునందుంచి రేయిఁబవళ్ళు వానిపై నొక్కకన్నుఁ బఱపి జాగరూకతతో వర్తింపఁజొచ్చెను.

---

## మూఁడవ ప్రకరణము.

వాసుదేవునివలనఁ దనకు సాయమంపఁబడిన కుశీలవుం డను వేగులవాఁడును దనవెంటరా జాతవేదుఁడు కొన్నిదినములు పయనమొనర్చి యెట్టకేలకుఁ జేదినగరమును బ్రవేశించెను. పరిమాణముచేసి నన్నినాళ్ళుఁ గుశీలవుఁడు కడుమాటనేర్పుతో రుక్మిణీసాధుభావమును సత్యభామ ప్రౌఢతనమును లక్షణ శృంగారలక్షణములును మిత్రవింద యందమును వారిపతులకయ్యములను, వాసుదేవుని తగవులుదీర్చు నేర్పరితనమును మొదలగు ద్వారకానగరవిశేషములు చెప్పి జాతవేదునకు మార్గాయాసము నివారణచేయుచుండెను. చేదిపురమును బ్ర

వేశించుటకు మున్నారుబైట జాతవేదుఁడుమార్గమధ్యముసఁదాల్చుకొనిన పాత్రవలువలువిడచి మంచిదువ్వలువలఁదొడికొని చూపరులు తనవేషముగఁజూచి భళీయని నట్టొప్పి కుశీలవుంజూచి యిట్లనియెను. "ఓయీ! నేను నీకొక్క పరమరహస్యము నెఱిఁగించెద నాలకింపుము. నీకాపురము ద్వారకాపురమని యెవ్వరికిని దెలియనీయకుము. శిశుపాలుఁడు పన్నగినవాసులు నిన్నడుగుదురేని గిరివ్రజమునుండి వచ్చువాఁడనని నీవు వాకొవ్వవలయును. నేనెడనెడఁ బ్రయోగించు టక్కరిశనములకెల్ల నీవు తలయూఁచి యూరకుండవలయునే కాని యిదియేమని నన్నడుగరాదు. సరిగదా నానుడిపిన తెఱఁగున నీవువర్తింతువేని జరిగెడు చిత్రములను జూడుమనుటయుఁ గుశీలవుఁడు పక్కుననవ్వి "దేవా! యెంతమాట! కార్యసాధక నిమిత్తము మీరుచేయు నింద్రజాలములకు నేను భంగము వాటిలఁజేయుదునే? నేనుమాత్రము వేగులవాఁడనుగానా? తాతకు దగ్గులు నేర్పవలెనే" యని యతనితో బయలుదేరి చేదిపురముం బ్రవేశించెను. నగరము నంజలి గుట్టుమట్టంతయుఁ దెలియకమున్న రాజమందిరముఁజొచ్చుట యపాయకరమని చింతించి యొక పేదబాపనముసలిదానియింట బసయుండి జాతవేదుఁడు మెల్లమెల్ల నాయమ్మనకుఁ గొంతవిత్తమొసఁగి కోటలోజరగు వృత్తాంతములఁ దెలిసికొనియెను. జాతవేదుఁ డావృద్ధ యువతిని బలుమాఱు గళానందుఁడను రాచకొడుకు కారాగృహావాసియై యున్నవాఁడాయని యడుగుచురా నామె యెఱుఁగనని చెప్పి యనంతరము గ్రామమునఁ గనుఁగొని కళానందుఁ డాతనిపేరగునో కాదో కాని యొక దివ్యమంగళ విగ్రహముఁగల సుందరపురుషుఁడు బందీకృతుఁడై యున్నవాఁడని తెలియఁజెప్పెను. ఆపలుకులాలకించి యాపురుషుండు తప్పక కళానందుండకా దలంచి యాతండు తలపంకించి మూనాఁటిరేయి శిశుపాలుని యంతిపురమునకరిగి ద్వారపాలకు

నొక్కనిం జేరి జరాసంధమహారాజునొద్దనుండి సందేశము గైకొని యొక మిత్రుండు వచ్చినాఁడని శిశుపాలునకు వర్తమాన మంపెను. శిశుపాలుఁడు తత్సమయమున నొకపూలసెజ్జపై మేను జేర్చి యిందు మతిపై డెందముకూర్చి మరునికాఁకలపాలై బేలయై యంగలార్చుచు రెండుమూఁడుసారులు సేవకుఁడు క్రొత్తవారిరాక విన్నవించినఁ జెవి నిడక యెట్టకేలకువానిమాటలువిని చివాలునఁ బాన్పునుండిలేచి "యేమి రావచ్చినవారు? లోనికిం దోడుకొనిరమ్ము పొమ్మని యానతిచ్చి తానొకపీఠముపైఁ గూరుచుండెను. ప్రతీహారియునంతరమున నాతని నుజద్వయంబును రాజసమ్ముఖమ్మునకుఁదోడుకొనివచ్చి తానావలకుం బోవుటయు వారివారి నర్హాసనములపైఁ గూరుచుండఁబనిచి మీవృత్తాంత మంతయునాకుఁదెలియఁబలుకవలయునని యడిగెను. మార్గాయాసముచేఁజెన్ను చెడినవాఁడువోలె జాతవేదుఁడు ఉస్సురస్సురనుచు నాలుగునిమిషములలసట నభినయించి యీనికిట్టులనియెను. మహారాజా! మున్నెన్నఁడేలినవారి దర్శనము నోఁచనివాఁడను గాకున్నను మీ కాప్తుఁడగుమగధేశ్వరుని పాదములు గనిపెట్టికొనియున్నవాఁడనగుట నేనించుక చనవుగైకొనిమాటలాడి జరాసంధునిసందేశ మెఱింగించెద. సావధానులై యాలకింప వలయు ననిఁ జేదిరాజు బద్ధకమునెల్ల దూరమునకుఁ బాఱఁదోలి, యిందుమతిపైనున్న మతిని జేరఁబిలచి ధైర్యముం జిక్కబట్టి సావధానుఁడై యుండెను.

అంతట జాతవేదుఁడు "దేవా! కొన్నికారణములనబట్టి మగధమహీపాలకుఁడు ప్రస్తుతము వాసుదేవునిపై దండువిడియఁడు. మీరు గిరివ్రజపురమునకు దయచేయఁదలపోయుచున్నవారని యెట్లో మగధేశ్వరుఁడాకర్ణించి మిమ్మాప్రాంతములకింతలో రావలదనినొక్కి చెప్పుమనియెను. మీరిచ్చటనేయుండి వాసుదేవుని వ్యూహములు కు ట్రలు వేగులవంపె యెరసి తనకెప్పటికప్పుడు వర్తమాన మంపవల

ముచెప్పిరి. జయసేనుఁడు బంధనిర్ముక్తుఁడై మనోవైకల్యవిముక్తుఁడై యింటికరిగెనేకాని తారావతింగూర్చిన యనుమానము వాని మనసునుండి పాయకయ్యె. జయసేనుఁడు కళానందుఁడు మిత్రులగుటం జేసి బంధముక్తులైన మఱునాఁడు కలిసికొని తమతమ కష్టసుఖముల కుఁ గారణములు చెప్పుకొనుచుండఁ బ్రసంగవశమున జయసేను డిట్లనియె. "మిత్రుఁడా! ఏవిధముననో నే నెఱుఁగను గాని మా యింటికి మొగలియాకుఁబో బాకటి రాజలేఖ తెచ్చె. దానిని నాకడనుండి దొంగలించి యెవ్వరో రాజునకిచ్చిరి. నే నాకుట్రలో నున్న వాఁడ నని రాజు నన్ను బంధించె. అందు జరాసంధమరణము సూచింపఁబడుటచే నాతని కలుక వొడమి యట్లు చేసె." అని నవ్వుచుఁ గళానందు డిట్లనియె. "మిత్రమా! ఆజాబు సౌందర్యతిలక నిమిత్తము నేనే వ్రాసితిని. పూలవర్తకుఁడైన రోహిణకున కిమ్మని యొకసన్యాసి కిచ్చితిని. అతఁడు రోహిణకునకిచ్చె. వాఁడు దానిని బూలచెంబులోనిమిడ్చి సౌందర్యతిలకదాసియగు నాగవల్లి కిచ్చె. అదిదాని నెవ్వనికో విక్రయించినదఁట. కొనినవాఁడుదానిని మీదాసి కీయఁబోలు. అది రత్నార్ణవుఁడు మాయింటనుండిదొంగిలించుకొనిపోయి రాజున కీయనోపు. ఇదియెల్ల నిక్కమని నాకుఁదోఁచెడు" నని చెప్ప జయసేనుఁడు సంతసించి తెలివొందిన మొగముతో మిత్రుని వీడ్కొని గృహమునకుఁ జని తారావతింబిలిచి "సుందరీ చిరకాలమునుండి నామనసుకం బీడించుచున్న యనుమానము తీఱె. అకలంక చరిత్రవైన నిన్ననిసమాటలకు నన్ను సైరింపుము. మొగలియాకు చరిత్రమంతయుఁ దెలిసినది సుమీ" యని కుమారుఁ-రాజసేను నెత్తి ముద్దాడి రాజలేఖ నూరార్చి కడుసుఖముగ నుండెను. కృష్ణుఁడు సహదేవుఁడుఁ గూరుచుండి యానాఁడు రాత్రి మాటలాడుచుండఁగ నన్నెఁడో యొక సేవకుఁడు కడువేగమున వచ్చి

వారియెదుట నిల్చె. దీపముల వెలుఁగునఁ వాసుదేవుఁడాతని నానవా లుపట్టి "యోరీ! కుశీలవా! యెప్పుడు వచ్చితివి? పాప మాయిందు మతి వార్త లేమి? దురాత్ముఁడైన శిశుపాలుఁడామెను బలాత్కార మునఁ బెండ్లియాడెనా?" అని యడిగె. అపుగుటయు వాఁడు వినయ మునఁ జేతులుజోడించి యిట్లనియె. "దేవా! దేవరవారి వేగులవాఁడు కుశీలవుఁడు బ్రదికియుండ నంతమాట పుట్టునే? హేమావతిం జూడ వలయునని వంకబెట్టి చందనపురమునకు కామెయు నేనును బోతిమి. అది నిజముకా వగచి శిశుపాలుఁడు మమ్మనిపె. మేము చందనపుర మునకుఁ బోక ద్వారకానగరమున కరిగితిమి. అట దేవరవారు లేరని యింద్రప్రస్థమున కరుగ నచ్చటను మీరు లేకనికి నేనిందువచ్చితిని. ఇందుమతిని యుధిష్ఠిర మహారాజుగారు సగౌరవముగ నందు నిలిపి కడు జాగరూకతతోఁ జూడవలయునని ద్రౌపదీదేవిగారి కప్పగించిరి, ఆమె యటఁ గుశలిన్మై యున్నది." అని విన్నవించుకొన్న కుశీలవు నింజూచి నందకుమారుఁడు చిఱునగవువెలయ "నవురా! నీవెంతకయి నం దగుదువురా! మంచిపని చేసితివి. నీవిశుభవర్తమానము కరభ మహామునీంద్రునకుఁ దదాశ్రమమునకుం బోయి విన్నవించి యట నుండి యింద్రప్రస్థపురమునకుఁబొమ్ము." అని యానతిచ్చెను. కుశీ లవుఁడు రెండడుగులు సాగిపోయి మరలవచ్చి "దేవా! చెప్పమఱచి తిని. ఆయిందుమతి ద్వారకలో నున్నపుడు మీకు దగ్గఱచుట్టముఁ బ్రద్యుమ్ననకుం బాల్యస్నేహితుఁడునగు మన యశోధరునిపైఁ జిత్త ము నిల్పినది. అతఁడు నీమెం జూచిన దాదిగ మదనబాణపీడితుఁడై యున్నవాఁడు. మీఁద దేవరచిత్త" మని మనవియొనర్చుకొని తనదా రింబోయె. అంతలోఁ గారాగృహాధికారివచ్చి సహదేవుని కంజలి యొ నర్చి నిల్చియిట్లనియె. "మహారాజా! తండ్రిగారు కొన్నినాళ్లక్రిందట నిష్కారణముగ భిక్షుకుఁడొకని ముసలివాని నొక్కని వాసుదేవు చా

రులలో నొక్కఁడనితలంచి బాధించిరి. చెఱసాలలోనికివచ్చినదాదిగ వాఁడు రోగపీడితుఁడై యొక్కముహూర్తము క్రిందట మరణము నొందినాఁడు. సెలవయ్యేనేని యగ్నిసంస్కారముఁ గావించెద" మని చెప్పి సహదేవుఁ డించుక విచారించి దిక్కుమాలినవానిఁగూడ మా తండ్రి బంధించి చంపెఁగా! వాఁడు మతిలేనివాఁడు. నిరపరాధుఁడు. పాపమని జాలినొంది వానిదహనమునకు సెలవిచ్చె. పౌరు లామరణ వార్త విని యాబాలగోపాలము వగచిరి.

మఱునాఁడు చంద్రపాలుఁడు మౌహూర్తికులఁ బిలిపించి కుమార్తె వివాహముహూర్తము పెట్టించి ప్రయత్నము సేయందొడఁగె. రణార్ణవునకు సౌందర్యతిలకకు ముస్ను జరాసంధుఁ డెచ్చటఁబెండ్లి సేయనిశ్చయించె నాచోటనెకళానందుని వివాహముగూడ నెఱపుమని వాసుదేవుఁడు చంద్రపాలున కానతిచ్చె. అతఁ డందుకు సమ్మతించె. సౌందర్యతిలక సర్వవిధముల సంతోషితస్వాంతయైయుండి తనచెలిమికత్తెయగు నాగవల్లి తలఁపునకు వచ్చుటంజేసి రాగలతికతో నాలత కూన యిట్లనియె. "ఓసీ! ఈసమయమున నాగవల్లియున్న నెంత బాగుండునె! మొదటినుండియు మాయిరువుర సమీపము నదియెంత మనసుపడి కోరెనో యంతదవ్వాయి పోయె. మొగలియాకు దొరికెంగాఁబో దానికై పోయిన నాగవల్లి రాదయ్యె" నని యించుక గంటఁదడి వెట్టి తమచెలిమి కారణము, నాగవల్లి మాటలసొంపు, దానిచమత్కృతిఁ దలంచి వగవసాగెను. ఆమెంజూచి రాగలతికయు వగచి యూరకుండుమని యూరార్చి కన్నీరు కొంగునఁదుడిచెను.

ముహూర్తము సమీపించుచుండఁ గళానందుఁ డానందసాగరమునం దేలె. రణార్ణవుఁడు దుఃఖార్ణవమున మునింగె. పౌరులందఱు మహానందభరితులైరి. వివాహమునకుఁ బూర్వమునఁ జంద్రపాలుఁడు కూఁతుఁ బెండ్లికూఁతుం జేసి చుట్టముల సెచ్చెలుల నాప్తులఁ

బిలిచి వించెను. నాఁటిరాత్రి సౌందర్యతిలకయు రాగలతికయు మేడపైఁగూర్చుండి పెండ్లిముచ్చట లాడుకొనుచుండ వడివడి మేడమెట్టు లెక్కి వచ్చి యొకపడఁతుక వారి కట్టెదుటనిల్చె. ఆనెలంత లాప డఁతుకంజూచి నాగవల్లి నాగవల్లియని పిలిచి యిరువురును లేచి యొక మాటె దానిం గౌఁగిలించుకొనిరి. అద్భుతానంద రసములవలన నుద యించిన పారవశ్యత యొకయింత తమ్ము విడిచి విడఁ శరీరములు తెలియుటయు బ్రదికి ప్రాణములతో వచ్చితివేయని రాగలతికయు, నింతకాల మెందుంటి వేమి పాటుపడితివి, నాకతమున నీకెన్నిచిక్కులు సంభవించెనో గదాయని సౌందర్యతిలకయుఁ బలుకరించిరి. నాగవల్లి వారినిద్దఱఁ గూర్చుండఁ బనిచి నేను సుఖముగ నున్నదాన, కష్టము లంతగాఁ బడలేదు. పడినవన్నియు సార్థకములయ్యె. ఇంతకును మొ గలియాకు దొరకెనో లేదో యని యడిగెను. ఆమాటకు రాగలతిక యిట్లనియె. "పాప నూయోగిని కటాక్షమున మొగలియాకులభించె. ఎవ్వఁడో జాతవేదుఁడను నాతని సహాయమున మనకళానందుఁడు బ్ర తికెనఁట! వారలిద్దఱుఁ బెండ్లికి వచ్చిన సంతోషముగ నుండును." అను టయు నాగవల్లి యిట్లనియె. "ఆయోగిని మీకుఁ బరమోపకారము నర్చె. జరాసంధునియొద్దనుండి మాయోపాయమున మొగలియాకు ను ముద్దుటుంగరముఁ దెప్పించి రణార్ణవుని భంగపుచ్చి యాకుమీకుఁ బంపి యుంగరము జాతవేదునకిచ్చి పంపె. వాఁడది గైకొని శిశుపా లునికిం జూపి జరాసంధుఁడు కళానందుం దోడితెమ్మనెనని బొంకి యాయంగుళీయక మానవాలు చెప్పి నీప్రాణవల్లభు నీవలకుం దెచ్చి కూడ శిశుపాలుఁడు పంపిన సేవకులనందఱ నర్ధరాత్రమునఁ బులిపులి యని భయపెట్టి పలాయితులంజేసి కళానందుని ద్వారకకుంగొనిపోయి మరల నిటకుంబంపె. అచ్చట నిందుమతియను కన్యకకుఁగూడ హాని లేకుండ జాతవేదుఁడు హేమావళీవ్యాజమున శిశుపాలునికంట దుమ్ము

గొట్టె. ఆయిందుమతి యిప్పుడిందప్రస్తమున నున్నదట" అనియామె చరిత్రముకూడ వారలకుం జెప్పెను. ఆచరిత్రములకు వారాశ్చర్యమొందుచుండ నాగవల్లి మరలనిట్లనియె. ఈవిషయమున యోగినికి జాతవేదునకు నందనందనుఁడు సాయమై వేగులవాండ్రగు కోరకకాణభూతులను యోగినికిని, సుశీలవుని జాతవేదునకు సాహాయ్యముగానంపె. యోగిని నీకుఁ గేశకీదళమిచ్చుటయే కాక మఱియొకమహోపకారము గావించె. మొన్నటి దినమున నిన్ను రణార్ణవునికిచ్చి పెండ్లిసేయ సర్వప్రయత్నములు జరగెఁగదా! ఆనాఁడు కళ్యాణమంటపముఁ దగులఁ బెట్టించి వివాహమాపినది యోగినిగాక యెవ్వరను కొంటివి? అదియొక టనునో? ఇంక వేయిపనులు నామెచేసెను. ఇవియెల్ల నింతకుమున్న కళాసందుని కెఱింగించి యాతనినానంద సముద్రమునఁ దేలించితిని. జాతవేదుని దలంచి యాతఁడు నమస్కరించి తలప్రాణమయిన నాతని కీయ సిద్ధముగ నున్నవాఁడు సుఁడీ" యని చెప్ప సౌందర్యతిలక యద్భుతమునొంది మనసున భక్తియు విశ్వాసముఁను బెల్లుబ్బ పైకిరాఁ జేతులు జోడించి యిట్లనియె. "అమ్మా! భగవతీ! యోగినీ! నీవు మాతల్లివి. నీఋణము నా శరీరము కోసియొసఁగినఁ దీఱునే? ఎంతలెంతకష్టములు నానిమిత్తమై పడితివి. అహహ! జాతవేదా! నాకు నిజముగ సోదరుఁడవునీవె. నీవను తెప్పమూలమునఁ గదా ప్రాణేశ్వరుఁడు శిశుపాలుఁ డను సముద్రమును దాఁటుట. నాపాలి దైవములు గదా వారిరువురు. ! నాగవల్లి! ఇంత కాలము నీ వెందుంటివే" యని పలికి యూరకుండె. రాగలతికయు నదియేమిచెప్పునో యని చెవియొగ్గి శ్రద్ధతో వినుచుండ నాగవల్లి యిట్లనియె "ఇంక నిజము దాఁపనేటికి మీకుఁ దెలియజేయకుండవున్న. సంతోషము పొంగి తనంత హృదయముపట్టక వెలికివచ్చుచున్నది. అంతంత యద్భు

తములుజేసిన యోగినినినేనె. కళానందుని విడిపించిన జాతవేదుఁడ నునేనె. ఇందుమతిని గట్టెక్కించిన హేమావతిని నేనె. ఇపుడు మ రలవచ్చిన నాగవల్లినినేనె. నేను నేనే" యని చెప్పి తలవంచుకొని కూర్చుండెను. రాగలతికయు సౌందర్యతిలకయు నామె పలుకులు నమ్మవలయునో లేదో యెఱుఁగక నిశ్చేష్టులయి యుండిరి. నాగ వల్లి వారి వైఖరింజూచి "అమ్మా! నాఁడు నేను నీ యెదుటఁ బ్రతినచేయలేదా? ప్రతినలో నున్నదానికన్న నెక్కుడు కార్యములు నివర్తించి కృష్ణునితో నాలోచనము సల్పి, శిశుపాలుని భంగపెట్టి, రణార్ణవుని మోసపుచ్చి, నీప్రాణములు దక్కించి నీహృదయేశ్వరు నసువులు రక్షించి కేతకీదళము నీకిచ్చి కృతార్థురాలనైతి. ఇది గో జరాసంధుని ముద్దుటుంగరము చూడుఁడీ" యనిమీఁదవైవ వారదియెత్తిచూచి కథయంతయు నిజమని నమ్మిరి. సౌందర్యతిలక తన నెచ్చెలిపై యింతింత యనరాని మక్కువయు విశ్వాసమును జూప దానిం బిగ్గఁ గౌఁగలించుకొని "చెలీ! నానిమిత్తము నీకెన్ని కష్టములు గలిగినవి. నిజముగ నీకు వేయిసంవత్సరములుదనుక దాసినయ్యుఁ దీర్పఁజాల. మగవారలయిన నిర్వహింపరాని దుర్ఘ టకార్యముల నవలీల నిర్వహించితివి. నాప్రాణము నీయది. యర్థ మునీయది. నీవ నాదైవము" నని నుతించియాదరించె. అనంతర మం దఱు బహుసల్లాపములు జరపి నిద్రించిరి.

---

## ఇరువదిరెండవ ప్రకరణము.

అంతటఁ సకలజనానందకరముగఁ బ్రభాతమయ్యె. సహదేవ మహారాజు, తానొకపట్టపుటేనుఁగకు సకలాలంకారములు చేయించి

బంగరుటంబారి వేయించియుందుఁ బట్టుపరుపులు పఱపించికళానందు నందెక్కుమనియె. మున్నుదుర్గంధభూయిష్ఠమయిన ముసలియేనికపై నెక్కిదీనాననుఁడయి తిరిగినవీథులలోనె విలాసవంతుఁడయి సుంద రాననుఁడయి పెండ్లికొడుకయి కీవితోఁ బౌరులు వెంటరా నూరేగి కల్యాణమంటపమునకు వచ్చె. అందు సహదేవమహారాజును, యాదవ పాండవ సింహులును సకలమంత్రులు, సామంతులు, దండనాయకులు, పరిచారకులు, దాసదాసీజనములు, బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రాచారకులు, విద్వాంసులు, వైణికులు, గాయకులు, నటులు, చుట్టములు, నెచ్చెలులు, నాప్తులు, నందఱుఁ దత్తదుచితాసనములఁ గూరుచుండి వివాహ మహోత్సవముఁ జూచుచుండిరి. రాగలతిక నాగవల్లి మొదలగు చెలిమికత్తెలు, పేరంటాండ్రు ముత్తయిదువులు వెంటరా సౌందర్యతిలక సిగ్గునఁ దలవంచుకొని సకలభూషణశోభితుఁడై సాక్షాన్మన్మథుని వడువున భాసిల్లు మగనిసోయగము గ్రేగంటిచూపులఁజూచి తనియుచు వివాహమంటపముం బ్రవేశించెను. కళానందుని చూడ్కులు, మనసు, ప్రియురాలివశముగా మేను మన్మథవశముగా హస్తములు పురోహితుని చేతికిచ్చి కీలుబొమ్మలాగున నాతఁడు చేయించుదైవారాధనలు చేసె. అందఱియెదుటఁ జంద్రపాలుఁడు పసిఁడి పళ్లెరమందుఁ గళానందుని పాదారవిందములుంచి తనభార్య కనకకలశముతో నిర్మలోదకము వోయఁ గడిగి సాలంకృతకన్యాదానముజేసి ధన్యుఁడయ్యెను. కళానందుఁడు సౌందర్యతిలక పాణిగ్రహణముచేసి యన్యోన్యకరస్పర్శనమువలన నానందపారవశ్యము నొందిరి. అనంతరము ధారుణీదేవియుఁ జంద్రపాలుఁడు నానందబాష్పములు విడువ వారిరువురు ముత్యాలతలబ్రాలొండొరులమీఁద నొకరినిమించి యొకరు వోసికొని రూపలావణ్యముల వయోవిభవములఁ విద్యాగుణములఁ బరస్పరానురాగముల నొకరికొ

కరు తగియున్న కతనఁ గొడుకుం గోడలింజూచి ధారుణీదేవియుఁ గూఁతునల్లునిజూచి చంద్రపాలుఁడు నట్టివియ్యములంజూచి సకలపౌరజనములు, వారింజూచి కృష్ణభీమార్జునులును సందఱంజూచి సహదేవ మహారాజును సంతసించిరి. ఆయైదుదినములు వచ్చినవారెల్లరు నాటలు, పాటలు, నృత్యములు, వాద్యములు చూచి విని సంతసించి విందు లారగించి వధూవరుల దీవించిరి. అనంతర మాదంపతులకు సంధానమహోత్సవము జరిగె. మదనారాతికైనఁ గోరిక లుదయింపఁజేయునట్లు సింగారించి. యంతిపురము మేడపై గదిలోనం బ్రవేశించి యాదంపతులు పూవుసెజ్జల మేనలుచేర్చి చిరమన్మథాగ్ని చల్లబడునట్లు పన్నీరు మంచిగంధము మేనలంజల్లి పూసికొని మనస్సు వచ్చినట్లు కన్నులకఱవుదీఱ నొండొరులరూపములం జూచికొని చిరకాలవియోగజనితకంపముపోవ బిగియారకౌఁగిళ్ళ ననఁగిపెనఁగి యెడలేని ముద్దులం దనిసితనిసి మహాభోగసౌఖ్యములందేలి మదన సామ్రాజ్య మనుభవింపఁ దొడంగిరి. ఆగాటంపుమక్కువ లాతని వోనికోర్కు లాకారణములేని యలుక లానిలుకడలేనిపట్టుదల లా సింగారపుంబందెము లాచిత్రప్రసంగము లాహాయలులు వర్ణింప సమకట్టుటకన్న ననుభవింపుఁడని వారి నొంటరిగ విడిచి యూహించుకొమ్మని చదువరుల విడిచి యనంతరకథాకథనమునకుఁ బోవుటుచితము.

మఱునాఁడు వాసుదేవుఁడు భీమార్జునులతోఁగూడ ఒయనమై తన్ననుప వచ్చిన సర్వజనమును వీడ్కొని కళానందునిచేయి సహదేవునిచేతికిచ్చి యప్పగించి చంద్రపాలుని సన్మానించి సహదేవుం గవుంగిలించుకొని రాజనీతి నేర్పి ప్రజనుల .. యమిచ్చి రాజభక్తిబోధించి . భీమార్జునసహదేవులకు సఖ్య ముండున .. నొక్కి చెప్పి జరాసంధుని రత్నకాంచనమయమైన తేరుపై నెక్కి వెడలెబం

ధమోక్షితులైన రాజులు వారివెంటఁజనిరి. అట్లు బయలుదేఱి గోపాలుఁడు భూపాలక పరివారముతో నింద్రప్రస్థముఁజేరి తమరాక మున్నె యుధిష్ఠిరునకుఁ దెలుపుమని కోరకకాణభూతుల సంపె. యుధిష్ఠిరుఁడును మహానందమున మఱఁదినిదమ్ముని నెదుర్కొని వారలదీవించికవుఁగలించుకొనిజరాసంధసింధురముం దెగటార్చినయాదవసింహబుద్ధిబలమును బాండవసింహబాహుబలమును, నగ్గించిగిరివ్రజపురవిశేషములం జెప్పుకొనుచునాదినముం గడపిరి. మఱునాఁడుయదుకుంజరముయుధిష్ఠిరుఁజూచియిట్లనియె. "రాజేంద్రా! చేయఁదగినపనిఁ జేసితిని. ఈ జగత్కంటకుఁడు తీరుటచే నిఁకశిశుపాలాది శత్రువులు నాచే తలోనివారు. నీవింక రాజసూయము నారంభింపుము. నీ నలువురు తమ్ములనలుదిక్కులకు దిగ్విజయయాత్రమంపుము. జరాసంధబంధితులైన రాజులు మావలన ముక్తులయిరి. వారల వారి దేశముల కనిపి రాజసూయమునకు రమ్మని యానతిమ్ము. యజనమునకుం దగుచోటు లరసి శాలలు నిర్మించి సంభారముల సమకూర్చి బ్రాహ్మణులను జుట్టములఁ బిలువనంపి సిద్ధముగ నుండుము. ఇందుమతిని నాతోడం దీసికొని పోయెదను. మేమందరము మరలనచిరకాలమున వచ్చెదము మాకు సెలవొసంగు" మని వీడుకొని ద్వారకానగరమునకుం జని పురజనులెదుర్కొని గౌరవింప నగరుజొచ్చి రుక్మిణిం బిలిచి యిందుమతిం జూపి "దేవీ! ఈబాలిక కొన్నినాళ్ళ క్రిందట నిటకువచ్చియున్నప్పుడామె చరిత్రము నీవు వినియె యుందువు. ఈమె కాఁపురము గిరివ్రజము కాని యిచ్చట నే నరసినంతవఱకు నీమెచుట్టములే లేరు. కావున నీమెను మనబలఁగములోఁ గలిపికొనవలయును. మనయశోధరుచిత్తము దీనియందు హత్తినదట. వీరలకు వివాహమెచ్చటఁ జేయవలయు" అని యిందుమతిం జూచి "బిడ్డా! నీవు వగవకుము. నాచుట్టము నైతివి. నీకు రుక్మిణితల్లి, నేను జనకుఁడను." అని యాడ

ర మొలుకుపలుకుల నామె కభయ మొసఁగి మఱునాఁడు కార్తాం తికులరావించి సుముహూర్తము నిర్ణయించె. అనంతర మొక్క పుణ్యదినమున నిందుమతీయశోధరుల వివాహముమహావైభవముతో వాసుదేవుని నగరుననే వర్తిల్లె. యదుభోజవంశజులు రాజబంధుస మేతులై మహాసంతోషముతో నాదినములు గడపిరి. కణ్వమహా మునియుఁ దద్వివాహమునకువచ్చి యిందుమతికిఁ గలిగిన కష్టముల కు వగచి యామె నాలింగనముజేసికొని దీవించి యూపెండ్లిదినము లందుండి మరల నాశ్రమమునకుం జనియె.

అటులయుధిష్ఠిరుఁడు బంధమోక్షితులైన రాజులందమతమ దేశముల కనిపి భీమార్జుననకులసహదేవుల దిగ్విజయముజేసి రాజు లగెల్చి ధనరాసులం దెమ్మని పంచె. ఆవీరచతుష్టయము చతు స్సాగరములనడుమనున్న సకలదేశములకు సేనాసమేతులై యరిగి మూర్ధాభిషిక్తులనోడించి కప్పములంగ్రహించి ధనసంచయముం గూ ర్చుకొనివచ్చి ధర్మజుపాదారవిందముల కర్పించి కృతకృత్యులైరి. అనంతరము యాగము నిమిత్తమువచ్చు సకలసామంతమహీపాలు రకు నివాసయోగ్యములగు ననేకగృహములును బసులకు గుఱ్ఱము లకు నరదములకుఁ దగు పందిళ్ళును, సేవకులకు దాసదాసీజనములకు ననుకూలములగు నిలయములను, జుట్టములకు నెచ్చెలులకు సౌఖ్య దాయకములైన మందిరములకును, నాటపాటలకు వేడుకలకుఁ దగు తావులను, బ్రాహ్మణోత్తముల స్నానపానజపహోమాదుల కను కూలములగు పవిత్రప్రదేశములును, యాగము నిర్వర్తింపఁబడుట కు శాస్త్రోక్తప్రకారము బహువిధాగారములును, సైన్యములు వసి యించుటకు విశాలపటకుటీరములును, బ్రాహ్మణభోజనములకు వం టలకు విరివిగలైన పర్ణశాలలును నిర్మింపఁబనిచి యుధిష్ఠిరుఁడు చుట్ట ముల, స్నేహితుల బ్రాహ్మణులఁ దక్కిన రాజలోకంబులఁ బిలువ

నంపె. వేదములవతరించినట్లు షడంగములు మూర్తులు గైకొన్నట్లు శాస్త్రములాకారములు దాల్చినటుల వసుమతీచక్రమునం గల బ్రాహ్మణులు యాగము నిర్వర్తించుటకు ఋత్విజులు సధ్వర్యులు నుద్గాతలు నుపద్రష్టలు హోతలు మొదలగువారు నరుదెంచి రాజుచే సన్మానింపం బడిరి. శిఖండిద్రుష్టద్యుమ్న ప్రముఖ కుమారులతో ద్రుపదుండును బాంచాలదేశము వారెల్లరు తరలివచ్చిరి. ఉగ్రసేన వసుదేవ బలదేవ సాత్యకి సంకర్షణాక్రూరప్రముఖులగు వృద్ధులను సాంబప్రద్యుమ్నాది కుమారులను యశోధరాదిబంధువులను, రుక్మిణి, సత్యభామ, జాంబవతి, మిత్రవింద మున్నగువారును వారిలో నిందుమతియు వెంటరా వాసుదేవుండు బయలుదేఱిన వారితో, ద్వారకానగరమంతయు వచ్చె. భీష్మబాహ్లీక సోమదత్త భూరిశ్రవాదులగు కురువృద్ధజనులతోడను, కృపద్రోణాశ్వత్థామల తోడను, దుర్యోధన దుశ్శాసనాదికుమారసంతతితోడను, కర్ణాదియాప్తవర్గముతోడను సింధుగాంధారరాజప్రముఖులగు చుట్టములతోడను ధృతరాష్ట్రుండు వెడల హస్తిపురిమంతయు వెడలివచ్చె. కళానందాదులతో సహదేవ మహారాజును, జరాసంధమరణమునకు నిందుమతి వివాహమునకుం జంతించుచు శిశుపాలుండును సకలమహీమండలమును వచ్చి యింద్రప్రస్తపురము జేరి యుధిష్ఠిరునిచే సన్మానమునొందిరి.

వచ్చినచుట్టములను స్నేహితులను నాయాకార్యములందు నియోగించి ధర్మరాజు రాజసూయము జేయుటకు ద్రుపదరాజకన్యతో దీక్షవహించె. బహువిధాద్యహోమముల న్వేలుపులం దనియించి, షడ్రసోపేతాన్నముల భూసురులం దృప్తినొందించి సన్మానములరాజుల న్ముదితాంతరంగులం గావించి దానముల నేలవేల్పులదరిద్రదశ బాపి బహుమానముల మిత్రులం జుట్టముల సంతోషింపం

జేసి, యామహారాజు జన్నము సేయుచుండె. పవిత్రమంత్రవాదములు, బ్రాహ్మణాశీర్వాద నినాదములు బహుజనులమాటలరొదలు, వందిమాగధవైతాళికుల యభివాదములు బ్రహ్మాండమునిండె. ఆసమయమున, లోఁబడిన సామంతులు, పటకురానిరాజులు, నరివెట్టని ధారుణీశ్వరులు, మ్రొక్కనిభూపాలురుఁ దనియనిబీదలు, దానములొందని భూసురులు, సంతసింపనివారుఁ గానరారైరి. ఆయజాతశత్రుఁ డాసమయమున దీపకళికలంబోలె ధగధగవెలయు బహురత్నయుక్తాలంకారకిరీటము మస్తకమున నలంకరింప హారకేయూరాదిభూషితుఁడయి నిజకీర్తియుఁబోలె భాసిల్లుదువ్వలువలఁ దాల్చి యిరుగడల భీమార్జునులు ధవళచామరములిడ నకులసహదేవులు ఛత్రములనిడ సాత్యకిధృష్టద్యుమ్నులు సమస్తమూర్ధాభిషిక్తుల నామధేయకీర్తనములతో మ్రొక్కింప వారికిరీటమాణిక్యకాంతులు తనయడుగుఁ గెందామరలయరుణకాంతులనినుమడించి నీరాజనమొసంగ వివిధదేశాగతులు వినయసంభరితులై యర్పించుకానుకలు, కట్నములు, రతనములు, ధనసంచయము శిరఃకంపములఁ గెరకంటిచూపుల మన్నించుచు సర్వబంధుజనము మహాసంతోషమొంద స్నేహితులు పొంగఁ బాంచాలుఁడు కూఁతునల్లుంజూచి సంతసింపఁ గొడుకుల యౌన్నత్యమునకుఁ గుంతి యానందబాష్పములు విడువఁ గురుకులము మహౌన్నత్యదశంబ్రాపించెనని భీష్మబాహ్లీకులు ముదితులుగా, శిష్యులపరితాపములకుఁ గృపద్రోణులహృదయములు జల్లఁబడ నిర్విశేషిత శత్రుమండలుఁడై నిరుపమానప్రతాపుఁడై వ్యాసనారదపరాశర మార్కండేయ ప్రముఖులగు మునిగణము, కౌరవులు యాదవులు పాంచాలురు మాగధులు చైద్యులుఁదక్కిన రాజులుఁగొలువ, పెక్కుగట్టులనడుమఁ బొల్చు మేరువట్లు తారకామధ్యమున వెలయు చంద్రునివలెఁ బ్రమధగణ సమేతుఁడయిన శంకరుచందమున దిక్పాలకులనడుమఁబొల్చు మహేంద్రునట్లు భూలోకదేవేంద్రుఁడయి వీరనారాయణుఁడై నల హరిశ్చంద్రుల మఱపించుచు రాజతేజముబ్రతేజముగుమికూడునట్లు మహావిభవమునఁ గొలువుదీర్చియుండె. య

జ్ఞాంతమున నర్ఘ్య మెవ్వరికీయఁదగునని యుధిష్ఠిరుఁడు భీష్మునడ
గనాతఁడు వాసుదేవుఁడర్ఘ్యమందుకొన నర్హుఁడని పలికె. అ
ప్పుడుసకలరాజలోకము వీక్షింప సహదేవుఁడు కృష్ణున కర్ఘ్యమొ
సఁగె. సహజవైరమున శిశుపాలుఁ డదియోర్వక మహాకోపమున
యుధిష్ఠిరు నాక్షేపించి గంగానందను నిందించి గోపాలదేవుండట్టి
యుద్ధసన్నద్ధుఁడయ్యె. చక్రధరుఁడు మహాక్రోధమున రాజచక్ర
ము చూచుచుండ శిశుపాలశిరచ్ఛేదము చేసె. రాజులు గడగడవడఁకి
జయజయధ్వనుల నందకుమారుం బొగడిరి. రాజసూయము, పరిశాం
తవిఘ్నమై, కురుకుల క్షేమకరమై, సర్వజనానందకరమై, భూత
ప్రీతిదాయకమై, పరివర్తిల్ల యుధిష్ఠిరుఁడు ద్రౌపదీమహాదేవియు
నవభృథస్నాన మాచరించి వచ్చినచుట్టములు రాజులు వారివారి దేశ
ములకనిపిరి. మాగధసహదేవులు కళానందునితో గిరివ్రజమునకుఁ
బోయి సుఖముగనుండిరి. యశోధరునితో వాసుదేవుఁడు ద్వారకాన
గరముజేరె. కళానందుని రాజభక్తికి విద్యావైభవమునకు బాహు
బలమునకు మెచ్చి సహదేవుఁడు వానిం దనమంత్రిగాఁ జేసికొనియె.
కళానందసౌందర్యతిలక లత్యంతసౌఖ్యమున నొండొరులపైఁ బ్రేమ
లు నానాఁటికి హెచ్చి హాయిగ నుండిరి. వాసుదేవుని యనుగ్రహ
మువలన నిందుమతియు యశోధరుఁడును నేకొఱంతయు లేకుండ సు
ఖించిరి. రణార్ణవుఁ డొకనాఁ డొంటరిగ నెందో పోవుచుండ వాని
ప్రతిపగతుఁడెవ్వఁడో వానిం జంపి పగదీర్చుకొనియె. యుధిష్ఠిరమహా
రాజు వాసుదేవుని బుద్ధిబలము తనకు మంత్రియైయుండ నలువురిత
మ్ములబాహువిక్రమములు తనకుఁ బెట్టని నాలుగుకోటలుగాఁగఁ బ్ర
కృతిజనానురంజనముగఁ గురువృద్ధజన సమ్మతముగఁ గువలయానం
దకరముగఁ బ్రజాపాలనము సేయుచు సుఖముగనుండెను.

సమాప్తము.





# అహల్యాబాయి.

మొదటి ప్రకరణము.

---

మహారాష్ట్రదేశమునకుఁ గస్తూరితిలకమువలె నలరుశ్రీపుష్పహా నగరము భయంకరశాసనుం డగు శ్రీపేష్వామాధవరాయనిపాలనము నందుండుటచేఁ జోరకిరాతభీతి లేక తన్నగరవాసులందఱు హాయిగా గుండియలపైఁ జేతులువైచికొని నిద్రించుచుండిరి.

ఆహాహా! రాత్రి సకలజంతుసంతతికి నపారనిద్రాసుఖము నొసంగుమహోపకారి యయ్యు మదనపీడితులకును, విచారవినమ్రులకును, పాపకర్ములకును గంటికిఁ గూర్కు రానీయక నాలుగుజాములకాలము నపకారిణియై యుండునుగదా! అయినను సర్వరహస్యములను దనకడుపున నిడుకొని కన్నతల్లివలెఁ గాపాడునట్టిది రాత్రియే. కనుక దురాచారులకే గాక మానధనులకుఁ గూడ నది యుపకారి యగు. ఆనాఁటిరాత్రి నగరమంతయుఁ గాలపురుషుఁడు వైచిన సమ్మోహనాస్త్రములచేత బద్ధమై పరవశత్వంబు నొందెనేమో యనునట్లు ప్రాణంబులు పరమేశ్వరునకును, నర్థంబులు రాజసేవకులకును, సంరక్షణార్థ మప్పగించి నిద్రించుచుండెను. వేయికన్నులతో సర్వేశ్వరుండు రక్షింపఁ దమపని యేమున్నదనియో, నియమితకార్యంబుల [illegible]చిరియో, యవిలంఘనీయ మగునిద్రాదేవి కెదురాడనేరకయో, రాజభటులుఁ గూడ నెక్కడివారక్కడ నిద్రించుచుండిరి. [illegible]

దత్యంతశ్రద్ధాళువులు కొందఱువీరులు గస్తీ తిరుగుచు నడుమనడుమ నిద్రవచ్చునప్పుడు స్తంభమునకో గోడకోచేరఁబడి కునికిపాట్లుపడుచు నట్టిట్టు బనిచేయుచుండిరి. నగరమునందలి దీపము లన్నియు నొకటి తరువాత నొకటి క్రమముగ నాఱిపోయెను. ఆరాత్రి యొక్క బాలిక దీపములు పెట్టినదిమొదలు పలుమాఱు తమపెరటితలుపుఁదెఱచుచు మూయుచు మాటిమాటికిఁ దనముద్దుమొగమ్ము బాటసారుల కగపడు నట్లు తొంగితొంగి చూచు చుండెను. జాముఱాత్రి యైనతరువాత నొకమా ఱట్లు చూచి వీథిలోనికి రావలె నని గుమ్మములో నడు గిడ నిద్దఱుబాటసారు లాదారినేగుచుండిరి. అందుచేత నామెచెంగున లోనికిం జని తలుపు మూసెను. మఱిరెండుసారు లట్లు గృహమువెడలిపోవఁ బ్రయత్నించుచుండ నొకమాఱు తల్లి మేల్కొని యామెస్థితి నిఁగూర్చి పరీక్షించి యామెను బండుకొనఁ జేసెను. రెండవమాఱు తనచిన్నతమ్ముఁడు నిద్రలో దుస్స్వప్నముం గని యేడ్చుటచే నాతని నూఱడింపవలసివచ్చెను. రెండుజాములరాత్రియైన వెనుక ద్వారము వెడలి యాసుందరివచ్చునప్పటికిఁ దనకెదురుగ నరుగుపై నిద్రించు రాజభటుఁడు "పోకుపోకు జాగ్రత్త" యని పలువరించెను. రహస్య కృత్యములఁ జేయువారు ప్రపంచమునందలియన్నియంశములుఁదమ విషయమే యనుకొందురుగాన నీమె యామాటలకు వెఱచి యిలు వెడల సాహసింప దయ్యెను. తుద కీ కన్య రేయియంతయు నిదుర లేకయే నిష్కారణముగ భ్రమపడి యింకఁ దనకుఁ దగుసమయము లభింప దనుకొనుచుండ జాముకోడి "కొక్కొరో" యని కూసి యా మెకు మఱింతవిచారమును గలిగించెను. అయినను నామె తనప్రయత్నమును మానక కడపటిసారి తలుపుందెఱచిచూడ వీథి నిర్మానుష్యమైయుండెను. ఇంటనందఱుఁ దెల్లవాఱుజామున వీఁచుమందమారుతములు తమ్ము సోఁకుటచే గాఢనిద్రం దేలుచుండిరి. అదితగినయదనని

మదినెంతేఁగి యాసుందరిమార్గమెఱుఁగుటకుఁ దన రెండుకన్నులందక్క దక్కనశరీరాంగములనెల్లఁగప్పు మేలిముసుంగుధరించుకొని గృహావరణముదాఁటి యీవలఁబడి తనకోరిక క్రేళ్లుదాఁటుచుండినట్లు తనగమనంబును నతివేగమై యుండునట్లు నడచి తాను నిర్ణయించుకొనిన స్థానమునకుం జనుచుండెను. అప్పుడు చీకఁటి పూర్ణముగ నున్నను నాకాశ మను పాలవెల్లిని విలాసార్థము గట్టిన పాదరసపుబుడ్డివలెఁ దోఁచిన వేఁగుఁజుక్క మినుకుమినుకు మని వెలుతురు నిచ్చుటచేతను ధాళధళ్యమగు మేలిముసుఁగు తనయొంట నుండుటచేతను నామె కితరులు, నితరుల కామెయు నగపడు చుండిరి. ఇట్లు కొంతదూరమాయింతి నడచినడచి యెవ్వరో మనుష్యులాత్రోవను వచ్చుచుండుటచేఁ గొంతతడ వొక యరుగుపైఁ గూరుచుండి మరలఁ దనప్రయాణము సాగింపఁ గొంత నడచి నాలుగుసందులమొగదగ్గఱ దనగమ్యస్థానమునకు దారి యెఱుఁగక నిలుచుండెను. అప్పుడు తనముం దిరువదియైదు సంవత్సరములయీడుగల మనుష్యుఁడు నడచిపోవుటఁజూచి యొంటరిగ దీర్ఘాలోచన మొనర్చుచు శిరమున వెల్లపాగయు, వెల్ల దేహమునఁ దెల్లయంగరకాయు ధరించి మెల్లఁగాఁ బోవునొకలేఁబ్రాయపువానిఁ గనుఁగొని చకచక వానివైపునకు నడచి చల్లఁగ వాని వీఁపునఁ జేయివైచెను. అదివఱకు నిర్మానుష్యమగువీథిని బోవు నీపురుషుఁ డీచల్లనిహస్తస్పర్శముచే నులికిపడి తిరిగి చూచి యెదుట మబ్బుమఱుంగున మసలుమెఱుంగు తెఱంగున ముసుంగుమఱుంగున మెలంగునంగనం జూచి యాశ్చర్యపడి యామెతో మెల్లఁగ, “నీ వెవ్వరిదానవు? నాతో నేమిపనియున్నది?” యని యడిగెను. ఆమెయు మృదూక్తులతో, “నాపేరెందుకు? భవానీదేవి దేవాలయమునకు దారి నీవెఱిఁగినచోఁ జెప్పుము. నేనటకుఁ బోవలయు” నని ప్రత్యుత్తర మొసఁగ నాతఁడు, “నీయెదుట నాచెట్లచాటున నొక మేడయున్నది.

ఆమీఁద కావలిదే భవానీదేవాలయ”మని చెప్పి యట్టిసమయంబునఁ జీఁకటి యనిశంకింపక, దురాచారులకు వెఱవక, కావలివాండ్రకు జంకక యతిసాహసముతో నొంటరిగఁ బయనము సేయు చున్న యామె తెగువకు మెచ్చుకొనుచు నా మొప్పెఁ గన్నులు నిగిడ్చి నిలువఁ బడెను. ఆమాటలు వినఁబడినతోడనే యన్నెలంత యా దేవళమువంక కరుగు చుండెను. ఆసుందరి యాలయమునం దెవ్వరినిమిత్త మేపని కయి చనుచున్నదో తెలియఁగోరి మన తెరువరి యామె వెనువెంటఁ దగిలి యామెచేఁ గనఁ గొనఁబడకుండ నడచు చుండెను. ఆమె యాలయమునఁజేరి మూసియున్నకవాటములు గుభాలునఁ ద్రోసి లోనికిఁజని దేవియున్న గుడితలుపులయొద్దకుంబోయి నిలిచెను. గర్భాలయపుతలుపులు మూయఁబడినందున నామె ముహూర్తమాత్రము యోచించి గుడియెదుట నేల సాష్టాంగ నమస్కార మొనర్చి తన మొగము పాఁపడిగడపపై మోపి కొంచెముసేపు వెక్కివెక్కి యేడువ సాగెను. ఈనడుమ వెంటవచ్చినయబ్బాలుఁడును బాలికస్థితికిఁదొంటి కంటె నక్కజపడుచు తెప్పవాల్పక యామెనుజూచుచు నొకమూల నామెచే లక్షితుండుగానట్లు కూరుచుండెను. ఊరడించువారు లేనందున దుఃఖము వెంటనే యుపశమిల్లెను. బాలిక తేలికయగుహృదయముతో నచ్చటినుండి యిట్లనెను. “అమ్మా! భవానీ! జగన్మాత! తండ్రిలేఁబిడ్డను నన్నిట్టుచేయుట నీకు ధర్మమా? ఇపుడు నామనస్సున కిష్టము లేనియీకార్యముఁ జేయుటకంటె నన్ను జంపివైవ రాదా? ఈకార్యమునుండి తొలంగు మని యాయమ్మకు నేల తోఁచునట్లుచేయవు? తల్లీ! నామనోరథము నెఱవేఱదేని నాకు విషమేగతి. ఆమాట నీకే దక్కఁగలదు. నాసాహసము నీకెఱుఁగ నిది కాదుకదా!” యని పరిపరివిధముల నమ్మహాదేవిని బ్రార్థించి త్వరపాటు చూపుటచేఁ దన్నెవ్వరైనఁ గన్గొందు రేమోయని

మరల గృహామునకుఁ జనవారు మేల్కొనకమున్న రుగఁదలఁచిలేఁచెను లేఁచు చుండఁగా, "నీమనోరథము నెఱవేఱును భయపడకు" మని యొక యమానుషవచన మామెచెవులకు వినవచ్చినట్లయ్యెను. అందుచే సఫలీకృతమనోరథ నయ్యెదనని యామె సంపూర్ణోత్సాహము గలిగి గుడి వెడలి పడిబారలు వచ్చునప్పటి కావల నాలయమున నక్కనయక్కమాటుఁను సుందరిం గలిసికొని వచ్చుట కారంభించెను. తనరహస్యముల నాతఁ డాలకించె నేమో యని యామెదిగులుగొని యాతని ననూయతోఁ జూచుచుండ నావయసుకాఁడు పరవశుఁడై యామెహస్తముం బట్టుకొని, "సౌందర్యమంతయు సంపూర్ణముగ నీసొమ్మయినది. ఇఁక నేమిననిముల్కై దేవిని బ్రార్థించుచున్నావు! నావంటివానిపై దయ యుంచు" మని యామెచేయి ముద్దుబెట్టుకొన యత్నించు చుండ నామె సహజముగ బలము గలదగుటచే స్త్రీసామాన్యమగు నధైర్యమును విడిచి చేయి విదలించుకొని కనులెఱ్ఱజేసి కోపముతోఁ నాతనిఁగసరఁ బోయెను. కాని యాతఁడామెను మరలఁ బట్టుకొని, "నాతో రా, నీ కెక్కడి కరుగఁ గలవు. రా!" యని లాగఁ దొడఁగెను. పడుచుకన్నియ యగుతాను నిశాసమయమున నొంటరిగా వచ్చినందుకు విచారించి, విచారించినఁ గార్యము లేదని యరక్షితరక్షిణి యగు నాభవానీమాతం దలంచి హా! జగన్మాతా! యని గద్గదస్వరముతో నఱచెను. ఆయఱపు గుడియరుగుపై నిద్రించుచు నప్పుడె మెలఁకువఁ గాంచిన యొకసన్యాసి విని "దురాత్మా! యెవండవురా! నీ" వని దగ్గఱకు వచ్చెను. వెంటనే యద్దురాత్ముండు పిక్కబలముఁజూపి యదృశ్యుఁ డయ్యెను. సన్యాసి యామె నూఱార్చి యిట్లొంటరిగా రాఁగూడ దని చెప్పి యింటి వనుక సాయము జనియెను. ఆమె యిల్లుచేరి తనవారెఱుఁగకుండ మెల్లన మంచముపైఁ బవ్వళించెను.

---

రెండవ ప్రకరణము.

హోల్కారు రాజ్యమునకు రాజధానియగు నిందూరునగరము నకు నేఁడుక్రోసులదూరమున మాహూ యనుపట్టణము కలదు. నిత్య కళ్యాణప్రదమగు పచ్చనియడవినడుమ నాపురముండుటచే నుద్యాన వనమందలి మేడలాగు ముద్దులు మూటఁగట్టుచు నుండుటయే కాక వ్యాధిగ్రస్తులకు నిరామయత నొసంగు నారోగ్యస్థానమై యలరు చుండును. దానికి మూఁడుక్రోసులదూరమున వింధ్యపర్వతసంబంధ ములగు కొండలచే నావరింపఁబడి యొకగూడెము కోటనడుమనున్న పల్లెవలె సురక్షితమై యుండెను. ఆపల్లె కులవృత్తివలన జీవించు గొల్లలకు నివాసస్థానమై వారికిఁ గామితసౌఖ్యప్రదాయిని యయి యుండెను. ఆగొల్లలచే భగవదవతార మని పూజింపఁ బడుచు మాహూనగరవాసులచే నాగతానాగతవేది యగు మహర్షి యని యెన్నఁబడు నొకవృద్ధుఁ డుండెను. ముడుతలువడిన మొగమును, నాకు లన్నియుఁ బండి రాలినవెనుక మోడగుచెట్టువలె నున్నసయి వెండ్రు కలులేకయున్న శిరస్సును, నాతఁడు కాలము దీఱినవాఁడని వేనోళ్ళఁ జాటుచున్నను నాతని యద్భుతదార్ఢ్యమును దంతపటిమయుఁ జెవుడు రామియు, గమనవేగమును, నతఁ డంతటి యీడుగలవాఁడా యని సందియము గొలుపును. కొంచెము రేఁజీకటి తప్ప నేత్రరోగముఁ గూడఁ బగటివేళ నెద్దియులేదు. కనులయెదుట బంధుగణ మెల్ల నశించుటయుఁ దనకుఁ జిరాయువు గలుగుటయుఁ జూచి యావృద్ధుఁడు తన ముప్పెట్లు గడచునని చింతించు టప్పుడప్పుడు కలదు గాని మూఢభక్తిగల గొల్లలు మహానుభావుఁ డని వాని కభిలోపచార ములు చేయుచుందురు. దిక్కులేనివారికి దేవుఁ డేదిక్కైనఁ జూపునుగదా! గొల్లలందఱు మహర్షులు వసియింపఁదగు పర్ణశాల

వలె నొకకుటీరమును నిర్మించి యం దాతని నుంచిరి. శతవత్సర పూర్ణుం డయినను మనోబలము చెడనివాఁ డగుటచే రాజకార్యముల యందుఁ గూడ నతనియాలోచన మమోఘము. పూర్వకాలపుసంగతుల నెఱుఁగఁ గోరినవారును, గ్రొత్తపనులం దలపెట్టి యవి నెరవేఱునో లేదో యనుసందేహము గలవారును నీవృద్ధు నడిగి వాని యిచ్ఛాప్రకారము వర్తింతురు. ఒకనాఁడు సాయంకాలమున గడియరాత్రి యైన తరువాత నొకపడుచువాఁడు సత్యఋషియని ప్రసిద్ధికెక్కిన వృద్ధునియొద్దకుఁ బాదచారియై వచ్చుచుండెను. వంపులు తిరిగి తుమ్మెదఱెక్కలతో నెకసక్కెము సేయు మీసములసొరును, వెడఁదనుదురుసోయగమును, చెవులస్పృశించుకొనలు గలకనులతీరును జక్కనివారిలోఁ జక్కనివాఁ డని యతనికి బిరుదునామము గలుగుటకుఁ గారణము లయ్యెను. యౌవన మంగసౌష్ఠవమును బరిపూర్ణము సేయ విద్య గుణసౌష్ఠవమును బూర్ణముఁ జేసెను. చిన్ననాఁటనుండియు సాముకసరతులు చేయుటచే దండలు తిరిగిన భుజములును,విశాలవక్షమును, మూర్తినిస్తోత్రపాత్రముగఁ జేసినట్లులె విద్యవలనఁ గలిగినశాంతము, సువర్తనముఁ గీర్తిని సుజనస్తోత్రపాత్రముగఁ జేసెను. బలము నకుఁ గార్యములయందలిచలనము వానికి వన్నెఁ దెచ్చెను. చుట్టుజరీ గలయెఱ్ఱతలపాగాయుఁ బచ్చపట్టంగరకాయుఁ, దెల్లనిమడుపుదోవతియు, వల్లెవాటుగ నిడ్డయుత్తరీయమును వానియలంకారమునుసమాప్తము చేసెను. ఆవన్నెకాఁడుసత్యఋషికుటీరమును బ్రాపించితలుపుం ద్రోసి ప్రత్యుత్తరము రాసందున నచట నిలువఁబడి యుండెను. వృద్ధుఁడు లోన నెవరితోడనో గుసగుసలాడు చున్నట్లు శబ్దము విన వచ్చెను. ఆమాటలు వినఁబడకమున్నె శ్యామసుందరదత్తు మఱల తలుపుఁ ద్రోయుటచే ఋషి తననిమిత్త మెవ్వరో వచ్చినారనిలోపల నున్న మనుష్యుని వెడలిపొమ్మని యానతిచ్చి తలుపుదీసెను. అంతట

వృద్ధుఁడు శ్యామసుందరుని రమ్మని పిలువ నాతఁడు కుటీరము వెడలి ముసుఁగువైచికొని చనుచున్న యతిదీర్ఘకాయుని మహాసత్త్వుని దేటి చూచుచు వెంటనే లోపలికిం జనఁ డయ్యెను. ఆపురుషుఁ డెవ్వం డయి యుండునా యని యోచించి శ్యామసుందరుఁడు లోనికిం జని లెక్కకుమించిన చినుఁగులతో నేలపైఁ బడియున్న పాఁతకంబళము పై వృద్ధుఁ డొసంగిన యాతిథ్యమునకు సంతసించి కూరుచుండినతరు వాత వా రొకరితో నొకరిట్లు మాటాడిరి.

ఋషి—నాయనా! నీవెవ్వరిచే నంపఁబడి నానిమిత్తమువచ్చి నావు? నీపేరు శ్యామసుందరుఁడు కదా ?

శ్యామ—ఔను! రాధాకాంతరావుగారు మీదర్శనముచేసి యాయన మున్న మనవిచేసినయంశమును గూర్చి మీరాలోచించితి రేమోయని తెలిసికొని రమ్మనిరి.

ఋషి—(తలయూఁచి) ఆ! నేనావిషయమై యోచించినాను. తుదనెగ్గుట కష్టసాధ్యము.

శ్యామ—కష్టమునకునేమి? వారి ధనము దినుచు మేమువారి పక్షమునఁ గష్టపడుదుము. శ్రమ కేమియు సంశయింపము.

ఋషి—మీరెంతకృతజ్ఞతతోఁ బనిచేసినను నామె స్త్రీకదా. పురుషులపైఁ గక్షవహించి తుదనెగ్గుట యసాధ్యము. నేనిట్టు లెన్ని చూచినాను! ఆమె జస్వంతరావు చెప్పినట్లు వినుట మంచిది.

అని యాతఁడు తనయభిప్రాయ మెఱింగింప దత్తునకు ముఖవికాసము రవ్వంత మందమగుటఁ గనిపెట్టి ఋషి యాతనికి ధైర్యము కలుగునట్లు మరల "నయినను దైవము మనపక్షమున నున్నాఁడు. హోల్కారువంశమును మొదటనుండియు నెఱిఁగిననేను మనరాణిగెలుచునట్లు నాశీర్వచన మొసంగెద" నని హెచ్చరించెను.

శ్యామ—అయ్యా! మీరు రాణిగారిపూర్వుల నెఱుఁగుదురా? మీవయ సెంత ?

ఋషి—నావయ సెంతయున్నదో నేనెఱుంగను. సంగతులను బట్టి తెలిసికొనుము

శ్యామ—మీరు శివాజీమహారాజు నెఱుఁగుదురా?

ఋ—సరి. సరి. నాకర్మముకాల. నేను శివాజి నెఱుఁగక పోవలెనా? ఆతఁడు మృతినొందునప్పటికి నేను బండ్రెండేండ్లవాఁడను

శ్యా—శంభాజీ సాహూమహారాజులను జక్కఁగ నెఱుఁగుదు రని నేఁ దలంచుచున్నాను.

ఋ—బాగున్నది. శాహు మొన్నటివాఁడు కాఁడటన్న నాకనులముందఱఁబుట్టి నాకనులముందఱ మృతినొందినవాఁడు.

శ్యామ—ఔరంగజేబును మీరు స్వయముగా నెన్నఁడైనఁ జూచినారా?

ఋ—అలంఘీరును జూచినారా యని యడుగుచున్నావా? అలంఘీరు సేనలతో యుద్ధముచేసినవా రెవరు? నేనుగానా?

శ్యామ—పీష్వాబాలాజీ విశ్వనాథులఁ గూర్చి మి మ్మడుగఁ నక్కఱలేదు. వారందఱు మీకు లెక్కలేదు.

ఋ—నిన్నటివాండ్రి సంగతి నన్నడిగెద వేమి? పూర్వాంశముల నేమయిన నడుగవలసినయెడల నడుగుము.

శ్యామ—మలహారురావుహోల్కారుగారి శౌర్యము మీరు చక్కఁగా నెఱుఁగుదురు కాఁబోలు.

ఋ—మలహారురావు గాదు. ఆయనతండ్రియు నేనును మిగుల స్నేహితులము.

శ్యా—అట్లయిన నూఱుసంవత్సరములయామధ్య మీరెఱుఁగని యంశములు లేవు. మీరు జాంబవంతునికన్న నెక్కుడుప్రాయ ముగలవారుగాను పెద్దగాఁ గనుపించుచున్నారు.

ఋ—ఎన్ని యేండ్లుగడచిన నేమి? ఎంతవయస్సువచ్చిన నేమి? ఈ

మీకు సాహాయ్య మొసఁగఁ గలిగితినేని నాజన్మము ధన్యతఁ గాంచును. కృతజ్ఞు లామెచుట్టును లేరు గనుక యామె నిరపాయమయిన స్థితిలో లేదు.

శ్యామ—(తొందరతో) ఎవరు కృతజ్ఞులు కారు?

ఋ—ఎవరును గారు. గణోజీ, బాలతురావు, గోమాజీ దక్కఁ దక్కినవా రెవ్వరును గృతజ్ఞులుగారు. రాధాకాంతరావుగూడ మంచివాఁడని చెప్పవచ్చును.

రాధాకాంతరావు విషయములో ఋషి పలికిన సందిగ్ధవచనములు శ్యామసుందరుని మనసునకుఁ గొంతవ్యాకులపాటు గలిగింపనదివఱకు దానుగన్నులారఁ జూచుచుండినదానికి నేనుచెవులార విన్నదానికిఁ గలవ్యత్యాసమునకుఁ గారణ మూహించుచుండెను. మార్పునొందినవానిముఖమై ఖరి నవలోకించి ఋషి యేమో మరలఁ బలుకఁ బ్రియత్నించుచుఁ దనపెదవులఁ గదుపుచుండు నంతలోఁ గుటీరపుఁ వాకిట "అయ్యో! అయ్యో! నిష్కారణ మిద్దఱును జచ్చిపోవుచున్నారు. రక్షింపుఁడు రక్షింపుఁడు. కటకటా! ఆఁడుదికూడ దారుణముగునాపదపా లగుచున్నది. రండి రండి" యని యెవఁడో యంగలార్చుచుఁ బలుగ్రత్తసాగెను. కరుణార్ద్రహృదయుఁ డగుశ్యామసుందరుఁడు యోగితో సంభాషణము మాని యోగియింట గోడపైనున్న ఓలుకక్రొయ్యకుఁ దగుల్పఁబడినవిల్లును నమ్ములంగొని మొలలోనున్న చిన్నకై జారు నూడఁబెఱికి యాస్థలమువంకఁ జనెను. ఋషి యార్తనాదముసేయు నాపురుషునిబిలిచి యాపదనొందినవా రెవ్వరని యడిగెను గాని వాఁడు పేరు జెప్పకయే దత్తును వెంబడించి పోయెను. అప్పుడు ఋషి తనలో "నీదినముననో రేపో యాతఁడు వచ్చునని తెలిసినది. ఈయదృష్టహీనుఁడు వాఁడై యుండఁడు గద" యని వితర్కించుకొని యెద్దియుందోఁపమి నిటు నటు దిరుగులాడుచు నెందుచేతనో

యాస్థానమునకుమాత్ర మరుగక తామరాకులోనినీరుతీరునఁ దటతట బరితపించుచుండెను.

---

## మూఁడవప్రకరణము

రాఘోజీహోల్కారున కప్పటికి నేబదివత్సరములకంటె నొకటి రెండెక్కువ యుండునే కాని తక్కువలేవు. చిన్నతనమందు మలహారు రావుహోల్కారునకుఁ దమలపాకు చుట్టలు దుస్తు లందించు నీచసేవకకోటిలోనివాఁడై యాప్రభువు సనుగ్రహమునకుఁ బాత్రుఁడై సైన్యమున నొకసరదారయ్యెను. తెలివితేఁటలు గలమహారాష్ట్రుఁ డగుటచే నతిత్వరితముగా రాజ్యమున నున్న ముఖ్యోద్యోగస్థులలో నొక్కఁడై మలహారురావు చనిపోవునప్పటికిఁ బ్రధానవర్గములలో నొక్కఁడయ్యెను. ఈతఁడు సత్కులీనుఁడును సదాచారుఁడును గాకుండినను మిగుల ప్రజ్ఞగలవాఁడు. అందుయుక్తులకుఁ బెట్టినదిపేరు. మోసమున నితనిఁజెప్పి మఱియొకరిని జెప్పవలయును. అతఁడు సౌందర్యము లేనినల్లని మోటుమనుజుఁ డని చెప్పుటకంటె వానియాకారము వర్ణింపనక్కఱ లేదు. ప్రథమకళత్రము వియోగ మొందుటచే మరల వివాహమాడఁ బ్రయత్నించి తన ప్రియమిత్రుఁ డగు హరిహర పాండ్యాజీసహాయమున సౌందర్యరాశి యగు నొకకన్యం జేకొని మఱి కొన్ని రాజకార్యవిషయములగు నుత్తరములు సంగ్రహించుకొనియిందూరునగరమునకు వచ్చుచుండెను. ఆరాత్రి యెట్లయిన మహేశ్వరముఁ జేరవలయు నని నిశ్చయించి ప్రొద్దు వోయిన వెనుకఁ గూడ బయన మొనర్చుచుఁ దాము వచ్చునప్పటికి వంటకముఁ జేయించి

సిద్ధముగ నుండు మని దుండిరావు సంపెను. పల్లకియందుఁ బదునెని మిదివత్సరముల వయస్సు గలసుందరి యొకర్తు గూర్చుండితలుపు లించుక తెఱచి చుట్టునున్నకొండలను మహావృక్షములను నిష్కళుష మైనయాకాశమును జూచుచుండెను. ఓంకారనాదములతో బోయలు పల్లకి మోయుచుఁ దనవెంట రాఁగా రాణోజీవల్కారు గడియగడియకు సకిలించుచు నలసి మోయలేక తన్ను మోయుచున్న గుఱ్ఱము నెక్కి యిరుప్రక్కల నిరువు రాయుధపాణు లగుభటులు గొల్వఁ బడలికతోఁ బయన మొనర్చుచుండెను. మార్గశ్రమచేఁ జెన్ను చెదరి విసిగియున్న యాసుందరిపల్లకికి సరిగా మస్త్యమధ్య నొకమాఱు తన గుఱ్ఱమును నడిపించుచుఁ "గమలా! నీవుమిగుల శ్రమపడినట్లున్నావు. వచ్చినంతదూరము రానక్కఱలేదు. కావలసినయెడల నాదగ్గఱ నున్న రొట్టెలు నాల్గు తిను" మని యోదార్పుమాటలు పలుకుచు వడిగ నడుగులు వైవుఁడని బోయీలను హెచ్చరించుచు రాణోజీ రెండు గడియలరాత్రికి ఋషి వసియించుప్రదేశమునకు సమీపముగావచ్చెను. అదికృష్ణపక్షమున కారంభమగుటచే నాపాడ్యమినాఁడు చంద్రోదయము రెండుగడియల కగుచుండెను. తూర్పునఁ దెల్లదువ్వలువఁబఱచినట్లు రేఖలు గానఁబడెను.

అట్లు పయనముచేయు నామనుష్యులయెదుటఁ జెవులు బ్రిద్దలగునట్లు మోరయెత్తి ఘణిల్లు ఘణిల్లు మని అంకవైచుచు నొక వృషభము కాలిడెక్కతో నేలఁ ద్రవ్వి దుమ్ము రేపుచు 'భయంకరాకారముతో దారికడ్డముగానిలిచి యుండెను. మార్గమునుండి యాయెద్దు మొద్దువలెఁ దొలఁగనందునఁ దాము పోవుటకు నెద్దును బెదరింపుమని రాణోజీ తనసేవకులలో నొకని నాజ్ఞాపించెను. మందబుద్ధియు మొఱటువయుఁ గలనాసేవకుఁడు ద్విపాదపశువు గనుక నాపశువు బెదరఁగొట్టుట కుపాయము తెలియక తనప్రక్కనున్న

యెఱ్ఱగుడ్డ విప్పి హుర్రా హుర్రాయని యాగుడ్డ దానిపై వైవఁబో యెను. ఆపశు వదివఱ కొకకాలుదున్న పోతుతోఁ బోరాడి దానిచే గాయములు తగుల నొచ్చి కడుఁగోపముతో నుండెను. అంతలో గుఱ్ఱ మొకసారి సకిలించెను. బోయ లోంకార మెక్కువ చేసిరి. ఎఱ్ఱగుడ్డఁ జూపుటచే బెదరి బోయల యోంకారములచేఁ గలవలపడి గుఱ్ఱపుసకిలింపుల సహింపనోపకనాలపోతు మార్గస్థులగుండెలు వ్రక్క లగునట్లు అంకవైచి రభసంబున వారిపైఁబడెను. దీనికంతకుఁగారణుఁ డైనమూర్ఖసేవకుఁడు దానిబారినుండి తప్పించుకొని యావలఁబడెను. ఆమనుష్యుని వెనుకనే వచ్చుచున్న రాణోజీపై నాజంతువు దుమికి మునుముందు నడువలేక సగము చచ్చినయశ్వముపైఁ బడి దానిని నేలఁ గూలఁ ద్రోయ సాహసముతోఁ గూడ నాతఁడును నేలఁగూలెను. కూలినతోడనే యాతఁడు లేవఁ బ్రయత్నించు చుండు నంతలో గుఱ్ఱముమీఁదనుండి యాతనిమీఁదికి దుమికి య ప్పాపపుఁబశువు దేహ మెఱుఁగక సూదిమొనవలె వాఁడిగనున్న కొ మ్ములతో నాతని గుండెలమీఁదను డొక్కలోను నెడమకణతమీఁద ను గుచ్చిమిక్కి తనయిచ్చవచ్చినట్లు గాయములుచేసి వెడలు కొన్నెత్తు రుతోఁ దనకొమ్ముల నలంకరించుకొనెను. సేవకులిరువురును భయ కంపితులై యాయుధములు తమంతటఁ దామె వారిచేతులనుండి నేల జాఱ వెనుకకుఁదిరిగి చూడక పఱుగెత్తిరి. బోయలు మోయుపల్లకి నచ్చట విడిచి చల్లాచెదరై నలుదెసలకుఁ బలాయితులైరి. ఒక నిమే షమున నచ్చటఁ గ్రిందఁబడిన నాయకుఁడును, బల్లకిలోనున్న సుంద రియుఁ దక్క నెవ్వరు లేరైరి. పాఱిపోయిన సేవకులలో నొకఁడు తన స్వామిపై జాలిగలిగి ఋషికుటీరము దగ్గఱకువచ్చి యాఘోరవార్త నచటివారికిఁ దెలుపుటయు శ్యామసుందరదత్తు సహాయార్థముబయలు దేఱుటయు మీరంతఱు నెఱుఁగుదురు గదా.

శ్యామసుందరుఁడు కడువేగమున నడచివచ్చెను. ఈలోన నా స్త్రీ పడియున్న రాణోజీని తనయసహాయస్థితినిజూచి కదలిమెదలిపోవుటకు సంగములాడక కొయ్యయయ్యెను. బోయలు పల్లకి దింపుటయు రాణోజీపై నెద్దు పడుటయు నామెయెఱుఁగునుగాని తరువాత నేమిజరిగెనో యెఱుఁగదు. పండుకొన్న దేహము పండుకొన్నట్లెయుండెను. చూచెడుకన్నులు చూచిన ట్లుండెను. ఇట్లామె మహాభీతితో నుండ నాయెద్దు కోపాగ్ని చల్లారకపోవుటచేఁ గాఁబోలు చెంగున నా పల్లకిమీఁదఁబడి కొమ్ములతో గుభిల్లు గుభిల్లు మని యాపల్లకింబొడుచుచు తనమహాబలముచేఁ దాని నడ్డముగాఁ బడఁద్రోసిదానిపై నెక్కి తన్ని పగులఁ గొట్టుచుండెను. ఆనారీమణి స్మారకమెఱుఁగక మొదట మాత్రమొక కేకవైచి మూర్ఛిల్లి యందుఁబడి యుండెను. దత్తు తత్తరపడుచు సనతిదూరమున నామె కేక విని యతిత్వరితమునవచ్చి మనోధైర్యమును జిక్కఁబట్టి విల్లుపయోగింపనెంచి యందసమాన ప్రజ్ఞ గలమహారాష్ట్రుఁ డగుటచే వరుసగా రెండుబాణములు దాని మొగమున నాటనేసెను. వెంటనే యది రోసముచేఁ బైఁబడ నుంకింప నతఁడు మఱి రెండు బాణములను రెండుకన్నులమీఁద గీలింప యంబా యని నేలఁబడెను. వెంటనే యాసేవకుఁడు వచ్చి తనకత్తితో దానిని నఱికి తనయసహాయశూరతఁ జూపెను. అప్పుడు దత్తు పల్లకి యథాప్రకారముగాఁ బెట్టించి తలుపుఁదెఱచి యందు మాటలాడనేరనిపోఁతపసిఁడిబొమ్మయై నిలుకడఁ గన్న మెఱుపుఁదీగయై మన్మథ రాజ్యలక్ష్మియై పడుచువాండ్ర బాధించు హృదయశల్యమై నిశ్చేష్టురాలగునయ్యతివం జూచి యామెను లెమ్మని పిలువ నామె పలుకదయ్యె. ఆమెను లేవఁదీయుటకుఁ దనకు సహాయముచేయుమని సేవకు నడుగ "నిద్రపోయెడుదానిని లేపెద వేమి? ఆమెను బండుకొననిమ్ము. నీవిటురా" యని వాఁడు మందలించెను. కొంచెము చల్లనీరు తెమ్మని

సేవకు నంపి తానె యమ్మగువను సందిటఁబట్టి కూరుచుండఁబెట్టి పడ కుండ నామెను దాను గూడఁ బట్టుకొనియుండెను. ఆమె జీవచ్ఛవమై మాటయుఁ గదలికయు లేక యెట్టులుంచిన నట్టులుండెను. మేనెల్ల జలుచెమ్మటలు గ్రమ్మి కణములుగాఁ బరిణమించి మొగమున ముత్యాలు వెట్టినట్లు వింతవిన్నాణము నొసంగెను. విలాసార్థ మామెకొప్పున గ్రుచ్చినమల్లెపుష్పములు నలుదెసలు జాఱి యామెవలెవసివాడి యుండెను. నట్టివు లయి పెద్దవగుపిఱుఁదుల స్పృశియించి నిడుదవెంట్రుకలు మొగమ్మునంతయుఁ గ్రమ్మునట్లు చీకాకుపడుటచే నామెవదనము భుజచ్ఛాయతోఁగూడ గ్రహణకాలచంద్రునివలె నుండెను. చెనుటలచేఁగరఁగి మొగమంతయువ్యాపించిన కుంకుమబొట్టు ముఖారవిందమున కొక్క-యారుణ్యమును దెచ్చి సంధ్యారాగములో నున్న చంద్రమండలములాగు వన్నె పెట్టెను. బెదరిన లేడికన్నులవలెఁ జలించు నేత్రములును భయమున వడఁకు గాత్రమును నందక త్రియలగరువ మడంచుతీవియు దొండపండునకు బంధువగు మోవియు నామెయందమునకు వింతయందము నీయ నొడలెఱుంగని స్థితియందుండియు నామె మోహినీదేవివలె నుండెను. సుందరాంగు లెట్టియవస్థలోనున్నను స్తోత్రపాత్రలేకద! శ్యామసుందరదత్తు కమలాబాయి మొగమువంకఁ గోరికలూరఁ గన్నులకఱవుఁ దీఱ నూహా లెంతదూరమోపాఱఁ బలుమాఱు తెప్పవాల్పక చూచి యామెకు సముచితోపచారములఁ జేసెను. ఇంతలో సేవకుఁడు నీరుఁ దెచ్చుటయుఁ జల్లని యాజల మామె మొగమునఁగొట్ట నామె కొంతసేదఁదేఱి కొంచెము నీరు ద్రావి మఱల సొమ్మసిలి తిరిగి కొంతయుదకము గ్రోలి కను విచ్చె. కను విచ్చి యాసుందరి భువనసుందరవిగ్రహుఁడగు శ్యామసుందరుఁ గనుఁగొని సిగ్గునఁ దల వంచి పరపురుషునియెదుటఁ గూరుచుండుట కిష్టములేక మెల్లగా లేచి యావలకుఁ జరిగి క్రిందఁబఱచిన

యుత్తరీయము మేలిముసుఁగుగా వైచికొని యాతఁ డెవ్వఁ డని యాలోచించుచుఁ బ్రభు వెట్లుండె నని సేవకు నడిగెను. ఈనడుమ శ్యామసుందరుఁడు రాణోజీయొద్దకుఁబోయి శరీరమునిండగాయములఁ జూచి యాతఁడు జీవించుట యసాధ్యమని యెంచియుఁ దగుచికిత్సఁ జేయఁ దలఁచి మెల్లగఁ దానును సేవకుఁడును వానినెత్తి పల్లకిలోఁ బరుండఁ బెట్టిరి. అప్పుడు రాణోజీ నాభార్యనాభార్యయని మెల్లఁగా నన "నీభార్యసురక్షితముగా నున్నది. భయములే" దని దత్తుప్రత్యుత్తర మొసంగి రెండుగుడ్డలు మసిచేసి యాగాయములకుఁ గట్టుకట్టెను. ఆరెండుమాటలుగాక యెన్నిసారులుపిలిచినను రాణోజీపలుకకతనలో దాను పలుమాఱు పలువరింపఁదొడంగె. సేవకునివలనఁ దనప్రభువింకను సురక్షితుఁ డని యెఱిఁగి కమలాబాయి "యింకను జీవించియున్నాఁడా! దైవమునకు నాపై నింత కోప ముండ నాకు సుగతియెట్లగును! ఎద్దు నాకుఁ బూర్వముగ నుపకారము చేయలేదు. నన్నుఁజంపినను మేలుగానుండు" నని తనలో విచారించెను. ఇంతలోబోయలు తిరిగివచ్చుటచే రాణోజీని బల్లకిలో మోయించి గూడెమునుండి బండి తెప్పించి కమలనందుఁగూర్చుండఁబెట్టి వారినందఱిని మాహులీ నగరమునకు శ్యామసుందరదత్తు తీసుకొని పోయెను.

---

## నాల్గవప్రకరణము

మహులీనగరమున మురళీధరదాసను నొకమనుష్యుఁడు సుందరియు గుణవతియు నగునానందాబాయి యను భార్యతోఁ గాపురము నేయు చుండెను. అతఁడు పిల్లలుగలాఁడును బీదవాఁడు నైనను గొంచెము వ్రాఁతనేర్చినవాఁ డగుటచే హజారుమల్లను మార్వాడీవర్తక

కునియొద్ద లెక్కలు వ్రాయుచు స్వల్పజీతమును గ్రహించుచు మిగుల గౌరవము కలిగి కాలక్షేపము సేయుచుండెను. ఆనందబాయి యిప్పటికి ముప్పదివత్సరములు వయస్సుగలదై మగనికంటె మూఁడుసంవత్సరములు చిన్నదై యుండెను. మురళీధరదాసు పొడుగుగ నుండును గాని బక్కపలుచనిపసిఁడివన్నె గలశరీరముతో నందగాఁ డని పేరొందినవాఁడే. రమారమి జాము రాత్రియగునప్పటికి శరీర మెఱుఁగక పడియున్న రాణోజీని దిక్కులేక భయవివశురాలైన కమలాబాయిని వెంటఁబెట్టుకొని శ్యామసుందరదత్తు మాహురానగరముఁ బ్రవేశించి మురళీధరదాసుగృహమునకు రమ్మని బోయల కానతిచ్చి తాను ముందుగా నాగృహమువైపు జనెను. భోజనముచేసి భాగవతము చదువుకొనుచున్న మురళీధరునియెదుట శ్యామసుందరుఁడు నిలువ నతఁడమితానందము నొంది భార్యను బిలచి "మనదత్తువచ్చినాఁడు. మనద" త్తనియఱచెను. ఆనందబాయి చాలకాలమునకింటఁ జూచుటచే దత్తును జేర రమ్మని "యేమినాయనా! యింతకాలము జాగుచేసినా" వని తలపైఁ జేయివైచి నిమిరెను. "అక్కయ్యా! నారాక కేమి గాని శ్రీరాణి యహల్యాబాయిగారికొలువులో గొప్పయుద్యోగి యగురాణోజీ చచ్చుటకుసిద్ధముగానున్నాఁడు. అతనితో భార్యకూడవచ్చినది. వారివిషయమై మన మతిజాగ్రత్త పుచ్చుకొనవలె" నని జరిగినవృత్తాంతమునంతయుఁదనభావకును సోదరికిని దెలియఁబఱచెను. అంతలో మనకమల యెక్కినబండియుఁ బల్లకియు వచ్చినందున నిస్పృహుండగు రాణోజీని మెల్లమెల్లగఁ జేతులమీఁద వైచికొని లోపలికిఁ దెచ్చి యొకగదిలో నొకపఱుపుమీఁదఁ బండుకొనఁబెట్టఁ బాపము రాణోజీ మూలుగుటయె కాని బాధ యిది యని చెప్పనేరక పిలిచినఁబలుకక ప్రక్కపైఁ గొట్టుకొనసాగెను. వా రారాత్రి యొక ప్రౌఢవైద్యుని రప్పించి యాతనిఁ జూపఁగా నతఁడు పెదవి విఱచి. "రోగి బ్రతుక

దుర్లభ* మని చెప్పెను. ఆనందబాయి కమలాబాయిని మిగుల గౌర
వముగ లోనికిఁ దెచ్చి కొంచె మెంగిలిపఱచి దుఃఖభారమున నాత్మ
హత్యఁ జేసికొను నేమో యని కను మొఱఁగునతోఁ గాపాడుచు నా
మె నొకనిమిషమును వదలక నడుమనడుమ నామెయందమున కాశ్చ
ర్యము నందుచు కాకిముక్కునకు దొండపండు గట్టినట్లు ముదివాని
కీచిన్నదానిని దల్లిదండ్రు లెట్లిచ్చిరో కదా? ఆముసలివానితో నైన
నింతపసుపుఁ గుంకుమబెట్టుకొని పదికాలములపాటు గాపురముఁ జేయ
నీయక దైవ మామెకు ఘోరవైపరీత్యముఁ దెచ్చిపెట్టును గాఁబో
లును. ఈరూప మడవిఁగాచినవెన్నెలయగునా!" యని విచారపడుచు
నామెపైఁ జేయి వైచి పండుకొనెను. రాణోజిస్థితిఁజూచి మురళీధరు
డాతనితమ్ముఁ డగుదాతలరావునకు నొకమనుష్యునిచే వర్తమాన
మంపెను. ముందు రాణోజికి వంటజేయుటకుఁ బంపఁబడినదుండిరావు
గంజాయిదుకాణమున దిట్టముగగంజాయిఁద్రాగి మెలఁకువలేక పండు
కొని యుండ మార్గమున నెద్దునుబెదరించినలక్ష్మణుఁడు దుకాణ
మునకు గంజాయికిఁ బోయి దుండిని లేపి జరిగినవృత్తాంతమును జెప్పి
పంపెను. దుండిరా వచ్చుటకి వచ్చి తనయజమానునకు సహాయ మె
ద్దియు నొనర్పఁజాలక యాతని నాధారముగఁ జేసికొని తానబన్నిన
పన్నుగడ లన్నియు వ్యర్థము లయ్యె నని చింతించుచు నిద్ర నాఁప
లేక రెండుకునుకులు కునికెను. ఈనడుమ నానందబాయి కొంచెము
కన్ను మూసినందున పలువిధము లగుతలంపులు మనసున మల్లడిఁగొ
నుటచే తెప్పపాటు లేక నిట్టూర్పు విడుచుచుఁ గమల లేచికూర్చుండి
కన్నులనిండ ముక్తాఫలములవలెఁ గ్రమ్ముకొనియున్న బాష్పములుమా
టిమాటికిఁ దుడిచికొనుచు మిగుల దుఃఖించుచు, "అమ్మా! నీవెంతకఁ
ఠినురాలవు: నీవు నాకుఁ జేసినయీద్రోహమున నేనీజన్మమునకు మఱల
దగ్గఱకు రాను.. అంత మీఁదుమిక్కిలి వచ్చిన విచ్చుటనే శరీర

సమాప్తముఁ జేసెదను. దైవమా! నాకేల మరణముఁగలుగఁ జేయవు! ఆయొద్దు నన్నేల క్రమ్మకపోపలె? ఈయనపని యెట్లయినను నేను దురదృష్టవంతురాలనే" యని వగచు చుండెను. అంతలో నాసందబాయి మేలుకొని ప్రక్కలో నామెలేకుండుటకుఁ గలవలపడి లేచి దూరమునఁగూర్చుండినయామెకన్నీయంజూచితఃయజాగ్రత్తవలస సహాయ మప్పటికి రానందుకు సంతోషించెనుగాన యప్పుడప్పుడెతొందరతోఁ దనకన్నీ ళ్లగపడకుండఁ గిమ్ము తుడుచుకొనునను నామెదుఃఖించు చున్నట్టు లానంద తెలిసికొని మితిమీఱిన జాలిచే నామెదగ్గఱగజని స్త్రీయగుటచే స్వాభావికలక్షణము పోకుండఁ దానుగూడఁగంటదడిపెట్టుకొని, "అమ్మా! యేల వాపోవుదు? నీముఖసౌందర్యమును నీవిలాసమును జూడఁగా మఱియొకయుపద్రవము జరుగఁ గూడ దని నాకుఁ దోఁచుచున్నది. అయినను విలపించినఁ గార్యమేమి? నీభర్తప్రాణములవిషయమై కాక మఱి యేవిషయమైనను నాతమ్ముఁడు నీకుఁ గావలసిన సాయముఁ జేయును. అతఁడు మంచివాఁ"డనియూఱడించెను. కమల యప్పుడు తనవెనుకటియవస్థ యెల్లమనసునఁ దట్టుటచే నొకమాఱామె యొడిలోఁ దల పెట్టుకొని గట్టిగ రోదన మొనర్చి, "అమ్మా! నీవు మాతల్లివంటిదానవు. నీతమ్ముఁడు మిగుల మంచివాఁడు అన్నివిధముల సంతతివానిఁ జూచి యెఱుఁగను. ప్రాణములు నిలిపినమహాత్ముఁడు కాఁడా? ఏన్నటికైన నాకతఁడే దిక్కని నమ్ముకొనియుంటి" నని పలికెను. ఇంతలో శ్యామసుందరదత్తు తలుపుఁ దెఱచి గదిలోని కరుదెంచుటచే వారిసంభాషణముముగిసెను. కమల యాతనిఁ జూచి చటుక్కున లేచి గోడకుఁ జేరి నిలిచి సిగ్గునఁ దలవంచి పదాంగుళిముతో నేల రాయుచుండెను. ఆమెవైపు చూడక నిగిడించి దత్తుతనసోదరితో, "అక్కయ్యా! రాజాజీగారికి రవ్వంత నిలబాటు చేసిన దనితోఁచుచున్నయది. కుదుటే

వచ్చునని నాకాశకలదని తనరాకచే వారిసంభాషణ యాగిన దనియుఁ గమల సిగ్గున నిలువవలసివచ్చిన దనియుఁ దానాగది విడిచి వీథిలోనికిం జని యేమియుఁ దోఁచక యిటు నటు పచారు చేయుచుండెను.

అప్పుడు రెండుఁగాములరాత్రికంటె నధికముగఁబొద్దు పోవుటచే వీథులలో నెవరును లేరైరి. పిండియారఁబోసినట్లు వెన్నెల ధవళధవళమై వ్యాపించి యుండ నున్నతసౌధములయొక్కయుఁ దమ యింటికావల నున్న దేవాలయముయొక్కయు నీడలు వీథిలోనికివ్యాపించి యనుపమానమైనసౌందర్యము నొలికించుచుండెను. ఆవెన్నెల కెరటములలో మునిఁగి యానందము నొందుచు శ్యామసుందరుఁ డాసాయంకాలము తనహృదయము నపహరించినదొంగను బలుమారు దలఁచుకొని మనస్తాపము నొందసాగెను. "ఆహాహా! ఏమి యాకమలసౌందర్యము! ఆమెసార్థకనామము నిజముగ లక్ష్మియె. వేయిజన్మములకైన నేనీమెను మరువఁజాలను. ఈమె నాయది. ఎంత వెఱ్ఱివాఁడను. పరధనమైనయామెను నాసొత్తనుటకంటె వెఱ్ఱి యేమున్నది? ఈరాణిఁ జావక బ్రదుకనా? ఛీఛీ! మోహపాశమునఁదగిలి పాపమునకుఁ బుట్టెడుదుఃఖములో నున్నయామెభర్తమరణము గోరుచున్ననాహృదయము వజ్రమా యేమి! ఆతండు జీవింపకపోయినను మాత్రము నాకామె లభించుట యెట్లు? ఆమె పతివ్రత గదా! అయినను సర్వేశ్వరుండు ఘటనఘటనాసమర్థుఁడుగదా" యని మెల్లన లోనికిం జనెను. అక్కడికిఁ బదునాల్గు మైళ్ళదూరమున నున్నయిందూరునగరమునకు మనుష్యులఁ బంపి దాలతరావును వెంట బెట్టుకొని తెల్లవారునప్పటికి వచ్చెను. దాలతరావు శవమువలెఁ బడి యున్నసోదరుని జూచి విలపించి యాతనిఁ బొరుగూర నుండనీయఁ జనదని కమలను సహోదరునిఁ బ్రయాణముజేసి పల్లకిలో వానినుంచి

దుండిరావును సేవకులు వెంట రా బయలు దేఱెను. కమలహృదయ మానందబాయియొద్దనుండి బయలు దేఱి నెప్పటియట్ల చింతిల్లు చుండెను. శ్యామసుందరుఁడామెను సాగనంపుటకుఁ గపుదూర మరిగి, కమలావియోగముచే వివర్ణముఖుఁడై దాతలరావును వీడ్కొని యింటికిఁజనెను. కొంతదూర మిట్లు పయనము సాఁగినతరువాత రాణోజీ మిగుల నాయాసమొందఁ బల్లకిఁ జెట్టుక్రింద దింపిరి. దాతల రావు గుండెలు బాదుకొని యేడ్వనారంభించెను. కమల నిశ్చేష్ట యయ్యెను. పల్లకిలో నున్న రాణోజీ పల్లకిలోనే మృతినొందెను.

## అయిదవ ప్రకరణము.



రాణోజీవల్కారునకు దాలతరావు తమ్ముఁడు. వయసున నీతఁడు రాణోజికిఁ దమ్ముఁడైనను గుణములయం దతనికి దాతలరా వన్న యనియు రూపమున సచ్ఛముగ నన్నగారినోటనుండి యూడి పడినటు లుండెననియుఁ జెప్పఁదగును. అభిమానముచేత నతనిభార్యయుఁ బక్షపాతముచేత నతనిస్నేహితులును, నీలమేఘశ్యాముఁ డని వర్ణింతురు గాని యతఁడు నిజముగ మాలకాకివలె కడునల్లనై యంద మనుమాటయైన లేనివికారాకారుఁడు. దుబ్బులవలెఁ దెగ పెరిగిన మీసమునలుపునకు వానిమొగముయొక్కనలుపునకు, రవంతయు భేద ముండదు. అతనిచక్కఁదన మంతటితో సమాప్తము నొందక యెబెఱిగినబొజ్జకడుపుతోడను, శరీరముయొక్క విపరీతపులావు తోడను, గొంచెము దీర్ఘమగుముక్కుతోడను, జూచువారికి నవ్వు బుట్టించు చుండును. అన్నకుఁ గుయుక్తులలో సహాయుడైయిరువురును గొప్పయుద్యోగములు సంపాదించి, హోల్కారుసంస్థానమున మంచి

వారని పేరు సంపాదింపకపోయినను దేశమున దుర్మార్గమున , కయినను పేరు వహించెను. అట్లుండియు నంతవఱకుఁ దమ యేలికవిషయమేద్రోహమును దలఁచినట్లు లేదు.

ఇట్లు రాణోజి తనపాలిటిమృత్యుదేవత యైవచ్చిన యెద్దుచే గాయములు దగిలినందునఁ బల్లకియందు మృతినొందఁ దౌలతరావు శవము నందేయుంచి జాముప్రొద్దెక్కువఱకు కమలాబాయితో నిందూరునగరముఁ బ్రవేశించెను. శవమును దనగృహమునకుఁ గొనిపోక స్మశానమున కాదారిని దీసికొనిపోయి కమల నింటి కంపి తనభార్య కప్పగింపు మని దుండిరావు నంపి బంధుజనులను రుద్రభూమికిరమ్మని వర్తమాన మంపి వారు వచ్చినతరువాత తనసోదరునకు యథావిధిగ నగ్నిసంస్కారముఁ జేసెను. అక్కడకువచ్చినకులస్థులందఱును, "మనుష్యులు కాలము తప్పినతరువాత వివాహ మాడఁగూడదనియు దైవవశమునకు నెవ్వ రేమి చేయఁగలరనియు సంతసుందరికి వివాహమైన నెలకే వైధవ్యము వచ్చుట యన్యాయ మనియుఁ నామె కీదురవస్థకే యీశ్వరుఁ డీపెండ్లి సంకల్పించె" ననియు బహువిధములు జాలినొందిరి. దౌలతరావుభార్య యగుదుర్గాబాయి పెద్దపెట్టున నేడ్చుచు వీథిగుమ్మముదగ్గఱ కెదురుగ వచ్చి తోడికోడలిని, కౌఁగలించుకొనిరోదనముచేసి, "అమ్మా! తోడికోడండ్రమని పట్టుమని మనమిద్దఱము నొకనెల యైనను గాపురము సేయ మైతిమి. నీ వెంతదురదృష్టవంతురాలవో, యేభోగ మనుభవింపకముందె పసుపుకుంకుమనైన మనసు దీఱఁ బెట్టుకొనకముందె యొకముద్దుముచ్చట దీరకముందె పెండ్లి యైననెలకె యీలాగైతివిగదా! అమ్మా! మొదటిపర్యాయమే నిన్ని వ్రాఁతలోఁ జూడవలసివచ్చెఁగదా తల్లీ! నీవింకను వచ్చినతరువాత నిద్దఱమును గాఁపురము సేతుమువలె ననుకొన్నాను గాని యింతవఱకు వచ్చునని యెఱుఁగను తల్లీ" యని పరిపరిభంగుల నంగలార్చి కమ

లయుఁ గొంచెము దుఃఖింప నామె నోదార్చి తానూరకుండెను. కమల యెందుచేతనో ధైర్యము జిక్కఁబట్టి యంతవిస్తారముగాఁ బొగ లుట మాని గుండె రాయి చేసికొనెను. అగ్నిసంస్కారాదులఁజేసి బాలతరావు కర్మనారంభించి రెండుదినములు గడచినవెనుక దుండిరావును బిల్చి, కమలనుగూర్చికొన్నిసంగతు లడుగఁదలఁచి యిట్లనియె.

బాల.—ఓరీ! దుండీ! మాయింటి కెంతదుర్దశవచ్చినది? నాకుఁ గుడిహస్తము పడిపోయినది గదా, యింక నాబ్రతు కేల?

దుండి.—అవును. దైవవశమున కేమిచేయఁగలము? మీ కేమి మూఁడేండ్ల దామె మీవదినగారిమాట దలఁచిన నాగుండెలు తాళుట లేదు.

బాల.—ఆహాహా! ఏమి యీమెయందము! దైవము మిక్కిలి యయోగ్యపుఁబని చేసినాఁడు. ఇంతటియందగత్తెను నే నెందునఁ జూచి యెఱుఁగను. ఇటువంటికన్య యెంతయదృష్టవంతునకు భార్యయగును.

దుండి.—(కొంచెమాలోచించి సందేహముతో) ఆమెయెక్కడి కరుగఁగలదు. పాపము! ఇఁక నీవే దిక్కు. నిన్ను గనిపెట్టుకొని యుండును గనుక నీ వామెసుఖముఁ జూడుము.

బాల.—మరే. ఆమె నాదగ్గఱ నుండునా? పుట్టినింటి కరుగు నేమో. అయితే యీామెను మాయన్నగారు వివాహ మాడినారా?

దుండి.—వివాహమైనప్పుడు నే నక్కడలేనుగాని పెండ్లి యైన దని మీయన్నగారు నాతోఁ జెప్పినారు. త్రోవలోఁ దన్నడిగినవా రందఱితోడ నీమె తనభార్య యనియే చెప్పెను. పెండ్లి యగుటకు సందేహములేదు.

బాల.—అయినదా? నేను కాలేదనుకొన్నాను. సరే, ఇఁక విచారమే లేదు.

దుండి.—విచారమెందుకు? నాదగ్గఱ దాఁచక నీమనసున నున్నది చెప్పు. నీ క్షేమే నాకక్కఱలేదా? మనకు లాభించునెడలఁ బెండ్లి కాలేదని చెప్పుదము.

దౌల.—మిత్రుఁడా! నీవు నాకేమయిన సహాయముఁ జేసెదేని యాకమలను మాయన్న పెండ్లి యాడలేదని నేను వివాహ మాడ వలయునని యున్నది. నీవు నన్ను మఱిగొనకలా గెంచవద్దు.

దుండి.—నీకుఁ బ్రియము సేయుటకంటె నాకుఁ గర్తవ్య మేమున్నది! ఆమెను నయమునఁ భయమునఁ లొంగఁదీసి నీకు వివాహముఁ జేయింతు. ఈపదిదినములకర్మ ముగిసినదాఁక నోరెత్తఁబోకు.

అని వారుమాటలాడుకొనుచుండ దుర్గాబాయి లోపలినుండి వచ్చి కమలాబాయిదురవస్థకుఁ గొంచెమువిచారించి, యామెతల్లికిని, దమ్మునకును వర్తమానము నంపు మని భర్తతోఁ జెప్పెను. సాధారణముగ నేమికారణముచేతనో కాని దుండిరావునకు దుర్గ యనిన నొకవిధమైన భయము గలదు. అందుచే నామె వచ్చినతోడనే లేచి యతఁడు మెల్లఁగా జాఱెను. తరువాత దౌలతరావు కమలపుట్టి నింటికి వర్తమానము నంపుటకు సమ్మతించి తనమనోరథమును భార్యకు నెఱిఁగింపఁగోరి యామెయొద్ద భయముగలవాఁడగుటచే రవంత సంశయించి యూరకుండెను. దుర్గాబాయి సద్వంశముఁ బుట్టి సద్గుణములు గల యొకసుందరి. సదాచారుఁడు కానిభర్త సద్గుణపుంజ మగుభార్యకు జడియుట స్వభావమే యగుటచేత దౌలతరావున కామె పితికిమం దయినను నీమూర్ఖుఁడు చీవాట్లకు వెఱవక యప్పుడప్పుడు తనమనోరథముల నామెకుం దెలిపి యామెచే మందలింపఁబడువాఁడుక గూడ కలదు. దౌలతరావు దుర్గను జూచి సంశయ మెల్ల విడిచి యిట్లనియె.

దౌల.—పిల్లలు లేనివారిబ్రతుకు వ్యర్థము కదా! మాయన్న కు

బిడ్డలు లేకపోవుటచేత నేనే కర్త చేయవలసివచ్చినది. నాకుఁ బిల్లలు లేరు. ఈనల్లాకుల వంశ మింతటితో నాశనమే కాఁబోలును.

దుర్గ—(ఈమాటలు విని సిగ్గుచేఁ దలవంచుకొని) "మీ రెవరి నైనఁ బెంచుకొనుఁ" డని ప్రత్యుత్తర మిచ్చెను.

దాల—పెంచుకొనినవారికి ముప్పు గడచుట యరుదు. అంతకన్నఁ దెగించి మఱియొకదానిని బెండ్లియాడుట యుత్తమము. నీ కిష్ట మయిన నొకసట్టు చేసెద.

దుర్గ—నాకిష్ట మయినది కాని మీ కీవయసునఁ బిల్ల నిచ్చువారెవరు?

దాల—ఇచ్చెడువారెవరు? పిల్ల సిద్ధముగనే యున్నది. నీవియ యుండినయెడ—

ఈమాట లతనినోటినుండి రాఁగానే దుర్గ వెలవెలఁబోయిచూడ సాగి, యెవరి పిల్ల యెవరని యడిగెను. అప్పుడు దాలతరావు లేచి భార్యచేతులు రెండును బట్టుకొని, "నే నొకమాట చెప్పెదను. కోప పడక వినుము. కమలను నాకిచ్చి వివాహము చేయు" మని యిఁక నేమో చెప్పఁబోవుచుండ దెబ్బఁ దిన్నపామువలె బుస్సని లేచి దుర్గ కోపావేశముచేఁ బెదవులు తడఁబడ నిట్లనెను. "ఛీ ఛీ! నీవంటి కఠిన చిత్తుని బాపకర్ముని నేనెందుం గనలేదు. అన్నగారిచితి తిన్నగఁజల్లార నైన లేదు. అప్పుడే పుట్టెడుదుఃఖములో నున్నయాయనభార్య నోదార్చుటకుమా రామెను బెండ్లియాడెద నని చెప్పుటకు నో రెట్లు వచ్చెను. విధవయని సందేహము లేదు. అన్నపెండ్లాము తల్లివంటిది గదా యని గౌరవము లేదు. నీముఖముఁ జూచినవారికి పంచమహా పాతకములు జుట్టుకొనును." అని యామె నింద సేయుచుండ దాలతరావు మెల్లఁగ నామెతో "ఆమె నిజముగ విధవ యైనచో నాది తప్పే. మాయన్న యామెను బెండ్లి యాడలే దఁట" యనెను.

దుర్గ.—"ఈమాయమాట లెవరు నీతోఁ జెప్పినారు? దుండి రావా యేమి? వానియమ్మకడుపు మాడ. వానికి మరణము రాదు. ఆకాళికాదేవికి వానిమీఁద దయ. ఆదిక్కుమాలినవాఁడే నాకొంపఁ దీయుచున్నది. ఊరిలో సాటివారు విన్న నేమందురు? ఆమెకుఁ బెండ్లి గాకున్న వైధవ్య మనుభవించుట కామెకు ముచ్చటగా?"

అని పలుక దౌలతరావు భార్యను గోపింపవలదని బ్రతిమాలి, నీకు సవతి వచ్చు ననురోషముచే నిట్లను చున్నావు. కోపపడక నాముద్దు చెల్లించు" మని వేఁడెను. అప్పలుకులు దుర్గ కలుక రెట్టింప "నాతో మీరు మాటలాడవద్దు. నాపనిమీఁద నేనుబోయెద" నని చేయివిదలించుకొని లోపలికింబోయెను. తనకు సవతి వచ్చు ననునీర్ష్యచేతనోఁ విధవను వరించుటచేఁ గలుగునప్రతిష్ఠను భరింప లేకయొ దుర్గ మిగులఁ గోపము విచారము నొంది తనభర్తకుం దనకుఁ జరిగిన ప్రసంగ మంతయుఁ బూసగ్రుచ్చినట్లు కమలకుం దెలిపి జాగ్రత్తగ నుండు మని చెప్పి యామెకు నేసహాయము గావలసినఁ దాను జేసెద నని వాగ్దానముఁ జేసి యంతతోఁ దృప్తిగలుగమిఁ దమయింటిపొరుగుననున్న రాధాకాంతరావుభార్యయగురోహిణీబాయియొద్దకుఁబోయి యీవార్త యామెకుఁ జెప్పి, రాధాకాంతునితోఁ జెప్పి సాయముఁ జేయుమని కట్టుదిట్టము చేసి వచ్చెను. దుర్గాబాయి దౌలతరావు యొక్కదురుద్దేశముల నెఱిఁగించిన వెనుక కమల మిగులభయపడుచుఁ దోఁజేలునోటనుండి విడిపింపఁబడి పులినోటఁబడితినిగదాయనిదుఃఖింప నారంభించెను. మఱునాఁడు రాధాకాంతరాయలు భార్యచే విని దీనురాలగుస్త్రీకి మానహాని రాకుండఁ గాపాడవలె నని నిశ్చయించి "కమలతో మాటలాడి ర"మ్మని రోహిణి నంపెను. రోహిణియు దుర్గయు నెన్నివిధములనో తరచితరచి యామెవివాహమును గూర్చియు స్థితినిగూర్చియుఁ దెలియఁగోరి యనేకప్రశ్న లడిగిరిగాని యామె

తిన్నగాఁ బ్రత్యుత్తర మీయక, "నాకర్మము నేననుభవింపక తప్పదు. జలమరణమొ, యగ్నిమరణమొ నాముఖమున వ్రాసి యున్నది. నాకు మానహాని కలుగకుండ మీరుమాత్రము చూచు చుండుఁ"డని యుత్తరముచెప్పెను. ఆమాటలఁబట్టి యామెకుమృత్యుఁ డైనభర్తృపై గాఢానురాగము గల దనియు, నందుచే నామె ప్రాణ త్యాగముఁ జేసికొను ననియు నిశ్చయించి రోహిణి మిగుల జాగరూక తతో నుండు మని దుర్గకు బోధ చేసి మానహాని సంభవించునెడలఁ దనయింటి కామె నంపు మని నొక్కిపలుమాఱు చెప్పి యింటి కరి గెను. ఆవేళమధ్యాహ్నము రాధాకాంతరావు దౌలతరావునకు నట్టి దుష్కార్యముఁ జేయ వలదని హితోపదేశము చేసెను. ఆహిత మత నికి విషప్రయోగ మగుటచేత దౌలతరావు మండిపడి వృద్ధుఁ డగు రాధాకాంతుని ననరానిమాట లనెను. రాధాకాంతుఁడు వానిమాట లకుఁ దల వంకించి యావిషయమున నెంతపని యైనఁ జేయనిశ్చయిం చెను. దౌలతరావామెను దప్పక వివాహమాడుటకు నిశ్చయించెను. కమల మానహాని సంభవించునని మృతినొంద నిశ్చయించుకొనెను.



# ఆ ఱ వ ప్ర క ర ణ ము.



మహారాష్ట్రప్రభువులలో హోల్కారుకటుంబము మిగుల గౌరవమునకుం బాత్రమైనది. ఈహోల్కారువంశమును స్థాపనము జేసినశూరుఁడు మలహారురావుహోల్కారు. ఈతఁడు క్రీ. శ. 1683వ సంవత్సరమున జనియించి, మొదట పీష్వాలయొద్ద సిపాయిగ బాహు బలాతిశయముచేత వాసికెక్కిన యోధవరుఁడై తనప్రభువులకు నను గ్రహపాత్రుఁడయ్యెను. అందుచేఁ బీష్వాయగు బాలాజీరా వితనికి

మాళవదేశమున జాగీరు లిచ్చి తనకు లోఁబడి యుండున ట్లొకచిన్న రాజుగ నొనర్చెను. తరువాత మలహారురావు మఱికొంతరాజ్యము సంపాదించి మాళవదేశమునందున్న యిందూరునగరమును రాజధానిగఁ జేసికొని పేరునకుమాత్రము పీష్వాకు లోఁబడినట్లుండి మాటల చేతను, నప్పుడప్పు డంపుచుండు బహుమానములచేతను, దన లొంగు బాటును దెలియఁజేయుచు, నిజముగ సర్వతంత్రస్వతంత్రుఁడై యథేచ్ఛగ రాజ్యముఁ జేయుచుండెను. కులమున నీచుఁ డగుగొల్లవాఁ డయ్యు బాహుబుద్ధిబలముల గొప్పవాఁడై మలహారురావు కొలఁది కాలమున నొకసామంతరా జగుటయె కాక యెల్లవిధముల నైశ్వర్య శాలి యయ్యెను. కాని యాతని యుత్సాహవృక్షమునకు మూలము వదలించినట్లు భగవంతుఁ డాయనకుమారరత్న మగుఖండేరావును స్వర్గలోకమున కెత్తుకొని పోయెను. ఖండేరావు మృతినొందునప్పటికి, శతవృద్ధుఁడై కాటికిఁగాళ్లుచాపుకొని యున్నతండ్రియు మాలిరావను నొకమగశిశువును, గుణవతియు విద్యావతియు నగునహల్యాబాయి యనుభార్యయు, గుణముక్తాభరణ యగుముక్తాబాయి యను కూఁతురు నుండిరి. మలహారురావు మనుమని మనుమరాలిని జూచికొని పుత్రుని మరచి నిండుజవ్వనమున భర్తృహీన యయ్యుఁ బాతివ్రత్యమె ప్రధానము చేసికొని యొంటిపూఁటభుజించుచు, నేలఁబండుకొనుచుఁ బుణ్యకార్యములఁ జేయుటచేఁ గాలము బుచ్చుచు వివేకురాలగుకోడలిం జూచుకొని దుఃఖము దిగమ్రింగి యెట్టెటో రాజ్యభారము గొంతకాలము మోసెను. తదనంతరముఁ గొన్నిదినములకు మలహారరావు కాలధర్మము నొంద మనుమఁడగు మాలిరావునకు మంత్రు లందఱుఁ బట్టము గట్టిరి. కాని యచిరకాలంబుననే వానికిఁ గాల మాసన్న మగుటచే నతఁడును దండ్రితాతల దర్శింపఁ బోయి హోల్కారువంశమునసంతతిలో నస్తమించునట్లు మగపురుగు లేకుండ

జేసెను. భర్తయు, మామయుఁ గుమారుఁడు నించుమించుగ నొక మారు కాలధర్మము నొందుటయు హోల్కారువంశము నశించుటయు నిందూరు రాజ్యలక్ష్మి తనవలె ననాథయగుటయు జనులు రాజహీనులై యుంటయుఁజూచి యహల్య యబలయయ్యు దుఃఖసముద్రమును నింగియు విధిలేక ప్రజారక్షణార్థమై రాజ్యముఁ బూనెను. ఇది యామె మంత్రులలో ననేకుల కిష్టము లేదు. ఇష్టము లేకున్నను, దేశ మరాజమై పరరాజులపాలగుటఁ గన్నులారఁ జూడలేక యహల్యా బాయి యంతటిసాహసముఁ బూనవలసి వచ్చెను.

రా. హోజవల్కారు మృతినొందిననాల్గవనాఁడు మహాపురిము నుండి శ్యామసుందరదత్తు రాధాకాంతరావుగృహమునకు వచ్చి బుషికిం దనకు జరిగినముచ్చటలను రాహోజీమరణవిధమును దనసహాయమును దెల్పెను. శ్యామసుందరదత్తుయొక్క తండ్రియగు పరమేశ్వరదత్తు రాధాకాంతరాయునకుఁ దనకుఁ బ్రాణమిత్రుఁడైనందునఁ దనమిత్రుని కుమారుని బాగుచేయవలెనని రాధాకాంతుఁడు శ్యామసుందరున కప్పటికి స్వల్పకాలముక్రిందట నెలకు ముప్పదిరూకలజీతము గలయుద్యోగమును జెప్పించి, యతనికి నెవ్వరు బంధువు లచ్చట లేమిఁ దన యింటనె భోజన మిడుచు వాని నభివృద్ధికి దెచ్చుచుండెను. రాధాకాంత రావు చనిపోయిన మలహారు రావునకు గుండెకాయ యనియు బహిఃప్రాణ మనియుఁ బ్రజలు చెప్పుకొనుటకాక యె వారతనియందమితగౌరవ ముంచి యతని యాజ్ఞానువర్తులై యుండిరి. రాధాకాంతుఁడు డెబ్బదిసంవత్సరములకన్న నెక్కువవయసు కలవాఁడు. అయినను దేహపటుత్వము చెడక దార్ఢ్యము కలిగి యుండెను. జీవించి యున్నప్పుడు మలహారురావునకును, నతఁడును మాలిరావును మృతి నొందినవెనుక నహల్యాబాయికిని రాధాకాంతుఁడు తనప్రాణములు గూడ ధారబోయునంతటిభక్తి గలిగి నిష్కపటిమై వర్తించెను.

శ్యామసుందరదత్తు రాధాకాంతునియెడలనెంతకృతజ్ఞతను జూపుచు రాణియందు నట్టిభావముంచి పనిచేయసాగెను.

వచ్చిననాఁటిరాత్రి రాధాకాంతరావు శ్యామసుందరుని వెంట బెట్టుకొని శ్రీయహల్యాబాయిరాణీగారిని దర్శించుటకుఁ బోయి వాకిట నిల్చి తమరాక నెఱుంగఁజేయుమని లోనికిఁ బ్రతిహారి నంపెను. లోపలికి రమ్మని రాణీగారి సెలవైనదని సేవకుఁడు వచ్చి తెలుప నంతఃపురమున నొకగదిలోనికి వారిం గొనిపోయెను. ఆగదిలో ముత్యాలజాలరువలె నడుమ వేయంబడి తెల్లతెఱచాటున నల్లని బక్కపలుచని యంగనయు నామెకుఁ గొంతవెనుకగఁ బదునాఱువత్సరములయీడుగల జవ్వని యొక్కతెయుఁ గుర్చీలపైఁ గూరుచుండిరి. రాధాకాంతరావును శ్యామసుందరుఁడును తెరసమీపమునకుఁ జని యానల్లనిస్త్రీకి నమస్కారము గావించి తమకై వైవంబడిన పీఠములపై సుఖోపవిష్టులైరి. దత్తదివఱకెన్నఁడు నహల్యాబాయిని జూచి యెఱుఁగఁడు. కాఁబట్టి సౌందర్యవతిగాక నల్లనిశరీరకాంతి గలిగి సామాన్యస్త్రీవలె సాధారణవస్త్రములు గట్టుకొని యాభరణములనైన దాల్పక కృశించియున్న యాయంగనను దనయేలికయగు రాణిగఁ గొంత సేపటివఱకుఁ దలంపక రాణి యెంతోవైభవముతో నుండుననియు నీఁకముందు వచ్చుననియు నెదురు చూడసాగెను. అట్లు వీరిరువురు లోని కరిగి కూర్చుండినవెనుకఁ గొత్తవాఁడగుదత్తునిఁ జూచి పడుచుకన్నెయగు ముక్తాబాయి దగ్గఱనున్నగదిలోనికిఁ జనెను. అప్పుడహల్యాబాయి తెరఁదీయించి దత్తును రాధాకాంతుని దేఱిపాఱఁజూచి, "నీవు మాతోమాటలాడిన దీబాలుని విషయమేనా" యని యడిగెను.

రాధా—చిత్తము ఈకుఱ్ఱవాఁడే. ఏలినవారు నాయందెట్టిభావ ముంచినారో యీబాలునియందుఁ గూడ నట్టిభావ ముంచఁదగును.

అని రాధాకాంతరాయలు మెల్లగ నుడువుచుండ రాణికను లకొలంకులనుండి వేఁడికన్నీళ్ళబిందువులు జారనారంభించెను. అంతయా కస్మికదుఃఖమునకుఁ గారణ మేమని వీరాలోచించుచుఁ గొంత సేప టికి గద్గదస్వరముతో రాధాకాంతరా విట్లనియె. "అమ్మా! యేమిది? ఇట్లు మీరుండుటకుఁ గారణ మున్నను ధైర్య మూనక విధిలేదు"

అహల్యాబాయియు నామాటలు విని యూరట లేక యీ బాలునిమొగ మచ్చముగ నాతనినవలె నున్నది. హా! మాలిరావు నాయనా! నీమరణముచేతనేకదా నే నీవిశ్వాసహీనులగు మంత్రిప శువుల నాశ్రయించుట? హా! తండ్రీ! స న్నేకాకిగాఁ జేసిపోతి వా? " యని యామె విచారించుచుండ లోపలిగదిలోనుండి ముక్తా మణులవలె భాష్పములు చెక్కులమీఁదినుండి జార ముక్తాబాయి బేలయై రోదనము జేయసాగెను. రాధాకాంతుఁడు వారివిలాపముచే హృదయము కరఁగ రవ్వంతవంతఁ దానుఁగూడనొంది యనుచితమగు నాకార్యము మానుట పురుషలక్షణ మని కన్నీరు దుడుచుకొని, "అమ్మా యేలినవారు విలపింపధైర్యము జెప్పువా రెవరు? మాలి రావు మీగర్భమునఁ జిచ్చుపెట్టిపోయెను. ఇది యాజన్మాంతమును బోవునదియు మఱల వచ్చునదియుఁగాదు. ధైర్యముఁ దెచ్చుకొన్నను మీరే దుఃఖించినను మీరే ప్రజలు మీబిడ్డలు. ఆకుమారుఁడు పో యిన మే మున్నవార" మని యూరార్ప రాణి కొంత సేద దేరెను. తరువాత వా రిట్లు మాటాడిరి.

అహల్య.—నేను నీవుచెప్పినట్లు ప్రజలనే బిడ్డలుగనమ్మకొంటి నిగాని వారు నాయందు విశ్వాసములేక రాజ్యమునకు శత్రువులుగఁ దొరద ఉన్నారు.

రాధా.—అమ్మా! అంత పాపకర్ములు, నదృష్టహీను లె వ్వరు?

అహ.—నేను నీయందును గంగాధరజస్వంతరావునందు నా యాసలన్నియు నిల్పియుంటిని కాని నాయాస—

రాధా.—(తొందరగా) అమ్మా! నావిషయమై మీకు సందేహమేల? ఇదిగో మీపాదములు సాక్షి నేను నాప్రాణముకన్నను లెక్కసేయను. నావిశ్వాసము మీకు విశదము.

అహ.—నేను నీవిషయము చెప్ప లేదు. గంగాధరజస్వంతరావునుగూర్చి నిన్న సతీపు నాదగ్గఱకువచ్చి కుమారని బెంచుకొమ్మని నాకనేకవిధముల నుపదేశ మొసర్చి నేను రాజ్యము పరిపాలించుట ప్రజల కిష్టములేదని కఠినముగాఁ బలికెను. పురోహితుఁడును మంత్రియు నాకుపకారము సేయునని తలంచితిఁ గాని యిట్లగునని యెన్నఁడెంచలేదు. ఈమాటలు చెవిఁబడ ముక్తాబాయికి మనస్సు మనస్సులో లేక, "జస్వంతరావునకు మాయమ్మగారికిని వివాదము లేక యుండవలె నని నాకోరిక. దైవమా! నీవువీనికి సఖ్యము గలుగఁజేయు" మని తన మనస్సునఁ బ్రార్థనజేసెను. రాధాకాంతరావు గంగాధరునివిషయమై మొదటినుండియు సందేహము నొందుచుండుటచే సతని యనుమానము రాణి తెలిపినసంగతులచే ధృవపఱుపఁబడెను. దత్తురాణీమాటలకు నర్థము స్పష్టముగా నెఱుఁగక, సత్ప్రవర్తనమునకు నిధివలెఁ గనఁబడుచుండు జస్వంతరావు దుర్మార్గమునకు నొడఁబడునా యని వితర్కింపసాగెను. తరువాత నీక్రిందిసంభాషణ జరగెను.

అహల్య—ఇంకను విశేషములేమి? రాఘోజీ, పాపము పోయి నాఁడఁట. దౌలతరావునకుఁ జాలకష్టము సంభవించినది.

రాధా.—అతనికేకాదు. చచ్చెడివాఁడు చచ్చుచు నతఁడొక పిల్లగొంతుక గోసినాఁడు. వివాహమాడి యిప్పటికి నెలకాలేదు. పాప మాభార్యగూడ నిక్కడికివచ్చినది. ఆమె యతి సౌందర్యవంతురాలు.

దత్తు—అతిదుర్మార్గుఁడగు దౌలతరావు పాప మామెను బాధించుచున్నాఁడఁట!

అహ—ఏమీ! నా పాలనారంభమందుఁ బతివ్రతలకు బాధ కలుగునా? అట్లయిన నామీఁద నతని కాగ్రహమువచ్చినను వచ్చుఁగాక. దౌలతరావును నేను మందలించి యామెకష్టమునుమాన్పెదను. ఆకష్ట మెట్టిదో నాకుఁ దెలియఁజేయుఁడు.

రాధా—వదినెగారిని దాను బెండ్లియాడునఁట. ఇది మంచిది గాదని మావంటివారు తెలుప నామెకు వివాహము కాలేదని చెప్పును. ఆమె వివాహ మైనది. వైధవ్య మనుభవింప సిద్ధముగనున్నది. అయినను దమరిందు జోక్యము గలుగఁజేసికొనవద్దు. అతఁడు దుష్టుఁడు. అతఁడు శత్రుగణములోఁ జేరిన మనకు నష్టముకలదు.

అహ—అతఁడు శత్రుపక్షమునఁ జేరినను సరే, నా రాజ్యము పోయినను సరే. ఇంతపాపకర్ముని నేను జూచుచు సైరింపఁజాలను. సాధుబాధ నివారింపకున్న నా రాజ్య మెందుకు?

దత్తు—(తనలో) ఆహాహా యేమి యీమెధర్మగుణము! ధర్మదేవత యీమెగా నవతరించియుండును. దేవుఁడీమెను రక్షించుఁగాక.

రాధా—అమ్మా! అట్లయిన జస్వంతరావుమొదలగువారిలో నెవ్వరు చేరినారు? ఏమిప్రతిక్రియ మనము చేయవలయును?

అహ—జస్వంతరావుతో దౌలతరావు చేరును. ఇంక నెవరు చేరుదురో తెలియదు. మీరు నాయందు గాఢానురాగు లగుదురేని నేను గెలువఁగలను. నేను శౌర్యముప్రధానముగా గలమహారాష్ట్రస్త్రీనని నమ్ముఁడు.

రాధా—అమ్మా! మీపాదములుసాక్షులుగా శ్రీవిశ్వేశ్వరుఁడు సాక్షిగ, నేను నాజన్మాంతముదాక, మీయెడ విశ్వాసముఁ గల్గియుండెద. అబ్బాయీ! దత్తూ నీవుఁగూడఁ బ్రతిజ్ఞఁజేయుము.

దత్తు—అఖిలదేవతలు సాక్షులుగ నేను మీయాజ్ఞ నెఱవేర్తు నని, యట్లు ప్రమాణము చేయుచున్నాను.

ఇట్లు వారు పలుక నహల్య సంతోషించి వారి నారాత్రికి వీడ్కొల్పిన దయ్యెను.



ఏడవ ప్రకరణము.

గంగాధరజస్వంతరావునకు బదియేండ్లలోపువయస్సుగలవాఁడు బుద్ధిచేతను, బాహుబలము చేతను నతఁడు తలంచినకార్యము లెల్ల నిర్వహింపఁ గలసమర్థుఁడు. మలహారురావు హోల్కారుకాల మునుండియు నతఁడు పురోహితుఁడును మంత్రియునై వైదికలౌకిక కార్యముల నమోఘముగ నిర్వర్తించుచు రాజమందిరమునకు మూలస్తంభమైయుండి, యాతఁడు మృతినొందినతరువాత నధికా రమునంతను దనచేత నుంచుకొనవలె నని దురాశ జనియించినందున రాజ్యము నహల్యాబాయి వహించినఁ దనయాటలు సాగవని యా మెను గుమారస్వీకారము జేసికొ మ్మని బలవంతపెట్టసాగెను. కుమా రుని బెంచుకొన్నయెడలనతఁడుయుక్తవయస్కుఁడగువఱకు రాజ్యము మంత్రులచేతులలో నుండుననియు, నందుచే దురాశాపీడితులగు వారిమూలమున దేశమునకుఁ గీడు రాఁగల దనియు, విశేషించి తనకు ముద్దులు మూటగట్టుకుమారుఁడే యుండఁగా నామెకు రాజ్య మొసఁగక పరుని నెవనినో తెచ్చి వానికీరాజ్యమును గట్టిపెట్టుట యనుచితమనియు నెంచి యామె పెంచుకొనదయ్యెను. అందుచే గంగాధరుఁ డాగ్రహించి తనలో నింకఁ గొందఱిని జేర్చుకొని రాణి పైఁ గక్షవహించెను.

వెనుకటిప్రకరణమునఁ జెప్పఁబడినసంగతులు జరిగిన మఱు నాఁడు రాత్రి గంగాధరజస్వంతరావుభోజనముచేసి తనమిత్రులనిమిత్త మెదురు చూచుచుండెను. అంతలో హరిహరపాండ్యాజీ యనుబ్రాహ్మణుఁడు తనయొక్కనిస్థూలదేహము దీపపువెలుతురులోఁ బెద్దనీడను వ్యాపింపఁజేయవచ్చి, "అయ్యా! గోమోజీరావు బాలతరావుమొదలగువారు సిద్ధముగ నున్నారు. వారి నిక్కడికి రమ్మని నేను జెప్పినాఁడను. వారు త్వరలో రాఁగలరు. మీభోజన మైనదా?" యని యడిగెను "ఆహా! నేను సిద్ధముగ నుంటిని. కాని రఘునాధరావేమనుచున్నాఁడు? నేను జెప్పినట్లు నీవు చెప్పినావా?" అని పాండ్యాజీతోఁ బ్రత్యుత్తరమిచ్చి కొన్నిప్రశ్నలు వైచెను.

హరి—ఈకార్యము రఘునాధరావున కిష్టమే. నీ వెప్పుడు రమ్మనిన నప్పుడె దండెత్తివచ్చి యహల్యాబాయిని సింహాసనము నుండి లాగును.

జస్వం—నిజముగా నాతఁడటు వాగ్దానము జేసినాఁడా?

హరి—అతనికి నేను గుండెకాయను. నాతో నిజము పలుకునుగాని యబద్ధము పలుకఁడు. నీవు కొంతరాజ్యము వాని కిచ్చుటకు సమ్మతింతువేని నిన్నె హోల్కారుగఁ జేయునట్లుకూడ నేను జక్కజేసినాను.

జస్వం—ఆహాహా! నాకు నీకంటెఁ బరమమిత్రుఁడు లేఁడు. నన్ను హోల్కారుగఁ జేసినపక్షమున నే నతనికి సగము రాజ్యము నిచ్చుట యాశ్చర్యమా కష్టమా? కాని నేను హోల్కారును గావలె ననుపట్టింపు లేదు. ఈయాఁడుదానిపాలనలో నుండకపోయినఁ జాలును. అహల్యను జూడ నాయొడలు మండునుగాని ముక్తాబాయిని గనుఁగొన్న నాహృదయము జాలినొందును.

అని జస్వంతరావును హరిహరపాండ్యాజీయును ముచ్చటించు

సమయమున సేవకసమేతుఁడై గోమోజీరావు గుమ్మముదాఁటి వచ్చెను. అంతట జస్వంతరావు మాటలాడవలదని పరమవైదికుఁడగు హరిహరునకుఁ గనుసన్న జేసిముందుగా "ఓహో! కొత్వాలుగారు కాఁబోలును. మము జెఱసాలలో నుంచుటకువచ్చినారా యేమి! ఆయనయెవ్వ" రని పరిహాసముగఁబలికెను. గోమోజీరావుసవ్వుచు "మీరు రాణిపైఁ గుట్రలు గావింపుచుండ వారిసొమ్ము దినువారము మే మూరకుందుమా? అయితే దాలతరావు రాలేదా ? ఈతఁడు నా స్నేహితుఁడు. ఈతనికాఁపురము వాసియూగ్రామము. మనకార్యమున కనుకూలుఁడు. ఇతనిపేరు సకారాం' మని చెప్పునంతలో ద్వారసమేతుఁ డగుకలివలె దాలతరావు దుండిరావుతోఁ గూడ గృహము నలంకరించెను. జస్వంతరావు వారిని గూడ సన్మానించి యందఱిని మేడమీఁదికిఁ గొనిపోయెను. అందఱు నొకరినొక రెఱిఁగినవారేకాని సకారాము నెవ్వరు నెఱుఁగరు. అతఁడు వచ్చి గోమోజీకిఁగుడిప్రక్కను గూర్చుండెను. అతనియెదుటఁ దముమరహస్యములను మాటలాడుకొను టందఱు సందేహించిరి. కాని గోమోజీరాయని ప్రోత్సాహముచే నివారితసంశయులై మూటగట్టుకొని వచ్చినరహస్యములను విప్పిరి. అప్పుడు వారందఱు నీక్రిందివిధమునమాటలాడిరి.

జస్వ—స్నేహితులారా! మనమిచ్చటఁ జేరిన దెందునిమిత్తమో మీ రెఱుఁగుదురు. మనస్వామియైన మలహరిరావుగారుచనిపోవుటయు వారికిఁ గుమారులు మనుమలును లేకపోవుటయు మనకింతటిపచారమును శ్రమను గలిగించినవి. అది యటుండ వంశనాశనమయ్యెనని విచారముగలిగి మనరాణిగారికిఁ బుత్రస్వీకారముఁ జేయవలె నని నేను బ్రయత్నము సేయుచుండ మనరాణి—రాణియనుటకు నోరాడుట లేదు—అహల్యాబాయి మనపై నధికారముఁ జేయవలె నని యెంచుకొని నని స్పష్టముగఁ జెప్పినది. అదిగాక

నన్ను సడ్డమైనమాట లాడినది.

గోమో.—ఆహాహా! ఎంతదుష్కార్యము. ఆఁడుది రాజ్యము చేయుటకూడ వచ్చినది.

దాల—ఆమెకు మామగారిచావు కుఱ్ఱగుంటచావు పండుగ యైనది. ఎంతకఠినురాలు గాకున్నఁ గుమారుఁడు కడతేఱి మూఁడు మాసములు కాలేదు. ఇంతలోనే రాజ్య మేలఁ దలంచునా?

జస్వం.—కొడుకు చచ్చెనని విచారము గాని, ప్రజలు తన్నే మందురో యనులజ్జగాని యామెను బాధించుటలేదు. రాజ్యకాంక్ష దుఃఖమును లజ్జను గూడ మఱపించుననుగదా!

దుండి.—కర్తవ్యాంశమును వేగమె వితర్కించుట మంచిది.

జస్వం.—ఇపుడు నేఁ జెప్పఁదలఁచిన దేమన్న మనమందఱము పరువు గలమహారాష్ట్రులము. శివాజికాలమునుండియు మనవారు ప్రాణములకంటె మాన మెక్కువగ నెంచినమాట నేను వర్ణింప నక్కఱలేదు. ఇంతంతబలవంతుల మై యింతంతబుద్ధిమంతుల మై కటకటా! తుదకు పనికిమాలినయాఁడుదానిచేతఁ బరిపాలింపఁబడవల సినంతటిదురదృష్టవంతులమైతిమి. ఈయాఁడుదానిప్రభుత్వమున మన కున్నగౌరవము నిలుచునా? మీ రీమెచే నేలఁబడుట కిచ్ఛగలవారా? మీకు మీసము లేదా? శూరులు కారా? మహారాష్ట్రులకుఁ బుట్టలేదా? మీరు మహారాష్ట్రు లగుదు రేని యామెను రాజ్య విహీనురాలుగఁజేసి ప్రతివిషయమున నామెయత్నమునకు విఘ్నము గావింపుఁడు. ఇది మీకు సమ్మతమేనా?

దాల.—సమ్మతమా యని యడుగుచున్నావా? ఆఁడుదాని పాలనములో రెండుమూఁడునెల లున్నందుకే సిగ్గుపడి తల పొట్టలోఁ బెట్టుకొనుచున్నాను. నీవెట్లుచెప్పిన నట్లు చేసెదను. ఈమెప్రయ త్నము భ[illegible]ను చేయుటకు దేశమున నున్నభిల్లులను సహాయము

జేసికొని మనము దేశము కొల్లగొందము. అప్పుడామె లొంగును.

జస్వం.—ఆమెమీఁదఁ గోపముచే నిష్కారణముగ నిరపరాధులగుజ్రజలను క్షోభపెట్టుట మంచిదికాదు. మన మెంతకొట్టుకొన్నను దేశమున కరిష్టము రాఁగూడదు. ప్రజలసుఖము చెడరాదు.

గోమో.—నేనిదివఱకే దీనినిగూర్చి కొంచెమాలోచించినాను. ఉదయపురమహారాణిగారికి వర్తమాన మంపి మన దేశముపై దండెత్తుమని ప్రోత్సాహపెట్టి యతనికిఁ దగుసహాయము జేయుట యుక్తము. ఛేతాళసింగుతో నే నిదివఱ కామాట తలపెట్టినాను.

జస్వం.—రాజపుత్రు లసాధ్యులు. తీసికొని వచ్చుటయె కాని మరల వదల్చుకొనుట మనతాతతరము గాదు. అందుచే వారిని బిలువ వలదు. ఒకరిని బిలుచుటయే యుక్తమైన శ్రీరఘునాధరావును రమ్మందము.

దాల.—కొంచెమది బాగున్నది. (అనిదుండిరావు చెవిలో) ఈజస్వంతరావు మెల్లగ రఘునాధరావునురప్పించి తనమనోరథసిద్ధికై ప్రయత్నించుచున్నాఁడు. మనము భిల్లులను వదలఁ గూడదు.

దుండి.—అయ్యా! యింకొకసంగతి. మనోరహస్యములనెఱుఁగుటకు రాధాకాంతుఁడును, వానితోనున్న శ్యామసుందరదత్తును, దమతపస్సు ధారపోయుచున్నారఁట. వారు మనలను బట్టికొందురఁట జాగ్రత్త.

దాల.—చెప్పుట మఱచితిని. ఆకుఱ్ఱవాఁడు శ్యామసుందరుఁడు తెగనీలుగుచున్నవాఁడఁట. ఓయీ! గోమోజీ! యేదోవంకబెట్టి వానిని గడతేర్చు నుపాయముఁ జూడుము. నీవు కొత్వాలువు గదా యేపనినైనఁ జేయఁగలవు.

గోమో.—వాఁ డక్కడ నన్నుఁగూర్చి ప్రేలుచున్నాఁడట. వానివిషయమై యేపనిఁ జేయుమన్నను జేయుదును. ఇఁక మన మరుగుదము లెండు.

జన్వం.—మీరు నాపలుకుల కియ్యకొనిరి. గనుక నే నామెతోఁ బ్రత్యుత్తరము వహించెద. ఆమెదగ్గఱ నాకుద్యోగము వద్దనియుఁ గొడుకును బెంచుకొనకయున్న నామెకు మాకు సంబంధములేదనియు నామెకు నేనుత్తరము వ్రాసెద.

గోమో.—నామాట నీవందువ్రాయకుము. నేనీకొత్త్వాలు పనిలోనుండియే నీకు సమస్తసహాయములుఁ జేసెదను. ముందుగా నుద్యోగము మాను టెందుకు?

జన్వం.—ఇంతటిధైర్యమేనా నీది? ఓయీ దాలతరావు! నీవు మీయన్న భార్యను వివాహమాడెదవని విన్నాను. ఆపనిమాత్రము వద్దు. అట్లయిన మనపైఁ బ్రజలకు నమ్మకముండదు.

దాల.—దాని కేమిలే యెట్లో సాధాయించవచ్చును. అప్పుడే లైనదా. మనమందఱ మిండ్లకుఁ బోదము రండు.

అని యందఱును లేచి యుచితపరిశారము సెలవు గైకొని పోయిరి. సకారాము దేవళములోవిగ్రహమువలెఁ గూర్చుండెనే కాని యొకమాటయు మాటాడలేదని జన్వంతరావు సందియ మందియుఁ గారణ మడుగఁడయ్యెను. అందఱును గృహము వెడలిరి. గోమోజీ రావు సకారామును వెంటఁబెట్టుకొని కొంతదవ్వరిగి యచ్చట నతని చెవిలో మెల్లగా “ఓయీ! స్వలాభపరాయణులుదురాత్ములునగు వీరిని నమ్ముకొని నాయుద్యోగము మానుకొందునా? ఎటుబోయి యెటు వచ్చునో దాలతరావు జన్వంతరావులు తమతమ మనోరథముల నెఱ వేర్పఁదలఁచి యీయెత్తు లెత్తిరి. అవి నే నెఱుఁగనా? ఏమైనను రాణావారిని వచ్చి నింబపురమును గైకొమ్మని చెప్పు. ఇంక నీ వరుగుము.” అని నొక్కి పలికి వాని నంపి తాను స్వగృహమున కరిగెను.

## ఎనిమిదవ ప్రకరణము.



"నేను మీముఖ్యమంత్రులలోనివాఁడనని మీ రెంచుకొనుట లేదు. అట్లు మీ రెంచుకొనినపక్షమున నాయాలోచనములకు మీరు చెవియొగ్గి యుందురు. పుత్రస్వీకారముఁ జేసికొని నిర్మల మయిన హోల్కారువంశమును నిలుపుమని హితోపదేశము నొసర్చితిని. కాని నేనగ్గుచేయలేదు. అయినను నామాటలు విషభోజనమువలె మీకు రుచింపవయ్యెను. మతిలేనివృద్ధజంబుకముయొక్క మాటలను, జతుకుల మంటవలె వేగిరపాటు గలపడుచువానికారుకూఁతలను, నమ్మికొని వారు మిమ్ముద్ధరింపఁగలరని చిరకాలమునుండి రాజ్యమునకు మీకు నమితోపకార మొనర్చినమావంటివారిని నిరాకరించితిరి. వారుమిమ్ము ద్రోహము చేసినపుడే మీరు పశ్చాత్తాపముఁ బొంది మరల మమ్మాదరింపఁగలరు. ఇంక నేను మీవాఁడనని నాయం దాశయుంచుకొన వద్దు. నేను మీకును మీరాష్ట్రమునకు నిష్టుఁడనని మీ రెంచినారు కారు. గనుక నేనట్లె యుందును. కుమారుని బెంచుకొనిరేని మీ యొద్ద నేనుద్యోగము చేయను. ఇవి త్రికరణశుద్ధిగ నేను వ్రాసిన మాటలు. ఇందుకు తిరుగులేదు." అని యున్నలేఖను జదువుకొనుచు మహారాణియహల్యాబాయి తనగదిలో నొకపీఠముపైఁ గూర్చుండి నడుమనడుమ ముక్తాబాయి జాబును గూర్చి యడుగుప్రశ్నలకుఁ బరాకుగఁ బ్రత్యుత్తరమిచ్చుచుఁ గర్తవ్యము నూహించుచు రాధాకాంతునినిమిత్త మెదురు చూచుచుండెను. అంతలో రాధాకాంతుఁ డరుదెంచి యథోచితముగఁ దనరాణికి నమస్కరించి యుచితాసనమునఁ గూర్చుండెను. ముక్తాబాయి చిన్నతనమునుండి రాధాకాంతుని యందుఁ బితృభావముంచి గౌరవించుటచే నతనియొద్ద ఘోషాపద్ధతి

యక్కఅలేక యథేచ్ఛముగ మాటలాడుదురు. మహారాణి యంతరాధా కాంతుని మొగము వైపుజూచి "యీచమత్కారమును నీవెఱుఁగవు కాఁబోలును. ఈచీటి చదువుకొమ్మని యాయుత్తరము నతనికిచ్చెను. అతఁడాయుత్తరమును నామూలాగ్రముగఁ జదువుకొనివిస్మయముతో నొకమాఱు గుండెకొట్టుకొని "అమ్మా జస్వంతరా పెంత వాఁ డయ్యెను. ఇంతవాఁ డగునని నే నెన్నఁడు నెఱుఁగను. అమ్మా వ్యవహారము శ్రుతిమించి రాగమునఁ బడినది. మనము జాగ్రత్తగ నుండవలె" నని చెప్పెను. అనవుడు నాదేవి "ఇటువంటితుచ్ఛులు వేయి పన్నుగడలు బన్నినను నేను బెదరను. వారికి వినాశకాల మాసన్న మగుటచే నిట్టిబుద్ధులు పుట్టినవి. వారు నాకు లోఁబడకున్నను వారి ప్రాణములు నాఖడ్గమునకు లోఁబడక మానవు. కాని మనకునెవ్వరు కృతజ్ఞతగ నుండరో వారినందఱఁ జేర్కొను" మని ప్రత్యుత్తర మిచ్చెను. రాధాకాంతరావాపలుకులనాలకించిరాణిమనోధైర్యమున కుబ్బి "శివనానా మన కాప్తుఁడు. అతని నింబపురమం దుంచుటలో మీరు మంచిపని చేసినారు. గోమోజీరావు కొత్తవాఁలు కూడ మంచి వాఁడనియె తోఁచుచున్నది. తుకాజీహూల్కారు కుక్కవంటి విశ్వాసము గలవాఁడు. కాని నీచుఁ డగుటచే నతనికి గొప్పయుద్యోగ మీయఁదగదని యుగ్గడించుచుండ నతనిమాట కడ్డమువచ్చి రాణి "వంశముచేత నీచుఁడైనను గుణములచేతను రాజభక్తిచేతను మఱి తుకాజీ యుత్తముఁడు. అందుచేత నతనికి సైన్యాధిపత్యమొసఁగితిని. గోమోజీరావుసంగతి నిశ్చయముగఁ జెప్పఁజాలను. నీ వాతనిఁగూర్చి వాకబు చేయుచుండుము. కాని వీనికంటె నాకు నెక్కువవిచారము పట్టినది. ముక్తాబాయి కలఁతపడియున్నది. ఆమె తమ్ముఁనినిమిత్తము బెంగపెట్టుకొనినది. మనోవ్యాధికి మందు లేదుగద ! దీని కేమి యుపాయము చేయవలెనోయెఱుఁగ"నని పలికెను. అప్పలుకులువిని

రాధాకాంతరావు రాణితో నిట్లనియెను. "ఆమె నిజముగ బెంగ పెట్టుకొన్నది. మనసు తమ్ముని మీఁద కరుగకుండ నిరంతరము నామె కుత్సాహజనకము లగుపలుకులు చెప్పువారుండవలయును. అట్లుచేయుటకు మీకుఁ దీరికలేదు. నాదగ్గఱ నొకదాసియున్నది. ఆమె బహుచమత్కారకథలు నేర్చును. ఏడ్చువారికైన నామెమొగము జూడ సకలదుఃఖములుబోవును. ఆమెను నేనిక్కడ కంపెదను. ముక్తాబాయి నామెకు జతచేయుఁడు. అంతట నామెదేహమునఁ గలరుగ్మతనశించును. ఇఁక నే సెలవుగైకొని పోయివచ్చెదను. కాని యడుగ మఱచినాఁడ. దౌలతరావువిషయమై యేమిచేసినారు? స్త్రీ రాజ్య మేలుచుండ స్త్రీకి మానగౌరవము దక్కకున్నచో నింకఁ జెప్పునదియేమి? అన్నియు ముగిసినవెనుక మీరు కనుఁగొన్న నేమి లాభము? ఆమె ప్రాణత్యాగముఁ జేసికొనకమునుపేయామెపాతివ్రత్యముచెడకమునుపే మీరు సాయము చేయవలెను." అను రాధాకాంతుని కఠినోక్తులచే రాణికి రోషము జాలియుఁ గల్గినందున నామె "ఓయీ నేను జీవించియుండఁ గమలాబాయికి మానభంగ మగునా! దౌలతరావును బిలిపించి యిప్పుడే మందలించెద. ఇదివఱకే రమ్మని వానికి వర్తమానము బంపితిని. ఎంతకష్టమునకైన నోర్చి యామెను రక్షింతు. నీవింకఁ బొమ్ము. దౌలతరావు వచ్చువేళ యైనది" అని పలికెను. రాధాకాంతుఁ డందుకుసంతసించి సెలవుగైకొని స్వగృహమున కరిగి కమలాబాయిస్థితి గనుఁగొనుమనియు నామెతోఁ గొన్ని రహస్యములు జెప్పుమనియుఁ దనభార్య నంపి యామెవిషయమై జాగ్రత్తగ నుండెను.

రాధాకాంతరా వరిగిన యొకగడియలోపున దౌలతరావుతన యేలికదర్శనమునకువచ్చి గుమ్మమునందుండి తనరాకఁ దెలియఁబఱిచెను. లోపలికి రమ్మని సెల వయినతోడనే మొగమున లేనిగాంభీ

ర్యమును దెచ్చిపెట్టుకొని మొులలో నొకవేళ నపాయమేదైన జరుగు నేమో యని ప్రాణసంరక్షణార్థమై తెచ్చిపెట్టుకొన్న కయిజారుగనc బడకుండc జేసి లోని కరిగి రాణీదర్శనముచేసి సాష్టాంగనమస్కార మొనర్చి నిలువcబడెను. రాణీగారు కనిమిషములు వానివంకc జూచి కూర్చుండుమనెను. తరువాత వారియుభయులకు నీక్రిందిసంభాషణ జరిగెను.

అహ.—పాపము మీాయన్నగారు పోయినందుకు మాకుcజాల విచారముగ నున్నది? ఈవేళకు నాలుగొకటి కాదా ? నీకుc జెడ్డ కష్టము వచ్చినది.

దాల.—(తలవంచి) ఏమిచేయcగలము. కాలవశము.

అహ.—అతనిభార్య యెక్కడనున్నది ? క్రొత్తగాc బెండ్లి యైనదcట కాదా ?

దాల.—ఇక్కడనేయున్నది. పెండ్లి కాలేదని చెప్పుచున్నారు.

అహ.—ఛీ! ఏమిమాటలు, నాదగ్గఱcగూడ నబ్బైయనెద వేల. నీ వామెను బలవంతముగా వివాహమాడ యత్నించు చున్నావcట! నా రాజ్యములో నీవుదుర్మార్గము చేయకుము. ఇటువంటివానిని క్షమి యింపను. అన్నభార్యను బెండ్లియాడుటకు నీకు సిగ్గులేదా?

దాల.—అమ్మా! నే నామెవిషయమై యెట్టి దుష్కార్యముc దలపెట్టలేదు. కిట్టనివారు చెప్పినయబద్ధములు నమ్మి మీారు నన్ను శిక్షింపc దలంచుచున్నారు. నే నట్టిపని చేయుదునా? అన్నభార్య తల్లికాదా? పెండ్లి కాలేదని నేను స్వీకరింపcదలcచితిని. పెండ్లి యైనమాట నిజమైన నాకామెవద్దు.

అహ.—సరే! జన్మాంతరావు మాపైన నలుక వహించి నాcడట. నీవును నందుc జేరినవాcడవేనా? ఇంక నీవంటి శూరు లెందఱు—

దౌల—రామ రామ! నే నేపాప మెఱుఁగను. మీపాదములతోడు, శ్రీవిశ్వేశ్వరస్వామివారితోడు. సెల వైన జస్వంతరావును ఒట్టి యిచ్చెదను.

అహ—తన ప్రాణముల కాసపడ వద్దని జస్వంతరావుతోఁ జెప్పుము. మీరుండఁ జచ్చినట్లు భావించుకొనుఁడు. ఇఁక నీవుపో.

అని యహల్యాబాయి దౌలతరావు నంపెను. దౌలతరావు నోటికివచ్చినన్ని యనృతములాడి రాణీయాగ్రహమునకుఁ బాత్రుఁడు కాకుండఁ బులినోటఁబడి తప్పించుకొనిన మేఁకవలె సంతసించుచుఁ బోయెను. అట్లు దౌలతరావింటికి వచ్చునప్పటికి భార్య దుర్గాబాయి గృహమందు లేనందున నిదె సందని కామబాధావివశుఁడై కమలాబాయియొక్క కమలములవంటిపాదములపైఁబడి తన్ను వివాహము చేసికొమ్మని యామెను బహువిధములఁ బ్రార్థించెను. కమల భయసంభ్రమములతో వడఁకుచు నాతనిఁ దనపాదములతోఁ దన్ని యాడరానిమాటలాడి యనేకవిధముల నిందించి రోదనము చేసెను. మన్మథబాణములచే దేహము చిల్లివడ ములుకులవంటియామెపలుకు లంతపనిఁ జేయవయ్యెను. సిగ్గతని నీవలకే విడుచుటచే నెగ్గు వాని కగపడదయ్యెను. అందుచే నాతఁడు వడకుచున్న యావన్నెలాడిని గట్టిగఁ బట్టుకొనిసందిటఁ జేర్చియాలింగనసౌఖ్యముకొఱకుయత్నించుచుండ నామె బెదరిన మార్జాలమువలె నొడలెల్ల రక్కి యఱువ సాగెను. ఆమె బరుకులు వానియంగములనుండి రక్తముస్రవింపఁజేసి కుంకుమ నలందుకొన్న పెండ్లికుమారునివిలాసము నతని కొసగెను. అంతలో దుర్గవచ్చి తలుపు గొట్టినందునఁ గమల యామెకుఁ దలుపు దీసెను. దౌలతరావు చేసినచర్యలను దుర్గ కమలాముఖమున విని యిట్టిమగనికిఁ దాను భార్యగా నుండుటకు సిగ్గుపడి కమల నూరార్చి మగనిని గాలమువంటిమాటలతో నొప్పించెను. కాని సల్లబాయి

వలె నతఁడు నిరుత్తరుఁడై కమలను వశముజేసికొను నుపాయమును వెదకుచుండెను. ఇట్లతఁ డాలోచనలు సలుపుచుండఁగానే సూర్యుఁ డపరశైలశిఖరము నలంకరించెను. రాత్రి యందఱు భోజనముచేసి పండుకొన్నతరువాత నిద్రాసక్తులైరి. రెండుజాములరాత్రి యైన తరువాత దౌలతరావు తాను నిద్రించుచున్న గదివిడిచి తళతళ మెఱయుచున్న ఖడ్గమును గేలఁ బూని కమలశయనించుగదిఁ బ్రవేశించి "దురాత్మురాల! కమలా! నీవునాకుసక్కఁ ఱకురానిదానవు. నీవుండిన నేమి చచ్చిననేమి? నిన్నిప్పుడు చంపివైచెద"నని ఖడ్గ మామెమెడ మీఁదనుండి యొకయేటున వేయఁ గత్తి నెత్తెను. అంతలో నామె ముఖవికాసచంద్రికలు కోపావేశాంధకారమును బాపినందున "ఈమె నిప్పుడు చంపను. ముందుముం దీమె తప్పక నావశము కాఁగలదు. కాకపోయినచో నప్పుడే తుదముట్టించెద" నని తనదుష్ప్రయత్నము మాని మఱలలోనికింజని నిద్రించెను. నాలుగుగడియలరాత్రియుండఁ గమల మొగముప మేలిముసుఁగు దిగజారవైచికొని యెవరితోడను జెప్పక గృహమునుండి వెడలిపోయెను. ఎక్కడికరిగినదో యెవ్వరు నెఱుఁగరు. ఉదయమున దుర్గాబాయి దౌలతరావును గమలం గానక కలవలపడి దుండిరావును లక్ష్మణుని వెదకుమని పంపిరి. అందు దుండిరా వెచ్చటనో గంజాయిద్రాగి మత్తుగొని పండుకొని సాయం కాలమున వచ్చి కమల కనఁబడలేదని చెప్పెను. దీపము పెట్టిన తరువాత లక్ష్మణుఁడు వగర్చుకొనుచు వచ్చి దౌలతరావుతో రహస్యముగ "అయ్యా! నల్లమందుచెట్లతోఁటలోనున్ననూతిలోఁబడికమల చచ్చినది. శవ మొకగడియకిందటఁ దేలిన"దని భయపడుచు జెప్ప దౌలతరావు తలయూచి, "సరే భయమేమి నేను జేయవలసినపని తానే చేసికొనినది కాని యెవ్వరికిఁ దెలియకుండదహనముచేయుఁడు" అని పలికి నాలుగుమాపాయలిచ్చి వానిని దుండిరావును బంపెను.

వీరిరువురు తోఁటలోనికిఁ జనునప్పటికి నూతియొద్దున నొకవృద్ధుఁడును నొకపడుచువాఁడును నప్పుడే తేలినశవమును జూచి విలపించుచుండిరి. అందువృద్ధుఁడు. "అమ్మా! నిన్ను బలవంతమరణముపాలుచేయుటకే వానికిచ్చి పెండ్లిచేసితిని. కాకున్నచో నీమఱఁది కింతచేటుకాలము రాదు." అని విలపింప సందుఁ బడుచువాఁడు వానినూరార్చి యిది యేడువఁదగినసమయముగాదు. ఎవ్వరో వచ్చుచున్నారు. పదపద యని వానిని గెంటికొని పోయెను. తరువాత దుండిరావును లక్ష్మణుఁడును మెల్లగా శవమును బయటికిఁదీసి మోసుకొనిపోయి దహనము చేసిరి.

---

## తొమ్మిదవ ప్రకరణము.

ధరణీమణికిఁ గాలపురుషుఁడు పట్టిన ధవళచ్ఛత్రమువలెఁ జంద్రుఁడు గగనభాగము నలంకరించి చెట్లకుఁ బర్వతములకు సమస్త పదార్థములకు నపేదుపూఁతపూసిన తెఱఁగునదన వెన్నెల వ్యాపింపఁ జేసి వానికపూర్వధావళ్యము నొసంగెను. ఆవెన్నెలలోఁ దనయజమానునియాజ్ఞ శిరసావహించి దుండిరావు మహాపురసమీపమున నున్న గూఢెముజేరి యందున్న ఋషికుటీరముఁ బ్రవేశించెను. ఋషి వానిం జూచి యాలింగనము జేసికొని "నాయనా! తండ్రీ! నీవువచ్చితివా! మనరాణీ మృతినొందినాఁడు గదా. దౌలతరావు చేయునది యేమియని యడుగుటయు దుండిరావు వానికినుత్తరముచెప్పుటకు యత్నించుచుండ నింతలో దీర్ఘకాయుఁడును మహాసత్త్వుఁడు నగు నొకనల్లనిమనుష్యుఁడు కుటీరముఁజొచ్చి వారిసంభాషణ కాటంకము గావించెను. ఆపురుషునిగడ్డము కాయముకంటెఁ గొంచెము నల్లనై జుట్టువలె నతిదీర్ఘమై యుండెను. ఆతనిశిరమున నల్లుకొన్న

జడలును జడలనడుమ నతఁడు చూడామణిగ నుంచుకొన్న నెమలి పింఛమును మెడను ధరించిన పలురంగులుగల పూసలును చేతనున్న గండ్రగొడ్డలియు నతఁడు పర్వతప్రాంతములఁ వసించునాటవికుఁడని తెలియఁజేయును. చింతనిప్పులవలె నుండువానికన్నగవనుండి వెడలు దృష్టి ఖాత్రిసుండెగల దుండిరావునకుఁ గూడ భయంకరమై యుండె నని నింకఁ జెప్పనదియేమి? అతఁడు లోపలఁ బ్రవేశించి తనమోట మహారాష్ట్రపుమాటలతో నిట్లనియెను. "దాంతియా రా లేదా? ఈదుండిరావు వచ్చి మీతో నేమి చెప్పినాఁడు? మన మితఁడు చెప్పి నట్లు చేయవచ్చునా" అని యన ఋషి "ఓయీ గండా! వచ్చి కూర్చుండు" మని "నిమ్మళముగ విచారింప వలసినయంశములు నీదుండిరావు చెప్పినమాటలు విను"మని సందేశ మెఱిఁగింపుమని దుండిరావును హెచ్చరించెను. అనంతరము దుండిరావు మెల్లమెల్లగా నిట్లు పలికెను. "ఓయీ గండాభిల్లుఁడా! మనపుణ్యము పుచ్చినది. జస్వంతరావు, దౌలతరావు, గోమాజిరావు మొదలగు ప్రబలులు రాణీతోఁ బగసాధింపఁ గత్తిగట్టినారు. అందుచే నీవు నీభిల్లసైన్యములతో వారికి సహాయముగవచ్చి రాణి నెదిర్చితివేని యుభయులకును లాభ ముండును. నీవుగోరుకొన్నసొమ్ము నీవే తైకొమ్ము. అదిగాక మలహారురావు హోల్కారు మరణము నొందునపుడు తన మనుమఁడు చచ్చునేని కోడలు మరలనొకని దత్తము జేసికొన వలయునని మరణశాసనము వ్రాసినాఁడు. వారిబందుగులకుఱ్ఱవాఁడె యున్నాఁడు. మనవా రాబాలుని హోల్కారుగఁ జేసి కొద్ది దినములలోఁ బట్టాభిషేకము జేతురు. క్రొత్తహోల్కారునకు మీరు సహాయము సేయుఁడు.

ఋషి—అహోల్కారును నే నెఱుఁగుదును. ఆహా! మిక్కిలి బాగున్నది. గండా! నీకుసందేహమెందుకు? అహల్యాబాయి సింహా

సనముమీఁద నుండదు. రాధాకాంతరావుతోఁ జెప్పినాను. శ్యామసుందరదత్తు నాతో మాటాడినప్పుడు నేను వారిపక్షము పల్కితిని గాని నేను వారిసంహారము జూచువాఁడను. మలహారరావు నాకిపకారము జేసినాఁడు. ఆకసి నేనిప్పుడుతీర్చుకొందును. దేశమును మంగలములోఁ బెట్టి వేఁచి వైవవలెను. నీ రెండువేల భిల్లసైన్యముతో దోఁపిడి వెంటనే యారంభింపుము. నీకు నాదీవన నిచ్చెదను, ప్రజలకు నావయస్సునుబట్టి నాపై మిగుల భక్తిగలదు. వారు నామాయాసముద్రమునఁబడి మునిఁగినవారలు. నీవుజంకకు.

గండాభిల్లుడాపలుకుల నాలకించి యడవిజంతువులెల్ల ఖణిల్లని యొకవింతకేకవైచి "యిదిసరి. యిదిసరి. నాతమాష చూడుము. ఈపని నెఱవేరునేని నూఱుదున్నపోతులను శ్రీకాళికి బలియిచ్చెదను. దొరికినయెడల మనుష్యుని బలియిచ్చెదను. దుండీ నేనిందులకు సమ్మతించితినని మీదాలతరావుతోఁ జెప్పుము."

దుండి—మలహారురావు మనయీఋషికి నపకారముచేసెను. అహల్య కమలాబాయిని వివాహ మాడవద్దని దాలతరావును నిందించి యనరానిమాటలని పరిభవించింది. అదిగాక కమల నూఁతిలోబడి మృతినొందినది. కాఁబట్టి దాలతరావు రాణిపైఁగల కసి దీర్చుకొనుటకు మిమ్ముఁ గలియఁగోరినాఁడ. ఇది ఋషికిని మీకును నిష్టమని ప్రభువుతోఁజెప్పికొత్తహరాల్కారుపట్టాభిషేకప్రయత్నములు చేయుచుండెదము. నీవును దోఁపిడి నారంభింపుము.

అనిచెప్పి ఋషికి నమస్కరించి గండాభిల్లునొద్ద సెలవుగైకొనఁబోవుచుండ నొకమనుష్యుఁడు పదునేడువత్సరములబాలుని నొకని వెంటఁ బెట్టుకొని వచ్చెను. ఈవచ్చినమనుష్యుఁడు సర్వలక్షణముల గండాభిల్లుకంటె నెక్కువవిలక్షణముగను, నెక్కువభయంకరముగను నుండెను. కాని యతనికంటెనొకయరదుగుపొట్టి. గండాభిల్లునికంటెఁ

బొట్టియు గాక యతఁడు వానికంటెఁ గ్రూరుఁడు. వెంటనున్న బాలుఁడు గడగడ వడఁకుచు వెఱ్ఱివెఱ్ఱిచూపులుచూడసాగెను. అతఁడు సౌందర్య శాలి. తాంతియాభిల్లు బాలునితో ఋషికుటీరముఁ జేరి గండాభిల్లుని జూచి, "ఓరీ నీనిమిత్త మీసుందరుఁడగు పిల్లవానిఁ దెచ్చినాను. ఋష హానుండి యీకుఱ్ఱవాఁ డిందూరునగరమునకుఁ బయనమై పోవుచు న్నాఁడు. ఈతని నీయిష్టమువచ్చినట్లు చేసికొమ్ము" అని యబ్బాలుని చేయిపట్టి లాగిచూపెను. ఋషి వానిమొగమును దీపము వెలుగునఁ బరీక్షించిచూచి "యీతఁడు కాళికి బలినిమిత్త ముపయోగించును. తీసికొనివెళ్లి బలియిమ్ము" అని యుత్సాహము గల్గునట్లుఁ బల్కెను. పలుకుటయు నబ్బాలునిగుండె జల్లుమన యొడ లెల్లఁ జెమటలు పట్టె ను. పట్టినతోడనే, 'అయ్యో' యని కేకవైచి గుభాలునమూర్ఛిల్లి నేలవ్రాలిన మోడువలెఁబడి స్మృతిదప్పి యుండెను. తాంతియా వా నినిజూచి మహాకోపముతో "దొంగవేషమువైచెదవా? బద్మాష్" అని క్రూరదృష్టితోఁ జెళ్లుచెళ్లున వీఁపుపై రెండుచఱుపులఁజఱచెను. కాని భయావేశమే కవచముగాఁగల యాబాలుఁడు దెబ్బలవలన మేలుకొనఁ డయ్యెను. "ఇప్పుడే యీతని బలిపెట్టుదమురా" యని తాంతియా భిల్లు గండాభిల్లుని వెంటఁబెట్టుకొని యాబాలుని శవమువలె మోసికొని పోయిరి. ఈబాలునిప్రాణము లెట్లయిన రక్షింపవలయునని దూండి రావునకు సదుద్దేశము గలిగినది. కాని యామాట వారితోఁ జెప్పి నచో వారు తన్నే చంపుదురని భయపడి యూరకుండి మెల్లగాఁ దనస్వామియొద్దకుఁ జనెను.

ఇదియైన కొన్నిదినములకే దేశమునం దక్కడక్కడ బందిపో టులు,కన్నపుదొంగతనములు, దారులు గొట్టుటయు నారంభమై దేశ మంతయు నట్టుడికినట్లుడుకసాగెను. స్త్రీలను జెఱపెట్టుట, దొంగత నము మాన్పి మానప్రాణములకును మర్యాదలకును భంగము లేకుం

డఁ జేయ జనులందఱు రాణితో మొఱ్ఱలుపెట్టుకొని యారాజ్యము నుండి పాఱిపోవుదుమని చెప్పిరి. నిరంతరమును గ్రామములు పరశు రామక్షేత్రి యగుటచేతను, జనులు పులులవలె వేఁటాడఁబడుటచేతను నహల్యాబాయి ప్రజలయధైర్యమును స్వసైన్యద్రోహమును దన యసహాయస్థితియు నరాజకమునుజూచి విసిగి చేయునదిలేక దుఃఖిత యయి రాజ్యభారమును విడిచి మంత్రులకు లోఁబడుట యుచితమని యోచించుటకుఁ గూడ సిద్ధమయ్యెను. అట్లుండి, రాధాకాంతుని శ్యామసుందరుని బిలిచి యామె వారితో నిట్లనియెను. "అయ్యా! ఇఁక నారాజ్య మెందుకు? నేను దీనివదలి కాశీనగరముఁ జేరి విశ్వే శ్వరస్వామివారి చరణముల నాశ్రయించుట మంచిదని తోఁచుచు న్నది. పరమపతివ్రతయగు కమలాబాయి నిష్కారణముగా నూతిలో దిగి చచ్చినది. ఆనేరమునబట్టుకొని యాపాపాత్ములను శిక్షించువారు లేరైరి. మీఁదుమిక్కిలి జస్వంతరావుప్రేరణచే రఘునాధరావు మన పై దండువెడలునఁట! అది నిజమని పీష్వాసభలోనున్న దాదాజీగో క్లా తనతోఁ జెప్పెనని మనకృష్ణాపంతులునిన్ననే పునహానుండివచ్చి చెప్పినాఁడు. భిల్లు లాకమూలఁ బ్రజలను మాడ్చుచున్నారు. ప్రజలు నాజీవమున కుసూరుమన్నతరువాత నారాజ్య మెందుకు? పన్నులు గైకొని సుఖయించుటకా! నే నేమిచేయుదును" అని నిర్వణ్ణురాలై పలుకు మహారాణినిజూచి రాధాకాంతుఁడు "అమ్మా! యీదురా త్ములు లోఁబడకపోరు. పాప మెన్నఁడును నెగ్గదు. నేను, శ్యామ సుందరదత్తు, తుకాజీ, శివనానా జీవములతో నుండ నిందూరురాజ్య లక్ష్మి యీదురాత్ములచేఁ జిక్కదు. మీరు మాకు ధైర్యము జెప్ప వలసినది. మీ రధైర్యపడ కుందురేని మే మెంతెంతకార్యముల నైన సాధింపనేర్తుము. విచారము వద్దు. అమ్మా! యీముక్తాబా యికి శరీరమున సుఖముగ నున్నదా? దాసి యెట్లున్నది" అనిపలుక

అహల్యాబాయి, "నేను మిమ్ము నమ్మియున్నాను. నీవును శ్యామసుందరదత్తునుబోయి దొంగలఁ బట్టుకొనుఁడు. మఱియొకవిచారము నాకులేదు. నీవు పంపినదాసిమూలమున నాకూఁతురు బ్రతికినది. అది కడుచమత్కారి. ఏడ్చువారిని నవ్వించును. సీతాబాయిమొగముజూడ నన్నివిచారములు నశించును." అనిచెప్పెను. శ్యామసుందరుఁ డంత "అమ్మా! యిదె నేనును రాధాకాంతరావుగారును నరిగి దొంగలలో ముఖ్యులఁ బ్రాణములతోఁ దెచ్చి మీ కప్పగించెదము. సెలవొసంగుఁడు. పోయెదము. తుకాజీని సైన్యముతో సిద్ధముగ నుంచు మని యానతిండు" అని రాధాకాంతరావును దత్తును రాణిని వీడ్కొని పోయిరి.

## పదియవ ప్రకరణము.



సూర్యరశ్మియెట్టిదో యెన్నఁడు నెఱుఁగనట్టి చీమదూఱనిచిట్టడవి యని చెప్పఁదగిన వింధ్యపర్వత ప్రాంతభూమియం దొకచోట, కొండగుట్టలచే నావరింపఁబడు నొకకోనలో నొకనాఁ డుదయమున నాకాశమును బీటలువాఱఁ జేయుమహాకోలాహల ముదయించెను. అడవి మృగములవలె ఘీంకారాదిభయంకరధ్వనులతోడ భిల్లులందఱు మతావేశమునొంది భక్తిపారవశ్యముచేత నెదుట వృక్షమునఁగట్టఁబడినబాలకునిపై దృష్టులు నిగిడ్చిరి. ఆబాలకునిశరీరమం దంతట జేగురుగంధము పూయఁబడెను. మొగమున నెత్తుటికుంకుమబొట్టు పెట్టి యప్పుడప్పుడె యంటఁబడినతలనుండి నీటికణములుజాఱ వికచారవిందములఁబోలు రెండుకన్నులనుండి బాష్పజలములొల్కుచు నాబాలకుండు భిల్లులవలన శ్రీకాళికిబలి యీయఁబడుటకుసిద్ధముగ నుండెను. అతని

హృదయస్థితదుఃఖమును వేఁడికన్నీరు తెలుపుచుండెనేకాని నోటి మాటలు తెలుపుటలేదు. వెనుక తాంతియాభిల్లు తోఁపలోఁ బట్టుకొన్నసుందరాకారుఁ డగుబాలుఁ డాదినమున గండాభిల్లుచేఁ దమ దేవతకు బలి యీయఁబడు చుండుటయే యీకోలాహలమునకుఁ గారణము. అమితానందరసమున నోలలాడుచు భిల్లులు భిల్లాంగనలు నెండ బల్లివలెఁ జెట్టునఁ గంటిపెట్టుకొని యమితదుఃఖరసమున నీవత్స యుఁడు పరలోకప్రయాణమునకు మూటగట్టుకొనెను. అప్పుడు వారిలోఁ నెల్లపెద్ద తళతళ మెఱయుఖడ్గముఁ బూని యెటునుండినఱకుటకు సులువుగ నుండునోయని కత్తి మెడపై నిడి భిల్లులు సింహనాదము సేయ భిల్లాంగనలు చప్పటలు చఱవ నొక్కవ్రేటును వైచెను. ఆవ్రేటుతో బాలునిశిరము తెగి నేలఁ బడవలసినదె కాని యాకుఱ్ఱవాఁడు మెడ రెండవవైపునకుఁ ద్రిప్పినందున నాయేటు వానికిం దగులదయ్యె. అంత నాకుమారుఁడు స్మృతిదెచ్చుకొని చేతులుజోడించి గండాభిల్లుని జూచి నమస్కరించి, "అయ్యా! నన్నేల మీదేవతకు బలియిచ్చెదరు. మాతల్లికి నేనొక్కఁడనె కుమారుఁడను. ఈనడుమ నాచిన్నతమ్ముఁడు మశూచికమువచ్చి చచ్చినాఁడు. నేను మాయక్కనుజూచి పోవలయునని పుణెనుండి వచ్చుచున్నాను. నేను తండ్రి లేనిబిడ్డను. మిగుల బీదతనము ననుభవింపుచు దిక్కులేని నాకుటుంబమును బోషించుకొనుటకు నెక్కడనైనఁ బదిరూపాయలుద్యోగము సంపాదింపవలెనని పట్టెడాశతో మాబంధువుల నాశ్రయింప నిటు నిందూరునగరమునకుఁ బోవుచున్నాను. నేనేమో యుద్యోగము సంపాదించి తమ్ముఁ బోషించునంతటి ప్రయోజకుఁడనగుదునని గంపంతకోర్కెతో నాతల్లి నాకయి యెదురు చూచుచుండును. నన్ను విడిచి యీపుణ్యము గట్టుకొమ్ము" అని ప్రార్థించెను. ఆప్రార్థనలు వినఁ గొండఱు భిల్లులకును భిల్లాంగనలకును హృదయములఁ గరుణారసముదయించెను.

కాని తాంతియాభిల్లున కాగ్రహ ముదయించి గురువును జూచి "ఈపాపాత్ముని వదలవద్దు. వదలినచో దేవి కాగ్రహము వచ్చును. ఇదివఱకు మన మెన్నిపల్లెలు దోఁచిన మనము పట్టుపడ కుండుట కీమెకారుణ్యమెకదా కారణము. కావున వేగమె తల తెగవైవుఁడు" అని పలికెను. పలికినతోడనే మనుష్యాకారము నెత్తిన వ్యాఘ్రము వంటి యాగురువు మనుష్యప్రాణములఁదీయుటలోఁ జిరతరానుభవము గలతనకుడిచేతి నెత్తి శిరము దేహమునుండి తెగవైచుటకుఁ గత్తి మెడపైఁ జేర్చి వాటముఁ జూచి మఱల ఖడ్గము నెత్తెను. అందఱు 'జయభగవతి'యని యఱచిరి. ఆబాలుఁడు కనులు మూసికొని రామ రామయంచు మెడపైఁగత్తిపడిన దనుకొనెను. అంతలో మూఁగిన మనుష్యసంఘమునందు, వచ్చెవచ్చె మరాటిదండు మరాటిదండు, అని మహాధ్వనులు వెడలెను. వెంటనే ప్రాణములకై పరతెంచు వారును బాణములకై పరుగులెత్తువారును, విండ్లుచేతఁబూనువారును జెండ్లవలె రాళ్ళుపట్టువారును నై భిల్ల భిల్లాంగనాబృందము చిందర వందర యయ్యెను. ఈనడుమ మరాటిదండువారిపైఁబడఁ దత్సైన్య ముఖమున నుత్తమతురంగముపై నెక్కి భిల్లులకన్నులకు రుద్రునివలె నున్న రాధాకాంతరావును, కుమారస్వామివలె వెనుకనున్న శ్యామ సుందరదత్తును గానఁబడిరి. గురువు ఖడ్గమును జంకక్రిందఁ బెట్టుకొని పాఱిపోవుటయుఁ గొందఱు భిల్లులు గురువుగారిమార్గమునవలంబించు టయు, మిగిలిన యాటవికులు మరాటులపైఁ బడి యెదిర్చి కొంత సేపు దూరమునుండి శిలావర్షము గురిసియుఁ గొంతవడి యమ్ముల వానలు వర్షించియుఁ గొంతసేపు ఖడ్గాఖడ్గిని బోరియు, హోరా హోరిగా యుద్ధముఁ జేసిరి. తుపాకులు, పిచ్చుకత్తులు, మొద లగునాగరకపుపనిముట్లుండుటచే మరాటులు శత్రుసంహారమున నెక్కువ సులువుగలవారై మోటకయ్యముసేయు భిల్లులఁ దోలిరి.

వీరశిఖామణి యగు రాధాకాంతునకు వీఁపు పై నొక కత్తిపెట్టి గాయము తగులుటయు, నీదుఃఖ ముపశమింప శ్యామసుందరదత్తు భిల్లనాయకుఁ డగుగండాభిల్లు పట్టుబడుటయు నను రెండుకార్యము లీయుద్ధఫలితములు. వృద్ధుఁ డగు రాధాకాంతునకుఁ దగిలినగాయ మపాయకరమైన దగుటచేఁ నటఁ దగినవైద్యము జరగ దని దత్తాతఁ డొకబండి చేయించి తగుపరివారము నిచ్చి ముందుగా నిందూరునగ మున కంపి తాను వెనుకనుండి దొంగను దీసికొనివత్తు నని చెప్పి యాతని నంపెను. యుద్ధము జరుగుచుండఁ గొందఱుభిల్లులు బ యీాయఁబడుటకు వృక్షమునకుఁ గట్టఁబడ్డ బాలునికట్లు తొట్రుప టుతో విప్పి బలబల లాగికొని పోయిరి. శ్యామసుందరదత్తు గండ భిల్లుని వెంటఁబెట్టుకొని నలుగురు సేవకులతో మెల్లమెల్లగఁ బయనమ సేయుచుఁ గడుమన్నెములను, బర్వతప్రాంతములను దాఁటి రెండ దినములకు మనఋషియున్న కుటీరసమీాపమునకువచ్చి సాయంకా మైనందున నచ్చట విశ్రమింపఁ దలఁచెను. దత్తుతోనున్న నలువురిసే కులలో నొకఁడు గండాభిల్లునకుఁ బరిచితుఁ డుండుటచే వాఁడతనితో నపుడపుడు సగము వినఁబడి వినఁబడకుండునట్లు మాటలాడుచు జా గ్లునట్లు కన్నీరు విడుచుచుఁ దన్నుఁ జెఱనుండి విడిపింపుమని బహు విధములఁ బ్రార్థించెను. కాని కత్తెరబోనువలె దత్తుఁ దక్కినభటుల నుండుటచేఁ బ్రత్యుత్తరమిచ్చుటకుఁ గాని చెఱనుండి వానిని విడిపి చుటకుఁ గాని యాబంటోత్రునకు వీలు లేదయ్యె. గండాభిల్లు తః మరణ మింక నిశ్చయ మనియు నేచెట్టునకో కట్టి తన్నహల్యాబాయి యురి దీయుననియుఁ గడు విచారగ్రస్తుఁడై చచ్చినపులివలె నుం యేపని చేయుటకు వీలులేకుండఁ జేతులు విఱచి కట్టఁబడినందు నప్రయోజకుఁడై యుండెను. ఇందూరునగర మొకక్రోసు దగ్గఱ వచ్చినకొలఁది తనమరణ మొకదినము సమీాప మగుచున్నదని గ

డాభిల్లు రోదనము సేయుచుఁ దాను జేసిన పాపములను, నరహత్యలను, రాజద్రోహములను దలంచి బెంగబెట్టుకొని నిద్రాహారములఁగైకొనఁడయ్యె. గండాభిల్లు చేఁజిక్కినవార్త విన్నవారందఱు సంతసించి పండుగ జేసికొనుచుండిరి. ఈలోఁగను శ్యామసుందరదత్తు ఋషికుటీరమునం దుంచి కాలుసేతులుగట్టి నలువురు సేవకులను జుట్టు కాపుపెట్టి జామున కొక్కఁడని మేల్కొనుమని యానతిచ్చి తాను వెలుపల నొకమంచముపైఁ బండుకొనెను. అంతట ఋషి యాతనితో, "నాయనా! యీపాపాత్ముఁడు దొరికినందుకు దేశమంతయు సంతసించు చున్నారు. వీనిని వేగముగఁ గడతేర్పుము. ఈకార్యము చేసినందుకు నీకీర్తి శాశ్వతమై యుండును. ఈదురాత్ముఁడు ప్రజలను బెట్టిన క్షోభ యింతంతకాదు. వారియుసురు నేఁడు తగిలినది కాఁబోలు." అని ముచ్చటించెను. "ఇది మీ యాశీర్వచనము. మీరు హోల్కారువంశమునకు మేలు సేయఁ దలఁప మే లెందుకు సేకూరదు? ఇది మీచలవ కాదా?" యని దత్తుత్తరము చెప్పెను. ఆసమయమున నొకతురక వెదకికొనుచు వచ్చి "అయ్యా, యిచ్చట శ్యామసుందరదత్తుగా రున్నారా"యని యడిగెను. దత్తు తత్తరపాటుతో లేచి, "అబ్దుల్‌నబీ యేమి యిప్పుడువచ్చినావు ? తొందర లేవైన నున్నవా?" అనియడుగ, "మహారాజా! తొందరలులేవు రాణీగారు మీకు హుకుము జారీ చేయించినారు. అది తెచ్చినాను" అని చెప్పి యుత్తరమును జేతికీయ నాజాబును దత్తుచదువుకొని, పాపమింతత్వరగా నదియగునని నేను దలఁపలేదు. అని యుత్తరము మడుచుచుండెను. ఋషి యది యేమనియడుగు చుండఁగనె దత్తు లోపలికిఁబోయి ఋషిని రమ్మని పిలిచి గండాభిల్లును మేలుకొలిపి యిట్లనియెను. "ఓయీ! మహారాణిగారిట్లుత్తరమువ్రాసినారు. చదువుచున్నాను విను. "గండాభిల్లు నిటకుఁ దీసికొని రా నక్కఱ

లేదు. భిల్లులు, బిడారులు, గాండ్లు మొదలగు వనవాసు లీ౦కము౦ దిట్టి రాజద్రోహము సలుపకుండ బుద్ధిగలుగునట్లు వారి నందఱఁ జేర్చి వారికి భయము గలుగునట్లు చెట్టునకుఁ గట్టి గండాభిల్లును తే పుదయమున నరిదీయవలెను." అని వ్రాసినారు. కాఁబట్టి నీమర ణము తేపుదయమున" నని కఠినముగాఁ జెప్పి తనకుఁ గొంచెము కన్నీరు వచ్చుటచే నటనుండలేక వెలుపలికిఁ జని పండువెన్నెలలోఁ బవ్వళించెను. గండాభిల్లు దత్తువచనములు విని పిడుగుబడినవాని చం దంబున కట్టుబొమ్మవలెనై యప్పుడే చచ్చినట్లుండెను. తరువాత ఋషి వానిని గొంత యోదార్చెను. ఆపండువెన్నెలలో నాఁటిరాత్రి దత్తు నకు గండాభిల్లుయొక్క మరణవృత్తాంతమును దెలుపవలసివచ్చినందుకు విచారమేకాక మఱియొకవిచారముగూడ జ్ఞప్తికివచ్చెను. ఆనాఁటి పూర్ణచంద్రదర్శనముచే దత్తుయొక్క మోహపయోధి యుబ్బి మలయమారుతప్రేరితములగు మహామోహతరంగము లున్నతము లగుటచే హద్దుమీరెను. కమలయొక్క ప్రదర్శనమును వృషభ సంహారమును మొదలగు నాఁటిపనులెల్లఁ గన్నులకుఁ గట్టిన ట్లెదుటఁ గనఁబడి దత్తున కించుకసేపు గండాభిల్లుపై మఱపు గొల్పి రాజభక్తినిగూడ మఱపించెను. అందుచే చిత్తస్థైర్య ల్యంబు చెడినందున నాతఁడు లేచి జాగ్రతగనుండుమని సేవకులతోఁ జెప్పి వానిని ఋషికప్పగించి తనకుఁ గమలాదర్శనమైనస్థానమునకుఁ జనెను. అరిగి "హా! సుందరీ! హాకమలా! నీవెంత యల్పాయుష్మంతు రాలవైతివే? వృషభముబారినుండి తప్పించుకొంటివి గనుక చిరకాల జీవి వగుదు వనుకొంటినిగాని యింతలో నిట్టిబలవన్మరణము గలుగు నని తలంపనైతిని. నీవుస్వర్గమునకుఁ బోవుచు నాహృదయము నపహరించుకొనిపోయినావు. నన్నుఁగూడ నీసాన్నిధ్యమున కేలకొనిపో రాదు? నిన్ను జూచినకన్నులతో నింకొకకన్యను జూడఁ జాలను,

నిన్నుఁ దలఁచిన మనసుతో నింకొకకన్యను దలఁపఁజాలను" అని విల పించి యూరటలేక "ఇచ్చటనొకదాని నిమిత్తము నేనొద్దును వాఁడి క్రోలలచేఁ గూలనేసితిని. ఇచ్చోటనె కదా నిన్ను సందిటం గదియఁ బట్టి నామనసార నీమొగము తెప్పవాల్పక చూచుచు నిన్నుఁ గూర్చుం డఁబెట్టినది. ఇందేకదా నీవు నన్ను వాలుచూపులఁ జూచి నా కాస గొల్పినది" యని యానాఁటిచర్య లెల్లఁ దలంచి యాయాస్థానముల కరిగి కూర్చుండుచు, లేచుచు, బవ్వళించుచు మన్మథబాణప్రహార ముల కోర్వక విహరించుచుండెను.

---

## పదునొకండవ ప్రకరణము.

---

ఇట్లు శ్యామసుందరపత్తు విచారించి విచారించి ప్రొద్దుచూడ నప్పటికి రమారమి జామురాత్రియుండెను. అందుచేఁ జాలనాలస్య మైన దని యెంతసేపు విచారించినను గతజలసేతుబంధనమే కాని మృతినొందిన కమల మఱల రాదని యెఱింగి ఋషికుటీరాభిముఖుఁడై చనెను. చనుచు మార్గమధ్యమున "తెల్లవాఱుచున్నది. గండాభి ల్లును నే నురిదీయింపవలెను కాఁబోలు! ఈవఱ కెన్నఁడు నిట్టిదారుణ కార్యము నేనొనర్చి యుండలేదు. ఈపని నాపాలఁ బడినందుకు నాకు మిగులఁ గష్టముగనున్నది. నే నెట్లుచేయుదును. అయినను రాజ భక్తియుఁ బ్రజాక్షేమముఁ జూచి యిద్దురాత్ముని జంపవలె. రాణి సెలవు తప్పదుగద" యని తనలోఁ దాను వితర్కించుకొనుచు నేవృ క్షమునకు దాఁడువేయించి యురిదీయింపఁదగునని యోచించుచు నిరు ప్రక్కలనున్న మహావృక్షములఁ బరీక్షించుచు నడవ సాగెను. ఇట్లు నడిచి నడిచి యొకకొంతసేపటికి ఋషికుటీరసమీపమునకు నరుగు

దెంచి యాగుమ్మముముందరఁ గన్ను చెదరునట్లు కుంకుమనీటివలె నున్న రక్తముఁజూచి యాశ్చర్యముఁ బొంది నిర్ఘాంతపడినిలుచుండెను. నిలిచేనలుదెసలు బరికింపఁ దనసేవకులలో నొకని శిరమొకవైపునను మొండె మొకవైపునను బడియుండుట దనకన్నుల కగుపడఁగా దత్తు చిత్తము తత్తరమంద లోనికింజనియెను. చనినతోడనే వానియాశ్చర్య మే మని చెప్పుదును. కుటీరములోఁ దనముప్వురు సేవకులుగాని గండాభిల్లుగాని కనఁబడరైరి. కాలుసేతులు వెనకకు విఱుగఁగట్టఁబడుటచేఁ గదల మెదల నేరక నోటగుడ్డలు గ్రుక్కఁబడుటచే మాటలాడనేరక యొకమూలఁ బడియున్న ఋషిని మాత్రి మతఁడు చూచి మెల్లఁగా వానిని లేవనెత్తి యొకచోటఁ గూర్చుండఁబెట్టి కట్లువిప్పి నోటనున్న గుడ్డలనూడఁదీసి యావైచిత్ర్యమునకుఁ గారణమడిగెను. ఋషి కొంత సేదదేరి నీరసముతో నిట్లు చెప్పెను "నాయనా! నీవేలయడిగితివి? నీకొంప నాకొంపఁ గూడఁ దీసితివి. నీవెట్టిపాపపుగడియల బయలుదేఱితివో, నీవు కుటీరమువెడలినతోడనే నలువురుభిల్లులు మాపైఁ బడిరి. తరువాత నేమిచెప్పుదును తండ్రి! విశ్వాసముగల శూరశిఖామణి యగు నీసేవకుఁడు కావలి కాచుచు వారి నెదుర్కొన వారొక్క ముహూర్తమున వానిని దమకత్తికి నెరజేసిరి. తరువాత, నేనెదిరింపఁ బోవ నన్నిట్లుచేసి చెఱలోనున్న గండాభిల్లును వదలించుకొని పాఱిపోయిరి. వారరిగిన కొంతసేపటికి నీముప్వురుసేవకులు మెలఁకువదెచ్చుకొని నాస్థితిని జూడకయె దొంగ లేఁ డని భయపడి యెక్కడికోపరుగెత్తిరి. ఇంత మించ నేనేమియు నెఱుఁగను. నాకుటీరమున నిట్టిపని జరిగినందున నన్నుఁగూర్చి ప్రజ లేమని చెప్పుకొందురో యని నాకు దలకొట్టినట్లున్నది. పాపము పుణ్యము పరమాత్మునం డెఱుఁగును." అని ఋషి తనవాక్యమునసమాప్తముజేయునప్పటికి, దత్తును విచారాశ్చర్యసముద్రిమగ్నుఁడై తనజీవము సమాప్తమయ్యెనని యెంచుకొ

నెను. ఈసేవకులె వానిని విడచిరో భిల్లులే వదలించుకొని పోయిరో యని సంశయ మొందుచుఁ దనభవిష్యదభివృద్ధి యనువృక్షమునకుఁ బిడుగుపాటువలెఁ దటస్థించిన యీకార్యమునకు వగచుచుని శ్చేష్టుఁడై గోడకుఁ జేరఁబడికూర్చుండి యిట్లువితర్కించెను. "హాదైవమా! ఎంత పని జరిగించితివి! నాకావిరహతాపము నాపాపముచేఁ గలిగినది కాఁ బోలును! ఏల ఖయిదీని విడిచి యేమరితిని? ఏమొగము బెట్టుకొని యింక నిందూరుపోవుదును. ఏమొగముబెట్టుకొని యహల్యాబాయి రాణిమొగముఁ జూతును. నేనేమో సంస్థానమంత నుద్ధరింపఁగలసమర్థుఁడ ననియు గృతజ్ఞుఁడ ననియు నన్నికార్యములందు రాణియు రాధాకాంతరావును నియోగింప నేను గామాతురుఁడనై చేతులార దొంగను వదలుకొంటిని. వాఁడు పాఱిపోయెనని నే నెంతచెప్పినను నామాట లీకుట్రదినములలో నమ్మువా రెవ్వరు? జస్వంతరావుతోఁ గలసి దొంగను నేను విడిచితినని జనులు నన్నాజన్మాంతము కలంకు నిగనెన్నుదురు. నేనిచ్చట మృతినొందక యిందూరుపురి కేలపోవలయును? అయినను రాణితో నాతప్పు విన్నవించి ప్రథమలోపమును క్షమింపుమని యామెపాదములపైఁ బడెదను. నాకంటె నాసేవకుఁడె కృతజ్ఞుఁడుగదా! రాణిసొమ్ము దినుచుండుటచేఁ దనప్రాణము రాణి కిచ్చి రాజఋణమును దీర్చుకొనెను. ఇంతచదువు చదువుకొనియెక్కువ యధికారినై యెదుహూకలజీతము గలబంటురౌతుపాటి రాజభక్తిని జూపఁజాలనైతిని. ఛీ! నాబ్రతు కేల!" అని పరిపరివిధములఁ జింతించుచున్నంతలో సేవకులు మువ్వురు దీనముఖులైవచ్చి శ్యామసుందరదత్తు ముందట నిలిచిరి. దత్తు వారిని గనుఁగొని దిగ్గునలేచి, "దొంగ యేమైనాఁడురా" యనియడిగెను. అనుఘటయునాదు కన్నీరు తమనిర్దోషత్వమును దెలియఁజేయ దత్తుపాదములపైఁ బడి, "స్వామీ! మేము మువ్వురము నిద్రించుచుంటిమి. మానిద్రలో నీగొడవయెల జరిగినది,

మేము లేచునప్పటికి ఋషి బద్ధుఁడైయుండెను. మాప్రియమిత్రుఁడగు మీసేవకుఁడు నిష్కారణముగ మృతినొందెను. మేము మెలఁకువ వచ్చినతరువాత దొంగలు దొరకుదురేమో యని తలఁచుకొని పోతిమి. కాని మాశ్రమ వ్యర్థమైనది." అని రోదనముఁ జేయుచుఁ దనపాదములు విడువక యున్నవారికి హెచ్చరికపుట్టఁ బలికి యభయహస్తము నిచ్చి ఋషియొద్ద సెలవుగైకొని పయనము సాగించెను. ప్రాణములకు మానములకుఁ గూడ హానికరమగుపని తానే చేఁజేతఁ జేసికొంటిననియు రాధాకాంతరావునకుఁగూడఁ దినమూలమునసప్రతిష్ఠ సంఘటిల్లుననియు, రాణీ యిట్టివిషయములను దన్ను క్షమింపదనియు, నెఱింగి యారంభమునవిచారభారము మెండగుటచే నాహారనిద్రలు మాని హెచ్చరిక లేమిచే నడక చకచక సాగక మెల్లగ నిందూరుపురి కరుగుచుండెను. త్రోవలో సేవకులలో నొకఁడు దత్తునుగనుఁగొని, "అయ్యా! మనప్రాణముల రక్షించుకొనుట కుపాయ మొకటి కలదు. దొంగపాటివోయెనని చెప్పుటకు మాఱు దొంగనుదిసితి మని మనము చెప్పినచో మనప్రాణములు దక్కును."

అన శ్యామసుందరుఁడుతనసుందరముఖమున మందహాసము నలంకరింప "ఓయీ పిచ్చివాఁడ! అబద్ధమాడినచో దాగునా? భగవంతునియెదుట మనము దాఁచఁగలమా? అనృతము పై కెన్నఁడైనఁ బొక్కకపోదు. ఆయాలోచనఁ గట్టిపెట్టి మనమందఱము నిజమొప్పుకొందము. పైన దేవుఁ డున్నాఁడు." అని మందలించి యెడతెగని పయనముతో దత్తు మహూనగరమునఁ దనసోదరి నైనఁ జూడక యానాఁటిమధ్యాహ్నము రెండున్నరయామములకునిందూరునగరము జేరి రాధాకాంతునియింటికేఁ జనక తనపరిమాదము నెవ్వరితోను జెప్పుకొనక మృత్యుదేవత కెదురుసన్నాహము సేయువాని తెఱంగున నతిధైర్యముగఁ గోటకుంజని రాణికిఁ దనరాక నెఱుఁగఁ జేసెను.

రాణియు త్తరువుప్రకారము లోనికింజని శ్యామసుందరుఁడు నిలిచిన తోడనే యామె యాత్రముతో, "గండాభిల్లు నరి దీసినావు కాదా? చచ్చి నప్పుడు వాఁ డేమన్నాఁడు? భిల్లులకు బుద్ధిచెప్పితివా" యని యడిగెను. ఆమాటలకుఁ బ్రత్యుత్తర మంతటియాత్రముతో నీయక కొయ్యవలె నిలువంబడియున్న దత్తుంజూచి యామె, "ఏమిది పలుకవు? వాఁడేమయినాఁడు? చెప్పవేమి?" యని తొలుతకంటె నెక్కువ యాత్రముతోడను, నెక్కువ వేగముతోడను దత్తును బలుకరించెను. అంతట వారిట్లు మాటలాడిరి.

దత్తు—(చేతులు జోడించి) అమ్మా! యేమని చెప్పుదును? గండాభిల్లా పాఱిపోయినాఁడు.

అహల్య—(చెవుల నీపలుకు పడునప్పు డామె చముకు చుక్కతగిలిన తప్తలోహమువలె దుర్నిరీక్షయై) నీవింకఁ బ్రాణములతో నుండఁగనే?

దత్తు—నే నీవార్త నేలినవారికి విన్నవించుటకు జీవచ్ఛవమునై యున్నాను.

అహ—ఓరీమూర్ఖుఁడా! రాజద్రోహీ! జస్వంతరావుప్రముఖులతోఁ గూడి రాధాకాంతరావు కష్టపడిపట్టుకొన్న దొంగలను లంచములుగ్రహించి వదలిపెట్టి దొంగ పాఱిపోయె ననిచెప్పుట కింకను బ్రతికియున్నావా? ఇంతదూరము రా నేల? అచ్చట నెందుకు నీవు పొడిచికొని చావవైతివి ? నీప్రాణములు నీకు దక్కనిత్తు నను కొంటివాయేమి పశువా !

దత్తు—అమ్మా ! అది నారాజద్రోహమువలన నైనదిగాదు. పొరపాటు.

అహ—ఛీ! సిగ్గు లేక వంకలు చెప్పుకొనెద వేల ? పొరబాటా! చేఁజిక్కిన యపరాధిని జేతులార విడిచితివి. పొరబా టెట్లగును?

ఛీ! నాయెదుట లే. నీమొగము జూచి నేను భరింపఁజాలను. నీయాయువు నేఁటితో మట్ట మయినది. నామంచితనము నాయాదరణము నీకు విషమైనది. ఓరీ, ఎవరురా. వీనిచేతులు విఱిచికట్టి వీనిని బట్టుకొమ్ము. రాధాకాంతునిఁ బిలుచుకొని రమ్ము.

ఇట్లు మెత్తనిలేడిపిల్లపై నుంకించు నాఁడుసింగమువలె రూక్ష వచనముల శ్యామసుందరదత్తుని నొప్పించి వాని నొకభటుని యధీనముజేసి రాధాకాంతాదులయాగమనమును నిరీక్షించుచుండెను. దత్తుతోఁగూడ వచ్చినముప్పురిసేవకులలో నొకఁడు రాధాకాంతుని గృహమునకుఁ జని జరిగినవృత్తాంత మంతయు వాని కెఱింగించెను. దత్తుని దనకుమారునికంటె నెక్కువప్రేమతోఁ బెంచుకొనుచున్న రాధాకాంతుఁ డాయాకస్మికదుర్వార్తచే నడుమువిఱిగినట్లు దుర్బలుఁడై తాను నాటినమొక్క నిష్ఫలమగుసమయము వచ్చినదనివిచారింపఁదొడఁగెను. ఇంతలో రాజసేవకులు వానిని బిలువవచ్చుటచే నాతండు పయనమైతనగాయపుబాధపూర్ణముగఁగుదురనందున మెల్ల మెల్లగాఁ జేతికఱ్ఱసాయమున నడచుచు నంతిపురముఁ బ్రవేశించి నరకాసురసంహారణోన్ముఖ యగుసత్యభామవలె వెలుపుగోలుపుచూపులు గలయహల్యను గని యుచితనమస్కారముల నొనర్చి యెదుట నిలిచెను. అంతట నచట నీక్రిందివ్యవహారము జరిగెను.

అహ.—ఏమయ్యా! నీవు మాకు మేఁకలమందలోఁ బెద్దపులిని దెచ్చిపెట్టినావు. సుగుణముల కెల్ల నితఁడు మణియెకాదూ. రాజభక్తికిఁ బెట్టినది పేరుగదా యితఁడు? ఆగుణము లేమైనవి? ధ్రొంగను జల్లఁగాఁ బంపినాఁడు.

రాధా.—అమ్మా! జరిగినసంగతి యేమో మీరు విచారింపవలెను. అంతవరకు నతనియుద్దేశ మిది యని చెప్పఁదరముకాదు.—

అహ.—నీ కింతపక్షపాత మతనియం దుండుటచేతనే యింత

మునిగినది. తేనెపూసినకత్తి యగు నీమూర్ఖునిచే నిష్కారణముగ మేము వంచింపఁబడితిమి. జస్వంతరావు మొదలగువారు నన్ను జూచి యిపుడు నగరా? మిమ్ము నమ్మికొని నే నుభయత్రి వ్యర్థురాలనైతిని. ఇటువంటి పాపాత్ముని విడువరాదు. ఓయీ శ్యామసుందర! రాజద్రోహమునకు నీకు మరణదండన విధించినాను. అంతటఁగాని నాకోపాగ్ని చల్లారదు.

రాధా—(విచారముతో) అమ్మా! బాలునియందు దయ జూపుటకు నాప్రార్థన.

అహ—ఏమిదయ? దేశమునుద్రోచుకొను దురాత్ముని విడిచిన దురాత్ముని, రాజద్రోహమునల్పినయపకారిని, శత్రువులలో దూఱిన దుర్నీతిపరుని నే నెట్లు శిక్ష సేయకుందును? నీ ముసలిమాటల నిఁక గట్టిపెట్టుము. ఇతని నొక్కని జంపుట నాయభిప్రాయము కాదు. ఈకుట్రలో నింక నెందఱు చేరిరో విచారణచేసి వారి కందఱకు సంఘమరణము గల్పించుట కర్తవ్యము. కాఁబట్టి విచారణ సలుపుమని గోమాజీరావువద్దకు వీని నంపెదను. శ్యామసుందరా! నీసాక్ష్యమును నీవు దెచ్చుకొనుము. ఓరీ! భటులారా! వీనిని జెఱసాలలో నుంచుఁడు.

రాధా—అమ్మా! నేను జామీనుండెద. నాకు వీని నప్పగింపుఁడు.

అహ—జామీను గీమీను బనికిరాదు. విచారణకావలయును. మీరందఱు నింక నరుగుఁడు.

అని యామె లేచునప్పటి కందఱునుజనిరి. శ్యామసుందరుఁడు మరణదండన వినినపుడును మనోధైర్యము విడువక నిశ్చలుఁడైయుండి రాధాకాంతుని వీడ్కొని భటులు గొనిపోవ జెఱసాలకుఁ జనెను. రాధాకాంతుఁడు కన్నీళ్ళతో నాతని విడిచి యింటికిఁ జనెను.

## పందొమ్మిదవ ప్రకరణము.



గండాభిల్లు శతృవులచేతఁ జిక్కినాఁ డని విన్నది మొదలు విచారణసమయమునఁ దమకుట్రను భిల్లులు బయలుపెట్టుదు రేమో యనియుఁ దమకాప్తుఁ డగుగండాభిల్లు నిష్కారణముగ నురిదీయబడు ననియు బెంగగొని కాలుగాలినపిల్లులవలె దౌలతరావును, దుండిరావును, జస్వంతరావుగృహముచుట్టును గోమోజీరావుగృహముచుట్టును దిరుగ సాగిరి. అందుఁ బిఱికివారిలో నగ్రేసరుం డగుదుండిరావు తన ప్రాణములు బిక్కుబిక్కు మనుచుండుటచే నగరమున నుండక దగ్గఱ నున్న యొకగ్రామమునకుఁ బాఱిపోయి బందుగులింట దాఁగెను. శ్యామసుందరునిస్వాధీనమున నుండక భిల్లు తప్పించుకొని పోయిన వార్త చెవులకుఁ జల్లగ వినఁబడుట మొదలు తన ప్రాణమిత్రుఁడు తప్పించుకొనినందులకుఁ దమరహస్యములు బయలుపడునవస్థలు తప్పినందులకును రాణితలంపులు భగ్నములైనందులకును దౌలతరావు మితములేని యానందమునొంది శ్యామసుందరదత్తునకు రాణి మరణదండన విధించెననియు గోమోజీరావుచేత నతఁడు విచారణ సేయఁబడు ననియుఁ దెలిసినపుడు కోర్కులెల్ల సిద్ధించిన వచనొని దుండిరావును బిలిపించెను. ఆపగ లంతయు వగలఁ బొగులుచు దత్తు చెఱసాలలో నుండి తన యకాలమరణమునకును శాశ్వతాపకీర్తికిని దన సోదరికిఁ దనపైఁగల యనురాగమునకును సర్వేశ్వరు మాయలకును నక్కజపడఁజొచ్చెను. దీపములు పెట్టినవెనుక రవంత కలఁతనిద్దుర పట్టి యందుఁ దన్నురిస్తంభములపై నెక్కించినట్లును దాను మృతి నొందినట్లును దనసోదరి వచ్చి తనశవముపైఁ బడి యేడ్చినట్లును దుస్స్వప్నముంగని మేల్కొని నలుదెసలుచూచి మఱునాఁడుదయమున జరుగఁబోవునది ముందుగా దృగ్గోచర మయినదని తెలిసికొని మన

సులో హా దైవమా! నిన్న నీపాటికి గండాభిల్లునకు వాని మరణవార్తను నేను జెప్పుచుంటిని. నేఁడు నామరణవార్తను దలఁచుకొనుచుంటి. ఏమి యీ వైచిత్ర్యము! ఈవృథావిచారముకొఱకుఁ గాలయాపన యేల? త్వరగా నాకు స్వర్గలోకసుఖము గమలాదర్శనమును జేయింపుము. అనివేడుకొనుచు నొకమాఱు కన్నీరు పెట్టుకొనుచుఁ బరితాపమొందసాగెను. శ్యామసుందరునివంటి బుద్ధిశాలియు బలశాలియుఁ దమపక్షమునకు వచ్చునని తమకక్ష నెగ్గునని యాతని నెట్లయినఁ దమవైపుఁ ద్రిప్పుకొనుటకు జస్వంతరావు ప్రముఖులు ప్రయత్నములు చేయఁ దలఁచి కారాగృహాధికారి తమకుట్రలోనివాఁడై యగుట జాము రాత్రి యైనతరువాత జస్వంతరావు రహస్యముగఁ జెఱసాల యొద్ద కరిగి జీవచ్ఛవమువలెఁ బండుకొని యున్న దత్తుఁ జూచి జాలినొంది మెల్లగ వానిని లేపెను. దత్తు లేచి తనయెదుట జస్వంతరావును జూచి యది కల యేమో యని కలవలపడి నిజమని తరువాత నెఱిఁగి యతఁ డక్కడకు వచ్చుట కాశ్చర్యపడెను. అంతట జస్వంతరావు వారిని బలుకరింప వారిట్లు మాట్లాడిరి.

జస్వంత్.—శ్యామసుందరా! రాజులను రాణులను నమ్మిన వారి బ్రతుకులు తుద కెంతవఱకు వచ్చునో నీవు స్వానుభవముచే నిప్పుడెఱిఁగితివా? చలచిత్తు లగుప్రభుపిశాచముల సేవించుటకంటె ముష్టి యెత్తుకొని బ్రతుకుట మేలు. నిన్నుఁ గూర్చి నాకు విచారమగుచున్నది.

దత్తు.—నాకర్మమునకు రాణి యేమిచేయఁగలదు? ఆ నేను జేసినయపరాధమునకు నేను దగినశిక్ష ననుభవించుచున్నాను. ఆమె లోపము లేదు.

జస్వంత.—నీపిచ్చి నీకింకను వదలలేదు. నేను నిన్ను బ్రతికించునుపాయ మొకటి చెప్పెదను. నామాట విని ప్రాణమును దక్కిం

చు కొనుచును. నిన్ను తేష్ప కొత్వాలుగు గోమోజీరావు విచారణచేయును గదా. గోమోజీ నాకు మిత్రుఁడు. నీవు రాణీపక్షము విడిచిమాపక్షము వత్తు నని ప్రమాణము చేసి తరువాత మాకక్షులోనుండి రాణితోఁ బోరెద వేని గోమోజీరావుతోఁ జెప్పి నిన్ను రక్షింపఁ జేసెదను. అట్లుచేసెదవా?

ఈప్రశ్నమునకు నుత్తరము సత్వరముగఁ జెప్పలేకపోయెను. మహాపాతకహేతువును దుర్గశాప్రాప్తికారణమునైన రాజద్రోహమున కొడిగట్టి యాత్మరక్షణ మొనర్చు టుచితమో తుచ్ఛప్రాణములపై నాసగోరి న్యాయమగుదండన నొంది దేహముఁ జాలించుట యుచితమో వేగమె నిర్ణయింపనేరక తటపటాయించుచుఁ గొండొక సేపటి కిట్లుచెప్పెను. "అయ్యా! నాప్రాణము రాజభక్తివిషయమున ధారపోయుదునని ప్రతిజ్ఞగైకొన్నవాఁడను. రాజద్రోహముఁ జేయుటకు నాప్రాణ మొప్పకున్నది. మరణ మెన్నఁడైనను దప్పదుగదా. కుటిలవారిలోఁ జేరి రాణిని క్షోభపెట్టి ప్రజలను రేపి కొలఁదికాలము సుఖపడుటకంటె గౌరవముతో నీతుచ్ఛప్రాణమును విడచుటమంచిది. నన్ను బ్రతికించుటయుఁ జంపుటయు నీర్వ్యపకీర్తులు రాణికిదక్క వలె." అన జస్వంతరావు వానినిమిరింగివేచునంతటి యలుకతోఁగన్ను లెఱ్ఱఁజేసి "దారుణపుచావున చావవలసిన యోగమునీకుండఁగనామాటలు విని బాగుపడుటకు నీకు మంచిబుద్ధి యెట్లు పుట్టును? నీకర్మమంతే చావుము" అని చివాలునలేచి చెఱసాల విడిచిపోయెను నాఁడట శ్యామసుందరుఁడు కాలిముందరికివచ్చిన యదృష్టదేవతను ద్రోభివైచితినని కొంచెముపశ్చాత్తాపము నొంది. మఱలఁ దాను సలిపినదియె యుత్తమకార్యమని యూరటనొంది యెప్పుడు తెల్లవారునని? ఎప్పుడీమైహికదుఃఖము పాయునని సిద్ధముగ నుండెను. ఆరాత్రి దాతలధావు గోమోజీరావును జూడఁబోయి. కొన్ని రాజకీయ

వ్యవహారముల ముచ్చటించి నడుమ దత్తువిషయమై ప్రసంగము రాఁగా వారిట్లు మాటలాడిరి.

దాల—జస్వంతరావుమాట మనము నమ్మఁజాలము. భిల్లులు దేశముపైఁబడి దోచుకో వలనుగాదఁట. రాజపుత్రులు దండెత్తి రావలనుగాదఁట! నీతి యుండవలెనఁట? కక్ష సాధించవలె నఁట. అది యుండిన నిదిరాదు. అంత నీతిమంతుఁ డయ్యె నేని కక్షలో దిగనేకూడదు. దిగిన వెనుక నన్నిపనులు జేయవలెను.

గోమో—అతనిని మొదటినుండియు నేనునమ్మలేదు. అయితే దత్తుగతి యీలాగున వచ్చినదేమి? అతనిని విచారణ సేయుమని రాణి నాతోఁ జెప్పినది.

దాల—నేను బన్నినపన్నుగడ సఫలమైనది కాని నీదగ్గఱకు విచారణకువచ్చినప్పుడు మనమిదివఱ కనుకొనినట్లు నీవుదత్తును గడతేర్పవలయునుజుమీ! అతఁడును రాధాకాంతుఁడును జచ్చినఁగాని మన ము నెలవేఱము. వారె కమలను నేనుబాధపెట్టుచున్నా ననియు నా తెను నేను వివాహ మాడుదు ననియు నాపై నేరములు రాణితోఁ జెప్పి లోకములో నా రెండుసంగతులను జాటి నాకప్రతిష్ట ఘటించిన వారు. రాణిమీఁదకంటె వారిమీఁద నాకెక్కువకసి గలదు. అందు శ్యామసుందరునిపై నాకుఁ గలకోపమునకు మితము లేదు. వాని నురిదీయించునట్లు సెలవీయవలెను.

గోమో—నే నిందు లేశమైన నన్యాయముఁ జేయ. నేనుపిల్లలు గలవాఁడను. ముక్కునకు సూటిగఁబోయి న్యాయమే చేసెదను.

దాల—మనలో మనకె యిన్ని భేదములుండఁగ మనమెట్లు నెగ్గఁగలము?

గోమో—అన్యాయముగఁ జంపినచో నామీఁదఁ, బ్రజలకు గోపముండదా!

దాం.—సరే! నీయిష్టము వచ్చినట్లు చేయుము. నే నరుగుచున్నాను.

అని దాలతరావు విసుగుతోఁ దనగృహము విడిచి పోయినతరువాత గోమోజీరావు మొగటలోపల దాఁగియున్న యొకపురుషుని "భేతాళా! యిఁకరావచ్చును రా" యని పిలిచి తనప్రక్కను గూర్చుండఁబెట్టుకొనెను. భేతాళసింగు హిందూస్థాననివాసియగు రాజపుత్రుఁడు. ఇనపకడ్డీలవంటి భుజములు గుండ్రనితలయుఁ బచ్చనిమొగమునకు నీలికాంతుల నొసంగుకోరమీసములును వానియాకారము భయంకరముగఁ జేయుచు. అతఁడు కూర్చుండ నభవారిట్లు మాటలాడిరి.

గోమో.—సైన్యములీపాటికి నింబపురము వచ్చియుండునా?

భేతా.—ఇంకను వచ్చియుండవు. ఈనడుమ మారాణావారికి దేహమున నించుక భారముగనున్నది. అందుచే నాలస్యమైనది.

గోమో.—శివనానా తప్పక పాటిపోవును. అతనిదగ్గఱ విశ్వాసమె కాని బలములేదు. మీరు తుకాజీహోల్కారునకు మాత్రమే జడియవలెను.

భేతా.—అతఁడు నింబపురిమునీఁదకి రాకుండ మీరు జాగ్రత్తపెట్టవలయును. నిన్ననో నేఁడో రాణావారు నింబపురము వచ్చియుందురని తలంచుచున్నాను.

గోమో.—నాకు వేఱే పనియున్నది. నీవింకఁ బొమ్ము. మఱచిపోక నాసొమ్ము నాకిప్పించుసుమా?

అని భేతాళసింగు వీధియరుఁగుపై నిద్రించు భైరవసింగును వెంటఁబెట్టుకొని తనదారినిబోయెను. అనంతరము గోమోజీరావు తనలో "నాకోరిక యెన్నఁడైన నెఱవేఱి యీరాజపుత్రులునింబపురముఁ బట్టుకొని యహల్యాబాయిని బాఱఁదోలి తామే దేశ మంతయు

న్నాక్రమించుకొని నాకు మంత్రిపదము నొసఁగుదురా? నేసంతటియ దృష్టవంతుఁడ నగుదునా" అని యోచించుచుండఁ దలుపు దోసుకొని వామనభట్టువచ్చి యెదుటనిలిచెను. ఆలోచనలమాని కొత్వాలు వానివైపుఁజూడ వాఁడిట్లనియె. "అయ్యా! అతఁ డేమియు లంచమిచ్చునట్టి స్థితిలో లేఁడు. వానికి బంధువులు లేరఁట"

గోమో.—ఇచ్చువారు లేకేమి? మహాపురములో నతని బావ యున్నాఁడఁట. అతఁడు వీనిని వదలించుటకు నెంతధనమైన నాకు లంచ మిచ్చును. దత్తుపాత్రకుఁడమునకు రాధాకాంతరావే లంచ మిచ్చును. కాని నేనాతనిదగ్గఱనుండి లంచము గ్రహింపను. అతఁడు నమ్మఁదగినవాఁడు కాఁడు.

వామన.—నేను సాధ్యమైనంత ప్రయత్నముజేసి మీకు రెండు వందలైన లంచము తెప్పించెదను. మీరు లంచము లేనిపని చేయనని ప్రతిజ్ఞగైకొన్నారుగదా!

గోమో.—ఏమాత్రమైనను సరే కార్యము చెడకుండఁ దీసికొనిరా. నీవింక పో. నేను నిద్రపోవలయును.

అని వామనభట్టు నంపి తెల్లవారుదాఁక నిద్దురలేక యిటు నటు పొరలుచు నెట్లో యారాత్రినాలుగుజాములు గడపి యుదయమునఁ బెందలకడ మేల్కని రాణిదర్శనార్థమరిగెను. గోమోజీని బరమవిశ్వాసముగల యుద్యోగస్థులలో నొకనిగ రాణి పరిగణించుటచే నాతనికిఁ దగునాసన మొసంగి కూర్చుండఁబనిచి గౌరవించి పనియేమని యడిగెను. అంతట గోమోజీ లేచి "అమ్మా! రాజ్య మల్లకల్లోలముగ నుండుటచే నాకు నిద్రపట్టుటలేదు. జస్వంతరావు ప్రేరణముచే రఘునాథరావుసైన్యమును వెంటఁబెట్టుకొని మనపై వచ్చుచున్నాఁడఁట!

అహ.—ఏమీ! వచ్చుచున్నాఁడా! నీ కెవ్వరు చెప్పిరి? నిజమని తోఁచదు.

గోమా.—అయ్యయ్యో! మీరు మాయమర్మ మెఱుఁగరు. శ్రీపేష్వామాధవరావుగారు పినతండ్రికిఁ దగుబలమిచ్చి పంపినారు. మీరు తత్క్షణమె తుకాజీహోల్కారును వారిపై కంపఁదగును.

అహ.—తుకాజీనిగాదు. రాధాకాంతరావునంపుదును. ఈవేళ నీవు దత్తునిపై వచ్చిన యభియోగమును విచారించి న్యాయమైన తీర్పు జేయుము.

గోమా.—రాధాకాంతుఁడు ముసలివాఁడు. అతఁ డేమియుఁ జేయఁజాలఁడు. తుకాజీని బంపుట యుచితము. మీఁద మీచిత్తము.

అహ.—ఎవరైన నేమి? విశ్వాసముతోఁ బనిచేయవలెను. గాని నీవింకఁబొమ్ము.

అని గోమాజీ తనయేలికయొద్ద నుచితప్రకారముగ సెలవు గైకొని నిష్క్రమించెను. రాణి రాధాకాంతుని బిలిపించి తగుసైన్యముతోఁ దత్క్షణమె పూనానగరమునుండివచ్చుచున్న రఘునాధరావున కెదురుగఁజని వాని నోడించి రమ్మని యానతిచ్చెను. దత్తునకు మరణదండన తప్పించుటకుఁ బయత్నింపఁదలఁచుచున్న రాధాకాంతరావు పొరుగూరు పోవలసివచ్చినందులకును దత్తునకు సహాయము చేయలేక పోయినందులకును జింతించి వెళ్ళుట కిష్టము లేక తప్పక పురి వెడలెను.

---

## పదమూఁడవ ప్రకరణము

---

రాణిదర్శనముచేసి సంగతులు ముచ్చటించి గోమాజీరావు తిన్నగాఁదనకచ్చేరికివచ్చెను. కళాహీనమగు మొగముతోడను దయాహీనమగు హృదయముతోడను దనమొగమువలె వెలవెలఁబోవు తెల్ల

నివస్త్రములతోడను టక్కుటక్కుమను ముచ్చెలచప్పుడులు వందిమా
గధులై తనరాక తెలియఁజేయఁ జేత నొకకఱుపుబుగల సాలకఱ్ఱ
విలాసార్థముగఁబట్టుకొని కచ్చేరికిదయచేసిన కొత్వాలును జూచి బం
ట్రౌతులు దండములు పట్టిరి. అతఁడు కచ్చేరిలో నడుమవేయఁబడిన
తనపీఠము నలంకరించినతోడనే నేరములుచేసినవారు క్రమక్రమముగ
వానియెదుటికిఁ దీసికొని పోఁబడిరి. తనకు సహాయము నొసఁగఁదగిన
రాధాకాంతుఁడు తత్క్షణమె యూరికిఁజనుటయు శతృగణములోఁ జేరి
తనపైఁగక్షవహించినగోమాజీ తన్ను విచారణ సేయుటయు స్వయ
ముగ రాణికిఁ దనపైఁ గోప ముదయించుటయు సరసి దత్తు తనకు
మరణముతప్పదని ప్రాణరక్షణార్థము ప్రయత్నములఁగూడమానెను.
శ్యామసుందరుని వానిగుణములను నెఱిఁగినవారగుటచే నతనివిచా
రణ జూడవలయునని నగరవాసులలోఁ బెక్కండ్రు కచ్చేరికివచ్చి
యెడ తెరపినీయక గణగణధ్వని జేయుచు నెక్కడఁజూచినఁదామేయై
యుండిరి. రాధాకాంతునిభార్యయగు రోహిణీబాయి రాణిదర్శనము
చేసి మెల్లగా బ్రసంగవశమున దత్తుమాట నెత్తి యతనిప్రాణరక్షణ
జేయుట యుచితమని రాణితో మనవియొనర్చిన దయ్యది నామె
కసరికొట్టి యిట్టియనావశ్యకవిషయములలో జోక్యముగలుగఁజేసికొన
వలదని గట్టిగ మందలించినందున రోహిణియేకాక యితరులుఁగూడ
నట్టిపరాభవమె తమకు జరుగునని భయపడి రాణితోదత్తువిషయమై
ప్రసంగించుట మానికొనిరి. తనమాట వినలేదని జస్వంతరావు దత్తు
పై నలుకఁబూని వానిపై సాక్ష్యము గుదుర్చుచుండ దౌలతరావు
సహజముగా నాతని నాశనముకోరుచుండ లంచము దనకు నీయలే
దని గోమాజీరా వలుక వహించి తనతొంటికోపము నిపుడు దీర్చు
కొనఁజూచుచుండెను. దత్తు తనకు లంచము నొసంగినచో గోమాజీ
రావు ప్రతికక్షులలోనివాఁడని కోపము వదలి వానిని విడిచియె యుం

డును. గోమోజీకి ధనము నధికారము ప్రధానముగాని తనకక్షి నీతి ధర్మము మొదలగుపట్టింపులు లేవు. అప్పటి కింకను శ్యామసుం దరునిభావమఱంది యగుమురళీధరదాసును శ్రీనిసోదరి యగునానం దయు రాలేరి. ఇట్టిస్థితిలో స్వపక్షపరపక్ష సహాయశూన్యుఁడును, విచారవివర్తుఁడును, నిరంతరనిర్మలచిత్తుఁడు నగు శ్యామసుందరదత్తు క్లొత్వాలుగారియెదుట నిలువఁబెట్టఁబడఁ జూడవచ్చిన జనులెల్ల వాని సౌకుమార్యమును దలఁచియు గుణములఁ దలఁచియు దుఃఖితులై లేటి యాతనిఁజూడఁజాలరైరి. దత్తుతోనుండిన ముగ్వురు సేవకులు సాక్ష్యమునిమిత్తము క్లొత్వాలువలన రప్పింపఁబడి యెదుట నిలిచిరి. ఋషికుటీరములోనుండి దొంగ పలాయనమొందుటచే నాతని సాక్ష్య మావశ్యకమని వానికై క్రిందటిరాత్రియె క్లొత్వాలు పల్లకి సంపినందున నాతఁడును బయలుదేరెను. కానియప్పటికిఁ గచ్చేరికి రా లేదు. అట్టహాసము విస్తారముగ జరిగెను. కాని విచారణ ముహూర్త కాలములో మూఁడుముక్కలలో ముగిసెను. అప్పుడు విచారణ మా రంభము కాఁగాఁ గొత్వాలు దత్తును గనుఁగొని "నేరమునుజేసితివా" యని యడిగెను. నేను బుద్ధిపూర్వకముగ నేరమును జేయ లేదని ప్రత్యుత్తరమును జెప్పి యదురుబెదురు లేక యొఱఁదీసిన కత్తి వలె నిలువఁబడెను. తరువాత సాక్ష్యవిచారణ మారంభించి క్లొ త్వాలు ముగ్వురుసేవకులలో నొకని నీవిషయముఁగూర్చియడుగ వాఁ డిట్లనియె. "నేనెఱిఁగినవఱకు నిజము మనవి చేసెదను. ఋషికుటీర ములో మే మందఱ ముండఁగ దత్తుగారు గండాభిల్లుని దన వెంటఁ దీసికొని యెక్కడికో బోయిరి. అర్ధరాత్రి ఖయిదీని దా నొంటరిగ వెంటఁబెట్టుకొని పోవలదనియు నది ప్రమాదకారణ మనియు మేము వలదని వాదించినను మామాటలు వినక యతఁ డట్లు దొంగతో నెటకోయరిగెను. మేమును వెనువెంట రహస్యముగ నరిగి వారిసంభా

షణ గొంతవింటిమి. మాకువారిమాటలు స్పష్టముగ వినఁబడలేదు. కాని నాలుగువందలరూపాయలు కావలెను. లేని యెడల నేనునిన్ను విడువను" అను మాటలు మాచెవులఁబడినవి. తరువాతఁ గొంతసేప టికి దొంగ పాఱిపోయినాఁడని యాతఁడే మాకుఁజెప్పెను. ఇంతకు మించ మేమేమియు నెఱుఁగము. శ్యామసుందరుఁడానుడువుల నాలకించి వింతకథలు సృష్టించిన బంట్రోతుయొక్క ద్రోహసాహసముల కచ్చెరువడి "ఇది కేవల మబద్ధము. దాలతేరావు మొదలగువారికుట్ర" అను దత్తుపలుకుల కాగ్రహించి "ఛీ నోరుమూయుము. నిన్నేవ రడిగినారు? ఇతరులజోక్యము నీకెందుల"కని గోమాజీరావు వానిని మందలించి రెండవ సాక్షిని విచారణ సేయ వాఁడును మొదటి వాఁడప్పగించిన పాఠమునే యప్పగించి దత్తునకు మఱియు సక్కజ మునుగల్గించెను. మూఁడవవాఁడు కొంచెము మేధకుఁడుగావునసాక్ష్య మిచ్చునప్పుడు తడబడి యొకమాట జెప్పి తనసాక్ష్య మిరువురు కుఁగూడ నిరర్థకము సేయుటయే కాక నడుమ నొకసారి "యిట్లు నిన్నెవరు చెప్పుమన్నా"రని దత్తు బెదిరించి యడుగ "దాలతేరావు చెప్పుమన్నాఁడండి" అని "లేదండి నేనే చెప్పినానండి" యని వడఁక నారంభించెను. కచ్చేరిలో వేడుక చూడవచ్చి కూర్చున్న దాలతేరావు మొగము చిన్నఁబోయెను. చూడవచ్చినవా రందఱుమిక్కిలీ యన్యాయ మన్యాయ మని యఱచి చప్పట్లుగొట్టిరి. గోమాజీరావు మిగులఁగోపముతో "ఛీ మూర్ఖుఁడా! నీదొంగసాక్ష్యము నేనమ్మను. నీతోడివారిద్దఱు నిజము బలుక నీవు దత్తువద్ద లంచము బుచ్చుకొని యబద్ధ మాడెదవా? చూడునిన్నేమిచేసెదనో చూడు మని యావెంగలిబంట్రోతునకుఁ జాలినంత పిఱికిమందుఁబెట్టెను. దానితో వాఁడు తిరుగఁ దెలివిదెచ్చుకొని చెప్పవలసినట్లు చెప్పెను. ఇంతలోఁబల్లకిలోఁ గూరుచుండి ఋషి యరుగుదెంచుటయు సభ్యులును గొత్వాలును

గూడ నాతని సన్మానము సేయుటకు లేచి నిలిచి నమస్కారముఁ జేసిరి. ఋషి నారాయణ నారాయణ యనుచు సందడిఁగూర్చుండ నియమించి యున్నతాసనమునఁ గొత్వాలునకు సరాసరిగఁ దానును సుఖాసీనుఁడయ్యెను. అనంతరము వినయవిధేయతాపూర్వకముగ ఋషి నిగర్వాని కొత్వాలు మీ విషయమునఁ దెలిసినంతఁ జెప్పవలయునని నాప్రార్థనయన ఋషి యిట్లనియె. నన్ను మీరు ప్రశ్నింపవలదు. భగవంతుని మోముఁజూచి నిష్పక్షపాతముగ నేను జెప్పెదను. శ్యామసుందరదత్తు నాకుటీరమునకప్పుడప్పుడు వచ్చుట కలదు. నాతో రహస్యమునఁ గొన్నికొన్ని యోచనలు సేయఁ బ్రయత్నించెను. దొంగపాటిపోవుటలో దత్తుపొరపాటుపడెనో బుద్ధిపూర్వకముగఁ జేసెనో చెప్పఁజాలను. రాజభక్తి యతనికి విస్తారముగ నున్నదని నమ్మఁ జాలను. పొరబాటుచేతనో బుద్ధిపూర్వకముగనో రాజద్రోహముజరిగినది గనుక శిక్షకుఁ దగినవాఁడె యని నాకుఁ దోఁచు చున్నది. ఇతఁడసత్పురుషుఁడని నాయభిప్రాయము. అని ఋషి పలుక "ఛీ! ఈ ఋషికూడనబద్ధమాడు చున్నాఁడు. ఏమిది యని దత్తు బిగ్గఱగ నఱచెను. అయ్యయ్యో! దైవస్వరూపుఁడగు ఋషి యబద్ధమాడుచున్నాఁడని యనుటకు నీనాల్కయెట్లాడెను? మూర్ఖుఁడా నోరు మూసికొను"మని గోమాజీరావు దత్తును గదిమి యాయభియోగము నిట్లు సమాప్తము చేసెను. ఓయీ శ్యామసుందరదత్తూ! నీయందమును నీవయసును జూడ నాకు మనసు గరుఁగు చున్నది. కాని నీచేష్టలు, నీస్థితికిని వయసునకును దగినవి కావు. చిన్నతనమునందే యింతటి కుట్రలు చేసినవాఁడవు. నీవు పెద్దవాఁడ వగుదువేని లోకములు ముంచివైచెదవు. అంతటి ధర్మస్వరూపురాలిని మోసముచేయుటకు నీమన సెట్లులొప్పినది? ఋషిమాటలఁబట్టిచూచిన సేవకులసాక్ష్యము బట్టి చూచిన నీవపరాధివని నాకుఁ దోఁచుచున్నది. నీకిప్పుడు శిక్ష

విధింప వలయును. అనునప్పటికి దత్తు వానిమాటల కడ్డమువచ్చి "అయ్యా! మీరు నాకు విధించెడు శిక్ష మరణముకంటె నెక్కువగ నుండదు. నే నందుకు సిద్ధముగ నుంటిని గనుక నేనెఱింగిననిజ మంతయుముందుఁ జెప్పుచున్నాను. దొంగయు మనుష్యుని వంటివాఁడె. నీవును, జస్వంతరావుతోడను దాలతరావుతోడను జేరి పెక్కు కుటిలు సేయుచు నేమియునెఱుఁగనివానివలె వేదాంతములు పలుకు చున్నావు. నీకుటిలు నేనెఱుఁగుదును. నన్ను గోసినను రాజద్రోహము నాదగ్గఱ లేదు. నేను ఘన మైనచావు జచ్చుచున్నాను. నీవు నీచ మైనబ్రతుకు బ్రతుకు చున్నావు. ఎప్పటి కయినను నీసంగతి వెలుతురులోనికి రాక మానదు. డంబము చిరకాలము ఢాఁగ" దని దత్తు జనులు విస్మయమును జాలియు నొందునట్లును గోమాజీరావు నిశ్చేష్టుఁడగునట్లు నిష్ఠురముగఁ బలుకుటయు సభయెల్ల నిశ్శబ్ద మయ్యెను. ఋషివచనంబుల నమ్మి కొందఱు శ్యామసుందరుఁడు దోషి యని వాదింప వానిమాటలు విని కొందఱు దత్తు నిర్దోషి యనియు మరణమున కనర్హుఁ డనియు నెంచి కొత్వాలు తీర్పు నియ్యకముందే దత్తాతని గూరివచనములచే నొప్పించుటచే నతఁ డేమి విపరీతపు తీర్పు నిచ్చునో యని యోచింపఁ దొడఁగిరి. అంతలో నొకసేవకుఁడు త్వరితముగ వచ్చి కచ్చేరిలో నున్నజనుల నొత్తిగించుకొని కొత్వాలు సమీపమునకుఁ బోయినిలిచి వానిచేతి కొకలేఖ నిచ్చెను. ఆజాబును మెల్లగాఁ జదువుకొని గోమాజీరావు చిఱునగవుతో సభ్యులనుజూచి "చూచితిరా వింత! శ్యామసుందరదత్తుపైఁ గలపేరిమచే రాధా కాంతరావు నాకు వ్రాసినలేఖ యెట్లున్నదో చూడుఁ" డని "నీవును నేనును స్నేహితుల మగుట నేఁడు సార్థకము కావలయును. కావల సినవాఁడవు. గొప్పయుద్యోగమున నున్నందులకు నాకీమేలు జేయుము. శ్యామసుందరుని నేను వృద్ధిలోనికిఁ దెచ్చు చున్నాను

వాఁడు నాకుఁ బుత్రప్రాయుఁడు. వానిమీఁద వచ్చినయీనేరమును నీవు తప్పించి శిక్ష లేకుండ వాఁడు తప్పించుకొనునట్లు జేసి ప్రాణములు కాపాడుము. నీమేలు మఱువను. నన్ను రాణిగారు దూర దేశమున కంపినారు గనుక ప్రయాణములో నుండుటచే నేను నీతో స్వయముగ మాటలాడఁ జాలనైతిని. నీకుఁ గావలసినచోఁ గొంత లంచము కూడ నేను జాగ్రత్త పెట్టఁగలను. ఎట్లైనఁ గట్టువానిని విడు వుము. రాధాకాంతరావు" అనునొకచీటి చదివి వినిపింప సభ్యులు రాధాకాంతుని తెలివితక్కువను న్యాయవిరుద్ధబుద్ధిని వేనోళ్ళ నిందిం చిరి. అట్టినీతిబాహ్య మగుననాలోచనపూర్వకకార్యము రాధాకాం తునివంటిలోకజ్ఞుఁడు చేయుట యనుచిత మనియు సమయ శత్రువుని పేర నట్టిరహస్యము లగుజాబులు వ్రాయుట బుద్ధిహీనత యనియు రాధాకాంతునికీర్తికిభంగముగలిగినదనియు, ఉత్తు విచారింపఁదొడఁ గెను. లేఖను జదివి గోమోజీరావు బిట్టలుకతోఁ బండ్లు గీటుచు గ్రు డ్లెఱ్ఱఁజేసి నాకు లంచము నిచ్చుటకు రాధాకాంతరావు ప్రయత్నము చేయుట చూచినారా! బుద్ధిపోయినను నేను లంచము దీసికొందునా? నన్నింతయవమానము నతఁడు చేసినందుకు నేను రాణితోఁ జెప్పి దీనికిఁ దగినంతచర్య జరపక మానను. అనుచిత మయినయీలేఖను వ్రాసి రాధాకాంతుఁడు తననీచబుద్ధిని గనఁబఱచుకొన్నాఁడు కాని నేను రాణివిషయమై యన్యాయము చేయుదునా? ముక్కుకు సూటిగఁ బోయెడను. నాసంగతి యెవ్వ రెఱుఁగరు. అని పలికి తత్ క్షణమే తీర్పు జెప్ప నుద్యుక్తుం డయ్యెను. చూడవచ్చినవా రందఱు చెవులు దోరబెట్టుకొని తీర్పువిన సిద్ధముగ నుండ శ్యామసుందరుఁడు నిశ్చలహృదయముతోఁ దనగతిని జెవులార విన్నటకు వేగిరపడుచుం డెను. అప్పుడు కొత్వాలిట్లు తీర్పు వినిపించెను. "ఓయీ! శ్యామ సుందరా! నీవు చేసినరాజద్రోహమునకు నీకు నేను మరణదండన

విధించినాఁడను. రేపుసాయంకాలము నీ కురిశిక్ష యగు" ననిబంట్రా తులను జూచి వీనిని జెరసాలకుఁ గొనిపొండని యానతిచ్చి వెంటనే సభాస్థానమును విడిచి యాతఁడు రాణిచేఁ దనతీర్పునామోదింపఁబడ జేసికొనుటకంతిపురికిఁ జనెను. తీర్పు విని జనులు రామ రామ! హరి హరీ! ఎంతకష్ట మెంతకష్టము! అయ్యో! యనుచు విలపించి యొక్కొ రొక్కరుగ గోమోజీని నిందించుచు నిండ్లకుఁ జనిరి. అనవసర మగు మనోవ్యధను దొలఁగించి కమలను సందర్శించుసుఖమునుద్వరితముగఁ జేకురఁజేసినందులకుఁ గాత్యాలునకు మొక్కుచు శ్యామసుందరుఁడు మొక్కపోనిమనోధైర్యముతోడను గావుపాటు లేనిచూపులతో డను రాజభటులచేఁ జెఱసాలకుఁ గొనిపోఁబడు చుండెను. అంతలో మహాపురమునుండి దత్తుయొక్క సోదరియగునానందబాయియునామె మగఁడు మురళీదాసును వచ్చి వానిదురవస్థ విని విలపించు చుండ నందు నానంద కడసారి తనముద్దులతమ్ముని జూడఁ గోరుటచే మురళీ ధరుఁడు త్రోవలో దత్తున కెదురుపడి యాతనిఁజూచి మనస్సు చెడి వగచి సోదరి కొకసారి వానిఁ జూపుమని బంట్రౌతును వేఁడుకొనెను. తనసోదరి నట్టిసమయమునఁ జూచుట కిష్టములేక దత్తువలదని రాజ భటులతో వాదించినను దయాళు రగు వారు వానిమాట ద్రోసి తిన్నగావాని నానంద కడకుఁ గొనిపోయిరి. లావణ్యవర్షము గురియు తమ్ముని మొగము విన్న బోవుటయు దీర్ఘబాహువులు వెనుకకు విఱుగఁ గట్టఁబడుటయుఁ జక్కనితలవెండ్రుకలు చీకాకుపడుటయు విచ్చుకత్తు లతో రాజభటులు వాని వెంబడించుటయుఁ గనుంగొని యానంద డెందంబు పగుల దుఃఖము పట్టలేక యోతమ్ముఁడా యని కేక వైచి మూర్ఛిల్లెను. తనలో సమానదుఃఖితుఁడైన మురళీధరునిచేఁ జేయఁ బడిన శైత్యోపచారములచే నామె తెలివినొంది హా! తమ్ముఁడా! యెంతకష్టము రా నాయనా! నే నెట్లుబ్రతుకుదునురా తండ్రీ! నీకుఁ

పెండ్లివారు వచ్చినారు వారితో నేమనిచెప్పనురా నాయనా! నావరాలచెట్టా! నిన్నుఁజూచికొని నాముద్దులు ముచ్చటలు చెల్లునని మురియుచున్నానురా తండ్రీ! ఈపాపిష్టియుద్యోగము నీచావునకు వచ్చినదఁట రా! ఇంతమంది యుండ దేవునికంటికి నీవే కనఁబడితివఁటరా! అని పరిపరివిధములు గుండెలు బాదుకొని తల గోడకువైచి కొట్టుకొని యెక్కడనైన ముష్టియెత్తుకొని బ్రతుకకుండ నీ కీకర్మ మెందుకు వచ్చెనోయి! మీబావను వేళాకోళము జేసెదువా రెవ్వరు బాబు! నాతో మాటలాడవేమిరా! నామీఁద గోపమా" యని గడ్డముపట్టుకొని బ్రతిమాలుచు ముద్దుబెట్టుకొనుచు నేడ్వసాగెను. "అక్కయ్యా! నాఋణము తీరిపోయినది. దుఃఖించినఁగార్యములేదు. నేను నీవాఁడనుగాను. బావా! ఆమె నూరడింపు. నాకు సెలవిమ్ము. పోయెద" నని పలికె దుఃఖ మాగక తానుగూడ సోదరివడిలోఁ బండుకొని దత్తు పెద్దపెట్టున నొకమాఱు రోదనముసల్పెను. ఆదుఃఖము జూడలేక బంధుమిత్రులు గూడ నేడ్చిరి. తుదకు రాజభటులు దత్తును దీసికొని పోవుటకుఁ బ్రయత్నము సేయ, నానంద దుఃఖావేశముచే నోడ లెఱుఁగక "ఓరీదుర్మార్గులారా! నాతమ్ముని దీసికొనిపోవుటకు మీ రెవ్వరురా? మిమ్ము జంపివైచెదను. నాయెదుటనుండి పొండీ" యని విఱిచి కట్టఁబడినదత్తుయొక్క చేతులనువిప్పసాగెను. మురళీధరదాసును రాజభటులును వారించి యామెనొకమూలగదిలోనికిసాయముఁబట్టి యీడ్చుకొనితోసికొనిపోయి యందుఁ బడవైచిరి. తరువాత నానంద మూర్ఛిల్లినందున నదియె దాఁటిపోవుటకుఁ దగుసమయమని దత్తు "బావా! నామీఁద దయయుంచి నేనిదివఱకుఁ జేసినతప్పులు క్షమియింపుము. నాయాస్తి నామేనల్లునికి వ్రాసి నన్ను జ్ఞాపక ముంచుకొనుము. మాయక్కను దయతోఁజూచుచుండుము." అని బంధుమిత్రులతో గుమ్మము దాఁటి వెడలెను. మురళీధరుఁడు వెనువెంటఁ జని

"నాయనా నిన్ను క్షమియించుటకు నీస్వల్పజీవితకాలమున నీదగ్గఱఁగ లిగినతప్పు లేవి? నాకుడిభుజముపడిపోవుచున్నది. మేరుపర్వతమువలె నీవున్నావుగదా యని నిన్ను నేను నమ్ముకొన్నాను. నీవున న్నొకా కిని జేసి నీత్రోవను బోవుచున్నావుగదా? నాయనా! నీయందము నేలపాలు గావలసినదినము వచ్చినది." అనివిలపించెను. అంతలోఁ భటులు వేగిరపడి గోమాజీ రావునకు దత్తక్కడకువచ్చుటఁ దెలిసినఁ దమకు మాటవచ్చునని యూదత్తును చెఱసాలకుఁ గొనిపోయిరి. ఆదిన మున నే భోజనములు లేక యానందాముర ళీధరులు మహాపురికరిగిరి. రాణి దత్తునకు గోమాజీ విధించిన శిక్ష సంగీకరించదు.



పదునాల్గవ పరిచ్ఛేదము.



ఓసీ! సీతా! నీవుచెప్పెడుకథలు మిగులఁజమత్కృతితో నిండి యుండును. ఇంతచిన్నతనములో నింతింతచిత్రముల నెన్నఁడు నేర్చు కొంటివి? ఒకపర్యాయము కడుపు చెక్కలగునట్లు నవ్వింపఁగలవు. మఱియొకపర్యాయము ఘోరరస నేడిపింపఁగలవు. హాస్యశృంగారకరు ణారసములు నీసొమ్మేయని తోఁచుచున్నది. నీవువివాహము జేసి కొని నీయత్తవారియింటి కరుగుదు వేని నేనెట్లుండఁగలను? అనిముక్తా బాయి తనకెదురుగఁగూర్చుండియున్న సీతాబాయినింగూర్చి పలికె ను. రాధాకాంత రా వప్పగించినది మొదలుదాసియగుసీతాబాయి రా ణీయెడలఁదత్తుమూరికయెడలనత్యంతవిధేయతతో నడచుకొనుచుసమ యోచితముగ వారిచిత్తరంజనకరము లగువినోదకథలఁ జెప్పి వారిచే శ్లాఘింపఁబడుచు వచ్చెను. మొదట నామెముక్తాబాయినిమిత్తమేర్ప ఱచఁబడినను దనవాక్చమత్కారముచేతను వాక్చమత్కారమును మిం

చుముఖసౌందర్యముచేతను, ముఖసౌందర్యము నతిశయించువినయా దిసద్గుణసంపదచేతను రాణిహృదయమును గూడ నాకర్షించినందున రాణిగూడ నామెచెప్పుకథలను వినుచుఁ దనవిచారముఁ బాపుకొను చుండెను. సీత దాసియనియు ముక్త యజమానురాలనియుఁ బేరే కాని వారిరువురు నన్యోన్యానురాగము గలవారై నెచ్చెలులై యొకరినివిడిచి యొకరునిమేషమయినఁ దాళఁజాలక పొద్దులుపుచ్చు చుండిరి. సీతబెట్టకుండ ముక్త యేపదార్థమును భక్షింపదు. రాత్రిలు తనతల్లి చూడకుండ ముక్త సీతను దనమంచము పైఁ బండుకొనఁబెట్టుకొనుటయు యౌవనాతిశయమువల్ల నుదయించుకోర్కెల నామెకుఁ దెల్పుటయుఁగూడఁ గలదు. దాసి నంతదయతోడను సమానగౌరవముతోడను నాదరించిన స్వపరగౌరవతారతమ్య మెఱిగిన తల్లి యేమనునో యనుభయమున ముక్త తల్లియెదుట నితరుల యెదుట సీతను దాసిగాఁ జూచి యాంతర్యమునఁ జెలివలెఁ జూడసాగెను. అహల్యాబాయియు సీతను సామాన్యముగ దాసియెడఁజూపుగౌరవముకంటె నెక్కువ గౌరవమును జూపుచుఁ బ్రేమము నూలుకొల్పుచు నామెకుఁ గొంతరానీయక బహువిధముల నరయుచుఁ జిన్నిచిన్నియంశములలో నామెయోచనముఁ గూడఁ గైకొనుచు నామెబుద్ధి మెచ్చుకొనుచుండెను. ముక్తాబాయి పైనుదాహరింపఁబడినపలుకులఁ బలుకుటయుసీత నవ్వుచు దీనికంతకు మీదయయే కారణము. నేను మిమ్ము విడుతునని భయపడకుఁడు. బ్రహ్మచర్యముతోడనే కాలము గడ తేర్పవలెనని యూహించుచుంటినిగాని వివాహప్రయత్న మింతట తలఁపు లేదు. మీరు వివాహానంతరము నన్ను విడుతురేమో యని భయపడుచున్నాను సుఁడీ" యని పలికెను. ఆపలుకులువిని ముక్తకు శరీరమంతటగగుర్పాటుదయించెను తలవంచుకొని సీతనుజూచి "నీకుబొత్తుగా

భయములేదు. అప్పు డప్పు డిట్టిమాటలు నాకుజ్ఞాపకముచేసి నాకుఁ
గలవరపాటు గలుగఁజేయు చుందువు. నీవావిషయమై యెత్తిబోకు"
అని మందలించి జస్వంతరావును నేను గలిసినను భాగ్యమే నాకుఁ
గల్గు నేని మాయమ్మకు వానికి సిట్టికలఁతలు గలుగవు. దైవమా!
మాకుసంయోగము గలుగఁజేయువుగదా? అని చింతింపుచు సీతతో
నీక్రిందిసంభాషణము జరపెను.

సీత—అమ్మా! గంగాధరజస్వంతరావుగారు మీకుఁ దప్పక
లభింపఁగలరు. చింతవలదు.

ముక్త—కోరికలతో నాకుఁ బనిలేదు. అది వ్యర్థమనోరథ
మని నేనెఱుఁగుదును. విరోధముచే మాయమ్మ నన్ను మఱియొకరిని
వరియింపుమని నా కాజ్ఞాపించును. ఇష్టము గలవానిని విడిచి వేఱొక
నిం జేసికొనుటకంటె మరణము మేలు.

సీత—నిజమే. అందుచేతనే కమలాబాయి పాపము జాలత
రావును వరించుటకంటె మరణ ముచితమని యట్లు చేసినది. మీయ
మ్మగారిపాలనములో నిది యొక్కటియే ఘోర మైనకార్యము
జరిగినది.

ముక్త—అవును. ఆమె కడు నందకత్తెయఁట! నిష్కారణ
ముగఁ జచ్చినది. సరే చచ్చినవారిజోలి మన కెందుకు? నాకాసంగతు
లు చెప్పకుము. రాత్రి పీడకలలు వచ్చును. నీ వేదైన నొకవినోద
కథ జెప్పుము. నీవుకథలను జెప్పి నారోగ్యముఁ గలుగఁ జేసినందుకు
ముందుముందు నీకు నేనొకయుపకారము జేసెదను. ఇదినావాగ్దాన
ముగ నీవు గ్రహింపుము. నీయందు నాకట్టిదయ గలదు.

సీత—(సంతోషముతో) అమ్మా! యిది నాకొక్కవరము. స
మయ మైనప్పుడు తప్పక యియ్యవలయునుసుఁడీ. ఈవేళ మీకు వింత

మైనకథ జెప్పెదను. అమ్మగారు కూడ వచ్చి యాలకింపవలసినట్టి కథ. వారువత్తురేమో మీరు కనుగొందురా?

ముక్త—అమ్మగారు కథల నాలకించుటకు మనస్థిమితము గలవారు గాలేరు. రఘునాధరావు దేశముపై వచ్చుచున్నాడని తెలిసి వానిమీదికి రాధాకాంతుని బంపినది. ఇంకను రాధాకాంతునియొద్దనుండి యుత్తరము రాలేదు. అతడుగూడ శత్రులఁగలసినాఁడని యీవేళ గుసూరు బయలుదేఱినది. రాజపుత్రులు నింబపురము మీఁదికి వచ్చుచున్నారనియు సైన్యముల నంపుమనియు శివనానాజాబులు వ్రాసినాఁడు. లేఖను జూడఁగనే మాయమ్మగారికి గుండెలో ఱాయి పడినది. అది గాక క్రొత్తహోల్కా రొకఁడు మాజ్ఞాతి బయలుదేఱినాఁడఁట. వానికి నేఁడో రేపో పట్టాభిషేక మగు నఁట. ఇవి యన్నియు నీవేళయుదయమునఁ దెలిసినవి. ఆమె కేమియుఁ దోఁచుట లేదు. ఇంతియే గాక గండాభిల్లను దొంగను విడిచినందుకు నొకని కీదినమున నురిశిక్ష విధించినది. ఆమె యుపవసి జేయించుచున్నది. అందుచేఁ గథ వినదు.

సీత—అమ్మా! యీ యదృష్టహీనుఁడెవఁడు? వాఁడు శిక్షింపఁబడవలసిన దే.

ముక్త—నీ వెఱుఁగవా? రాధాకాంతునింట నుండెడువడుచువాఁడు. శ్యామసుందరదత్తు.

ఆమెవచనములు చెవులఁ బడినతోడనే సీత భీతకురంగమువలె బెదరుచూపులు గలిగి నాలుక గొంతుగుపోయినదానివలెఁ దడబాటు మాటలతో "హరిహరీ! ఆపిల్లవాఁడే" అని కూర్చుండలేక స్తంభమునకుఁ జేరఁబడెను. ఆమెయవస్థఁ గని ముక్త భయపడి, "ఏమిది? నీవు దత్తు నెఱుఁగుదువా? నీకింతవిచారమేల" అనెను.

సీత—అమ్మా! పాప మాదత్తు, నేనును, జిన్నతనమునందు

మిగుల స్నేహితులము. దైవవశమున నిట విడిపోయినతరువాత నేను మీయింట దాసినైతిని. అతఁ డుద్యోగియయ్యెను. చిన్నప్పటిస్నేహ ముచేమిగుల జాలిగలదు.

ముక్త.—మన మేమి చేయఁగలము ? రాజద్రోహము చేసిన దురాత్ముఁడు శిక్షాపాత్రుఁడని నీ విప్పుడేకదా పలికినావు. నీమాట నీవు నిలుపుకొనుము.

సీత.—దాసి నగునేను నామాట నిలుపుకొనఁ జాలను. రాజ పుత్రిక లగుమీరు మీమాట నిలుపుకొనుఁడు. నాకుఁగావలసినసహా యముఁ జేసెదనని మీరిప్పుడే వాగ్దానముఁ జేసినారు కదా? ఇప్పు డామాట నిలుపుకొని మీయమ్మగారితోఁ జెప్పి నానిమిత్తము మీఁదత్తు ప్రాణములు రక్షింపుదురా ? ఆమేలు నాకుఁ జేయుఁడు.

ముక్త.—ఇది యసాధ్యము. రాజకార్యములలో మాయమ్మ నామాట వినదు. నే నీపని జేయఁజాలను.

అని ముక్త సందేహవిముక్తయై పలుక సీత కనుదమ్ముల మంచుబిందువులచందమున బాష్పకణములుదిగజార దుఃఖావేశముచే ధైర్యము జార భోరున రోదనము సేయఁ దొడంగెను. అందుచే ముక్త జాలిగొని యెట్లయినఁ దనయావచ్ఛక్తి వినియోగపఱచి తల్లి మనస్సు ద్రిప్పుదునని బయలుదేఱి విచారగ్రస్తయై యున్నకాంతా మతల్లియగుతల్లిం గనుంగొని యొకచోట మెల్లగఁ గూర్చుండి కొంత సేపటి కామెతో, "అమ్మా! రాజపుత్రులు నింబపురము నాక్రమించి నారా?" యని పలికెను.

అహ.—ఆక్రమింపలేదు. తేపో మెల్లుండియో యాపని జర గును.

ముక్త.—అమ్మా! యీదినము నా దొకమనవి యున్నది. నీవు శ్యామసుందరదత్తును—

అహ — తెలిసినది. చాలుఁజాలు ! నీమనవిని గట్టిపెట్టుము. ఆవిషయమై చెప్పకుము.

ముక్త — అమ్మా ! అట్లనవద్దు. వానిని బ్రతికింపు మని సీత నన్ను వేఁడుకొన్నది. నాముద్దు చెల్లింపుము.

అహ — నీకు భయభక్తులులేవు. రాజకార్యవిషయములలో నీకు జోక్య మెందుకు? ముక్కుపచ్చలారనిపసిదానవు. నీవు నాకు రాజకార్యములలో నాలోచన చెప్ప వచ్చితివా ? ద్రోహులను నే నురిదీయింపక నీసిఫారసువిని రక్షించినచో రాజ్యమునకువైపరీత్యము తప్పక వచ్చును. నీవెన్నఁడు నిఁక మీఁద నిటువంటిస్వాతంత్ర్యములు గైకొని నాకు నేవిషయమునం దుపదేశముఁ జేయకుము.

ముక్త — అమ్మా ! నేనుపదేశము చేయలేదు. నేను బ్రార్థించుచున్నాను.

అహ — ఆదాసి వేఁడుకొనుటయు నీవు వేఁడుకొనుటయునా ? ఏమీ ! కొంచెముదయతో నాదరించుచున్నామని దానికి నోడలు దెలియుటలేదా ? దాసి యగుతనయంతరమును రాణినగు నాయంతరము నెఱుంగిక సీత సిఫారసులుచేయ సాహసించినదా? జాగ్రత్త యని చెప్పు. ఆలస్యమయినఁగొలఁది నెందఱో సిఫారసులు చేయుచుందురు. కనుక నీపూఁటనే వాని నురి దీయించెదను. నీతోవను నీవు పోయి చదువుకొనుము. నేనిట్లన్నానని విచార మొందకుము.

అన ముక్తాబాయి యుడుకుబోతుతనమును దుఃఖమును డెందమున సంవడింపఁ జన్నపోయి తల్లివద్దనుండి పోయి గంపంతయాసతోఁ దనకై యెదురు చూచు సీతతో నిరాశగొలుపు నీపలుకులఁ దెలువ నామె విన్నఁబోయి విచారభారముచే నన్నము నీళ్ళు ముట్టక రోజుచుండెను.

## పదునేనవ ప్రకరణము.



ఉదయగిరిశిఖరంబున రతనంపుబంతిచాయలఁ బ్రభాకరబింబంబు నేత్రానందకరమై పొడచూపి యజ్ఞానముఁ బాపుసద్గురూపదేశవాక్యములవలె నంధకారమును బాపుతనకిరణసహస్రములచేజగమున కమితోపకారము నొసఁగెను. వ్యాఘ్రసింహాదిక్రూరమృగములు చీఁకటిగుహలలో డాగి తమవేఁట కనుకూలముగఁ బగ లేటికరుదెంచె నని విచారింపఁ జొచ్చెను. ఆసమయమున మహాబాహుపురసమీపారణ్యమున నొకయున్నతపర్వతశిఖరముపై వేనవేలుజనులు చేరి మహాకోలాహలధ్వనులఁ జేయుచుండిరి. ఏనుఁగుదంతములు నడవిపందికొమ్ములు నెమలిపింఛములు పలువిధములగు పూసలపేరులు మొదలగుననాగరకతసూచించునలంకారములఁ గైకొని భిల్లులు నాగరకత సూచించు వేషములతోఁ గొందఱుపురవాసులును. మధ్యస్థితిలోనుండినకొందఱు కాఁపులును వచ్చి తత్పర్వతమున నాతురతతో నొకమహాకార్యమున కెదురుచూచు చుండిరి. పర్వతముపైఁ జల్లదనమును వెదఁజల్లు విశాలమగు పందిళ్ళు వేయఁబడియుండెను. పందిళ్ళకునలుదెసలనుమంగళకరముగఁ గట్టఁబడిన పచ్చనిమామిడాకుల తోరణములునునడుమ తోరణములతో దండలుగఁగట్టఁబడినవనపుష్పములును స్తంభములకు జతగ నాటఁబడినకదళీకాతరువులును దత్ప్రదేశమునకు శృంగారలక్ష్మినని రాజ్యలక్ష్మినని నాహ్వానము సేయుచుండెను. ఈకోలాహలముతో జనులు మహోత్సాహభరితమనస్కులై యుండఁ గొందఱు పెత్తనమువహించి సందడి సేయవల దని జనుల నాజ్ఞాపించుచు హస్తములయందుఁ దమకు నెవ్వరు నీయనియధికారమును దెల్పు కఱలఁ దాల్చి యటునిటుఁ దిరుగసాగిరి. అంతలో "నిశ్శబ్దముగ నుండుఁడువచ్చుచున్నారు.వచ్చుచున్నారు. జాగ్రత్త" యనుపలుకులు

వినఁబడఁ బ్రజలందఱు వచ్చుచున్న యాపురుషునిపై గన్నులు నిగిడ్చి చూడసాగిరి. అప్పుడు ముందును వెనుకను నిరుగెలంకులను హస్తముల దండములు బూని వేత్రహస్తులు స్తుతిపాఠములు సేయు ధనము చెలఁబెట్టుటచేఁ బల్లెలనుండి వచ్చినలోభిబ్రాహ్మణులు స్వస్తి చెప్ప దుర్గంధభూయిష్ఠమగు నొకయడవియేనుఁగుపయి సమర్పఁబడిన పాత్రయంబారిలో బాలీసునకుఁ జేరఁబడి యొకసుందరపురుషుఁడిరువ దియాఱుసంవత్సరములవయస్సు గలవాఁడు కూర్చుండి యెడనెడఁ దనరాకకై ప్రజలు గావించినయలంకారమునకు మెచ్చుకొనుచు వచ్చెను. అంబారీలో నాతని కెదురుగ నొకసల్లనిస్థూలకాయుఁడు కొన్ని రాజకీయవ్యవహారముల నాతనితో ముచ్చటింప నీబాలుఁడుతల యూఁచుచుఁ గేలనప్పుడే త్రుప్పుపోఁ దోమినఖడ్గము తళతళ మెఱ యఁ దనభవిష్యద్వృత్తాంతమును బందిళ్ళమధ్యమున నిలిపెను. వెం టనే దౌలతరావు మెల్లఁగా నంబారిదిగి యాబాలునింగూడ వినయ ముతోడను భయముతోడను నొకరత్నకంబళముపై దింపెను. దిం పునప్పటికి భిల్లులు ఘీంకారనాదములు చేసిరి. పల్లెనుండి వచ్చినకాఁ పులు భయముచేనొత్తిగిలిరి. కొందఱు మనకొత్తహోల్కారుగారు వీరే యని యాబాలుని జూపఁదొడఁగిరి. గండాభిల్లు తాంతియా భిల్లు వెనువెంట నడువ చోప్దారులు మనుష్యుల నొత్తిగించి మా ర్గము జూప, దౌలతరావొకహస్తమును హరిహరపాండ్యాజీయొక హస్తమును బట్టి తన్ను నడిపింప బాలుఁడు వచ్చి సభాంతరమున వైవఁబడిన యొక వేదికపై నున్న చిన్నకుర్చీపైఁ గూరుచుండెను. దానిప్రక్కనే సింహాసన మని యొక పెద్దపీఠము వైవఁబడి యుండెను అందతఁడు సుఖాసీనుఁడయినతరువాత సభ్యు లందఱుఁ దమతమయ థాసనములపైఁ గూరుచుండ నంతట దౌలతరావు లేచి సభలో ను న్నధ్వని నివారించియిట్లుచెప్పెను. “ఓహో! ప్రజలారా! మిమ్ముల

నిక్కడకు నేను రావించినకార్యము మీరెఱుఁగుదురు. ఈదినము సుదినములలో సుదినము. ఈయన మనయేలిక యగుహోల్కారు గారు. తనమనుమఁడు గతించినపక్షమున నీయననే పెంచుకొమ్మని మల్హారురావుహోల్కారుగారు మరణశాసనము వ్రాసిరి. ఈయన యున్నతమైనహోల్కారుకుటుంబమున నుదయించినవారు. ఆఁడుదాని యధమపరిపాలనములో నుండుట కిష్టము పరువుగల మగవారి కుండఁ గూడదు. మీ శ్రీమహారాజుగారిపాదములు నమ్ముకొని యుండుఁడు. ఈయన ధర్మప్రభువులు. వెనుకటిహోల్కారుగారికిసన్నిహితజ్ఞాతులు ఈయనను బెంచుకొమ్మని జస్వంతరా వెన్నిచెప్పినను రాణి విన దయ్యెను. మీ కందఱకు నిష్టమయినచో నీయనకుఁ బట్టము గట్టె దను. ఇది మీకు సమ్మతమేనా ?" అని దౌలతరా వుపన్యసింప, భిల్లులు కాఁపులు మొదలగువారందఱు నైకకంఠ్యముగ మాకు సమ్మతమే మాకు సమ్మతమే యని యఱచి చప్పటలఁ గొట్ట నారంభించిరి. నింగి ముట్టినట్టిచప్పటలతోఁ బర్వతవ్రాతమున నున్న మృగసమూహములు బెదరి పాఱుచుండ దౌలతరావు శ్రీమద్రాజాధిరాజ శ్రీమంతపంతుశ్రీయిందూరుపదపాదుషాశ్రీమహాదేవరఘునాధగోవింద శాయాజీహోల్కారుగారూ! దయచేసి సింహాసనమెక్కుఁడని యాతని సింహాసన మెక్కించి యొకజరీకుళాయినిదెచ్చి ప్రస్తుత మిదియే నవరత్నకిరీట మని వానిశిరమునఁ బెట్టెను. తరువాత హరిహరపాండ్యాజీ లేచి "ఓజనులారా! ఇఁకమీఁద మనయేలిక శాయాజీహోల్కారుగారు. అహల్యాబాయికి మీరుదమ్మిడియైనఁ గప్పము గట్టవద్దు. కట్టినచో మరల మనరాజుగారి కీయవలసి యుండును గనుక మీరు రెండునష్టములు గల్గి చెడిపోదురు. ఇందూరురాజ్యమున నున్న గ్రామముల కన్నింటికిని నీవిధముగానే మేముత్తరములు తాఖీలు వ్రాయుచున్నాము. అహల్యాబాయి రాణి యని యెంచినవారికి

మానప్రాణములు దక్కవు. ఇదివఱకున్న యుద్యోగస్థులఁ దీసివైచి క్రొత్తవారినేర్పఱుతుము. మీరందఱు మహారాజుగారికిలోఁబడినట్లు మీభక్తిఁ దెలుప్పుఁడు" అని సింహనాదముతో బలిచెను. అంతట గండాభిల్లు తాంతియాభిల్లు మఱికొందఱు కాఁపులు కరణాలుఁ జేరి రాజసింహాసనమునకు సాష్టాంగనమస్కారమొనర్చి తమకత్తులపిడులు రాజున కందిచ్చి యందుమూలముగఁ దమ రాతనికి లోఁబడుటఁదెలిపి "స్వామీ! మేము మాపన్నులను మీకిచ్చెదము. అహల్యను రాణిగా నెంచము. మేము మీకొఱకు హోల్కారురాజ్యముకొఱకుఁ బ్రాణములు ధారబోయుదుము. దేశముల దోచుకొని యామెతోఁ గత్తి గట్టి యుద్ధము జేసెదము." అని ప్రమాణములఁ జేసిరి. అంతట శాయాజీహోల్కారుమహారాజుగారు సింహాసనము విడిచి లేచి యిట్లనిరి. "కాఁపులారా! మీకందఱకు సమస్తసుఖములు గలుగునట్లు మేముపరిపాలించెదము. అహల్యాబాయికాలమున మీకుఁగలకష్టము లన్నియు నశించెను. ఖర్చులకు సొమ్ము గావలయును గనుక మీరు పన్నులు త్వరగా దౌలతరావునకు హరిహరునకు జెల్లింప్పుఁ" డని దౌలతరావును జూచి నిన్ను మాసైన్యమునకు సేనాధిపతిగా నేర్ప ఱచినాము. హరిహరుని జస్వంతరావును మంత్రులుగా నియోగించి తిమి. గండాభిల్లు మన్నెసుల్తాను బిరుదముతో నీ యడవుల నేలవలసినది. మఱియు నహల్యకు జాబు వ్రాయుము. ఇందూరునగరము, కోట, సైన్యము, రాజ్యము, ఖజానా, మాద త్తజనకు లగు మలహారురావువారియాభరణములు మాకామె వారముదినములలో పున నప్పగింపవలసిన దనియు నట్లు సమర్పింపదేని యుద్ధము సిద్ధమనియుఁ గలహ మొనర్చినదేని ప్రాణములతో విడుమటలే దనియు జీవితాశ గలిగినపక్షమున మాసొత్తుమాకిచ్చి మారాజ్యమునుండిమరి యెచ్చటికైనఁ బాఱిపోవలసిన దనియు, నామెకు వ్రాయవలసినది.

రీవాసర్కారువారికిని గ్వాలియరుప్రభువులగు సిందియామహారాజు గారికిని మాకు సహాయము నమ్మని యుత్తరములు వ్రాయుడు. ఇది మీపని" యని ముచ్చటించెను. అంతలో గంఢాభిల్లు పదునేడేండ్ల వయస్సు గల యొక సుందరుడగుబాలుని దెచ్చి మహారాజునకు మ్రొక్కించి "దేవా! మాంతాంతియాభిల్లు వీనినిమార్గమధ్యమునుండి తీసికొనవచ్చినాడు. మాదేవతకు వీనిని బలిపెట్ట దలంచితిమి. కాని రెండుమూడాటంకములు వచ్చుటచే వానియదృష్టమున బలి మానితిమి. వీడు చదువు వ్రాత నేర్చిన వాడట. వీనిని దమయొద్ద నుంచుకొని మావిషయము లగు పనుల జేయింపుచుండుడు" అని యాతనిని సమర్పింప మహారాజు బాలునిసౌందర్యమునకు మెచ్చుకొని వానిని దాముంచుకొనుట కంగీకరింప నిదివఱకు రెండుసారులు మృత్యుదేవతనోటనుండి బయటబడినందులకు సంతసించుచు నాబాలుడు హోల్కారువద్ద కరిగెను. తరువాత మహారాజు తననిమిత్తము వేయబడినగుడారములోనికి నీబాలకునితోడం గూడి వందిమాగధ స్తోత్రములతో జనియెను. కాపులు తమతమగ్రామముల కరుగ భిల్లు లాయుధముల ధరించి యాపందిళ్ళలో బండుకొని యక్కడికే తమభోజనములు దెప్పించుకొని భుజియించిరి. క్రొత్తహోల్కారు గారు పట్టాభిషిక్తు లయినవార్త గ్రామములో దెలియుటదోడనే సైన్య మభివృద్ధి నొందసాగెను పెండ్లిళ్ళులేని ఘోటకబ్రహ్మచారులు, బిడ్డలులేని గొడ్డుబోతులు, కొంపలుగాల్చుటలో నాఱితేరినప్రాఘులు దారుల గొట్టుపచ్చిదొంగలు, బందెపోటుజేయు దోపిడిగాండ్రు నవలీలగ నరహత్యలు గావించుహంతకులు, రాజులక్ష్యములేనిగడే కారులు, మొండిబండలు, రాజుపై నాగ్రహము గలదురాత్ములు వెయ్యేల దుర్నీతిపరు లందఱు శాయాజీమహారాజుసైన్యమున జేరి యెప్పుడు దేశముగొల్లగొందుమో యెప్పుడు స్త్రీల జెఱబట్టుదుమో

యని కోరుచుండిరి. అహల్యాపాలనము నిష్టము లేనివారికిఁ గూడ నీసైన్యమును జూడ నొకవిధమైన భయముదయింప సకలదోషములు మూర్తీభవించి కొలువ నధికారము సేయుకలిపురుషునివలె శాయాజీని వారెంచఁ దొడఁగిరి. ఇదియైనమఱునాఁడుదయమున హరిహరుఁడును దాలతరావు నొకటిగఁ గూర్చుండి యిట్లుముచ్చటించిరి.

దాల.—ఓయీ హరిహర! జస్వంతరా వీపట్టాభిషేకమున కేమన్నాఁడు? నీవతని వదలి యిక్కడికి వచ్చినా వేమి?

హరి.—జస్వంతరావునకు మనయీకార్య మిష్టము. అందుచే నతఁ డీవిషయమై మనతో మాటలాడునఁట. కాఁబట్టి యీవేళ రాత్రి మన మిందూరునగరమునకుఁ బోవలయును. ఇష్టమున్నను జస్వంతరావు నాశ్రయించి నే నుండినచో నాకు నొకగవ్వయైనదొరకదు. అతఁడు దేశము దోఁచుకొనుటకు నొప్పుకొనఁడు. నీదయవల్ల నేను నాల్గుడబ్బులుసొమ్ము నార్జింపవలెనని యున్నది.

దాల.—నిజమే. అతఁ డెందులోను జేరఁడు. చివరకు రాణిని వఱిమి మన మే భాగుపడుదుము చూడు. నాకు ధన మార్జింప వలెనని లేదు. కమలాబాయివిషయములో నాకు, రాణికిఁ గతువచ్చినందున నన్నామె యాడినమాటలకుఁ గసి దీర్చుకొనుటయే నాముఖ్యోద్దేశము. పిల్లలు గలవాఁడవు కావలసినధనము నీవు దోఁచుకొని స్వీకరింపుము. మీవంటిబ్రాహ్మణులకిచ్చిన పుణ్యము.

హరి.—నీవు నాకు చేసినయుపకారమునకుఁ జాలసంతసించితిని. శూద్రులలో నిన్ను మించినవాఁ డెవ్వఁడు లేఁడు సరే కాని యీచచ్చుముండకొడుకను హోల్కారుగఁ జేసినా వేమి? అనక వీఁడు మననెత్తిని జేడరాయునేమో.

దాల.—ప్రస్తుతము వీనిని హోల్కారుగఁ జేసితిని గాని రాజ్యము స్వాధీన మైనతరువాత నీతనిపాత్రిప్పుచప్పుడీమఁగుదురు

సాగనంపి నేనీరాజ్యము గైకొందును. అంతవఱకు నామకా, వాని నేర్పఱచితిని. ఇది రహస్యము జాగ్రత.

అని వారు సంభాషించునంతలో నొకకొత్తపురుషుఁ డటకు వచ్చుటచే వారు తమమాటలు సమాప్తము కావించి మహారాజుగా రున్నగుడారమునకై పరిగిరి.

---

# పదునాఱవ ప్రకరణము.

"అమ్మయ్యా! నాప్రాణము లిప్పటికిఁ జల్లబడినవే సీత. నే నదృష్టవంతురాలను సుమీ" యని ముక్తాబాయి పలుకుటయు, సీత యాత్రముతో, "అమ్మా! యేమి జరిగినది యెందుచేత మీర దృష్టవంతులు,? చెప్పవచ్చునేని నాకాసంగతి జెప్పుఁడు" అని ముక్తను వేగిరపెట్టుటచే నామెయిట్లనిచెప్పఁదొడఁగెను. "ఓసీ! సీత! నీవింకను నెఱుఁగవే! యెఱుఁగవా నిన్నరాత్రి మాయమ్మ సర్వజనశ్లాఘ్య మయినయొకకార్య మొనర్చెను. శ్రీగంగాధరజస్వంతరావుగారు, దౌలతరావు, హరిహరపాండ్యాజీ మొదలగువారు దాదాపుగ నూఱ్వురుగూడి యొకమందిరమున మాయమ్మపైఁ గుట్రలు పన్నుచుండిరి.ఆసాయంకాలమున నేరూయమ్మగారికివార్తలులేనియొకయుత్తరమువచ్చెను. ఆజాబులో వీరంపఱుఁ గుట్రలు పన్నుదు రనియు జస్వంతరావుగారి వసంతగృహములోఁ గలిసికొందు రనియు ఖారిం బట్టుకొనుట కదియె యదన యనియు నున్నది. ఆజాబు చదువుకొని వీరావేశము నొంది యమ్ములు విండ్లు ఖడ్గములు మొదలగునాయుధములతో మదగజేంద్రము నెక్కి నయనకల్హారములయారుణ్యమును జూచి పౌరులు భయకంపితులై పార వీరపురుషోచితవాక్యములు

దురాత్ములగుండియలు జల్లుమనఁజేయ బయలుదేరెను. బయలుదేరి యాకస్మికముగఁ దనపైఁ గుట్రలు పన్నుచున్న నరాధములతోఁటఁ జేరి కవాటములు బలిమిని భేదించి యావసంతగృహమున వసంత జయంత కాంతుఁడగుజన్వంతుని, వానిచెలిమికాండ్రను గొందఱను జూచి వారిలోఁ బెక్కండ్రఁ బట్టుకొని బంధించెను. కాని దౌలత రావు మొదలగువారు గోడలు దాఁటి పలాయితులైరి. అంతట వారందఱుఁ దమకుఁ బ్రాణదాన మొసంగుమని రాణిని బ్రార్థింపఁ గాంతామతల్లి యగునాతల్లి కరుణారసైకపరిధానరాలయి యంద ఱను క్షమించి యభయహస్తంబిడెను. దౌలతరావు మొదలగువారు మందమతులై పారిపోయిరి. కాని లేకున్న మాయమ్మవారినికూడ క్షమించి యుండును. వారుమృత్యుదేవతకు బంధువు లగుటచే పారి పోయిరి. నాకోరిక దీర మాయమ్మయు జస్వంతరావుగారును సఖ్యత వహించినారు. అదియే నాకు శుభసూచకము" అద్భుతరస ముద యింపఁ జాలునాపలుకుల నాలకించి సీత తనచెలిమనోరథము సగము నెరవేరిన దననానందమును, దనమనోరథము పూర్ణముగ భిన్నమైన ధనవిచారమును డెందమున మల్లడిగొన నిట్లనియె. "అమ్మా! మన మిరువుర మొకశరీరముగ నుండునంతటినెయ్యము గలవారము. కాఁబట్టి శరీరము సగభాగము సంతోష మనుచిరువులతో నుండ రెండవయర్ధము విచార మనుపక్షవాతముచే స్పర్శజ్ఞానము లేక యున్నది. ఇది నీకు సమ్మతమేనా? నిరపరాధి యగుశ్యామసుంద రుని నానిమిత్తము బ్రతికింపుము" అని నల్లగలువజేకులనుండి వెడలు మకరందబిందువులవలెఁ గాటుకకన్నులనుండి జాఱిననల్లనిబాష్పములు ముక్తహృదయము గరఁగింప, సీతవిలపించిన ముక్త తనచేత నైనంత ప్రయత్నము జేయఁ దలంచి "ఓసీ యీదినమున మాయమ్మగారు నింబపురమున కరిగెదరు. రాజపుత్రులు వచ్చి నింబపురమును బట్టి

కొని దుర్గాధ్యక్షుఁ డగుశివనానాను బారఁదోలిరి. అతఁ డీదినమున మాయమ్మవద్దకు వచ్చినాఁడు. అందుచే ఱేపు మనమండఱము సైన్యసమేతముగ నింబపురములోని కరుగవలయును. అచ్చటి కరుగుటకు ముందె దత్తును గూర్చి చెప్పెద. నీవు విచారింపక ప్రయాణమునకు సిద్ధమై యుండుము" అని పలికి తనతల్లియొద్దకుఁ జనియెను. అదివఱకహల్యా శివనానా, తుకాజహోల్కారు కొత్తగాలోఁబడినజస్వంతరావు, మొదలగువారు పరివేష్టింప రాజకార్యాలోచనము సేయుచుండుటచే ముక్త తత్సమయమున కరుగుట యనుచిత మని ప్రక్కగదిలోఁ గూర్చుండి వారి విస్రంభసంభాషణముల నాలకింపుచుండెను అంతట నహల్యాబాయి యించుక విచారగ్రస్తయై శివనానాను జూచి యిట్లనియె. "ఓయీ! రాజపుత్రులు నింబపురముపై నెంతటి సైన్యముతో వచ్చినారు? మనసైన్యమునందెంత పనము దీసికొని పోవలయును?" అన శివనానా పదివేలుండునని నేఁ దలంచినాను. రాజపుత్రులు శౌర్యవంతులు. వారినిం గెలుచుట యసాధ్యము. కాఁబట్టి మనసైన్యముఁగూడనంతయుండవలెను. తుకాజీహోల్కారును నన్నును ముందుగ నంపుఁడు. మీరు సైన్యముతో రావచ్చును." అని రాణి కుత్తర మొసఁగెను. రాణి యాపలుకుల మెచ్చుకొని "యున్నవారిలో నీవును దుకాజియుఁగాక విశ్వాసనీయు లెవ్వరున్నారు? రాధాకాంతరావును నేనిదివఱదాఁక నమ్మియుంటిని. శ్యామసుందర దత్తు నురి దీయించుచున్నా ననుకోపముతో నతఁడు రఘునాథరావుతోఁ జేరినాఁడఁట. అతఁడు నాశత్రువులలోఁ జేరునని నే నెన్నఁడు దలఁప నైతి" నని విచారింపఁ దొడఁగ నప్పుడు తుకాజీ మెల్లగా నమ్మా రాధాకాంతుఁ డట్టివాఁడని నేను నమ్మను. అతని నియమములకు శత్రువులలోఁ జేరుట విరుద్ధకార్యము. ఇది యబద్ధఘేమో యని తలంచెదను. అని మనవి యొనర్చెను. ఆమనవి నను

గ్రహముతోఁ జెవి యొగ్గి విని రాణి తన చందువాపెట్టెలో నుండి యొకజాబు దీసి "నామాటలు మిమ్ము నమ్మింపలే కుండినను నీచిన్ని చీటియైనను మిమ్మునమ్మింపక పోదు. చదువుకొనుఁడీ" యని యాచీటి తుకాజీపైఁ బడవేయ నాఁతఁడు దాని నిట్లు చదువసాగెను. "శ్రీరఘునాథరావు రాధాకాంతరాయున కాశీర్వచనపురస్సరముగ వ్రాయున దేమనిన- నీవు నాకు మిత్రుఁడ వని నేను మిగుల నమ్మి యున్నాను. నన్ను మొదట మీదేశముపై రమ్మని జస్వంతరావు పిలిచినాఁడు. అతఁడు చలచిత్తుఁ డని వినుటచే నాతనిమాటలు నమ్మి నేను రానైతిని. నీవు నాతోఁ జేరి యహల్యాబాయితో యుద్ధము జేయుటకు సమ్మతించితివి గనుక నేను తేప్ప వచ్చి నిన్ను గలియుచున్నాను. నీవు పుత్రభావముతోఁ బెంచుకొనుచున్న శ్యామసుందరుని మీరాణి యన్యాయముగఁ జంపింపఁ దలంచుటచే నీకాగ్రహము కలుగుట దోషము కాదు. నీవు చేసినది రాజద్రోహము కాదు. కాని యిందూరురాజ్యముయొక్క గుట్టుమట్టు లన్నియుఁ దెల్పుదునని నీవు వాగ్దానము జేసితివి కనుక యీవాగ్దానము నిలుపుకొంటివేని మాపేష్వాయొద్దనీకుఁదగినయుద్యోగమిప్పించెదను. రఘునాథరావు." ఆయుత్తరము జదువుకొన్నతుకాజీయు, విన్నశివనానాజస్వంతరావులును నాశ్చర్యముచేఁ గొయ్యలయి మాటలాడ నేరకుండిరి. రాణి వారి యాశ్చర్యమును జూచి "యాశ్చర్య మెందుకు? ఇట్టివారు మనరాష్ట్రములో ననేకులున్నారు. గంగాధరజస్వంతరావూ! నీవు పాతినకలహాంకురము మహావృక్షమై పెరిగి యున్నది గదా! నీవు లొంగినను నీచేఁ బ్రేరితు లగువారు లోఁబడలేదు. దీని కంతకు నీవేకారకుఁడవు గదా" యనఁ దల వంచుకొని జస్వంతరావు తనయేలికతో "అమ్మా! యీద్రోహమునకు మార్గప్రదర్శకుఁడను నేనే. నాపొరబాటుకుమించి నన్నెప్పటియట్ల మన్నింతురని ప్రార్థించుచున్నాను. నేను జేసినపాప

ముగనకు నాపశ్చాత్తాపమే సన్ను దహించుచున్నది. మీరు వేఱ శిక్షింప నక్కఱలేదు. ఇంక మీయాజ్ఞ నతిక్రమింప నని ప్రమాణము చేయుచున్నాను." అని పరిపరివిధములు నామెను వేడుకొనెను. రాణియు వానిమాటలకు సంతసించి కారుణ్య మొలికించుకటాక్షములు బఱపి వానితో నిట్లనియె. "ఓయీ మనరాష్ట్రమున భిల్లుల బాధ యెక్కువగానున్నది. అదిగాక రెండుదినములక్రిందట శాయాజీసాహోల్కారను పేరుతో నొకక్రొత్తరాజు బయలుదేఱి పట్టాభిషేకము జేసికొన్నాఁడఁట. వాఁ డెవ్వఁడో యీయనామధేయుఁడు మాకు సన్నిహితజ్ఞాతినని చెప్పుకొని ప్రజలను మోసము చేయుచున్నాఁడు. శాయాజీయను నొకజ్ఞాతి మాకుండెను. కాని యతఁడు మృతినొందె నని యెవ్వరో చెప్పినారు. ఆమాట యబద్ధమో యీమాటయబద్ధమో తెలియదు. భిల్లులు వానితోఁ జేరినారు. దేశమునకు నిదివఱకే సేమములేదు. ఇంక ముందు బొత్తుగ సేమముండదు. అందుచేత నెవారుఁడైన భిల్లుల నందఱ శిక్షించి వారినాయకులగుగండాభిల్లుమొదలగువారలఁ బట్టుకొని నాకప్పగించి దేశమున దోఁపిడి మాన్పఁ గలిగెనేని వానికి నాకుమాతెఁయగు ముక్తాబాయి నిచ్చెదను. ఆకార్యమును జేయఁ గలవాఁడు పళ్ళెరములోని యీతాంబూలమును గ్రహింపవచ్చు" నని బంగారుపళ్లెరమునఁ గర్పూరతాంబూలమిడెను. అందఱునొకరిమొగము నొకరుచూచుచు సందేహింపుచుండ జస్వంతరావు సంతోషభరితాంతరంగుఁడై లేచి యేలికతో నిట్లనియె. "అమ్మా! నేనీకార్యమును బూనెదను. భిల్లులను లోఁబఱచుకొనక జస్వంతరా వేలినవారిమొగముఁ జూడఁడు. నాకా చంద్రవదన యగుముక్తాబాయిని విజయలక్ష్మితోపాటు పాణిగ్రహణము సేయుటయో, యోడిపోయి మృతినొంది వీరస్వర్గమున రంభాపాణిగ్రహణము సేయుటయో నాకు నీశ్వరుఁడు విధించినాఁడు.

ఈతాంబూలము నే నందుకొనుచున్నాఁడను." అనిపలికి తుకాజీశివ నానాలు విస్మయము నొందఁ దాంబూలము నందుకొని గంగాధరుడు నిలువ నహల్య యాతనిం గని "గంగాధరా! నీవట్టికార్యమునకుం దగుదువు. చిరకాలముక్రిందట నంకురించిన యనురాగఫల మచిర కాలమున నిచ్చుఁగాక. నేను నింబపురముపైఁ జనియెద. నేను మరల వచ్చునటకు గండాభిల్లుగం డడంచి నీవు భిల్లులగండఁడవై యుండ వలెను. నీ విఁకఁ బొమ్ము. తుకాజీ! నీవు మన సైన్యములలో నొకవంతు నంచి తక్కినవాహినులఁ గొని శివనానాసమేతుఁడవై రాజపుత్రులమీఁదికిం జని బాగుగ బుద్ధి చెప్పుము. తక్కినసైన్య ముతో రెండుదినములలో నేను వత్తు" నని యానతిచ్చెను. వెంటనే రాణికి జోహారొనర్చి సెలవుగైకొని వా రరిగిరి. అప్పుడు ముక్తా బాయి మాలిన్యమెడలిన ముక్తాఫలమువలె ముక్తవిచారయై ముక్తి నొందినదానివలె ముక్తభయయై యౌవనప్రాదుర్భావముచేఁ బరి పూర్ణమునొందినతనయంగములసౌష్ఠవము వసంతకాలమునఁ గెంజిగు రాకుల నొప్పు మల్లికాలతచందములు విడంబింప, నెన్నడుము జవజవ లాడ మందగమనముతోఁ జిరునగవుతో నలంకరింపఁబడిన నెమ్మొగ ముతో వికచారవిందయుగముఁబోలుకన్నుగవతోఁ దల్లికడకువచ్చెను. తల్లిచేసినశపథమును బురుషతల్లజుఁడగు గంగాధరుఁడు చేసినశపథ మును ముక్తను సంతోషసముద్రమున నోలలాడించు రెండు తెప్ప లయ్యెను. వచ్చినకూఁతుం జూచి తల్లి "తల్లీ! నీనగుమొగము క్రొ త్తవిలాసము నొందియున్నది. జరిగినసంగతులు వింటివా యేమి?" యని తనకూఁతుహృదయ మావఱకే జన్మాంతునివంక మరలినదని యెఱుఁగుటచే నవ్వుచుఁ బలికెను. ముక్త లజ్జచే శిర మించుక వంచి నేలఁ జూచుచు "తల్లీ! నామనవి నాలకించి మనసీతహృదయముచల్ల బడునట్లు దురదృష్టవంతుఁ డగుశ్యామసుందరుని విడువుము. ఇది

చేయువేని సీత దుఃఖించును. సీత దుఃఖించిన నేను దుఃఖింపక మానను. నేను దుఃఖించిన నీకు దుఃఖము రాక మానదు. కాఁబట్టి నన్ను దయఁజూడు తల్లీ" యని బ్రతిమాలెను. ఆ దీనాలాపములు విని తన కూఁతునకు సీతపైఁ గల ప్రేమాతిశయమును జేయఁదలచిన కార్యమునఁగల పూనికయు నెఱిఁగినవాఁడగుటచే రాణా కూఁతుం గనుంగొని "నీ వింతమూర్ఖపుపట్టు బట్టినావు. నీనిమిత్తమున నే నతనిప్రాణములు నిచ్చితిని. కాని యాతని నా రాజ్యమున నుండనీయను. అతఁడు నా దేశము విడిచిపోవున ట్లుత్తరవు జేసెదను. నీవును సీతయు నింక నింబపురప్రయాణమునకు సిద్ధముగ నుండుఁడు" అని పలికి కూఁతు నోదార్చి పంపెను. ఆమధ్యాహ్నమే శ్యామసుందరుఁడు చెఱలో నుండి విడిపింపఁబడి రాష్ట్రమునుండి తఱుమఁబడెను. తుకాజీయు శివనానాయు నరిగిన రెండుదినములకు రాత్రి విజయభేరీకాహళధ్వానములు శత్రువులహృదయములు వ్రక్కలుచేయ మహిషాసురనిర్మూలనకేళి కరుగుదుర్గామహాశక్తినవలెఁ జతురంగబలములతో నింబపురముపైఁ జనియెను.

---

## పదునేడవ ప్రకరణము.

తుకాజీహోల్కారును శివనానాయును సైన్యమును దీసికొని నింబపురమునకుం జని రాజపుత్రులచే నాక్రమింపఁబడిన నింబపురపు కోటను ముట్టడింపసాగిరి. రాజపుత్రసేనకు నుదయపురరాణా నాయకుఁడై కోటలోనుండి మహారాష్ట్రసేనల నెడతెఱపి లేకుండునట్లు తుపాకులబారులచే నొప్పించుచుండెను. రాణాకు రెండుకన్నులవలెఁ గపటోపాయవేదు లగుభేతాళసింగును, భైరవసింగు లిరువురు రాజపు

తులు సమస్తసహాయములు జేయుచు నిందూరుపురవార్తలు సహా ల్యాపరికముంగావార్తలును విన్నవించుచుండిరి. రాజపుత్రులు నింబాపుర ము నాక్రమించుటకు ముఖ్యకారకుఁడు గోమాజీరావే కనుక నతఁ డెప్పటివార్తలను మన్నారు గూఢసంచారు లగుచారులముఖమున భేతాళసింగునకు నెఱుఁగఁజేయుచుండ, నతఁడు రాణాకు నెఱుఁగఁజే యుచుండెను, గోమాజీరావు హోల్కారురాజ్యముయొక్క గుట్టుమ ట్టెఱింగించినపక్షమున వేయివరహాలతని కిచ్చెదనట్లు భేతాళసింగు వాగ్దానము చేసినందున నింబపురముపై రసపుత్రులను రమ్మనియు నచట దుర్గాధిపతియగు శివనానా పరాక్రమహీనుఁడనియుఁ జెప్పి గోమాజీ రాజపుత్రులను రావించెను. రసపుత్రులమనోరథము తీరి నను గోమాజీయొక్క మనోరథముతీరదయ్యెను. భేతాళసింగు వాగ్ద త్తముచేసినద్రవ్య మతనికిఁ బంపుటగాని యతఁడు వ్రాసినజాబులకుఁ బ్రత్యుత్తర మొసఁగుటగాని సలుపఁడయ్యెను. అందుచే గోమాజీ తనకిష్టుఁడైన వామనభట్టుచేతికిఁ గొన్నియుత్తరములు వ్రాసియిచ్చి యవి భేతాళసింగున కిమ్మని చెప్పి వానిని నింబపురమున కంపెను. అతఁ డటుండ జస్వంతరావు ర్గాశీఫక్షమునకుఁ దిరిగిపోవుటయు గోమాజీరావుస్వలాభపరాయణుఁడై ప్రత్యక్షకక్షకుదిగకుండుటయుఁ జూచి దాలతరావు భిల్లులనుశాయాజీహోల్కారునునమ్మియుండుట కేవలము మంచిది కాదని రసవుత్రులతోఁగలసి కొంతపని జేయుట యుచితమని నింబపురమునకుఁ దానుగూడ మహారాష్ట్రసైన్యము కంపె ముందుగఁ జని రాణాను దర్శించి యాతనిచే గౌరవింపఁబడి యచ్చట నుండెను. తుకాజీ బయలువెడలినరెండుదినములకు శ్రీరాణి యహల్యాబాయి కొంతసేనతో నింబపురముపైఁ జనుచు మార్గ మున నచ్చటచ్చట నిలుచుచు నాయాగ్రామములపరిజలం బిలిపించి భయపడవలదనియు భిల్లులను జస్వంతరావు సంహరించి దేశమునకుప

కారము చేయు పనియు దురాత్ములు చెప్పు తేనె తేటలవంటి మాటలకు నోడి చెడిపోవలదనియు నుపదేశించుచుఁ బయనము సేయుచుండెను.

చెరియొకపల్లకిలోఁ గూరుచుండి ముక్తాబాయియు సీతయు రాణివెంట వచ్చునెడ గ్రామములు ననాగరికులఁ గనుంగొనునప్పుడు వారొందు నాశ్చర్యమును వనములఁ బ్రయాణముచేయునప్పుడు నెమలి, లేడి మొదలగు ముద్దులుమూటగట్టు జంతువులం జూచి పొందినయానందమును గుట్టలను మహోన్నతపర్వతములను గండశిలలను సెలయేళ్ళను వీక్షించి యనుభవించిన సౌఖ్యమును వర్ణింప నలవి గాదయ్యెను. అదివఱకెన్నఁడు నంతఃపురము విడిచినవారు గాకుండుటం బట్టియు నిట్టివినోదములకుఁ గ్రొత్తవారగుటఁ బట్టియు యావనప్రాదుర్భావముచే ముందువెనుక లెఱుఁగనివారగుటఁ బట్టియుఁ బయనమే సుఖతరమని యెంచి నిర్భయముగఁ దలుపులం దెఱచి చూచుట కారంభించిరి. సైన్యమున విస్తారభాగము తుకాజీతో సంపఁబడుటచే నహల్యాబాయి కొలఁదిమూకలతో బయలుదేఱి మదగజాధిరోహణముచేసి తాను సేనాగ్రభాగమున నుండి శత్రువులొకవేళ పయిఁబడిన స్త్రీలకపాయము గలుగకుండునట్లు ముక్తను సీతను వెనుక రాఁ బనిచెను. ఇందూరు వదలిన మూఁడవనాఁడు సాయంకాలమీచిన్న సేనయొకయడవిలో ముప్పదుమనుష్యులొకమారు నడువగా నడచిపోవుటకుఁ దగినవెడల్పు లేని యొకయిరుకుత్రోవఁబట్టి పోవుచుండెను. రాణి యధిరోహించినయేనుఁగు సుఖముగా నడచుట కామార్గము చాలనందున నాజంతువును మిక్కిలి కష్టముతోఁ బయనము సేయఁ దొడఁగెను. వెనుకవారు ముందుకుఁ గాని ముందువారు వెనుకకుఁగాని వచ్చుటకు వీలులేదు. అందుచేత మనుష్యులందఱుఁ జీమలబారువలె నొకరివెనుకనొకరు నడిచి యక్కడికి సమీపగ్రామమునకు సాధ్యమయినంతవేగముతోఁ బోవఁజూచిరి. గాటముగఁ జీకటి సభమంతయు

వ్యాపించి యప్పుడప్పుడే పట్టిన నల్లమబ్బులసాయముఁ గొంది యామా ర్గస్థులకు దారితెన్నుఁ గానీయకుండెను. ఉఱుములు మెఱుములు నట్టహాసముచేసినందున జవ్వనులిద్దఱుఁ బ్రయాణము గొంచెము కష్ట మని యోచించిరి. అంతలో నొండొరులధ్వనులు వినరాకుండ ఝంఝా మారుతము వీవఁ దొడంగెను. ఆసమయమున నేమూలనుండియో కొండయేటిప్రవాహమువలె మహారావములతో నలుదెసల నున్న కొండలు చరచర దిగి యుగ్రధనుఃపాణులును విలక్షణాకృతులునగు భిల్లుల మూఁకలు వచ్చి యొకపెట్టున సేనయొక్క వెనుకచక్కిం దాఁకొనెను తాఁకుటయు బాలికలిరువురు నాక్రందనధ్వని జేసి అమ్మా! దొంగలు దొంగ లనియఱచిరి కాని వారిరోదన మరణ్యరోదనమై యామహా వాయువుచే దిగమ్రింగఁబడి యహల్యచెవులకెక్క దయ్యెను. భిల్లు లయుఱుఁపులు మోటసకిలింపులు గొంచెము రాణిచెవికిఁ బొడకట్టెను. గాని యామె తనసేనల వారు దాఁకి రని తెలియలేకపోయెను. అం తట సామగ్రి మోయుకూలివాండ్రు నిర్విణ్ణహృదయులై భుజము లపై బరువులు దింపి శత్రులకుఁ జేతులు జోడించి దండములు పెట్టి తమప్రాణములు గాపాడుకొనిరి. ఎదిరించువా రెవ్వరు లేనందున గండాభిల్లు తక్క నభిల్లులుసైన్యమున బియ్యముమొదలగుపదార్థములఁ దమసేవకులచేతి కిచ్చి బాలిక లున్న రెండుపల్లకులదగ్గఱకువచ్చితలు పులు దెఱచెను. అతనిభయంకరాకారముఁ జూచి ముక్త బాష్పయుక్త యయ్యెను. సీత భీత యయ్యెను. అనంతరము భిల్లులతోఁ గొల్ల సలుపవచ్చిన హంహారపాండ్యాజి యామిటారులపైఁ జేతులు వైచి యందు ముఖ్యముగ ముక్తయొంట నున్నయమూల్యరత్నముల స ఱాళువాబంగారునగలను దనివి దీర దోఁచుకొనుచుండ నాలతకూన లిరువురు మూర్ఛిల్లి యెన్నఁడో చచ్చిన ట్లుండిరి. ఇట్లు దోఁపిడిచేఁ గోరిక సఫలమైనందున హరిహరుఁడు సంతోషపారవశ్యము చేఁబలుకఁ

జాలక మాటిమాటి కానగలమూట జూచి మురియుచుండ "నీవె కా దామె, ఆమెకా దీమె" యని భిల్లులలో నొకవిధముగ వాగ్వాదముదయించెను. ఒకపట్లు నొరెత్తి మాటలాడఁజాలక హరిహరుఁడు వ్రేలితో నొకపల్లకిని జూపినందున వారు వాదము మాని యిదియె ముక్తాబాయి యని యాపల్లకి నాభిల్లులు భుజముపై నిడుకొని యనాయాసముగఁ గొండలు సెలయేళ్ళు దాటి పరువెత్తి యదృశ్యులయిరి. ఇంతనీవార్త కర్ణాకర్ణిని రాణి యాలకించి పుత్రికావియోగదుఃఖముచే వెడలుబాష్పములం దుడుచుకొనుచుఁ గతిపయ సైనికులతో రంగస్థలమునకు నొక్కనిమిషమున వచ్చి వారించెను. కాని దొంగలు స్థలము విడిచిపోవుటయేకాక దృష్టిపథముం దప్పిరి. అంతట నామె హా! ముక్తా! నన్ను విడచి యడవులపాలైతివేయని విచారించుచు రెండవపల్లకివద్ద కరిగి మూర్ఛిల్లియున్న కన్నెం జూచి సీతా సీత యిటు రా నీచెలి భిల్లులపాలయినది యని లేపెను. ఆపలుకు లామెను మూర్ఛనుండి మేలుకొలిపినందున బాలిక కన్నుదమ్ములు విచ్చిచూచి "అమ్మా! దొంగలుపోయినారా, నాస్నేహితురాలిని గొనిపోయినారా" అని యహల్యకంఠమునకుఁ జేతులుపెనవేసి కౌఁగలించుకొనెను. అహల్య యాశ్చర్యనిమగ్నయై "యేమిది? అమ్మా! నీవు ముక్తాబాయివా! పాపము సీతనే దొంగ లెత్తుకొని పోయినారా" యని కూఁతుఁగన్న మోదము, సీతచన్న ఖేదముచిత్తమున మల్లడిగొన ముక్తాబాయిని లేవనెత్తి ముద్దుపెట్టుకొని సీతకై మిగుల విచారించి తనకంటెఁ జెలినిమిత్తము మిక్కిలి వ్యథనొందు కూఁతు నూరార్చుచు నామెను సేదదేర్చి వెంటఁ బెట్టుకొని తనగజముపై నెక్కించుకొని సైన్యమునఁ గలకల ముడిపి తిరిగి పయనము సాగించెను. త్రోవలో ముక్త సీతను దలంచుకొని "అమ్మా! యిఁక నేను సీతను జూడను గాఁబోలు. దానిమాట లేమమ్మా. అది పలుకుట

యమృతవర్షము గురియుటకాదఁటమ్మా. ఆహాహా! మఱువఁదలఁచి నను దానిచర్యలు మఱపురావు తల్లీ. అది దాసి యటమ్మా వరహాలకుప్పగాని. హా! సీత! భిల్లులచేతఁ జిక్కినతరువాత నీవు నాకు దక్కుట యెక్కడిది? వా రేదేవతకో బలివెట్టుదురుగదా” యనివిలపింప కన్నీరు దుడిచి తల్లియామెనూరడించి సీతను వెదకించి తెప్పింతునని పలికి భిల్లులమీఁది కరుగునప్పుడు సీతజాడలు దీయుమని జస్వంతరావునకు రాణి జాబు సంపెను. అట్లు చని యారాత్రి సమీపగ్రామము జేరి యందుండి మఱునాఁడు మరల బయలుదేఱి పయనముసాగించి కొన్నిదినములలో నింబపురసమీపమునకుఁ జనిరి. రాణిరాక మున్నెవిని తుకాజీ శివనానా మొదలగు సేనాధిపతులు భయసంభ్రమములతో నామె నెదుర్కొని యామెయేనుఁగుల కిఱుకెలంకులందాను నడచి ప్రత్యేక మామెకై వేయఁబడినగుడారములో నామెను బ్రవేశపెట్టి తద్దేహసంరక్షణార్థమై యేనూఱుగురుజోదులను గుడారముచుట్టుఁ గావలియుంచి రాణితో శివనానా యిట్లనియెను. “అమ్మా! మేమువచ్చి నాలుగుదినము లయినది. తుకాజీయు నేనును గడుజాగ్రత్తగఁ గోట ముట్టడించుచున్నాము. మీరుగూడ శ్రమపడనక్కఱలేకయే కోట లోఁబడును. మీదేహసంరక్షణార్థము నేనుంచినయీసేవకులలో నేఁబదుగురు తురకలున్నారు. తురకలని వీరిని దిరస్కారభావముతోఁ జూడవలదు. మతవిషయమున హిందువులకంటెను గృతజ్ఞులుగ నున్నారు. అందీజమాన్ఖాను సాహసవిక్రమాన్యుఁడు. రాజపుత్రులు వచ్చునప్పటి కీశూరశిఖామణి యూరలేఁడు. కాని యుండినచో నింబపురము మీరు రావలసినయవసరముండకపోవును. ఈతనిచేత మీ రన్నికార్యములు చేయించుకొనవచ్చును” అని చెప్పి యొక్కసుందరుఁడగు తురుష్కవీరునిం జూపి యప్పగించెను. రాణి యాపలుకుల కలరి జమానుఖాను మొదలగు

మహమ్మదీయులయందు నమ్మక ముంచి వారిచే సంరక్షింపఁబడుచు గాఢముగా ముట్టడి జరపుమని యానతిచ్చి యుద్ధముల నారితేఱని స్త్రీయయ్యు భయమనక పగలనక రాత్రి యనక గుఱ్ఱముపై నెక్కియు నేనుఁగుపై నెక్కియు స్వయముగా సేనలఁ బురికొల్పుచుఁ బాఱిలుమాలిన స్వభటుల రక్షింపుచుఁ బరభటులను జంపఁ జేయుచు నిరువురచే శ్లాఘింపఁబడఁజొచ్చెను. నింబపురాంతఃపురకాంతలగర్భంబు లవియఁజేయు ఫిరంగిగుళ్ళు గభిల్లుగభిల్లుమని కోటగోడలు దూట్లుపడఁ జేయుచుండెను. రాజపుత్రమహారాష్ట్రసైన్యములు దూరమునుండి యొకరిపై నొక రగ్నివర్షములు గురియుచుండిరి. ఇట్లు ముట్టడి జరుగుచుండ రాణివచ్చినమఱునాఁటిరాత్రి గుడారములో రాణియు, ముక్తయుఁ గూరుచుండి సీతనుగూర్చి ముచ్చటించుచుండఁ గావలి గాచు జమానుఖానుయొక్క కఠినమయిన కంఠధ్వని వారికి వినఁబడ రాణియొక సేవకుని బిలిచి యది యేమని యడిగెను. ఆసేవకుఁడు నమస్కారముఁ జేసి "అమ్మా! నలువదియేండ్లవయస్సుగల స్త్రీ తమ దర్శనమునకు రాఁగోరుచున్నది. యుద్ధసమయములయందుఁ బరుల రానీయనని జమానుఖా నామెను నిరోధించినాఁడు. అదియే యాగడబిడ యని విన్నవించెను. రాణి యామాటలు విని నవ్వి 'స్త్రీలను రానిచ్చిన నేమినష్టముండును! ఆమెను రానిమ్ము. ఆమె యేమి చెప్పునో' యని జమానుఖానునకు వర్తమానమంప నతఁ డామెను లోపలికి వదలెను. పచ్చనిదబ్బపండువంటి దేహచ్ఛాయకలిగి పొట్టిగ లావుగ నున్న యాయంగన యెఱ్ఱనిచీర గట్టుకొని మొగమున నెఱ్ఱని కుంకుమబొట్టుతోడను గుఱుచలగు వెండ్రుకలతోడను బలుచని మొగముతోడను వచ్చి రాణియెదుట నిల్చి "అమ్మా! నామొఱ నాలకింపుఁడు. నేను నింబపురవాసురాలను. నాకుమారుని శివనానా నిర్హేతుకముగఁ జెఱలో నుంచినాఁడు. అదిగాక యీముట్టడిలో

నాపని పట్టెదనని యిదివఱకుఁ బ్రతిజ్ఞ చేసినాఁడు. అందుచే నే నసహాయురాలనగుట మీయొద్దనుండఁగోరి వచ్చితిని. నాకుమారుని జెఱనుండి విడిపింపుఁడు." అని రోదనము చేయ సాగెను. శివనానా యామెకుమారుని నిర్హేతుకముగఁ జెఱలోఁబెట్టఁడని నిశ్చయముగ నెఱిఁగి యతని నీసమయమున నావిషయమై యడిగినచో నేమికార్యభంగము వాటిల్లునో యని శివనానా నడుగుటకు నుద్యుక్తురాలుగాక భయపడిన యాయంగనను మాత్రము తనతోనుండుమని "అమ్మా! నీకుమారునకుఁగాని నీకుఁగాని భయములేదు. ముట్టడి యగునఱకు నీవు నాగుడారమున నుండుము. నేనుండ భయమేల" యని యామె భయ ముడిపి రాణి యారాత్రి నిద్రించెను.

---

## పదునెనిమిదవ ప్రకరణము.

---

మనుష్యరక్షితములుగాక యెండకు నెండి వానకుఁ దడిసిన యడవిచెట్లనున్న పరిమళములు గ్రహించి మందమలయానిలుండుతన గంధవహనామము సార్థకముగానరుదెంచి యున్నతపర్వతముపై గుడారమునఁ గొలువుదీర్చిన శాయాజీహోల్కారుయొక్క శ్రమలన్నియుఁ దొలంగఁ జేసెను. అతఁ డొకకుర్చీమీఁద సుఖాసీనుఁడై యదివఱకుఁ బీల్చినగంజాయిమత్తుతగ్గినందున మఱలఁ గొంచెము గంజాయి తన దగ్గఱనిలువఁబడిన బాలకునడిగినాలుగుగుక్కలుపీల్చివహావ్వావహావ్వా నీవు మంచివాఁడవు రాకుట్టా నీపే రెవ్వరు రామఱచినాను. ఫాజీగాదా" యని యాబాలు నడిగెను. హోల్కారురాజవంశమున నుదయించిన వాని కిట్టి తుచ్ఛమైనయభ్యాసము లెట్లలవడె నని మనస్సున నొచ్చుకొనుచు నాబాలుఁడు నాపేరు బాజీరావు కాని ఫాజీ కాదండి

యనియుత్తర మిచ్చెను. శాయాజీ ప్రత్యుత్తర మిచ్చుటకుఁ బ్రయత్నించుచుండ నింతలో గండాభిల్లుపాండ్యాజీలు గుడారపువాకిటనిల్చి హూల్కారువారి దర్శనముఁ జేయఁ గోర నతఁడు వారినిరమ్మనియెను. వారు లోనికి వచ్చునప్పటికి శాయాజీ బాజీరావు నావలికిఁ బంపి వారచ్చటికి వచ్చినకార్య మేమని యడుగ హరిహరుఁ డిట్లనియె. "మహారాజా! అహల్యాబాయికిముక్తాబాయిపై ప్రేమ మిక్కుటమని విని గూఢముగ మనస్వాధీనములో నుంచుకొన్నపక్షమునఁ దల్లి మనము చెప్పినట్లొప్పుకొని కుమార్తెకై పాణిగ్రహణార్థము మనకు రాజ్యమువదలివేయు నని ముక్తాబాయిని దెచ్చినాము. ఈపర్యాయము తమకు తప్పక రాజ్యము గైకొనవచ్చును. కావలసినచో నీమెను వివాహ మాడవచ్చును" ఈపలుకులు శాయజీచెవులఁ బడినతోడనే యేదీ నాప్రియురాలేది యని శీఘ్రముగఁ బీఠమునుండి లేచి గుడారమువెలుపలికి వచ్చెను. గండాభిల్లింతలోఁ బల్లకిఁ దెమ్మని బోయల కానతిచ్చుటయు వారందున్నయందకత్తెను మోసికొని వచ్చి హూల్కారునెదుట నుంచి తలుపులు దెఱచిరి. తమకు మన్నెసుల్తానుబిరుదు నొసంగినతనయేలికయెడ విశ్వాస మధిక మగుటచే గండాభిల్లు పల్లవాధరిం గని ప్రభువారు నీనిమిత్త మెదురుచూడ ముద్దులాగునఁ గదిలిరావేమి యీపాటికి రాయని మృదుతరమృణాలములు నిరసించునామెబాహువల్లిఁ బట్టుకొనిలాగ మడకత్తువంటిభిల్లుని మోటుచేయి సోఁకుటచే నరము బెణికి కడుబాధగలుగ, "అమ్మా" యని జాలిపుట్టనఱచి ప్రతిమలాగు సీత వాఁడు లాగినవైపునకుఁ జని నిశ్చేష్టురాలయి పల్లకిఁ జేరఁబడెను. శాయాజీశరీరము పులకలెత్తఁ గన్నెత్తి యాపుత్తడిబొమ్మం జూచి మేలిముసుంగు దీయుమని యానతీయ గండాభిల్లు కన్నియయొడాసి వలదు వల దని యామెచేతులతో నడ్డగించుకొనుచున్నను జేతులు వదలించి మేలిముసుంగు దీసెను,

తీయుటయు మేఘమునుండి వెడలు మెఱుపువలెం దెరచాటునుండి వచ్చుభామవేషమువలె భూమిని సంచరింపవచ్చినయప్సరవలె నప్పుడుదయించినపూర్ణచంద్రబింబమువలె ముఖకళలు పర్వంజేయుచు నాలతాంగి నిలువ ముసలివాండగుహరిహరుండు, శృంగారరసమెఱుంగనిమోటువాండగుభిల్లుండును మోహాతురులై యువ్విళులూర నాగరికుండును బహుచువాండు నగుశాయాజీస్థితి వర్ణింప నేరితరము. ఇట్లు మోహసముద్రమునం గొంతసేపు మునుంకలు వేసివేసి వారుమువ్వు రొకరినొకరు జూచుచు భయలజ్జలచే వారిం జూడంజాలక మొగ మావలివైపున కాబాలిక త్రిప్పుకొన్నను వంగి యాముఖము గనులారం గనుచునుండ శాయాజీ వారలతో "హరహరా! ఈమె ముక్త కాదు. ముక్తను నే నెఱుంగుదును. ఆమె యింతసౌందర్యవతి కాదు. ఈమెపే రెఱుంగను. కాని యాకారము నాకుం గ్రొత్తదికాదు సుమీ, యని సుందరీ! నీవెవరవే" యని యడిగెను. మహారాజుగారిప్రశ్న కామె యుత్తరము నొసంగుట కిష్టము లేనిదయ్యెం దన్ను వారు ముక్తాబాయిగా భావించుచుండిరి. గనుక తన పేరుముక్తాబాయి కాదని మనవి యొనర్చినదోం దన్ను వారు విడుతురను నాసచే నామె "నేను ముక్తనుగాను నాపేరు సీత. ముక్తాబాయికి నేను దాసిగ నున్నాను. నన్ను దయచేసి విడువుండు స్వామి! మహారాజులు, నున్నతగుణవంతులు నగుతమకు దాసీసంగమముకూడదుగదా" యని ప్రార్థింప నామెముద్దుమాట లాలించి శాయాజీ సుందరీ నేను నీసన్నాపక మున్నానా? నాండు పున్యహానగరములో గుడిలోనికి నీవు పోయి మరలి వచ్చుచుండ నేను నిన్ను బాణిగ్రహణము చేయలేదా! యని తన్నామెకు విన్నవించుకొనెను. అర్ధరాత్రివేళ నడివీథిలో స్త్రీని జెఱబట్టం దలంచినదోషకర్తృత్వం దొంటరికెంజిక్కిన దానిని విడువం డని యుం దనపుణ్య మట్లున్నదనియు భగవంతునిపై భారమువైచి సీత

మిన్నకుండ, వివాహప్రయత్నము చేయించు మని హోల్కారు చెప్పెను. ఆపన్నెండవదినమునను నాపర్వతశిఖరమునం బట్టాభిషేకమహోత్సవమువలెనే వివాహమహోత్సవమును జరుగుట మంచి దని గండాభిల్లు తగినముహూర్తము నుంచు మని హరిహరపాండ్యాజీకిం జెప్పి కావలసినమృగములను జంపి తెమ్మని నలుదెసలకుం దనభిల్లుల నంపెను. శాయాజీహోల్కారున కీకన్యను వివాహము సేయుట యెందుచేతనో హరిహరున కిష్టము లేదయ్యెను. ఈవృద్ధబ్రాహ్మణునకుంగూడ నామెయం దాశగల్గుటయె ప్రియమే; దీనికిం గారణమై యుండం బోలు! అందుచే నాతండు శుభముహూర్తము నాలుగైదు దినములలోపున లేదని తెలియం జెప్ప వారంతయు సీత నొకగుడారమున నుంచి చుట్టునలువురు భిల్లులను గావలి యుంచిరి. మొదట సీత యక్కడికి వచ్చుటతోడనే శాయాజీ బాజీరావును గుడారమునుండి యావలకుం దోలినందున నాతండు గుడారముచాటున కరిగి యచ్చటం గూరుచుండి వచ్చినయామ యంగన యెవ్వరో యనిమాత్రము ప్రేరేపింప గుడారపుగుడ్డకున్న చిన్నరంధ్రమునం దనకన్ను లుంచి సీతను జూచెను. చూచినతోడనే యాతనిమనస్సున కేమిపుట్టెనో కాని బొటబొటంగన్నీరు కాలువలై చెక్కులమీఁదుగ నేత్రద్వయము నుండి ప్రవహింప బాజీరావు హా దైవమా! సూర్యునకుంగూడం దగని యాపద దెచ్చిపెట్టినావుగదా, యని విలపించి తాను దుఃఖించినజాడ యేరికినైనం దెలిసిన వారు తన్ను గారణ మడిగి తెలిసికొని బాధింతురని కన్నీరుసత్వరమే తుడుచుకొని యెట్లైన సీత నొకపర్యాయము గలసికొని మాటలాడవలయు నని ప్రయత్నించెను. కాని యాదినమున సమయము దొరకదయ్యె. ఆతం డొకటిరెండుసారులు సీతయున్నగుడారముముందటికరిగి నిలువ భిల్లు లతని గదిమి కొట్టిరి. అందుచే నేమియుందోంచక కాలుగాలినపిల్లివలె నిటునటుం దిరుగుచుం

చెప్పినమాటలు చక్కఁగ వినఁబడమి శాయాజీచేఁ జీవాట్లు దినుచు మితిమీఱిన సంతాప మొందసాగెను. ఆగుడారమునఁ బ్రవేశించుటాది సీత నెమ్మనమున నమ్మల్లికము హెచ్చ "హా భవానీమాత! నాఁడు సన్యాసిరూపమున నీవే నాపరాభవము దప్పించితివి. నేఁడుపంచాగ్నిమధ్యమందు నన్నుంచినట్లు క్రూరజనమధ్యమున నుంచితివి. నన్ను భంగిపుచ్చుటకు యత్నించువారు కాని నివారించువారు లేరు. ఏమిపని జేసిననునీదాసనే" యనివేయివిధములఁ బ్రొక్కుచు హరిహరుఁడు తన కంపెంచినభక్ష్యములు గాని మహారాజుగారు ప్రత్యేకముగఁ దననిమిత్తమై వండించి పంపించిన మాంసాదికములుగాని భక్షింపక యన్నముముట్టక నీరుగూడఁ ద్రావక శుష్కోపవాసము చేసి భిల్లులచెరనుండి తప్పించుకొనిపోవువఱకు నుపవాసములు చేయునట్లు ప్రతిన గావించెను.

శాయాజీ హోల్కారు సూర్యాస్తమయ మయిన తరువాత మదనబాణహతుఁడై పలుమాఱు సీతయున్నగుడారమునొద్ద కరిగి యటనుండుభిల్లునకు జంకి మఱలుచు మఱల నటుపై పరుగుచు ప్రీతి మాలియో బలాత్కరించియో యామెను దనస్వాధీనము జేసికొనఁ గోరుచుండెను. హరిహరపాండ్యాజీ వృద్ధుఁ డయినను వానికోరిక మనుచునసమందుండుటచే నెట్లయిన నయమునో భయమునో బాలికను దాను స్వీకరింపఁగోరి నిద్దురలేక సమయమున కెదురుచూడసాగెను. బలవంతముగ గుడారము జేరినపక్షమున హరిహరుఁ డేమనుకొనునో యని శాయజీయు శాయాజీ యేమిసేయునో యనిహరిహరుఁడు నొకరికొకరు జంకి చతురంగమున నొకగుఱ్ఱ మొకగుఱ్ఱముచేఁ గట్టఁబడిన వారుప్రస్థ నామెదగ్గఱ కరుగరైరి. దైవయోగమున నావృద్ధుఁడు బాలుఁడు పరస్పరమత్సరబద్ధులై భిల్లులు నిదిరించుచున్నను గుడారమును గావుముండిరి. హరిహరుఁడు నిద్రలేక శవమువలె నేలమేలుకొనుచు

న్నాఁడో యని మహారాజునిందింప నీకుజ్జీపిసుఁ గేల దయ్యమువలెఁ దిరుగుచున్నాఁడో యని హరిహరుఁడు వానిని నిందింపఁ దొడఁగెను. ఒకమారు కామాగ్నికిఁ దోడు క్రోధాగ్ని గూడ జనింప శాయాజీ ఖడ్గము ధరించి హరిహరుని జంప నుంకించి చప్పున తెలివి దెచ్చుకొని యది తనభవిష్యదభివృద్ధికి నాశనకారణ మని యూహించి మాని తుదకుఁ బ్రాణములు విసికి కామపారవశ్యమునుండి తొలఁగింపఁబడి నిద్రాపారవశ్యముఁ బొందెను. అప్పుడు హరిహరుఁ డాజాడ దెలిసి గుడారము జేరఁబోయి యమదూతలవలె భిల్లులు మేలుకొనుటచే వెనుకకుం జని రవంతసేపు కునికెను. ఆవగింజంతసమయ మెట్లయినఁ జేకుఱు నేని దానింబట్టి సీతాదర్శన మొసర్చి మాటలాడఁ దలఁచి రేయి కునుకు లేక శ్రమ పడుచున్న బాజీరావు వీ రిరువురు నిద్రాసక్తులు కాఁ జూచి భిల్లు లంతకుముందే దేహములను మరచి గాఢసుషుప్తులగుట నెఱిఁగి యది చీకఁటిరాత్రి యగుట నెంచి మెల్లమెల్లగ సీతయున్న గుడారపుప్రక్కకు వచ్చి నిశ్శబ్దముగఁ గూరుచుండెను. కూరుచుండి భూమినిదాఁకు గుడారపుముతకగుడ్డను దనచేతులతో మీఁదికి నెత్తి యల్లన దానిక్రిందదూఱి లోపలఁ బ్రవేశించి చప్పుడు గాకుండ దేఁకి సీతకడ కరిగెను. నిద్రపట్టకున్నను బరధ్యానముగ నేమో యాలోచనసల్పుచుండిన సీతయొక్క మృదుదేహముపై బాజీరావుచేతులువైచి తట్ట నామెయులికిపడి శాయాజీయేమో యని వడఁకి ఛీఛీ దురాత్మా పోపో యని గద్గదస్వరముతో సఱచెను. ఆపలుకుల కలుగక బాజీరావు "నే నక్కయ్యా నేను బాజీరావును నీవు భయపడకు" మని మెల్లనఁ జెవిలోఁ జెప్పెను. అమృతసేచనము జేసినచందమున నామాటలు తనచెవికిఁ దృప్తియొసంగఁ జేతులతో వానిదేహము దడవి పూర్వము దా నెఱింగిన యానవాళ్ళను బట్టి యతఁడు బాజీరావని గ్రహించి "నాయనా నాయనా నీవును నామాయ

భిల్లులచేతనే చిక్కితివా" యని రవంతసేపు వగచి యాతని దగ్గఱ దీసికొని నాతఁడు నామెయొడిలోఁ బండుకొని ముహూర్తము దాఁక అక్కయ్యా! నన్ను భిల్లులు రెండుసారులు వారిదేవతకు బలి వెట్ట నెంచిరి. ఈపర్యాయము మన యిద్దఱముగూడ నటులే యగుదు మేమో, యని యేడువసాగెను. సీత వానివిలాపమును వారించి యిది దుఃఖమునకుఁ దగినయదను కాదు. ఉపాయములచే మన మిచ్చట నుండి దాఁటవలయును. నీవు నేను జెప్పినట్లు జేయుము. అని వానికిఁ గొన్నిరహస్యములు చెప్పి యిక్కడ నీవున్నచో మనకు నిరువురకు నాపద వాటిల్లును. సత్వరమే సాగిపొమ్ము. లే యని వాని నంపెను. అతఁడును బూర్వప్రకారముగ గుడారము నొత్తిగించుకొని యావలఁ బడి తన యేలికహాజారమునకు కరిగి తనస్థానమునఁ బూ నెప్పటియట్ల శయనించెను. ఉదయమున హరిహరుఁడు హోల్కరుకన్న మున్నే లేచి కాల్యకృత్యములందీర్చుకొని బాజీరాయనిఁ జేరఁ బిలిచి కుఱ్ఱా సీతవద్దను నీవు సేవకుఁడ వగుటచేఁ బలుమాఱు పోవుటకు నీకుత్తరువు గల్గునట్లు నేఁ జేసెదను. నీ వామెతో నాపైఁ బ్రేమ గల్గునట్లు నన్ను వివాహమాడునట్లు లోత్రిచెప్పి నాకీయుపకారము జేతువేనిచెఱనుండి నిన్ను వదలించెదను. కావలయునేని నీకు ధనముగూడ నర్పించెదను. అట్లు చేయఁగలవా యని వినయమునఁ బలికెను. ముసలివాని కింత కోర్కె యున్నందుకు నగవును దన్నట్టి దుష్కార్యమున కాతఁడు నియోగించినందు కలుకయు నతనిమనస్సున నుదయింప బాజీరావు వానిని వారించుకొని కాలానుసారముగ వర్తింపఁదలఁచి, యయ్యా నాకిది యిష్టమే. శాయాజీకూడ నామెను గోరుచున్నాఁడు. వానిని గడతేర్చినపక్షమున మీకామెదక్కునని యుత్తరమీయ హరిహరుఁ డది యెంతపని యీ రాత్రి చేతునని సంతోషముతో వాని నంపెను.

# పందొమ్మిదవ ప్రకరణము.



అట్లు భిల్లుల శిక్షించుటకుఁ బ్రతినబూని జస్వంతరావు రాణి నడిగి కొంతసైన్యమును వెంటఁబెట్టుకొని భిల్లులగూడెముపైఁ బడి వారిలోఁ బలువురఁ బట్టుకొని కొందఱఁ జెరలో నుంచుచు ముఖ్యులగు నాయకులను వృక్షములకుఁ గట్టి యురిదీయించుచు నొకమాఱు వారు తిరుగఁబడునప్పుడు వారితో వెనుదియ్యక కయ్యములు సల్పుచు నొకమాఱపజయము నొందుచు జయాపజయములవలన నుదయించిన సంతోషవిచారములకుఁ దనమనసు పుట్టినిల్లగునట్టుల ముక్తాబాయిపై హృదయము నిల్పి విజయకాంక్షపై దృష్టి నిల్పి విహరింపఁజొచ్చెను. ఒకమాఱు కొందఱఁ బట్టి పరిమార్చుచుండ రెండవమూల మఱికొందఱుభిల్లులు పల్లెలపైఁ బడి దోఁచుకొని బీద కాఁపుల గృహములు బరశురామప్రీతి జేయసాగిరి. అహోరాత్రములు నిద్రాహారములు లేక జస్వంతరావు ప్రాణములకు లక్ష్యపెట్టక యెందఱిని శిక్షింపుచున్నను భిల్లు లిసుకపాతరలవలెతగ్గకైరి. కాని యాతనియెడ తెగనిపూనికవల్లను వహించినక్రౌర్యమువల్లను భిల్లులకుఁ దమవినాశకాలము దాపయిన దనుమాట తెలియుటయే గాక జస్వంతరావునామము విన్నప్పుడువారి కొకవిధమయినయడలు కూడ గలిగెను. కాని యాటవికనాయకుఁడును మున్నొక్కసారి చిక్కి శ్యామసుందరునిలోపమునఁ బారినవాఁడును శాయాజీకిఁ గుడిచేయి యయినవాఁడును, నగు గండాభిల్లున్న స్థానము జస్వంతరా వెఱుఁగక వానిని బట్టుకొనిన తనజన్మము సార్థకమనియు నతఁడు చిక్కినతోడనే భిల్లులు కోరలు దీసినపాములవలె లొంగుదురనియు నందు శాయాజీ యసహాయుఁడయి రాణికి లోఁబడుననియుఁ దలఁచి గండాభిల్లునిమిత్తము సమస్తప్రయత్నములను సల్పుచుండెను. భిల్లువంశమునకు జస్వంతరా వుత్పాతహేతు

వయి ప్రళయచండమునఁ దమవారి నతఁడు వేఁటాడుట విని గండా భిల్లు సహింపనోపక శాయాజీదగ్గఱఁ దాను గొలువుండి తాంతియా భిల్లు నిచ్చి తనసేనఁ గూడ దేశనాశము జేయు మని పంపెను. భిల్లులతోడనే కాక సకలపాపములు మూర్తీభవించినట్లు బహుదురా త్ములతో నీసేన గూడియుండినది. గ్రామములపైఁ బడినదాది తల్లులకుఁ బాసిన పిల్లలతోడను మగలకుఁ బాసిన భార్యలతోడను దినుట కన్నము లేని బీదలతోడను దేశ మెంతక్షోభపడవలయునో యంత క్షోభ పడసాగెను. కాని లయకాలరుద్రుఁ డయిన జస్వంతరావును మృత్యువుమూర్తిగైకొన్న తెఱఁగునఁ గృష్ణపంతనునొక యోధవరుఁడును గలిసి విధివిరామము లేక శతసహస్రములుగా వారిని యమాలయమున కంపుచుండిరి. హరిహరపాండ్యాజీ సీతకును శాయాజీకిని వివాహము జరగు ముహూర్తము నాలుగు దినములున్నదని చెప్పిన తోడనే గండాభిల్లు తాంతియాను వెంటఁ బెట్టుకొని జస్వంతరావు యొక్క ధాటిని చవి చూత మని తనకొండవిడిచి తక్కినభిల్లులకును రాణిభటులకును గయ్యములు జరగుస్థలమునకుం జనెను. ఆస్థలమున కరిగి మొగమునఁ గన్నులకు మీఁదఁ జేయి పెట్టుకొని యతఁడు పారజూచునప్పటికి నిరువదిమంది గుఱ్ఱపురౌతులతోఁ బోవుచున్నయొక యోధుఁడు దూరమునఁ గనఁబడ తాంత్యా "అతఁడు జస్వంతరావని తోఁచుచున్నది. మన మీసమయమున వాని నెదుర్కొనఁ జాలము. నీవు పోయి యీచుట్టుపట్లనున్న మనవారినందఱిని సిద్ధముగ నుండుఁడని చెప్పుము" అని వాని నంపి తా నొకగుహలో డాఁగెను. తాంత్యాభిల్లు తనయజమానుని సెలవుప్రకారముగ సమీపమున నున్నపల్లెల కరిగి భిల్లులకు గండా వచ్చినవార్త తెలియఁజేసి మరల నాగుహవైపు పోవుచుండెను. ఇంతలో నిరువదిమంది గలయాసమూహము గుహావద్దనిలిచి పలుదెసలు పరికించునప్పటికి వృక్షములచాటున నక్కి

యున్నయొకభిల్లుఁడు గనఁబడ “అదె భిల్లుఁడు! అదె భిల్లుఁడు వచ్చె” నని యఱచిరి. తోడనే జస్వంతరావు మార్గాయాసమున నది నలసి మిగుల నసివాడిన కృష్ణపంతును గుహాముఖమున నొక చెట్టుక్రింద నిల్పి తాను దక్షిణభటులను గలసి యాభిల్లునిదెస కరుగ నతఁడును లేడివలె దాఁటులువైచుచు ముండ్లపొదలను రాతిగుట్టలను నవలీలఁగ దుముకుచు వారికిఁ జిక్కక పరుగెత్త సాగెను. ఇచ్చటఁ గృష్ణపంతొక్కఁడును వృక్షచ్ఛాయవిశ్రమించుటఁ జూచి గండాభిల్లు మెల్లగ నీవలకు వచ్చి “తమ రెవరినిమిత్త మిందున్నవారు స్వామీ”యని వానిని బలుకరింప నాతఁడు “భిల్లులనిమిత్తమై మేము వచ్చినాము. గండాభిల్లును నీవెఱుఁగుదువా? అతని నప్పగించినపక్షమున నీకపాయము లేకుండఁ జేసెదను” అని కృష్ణపంతు ప్రత్యుత్తర మిచ్చెను. అంతట గండాభిల్లు “స్వామీ! గండా యింతకు ముందె యీప్రాంతములకు వచ్చినాఁడు. ఒకనిమిషము క్రిందట మీరు వచ్చితిరేని నేను జూపియుందును. అయినను వాఁడీ గుహాలోనుండి వచ్చును. నావెంట రండి” యని యాతని నాగుహా ప్రవేశము జేయించి యందతని నొకరాతిపైఁ గూర్చుండఁ బెట్టి యెవరయిన వచ్చుచుండి రేమో యని మఱల నొకమాఱు గుహా ద్వారమునకు వచ్చి యెవరును వచ్చుట లేదని సంతసించి లోనికిం జనెను. ఇచట పరధ్యానముగ నున్నకృష్ణపంతును బలిమిని వెనుకకుఁ బడఁద్రోసి తనమొలలో నున్నసూరకత్తితో నాతనిముక్కు గోసి యొకచెవిలో నొకభాగము ఖండించి “యోరీ దురాత్మ! నేనేరా గండాభిల్లును. నన్నుఁ బట్టుకొనువారు మీరా” యని తత్క్షణ మాగుహానువిడిచి కొండమీఁది కెగఁబ్రాకి తనయొంట వ్రేలాడునిడుదగొరకొమ్మునని విపరీతమయినవిధమునఁ జెవులు గింగురుమనునటు లొత్తెను. ఆకొమ్మునూఁదుట యానవాలుగఁ గొని యాప్రాంతవాసు లగు

భిల్లులు మఱల నొకకొమ్ము నొత్తి ప్రతిధ్వని చేసి పుట్టలో నుండి వెడలుచీమలవలె నొకనివెనుక రెండుమూఁడు వందలమంది గండాభిల్లున్నదెస వచ్చిరి. తాంతియాభిల్లు తమ కాళ గొల్పి దిక్కునందున జస్వంతరావు తనచిన్న సేనతోఁగూడ వెనుకకుఁ దిరిగి గుహాముఖమున బోసిముక్కును దెగినచెవియును గల్గి స్రవించు రక్తముతో బాధపడుచున్న కృష్ణపంతును జూచి తెల్లబోయి స్పష్టముగఁ దెలియనివాని ముక్కుమాటలవల్ల గండాభిల్లు చేసినపరాభవము నెఱిఁగి క్రోధోద్దీపితుఁడై యుండ నింతలో గుమిగూడినభిల్లులు కొండమీఁదనుండి వీరిమీఁద నమ్ములవర్షములు కురియింప నారంభించిరి. మూఁడువందలమందితో నిరువదిమంది కయ్యము సేయుట మృత్యుస్నేహము చేయుటయే యని జస్వంతరావు స్పష్టముగ నెఱిఁగియుఁ దాము వెన్నిచ్చి పారినచో వారు తరిమికొట్టి మొదలేబ్రతుకనీయరని తుపాకులతోఁ గొంత యుద్ధముచేసెను. ఇట్లు జరిగినకయ్యమున మహారాష్ట్రుల తుపాకిదెబ్బలు తిని ముప్పదైదుగురుకంటె నెక్కువసంఖ్యగలభిల్లులు నేలపాలయిరి. జస్వంతరాయనిబలములో సగముకంటె నెక్కువ హతులైరి. అంతట జస్వంతరావు రంగము విడిచి పోవఁ జూచుచుండ దూరమున నాతనిసేనలో నొకభాగము వానిని వెదకికొనుచు వచ్చుచుండెను. ఆబలము దృగ్గోచరము కాఁగా భిల్లులు పిట్టలవలె తుఱ్ఱున కొండమీఁదనుండి నానాముఖములఁబారి యదృశ్యులైరి. ఇట్లు పూర్వము లక్ష్మణునిచే శూర్పణఖకు జరిగినపరాభవమే గండాభిల్లుచేఁ గృష్ణపంతునకు జరుగ నాతఁడు యుద్ధమును మాని సిగ్గుచేఁ దనవికలాంగత తనకే యసహ్యకరముగఁ దోఁచ మెల్లగ నింటికిఁ జనెను. గండాభిల్లు తాంతియాను గూడుకొని మఱునాఁడు సాయంకాలమునకు శాయాజీహోల్కారు వారి సమ్ముఖమునకు వచ్చి తన పూర్వోద్యోగముఁ గైకొనెను.

అట నింబపురమున దౌలతరావు రసపుత్రులతోఁగలసి యహల్యాబాయిసైన్యమును నోడింపవలెనని యెంత ప్రయత్నము సల్పుచున్నను మహారాష్ట్రులే యీముట్టడిలోఁ బయిచేయి గలవారుగ నుండిరి. గోమాజీరావు రాజపుత్రులకుఁ గావలసిన ప్రతిసహాయముఁ జేయుదు నని వారిని బిలిపించి తనలంచము వారు సత్వరముగ సంధిఁ జేయింపరైరని వారిపై నలుక బూనెనే కాని తాను వాగ్దాన మొనర్చిన సాయము వారికిఁ దా నొనర్పఁజాలనందునకుఁ జింతిల్లఁడయ్యెను. కోత్వాలువద్దనుండి యేసహాయము లేకున్నదని రసపుత్రప్రభువగు నుదయపురి రాణా వారు భిల్లులను శాయాజీనైనఁ దమకుఁ దోడుగ రప్పింపుమని దౌలతరావును బలుమాఱడుగుచువచ్చినను శాయాజీ యప్రయోజకుఁ డనియు వానిని బిలిచిన మును పున్నగోడు చెడు ననియు భిల్లులాటవికు లగుటచే దేశమును గొల్లగొనుటకే యర్హులు కాని నిల్చి కోటలు ముట్టడించి క్రమమయినయుద్ధములు చేయుటకుఁ దగ రనియు నెఱిఁగి వారిని రప్పింపఁ దలఁపక యట్లున్నచోఁ దనకు నేమము లేవని యిదిగో వచ్చెద రదుగో వచ్చెదరని ఱేపు మాపని కాలయాపన మొనర్చుచుండెను. రసపుత్రులు కాగ్రహము వచ్చి తన్నెపుడు తుద ముట్టింతురో యని భయము గలిగి వారి నాతఁడు వదలఁ బ్రయత్నించెను. కాని వా రాతనిని దాఁటి పోనీయక వేయి కన్నులతోఁ గాచుచుండిరి. ఒకవేళ నేమాయోపాయము చేసియైన నీబందెనుండి వదలించుకొని పోవుదమన్న నీవల జస్వంతరావు భిల్లుల నిర్మూలమునకు నోడలు దాఁచుకొనక పని చేయసాగుటచేఁ దనకు వారికడ నేమముండ దనుమాట నిశ్చయమని తెలిసికొని యక్కడికిఁ బోవుట యవివేకముగ నెంచి యెట్లయినను రసపుత్రులతో నుండుట యుక్తమనుకొనెను. రసపుత్రప్రభు వాడినమాట తప్పని పురుషుఁ డగుటచే గోమాజీరావునకుఁ దాను వాగ్దానము చేసిన

వేయివరాలును భేతాళసింగుచేతి కిచ్చి యంపినను జిత్తులమారితనమున నక్కను జంపి పుట్టినభేతాళుఁ డావిత్తము తానే యపహరించి గోమాజీరాయని కిచ్చినట్లు రాణాకువిన్నవించెను గోమాజీరావుకడనుండి భేతాళసింగు దగ్గరకు రాయబార మంపబడినవామనభట్టు మెల్లగాఁ గోటలోఁ బ్రవేశించి కొత్త్వాలు కీయవలసినసొమ్ము నిమ్మనియు సొమ్మిచ్చినవెనుక నెంతయుసహాయము జేయుదనియు వానినడిగెను. భేతాళుఁ డాతనిపలుకులు విని "యోయీ, వామనభట్టూ గోమాజీరావునకు నేనసొమ్మునిచ్చుటకు వాఁడు మాకుఁజేసినసాయమేమి? నే నొక్కదమ్మిడీయైన వాని కీయను. నీకు నూరురూకల నిచ్చెదను. నీవీసొమ్ము దీసికొని యీసంగతి రాణాకుఁ దెలియనీయకుండు"మని వాని నొడఁబఱచి వానికి ముందె పదిరూకల నిచ్చి తక్కినది తరువాత నొసంగఁగల నని చెప్పి వానిని సమ్మతింపఁజేసెను. తరువాత దౌలతరావు రాణానుదర్శించి శాయాజీమహారాజు పక్షమున నహల్యాబాయికి సందేశ మంపుట కర్తవ్య మనియు రిపుపుత్రులు శాయాజీతోఁ గలిసి రని విన్నచో రాణి తప్పక కోరినపద్ధతులపరిహారము నొడంబడిక గావించుకొనుననియు నట్లువామనభట్టు రాయబారిగ నేగఁ దగినవాఁడనియు నచ్చఁ బలికి రాణాతోఁ జెప్పవలసినయంశములనెల్ల మనస్సునకు నాటఁ జెప్పి వామనభట్టును రాణాయనుమతిమీఁదఁ దగుపరివారముతోడను జెండాలతోడను రాయబారమంపెను. వచ్చి యహల్యాబాయియనుమతిని నామె హజారముఁ బ్రవేశించి వామనభట్టు ప్రాణముల నగ్గఁ బట్టుకొని భయపడుచుఁ గూరుచుండ జమానుఖాను మొదలగు తురకలు పదుగురు తుకాజీశివనానా మొదలగుసేనాధిపతులు రాణిని బరివేష్టించి యాసందేశమును వినఁగోరిరి. అంతట రాణిమొగము జూచి వామనభట్టిట్లనియె. "అమ్మా! శాయాజీహోల్కారు మహారాజుగారు నన్ను

దమవద్ద కంపినారు. ఇందూరు రాజ్యమున మీకు లేశ మైన భాగ మీయమనియు సర్వస్వము తమపాలక జనకులగుమలహారు రావుగారి దే యగుటఁ దమకే రావలయు ననియు మనోవృత్తిగ మీకుఁ గొన్ని జాగీర్ల నిచ్చెదమనియు రాజ్యము వదలవలసిన దనియు వదలకున్న పక్షమున దాము రసపుత్రులతోఁ జేరుదు మనియుఁ దమతో మహా రాజుగారు మనవిచేయుచున్నారు. రాజపుత్రులకుఁగూడ నాల్గవవంతు రాజ్యమొసంగవలయు నఁట. దీనికుత్తరము జెప్పి నన్ను సత్వర మంపవలయు ననిప్రార్థించుచున్నాను." అని చెప్ప సహల్య పక్కన నవ్వి "మీమహారాజుగా రెందున్నారు? వారు మాకగపడుదురా?" యన నాతఁడు "చిత్తము వింధ్యపర్వతములలోనున్నారు తల్లీ" యని ప్రత్యుత్తరమిచ్చెను. ఇచ్చునప్పటికి జమూనుఖాను వెనుకపాటున వచ్చి వామనభట్టుయొక్క భుజకండము గట్టిగఁ బట్టుకొని రాణితో 'అమ్మా! వీఁడు కుట్రలో జేరినవాఁడు వీనిని బట్టి చెరఁ బెట్టినచో నద్భుతములు గొన్ని మనకుఁ దెలియఁ గలవు సుఁడీ' యని విన్న వించి వానిరెండుచేతులకు సరిదండలు బలిమివేసి, "నీవు ఖయిదీ వయినావురా" అని నిలువఁ బెట్టెను. ఇంతలో నీకార్యము సహింప నోపక వానితో వచ్చినరాజపుత్రులు వరలలో నుండితళతళమెఱయు కత్తుల నూడఁబెఱికి మహారాష్ట్రులపైఁ బడి నఱుకఁబోవఁ బ్రతివిధా నము నొనర్పఁబోవుతుకాజీమొదలగువారి వారించి, జమూను ఖాను వారిపై సింగపుఁగొదమచాడ్పున దుమికి యాపదుపురిలో సగమును దక్షణమే మృతి నొందించెను. తక్కినతురకలు రసపుత్రులఁ బోరిఁ గొనుటచేఁ దక్కినయేవురురసపుత్రులు నంతమడసిరి. వామనభట్టును జెఱబెట్టినవార్త దాతారావు విని యుక్కు దక్కి శవము వలెఁ గళకాంతులు లేక దీర్ఘోచ్ఛ్వాసములఁజేఁ దన యటమటము బ్రకటి తము కాఁగ నింక దనమరణము నిశ్చయ మని జెంగఁ గొనెను.

## ఇ రు వ ది య వ ప్ర క ర ణ ము.



హరిహరపాండ్యాజి తనహృదయమును దెఱచి మనోరథమును దెలియఁబఱచి బాజీరావు నాకార్యమునఁ బనిసేయు మని నియోగించినతరువాత శాయాజీమహారాజు మేల్కొని బాజీరావును జేరఁబిలిచియదివఱఁ కెన్నఁడుఁ జూపనిదయ నాతనిపైఁ జూపి మెల్లగానాతనితో నిట్లనియెను. "ఓరీ కుబ్జవాఁడా! నీవు నాకొకకార్యము జేయవలయును. సీతను నాకు వివాహము సేయుటకుగంగాభిల్లుమొదలగువారు నిశ్చయించినారు. కాని యామె కిష్టములేనట్లు కనబడుచున్నది. నామీఁద గాఢానురాగ ముదయించునట్లు నీవామెతోఁ బలుకవలయును నీవామెయొద్దకుఁ బలుమాఱు పోఁగలుగునటుల నేనుత్తరవు జేసెదను. నావంటిమహారాజు చెట్టవట్టి సుఖింపగలుగుట యామెకెన్నిజన్మములకైనను దొరకునా? ఇప్పుడీపర్వతముమీఁదనొంటరిగ నేనుండుట యామెకలక్ష్యముగ నున్నది కాఁబోలును. రేపు రాజ్యము స్వాధీన మైనతరువాతఁ దాను రాణి కావచ్చును. వెండి గొలుసులతూఁగుటుయ్యెలలోఁ దుల లేనిరత్నభూషణములు ధరించు యోగ్యత కామె నోచుకొన్నది కనుకనే తనవంటిదానిపై నావంటి మహారాజునకు ననురాగ ముదయించినది. నాకు శ్రీకొల్హాపురమహారాజుగారు సింధియామహారాజుగారు పిల్లల నిచ్చెద మని వర్తమాన మంపినారు. కాని నామన స్సీమెపైఁ దగిలి యున్నది. ఈమె నన్ను నిరాకరించినను బలిమిచే నైన నేనీమెపొందునొందక మానను కాఁబట్టి యీవివాహమునకు సమ్మతింపు మనియు ముందుగా నేను దానితోఁ గొన్నిరహస్యములు మాటలాడవలయును కనుక సమయ మెఱుంగఁ జేయు మనియు నామెతో నాపలుకులుగా మనవి చేసి యొడఁబఱచి రమ్ము. ఇదియెరికిం దెలియనీయవలదు. సుమీ" యన్ని

మహారాజు నడుమ శాజీరావు కొంచెము యోచించి. "మీసేన కుఁడ నగునేను మీకుఁ బ్రియమును జేయనా? ఆమెను హరిహర పాండ్యాజీకూడ మోహించియున్నాఁడు. వానిని మీరురహస్యముగఁ గడతేర్చితేని యీమెమిమ్ముఁ దప్పక వరింపఁగాదు నుఁడీ" యని విన్నవించుకొను మహారాజుఁబ్బి యీవేళ సాయంకాలముననే హరి హరునకు స్వర్గసుఖ మిప్పించెద చూడు నాశక్తియని ప్రతిన జేసి కుబ్జవానిని లోనికిఁ జననిమ్మని భిల్లులతోఁ జెప్పి మదనాయత్తచిత్తుం డై తహతహ బొందుచు శాయాజీ హరిహరుని జంపుటకుఁ గదలు చుండెను. జస్వంతరావుచేఁ దనబలము ముక్కముక్కలుగ ఖండిం పబడుటకు వగచి గండాభిల్లు ప్రభువును దమముందుపోకలఁ గూర్చి కఠినముగ నడుగఁ దలఁచి వచ్చి గుడారము సొచ్చి యిట్లనియె. "మహాప్రభూ! ఏలినవారికి బట్టాభిషేక మయినదిమొదలు జస్వంత రావు మాచుట్టములును మేకపోతుల నఱికినట్లు నఱుకుచున్నాఁడు. దాలతరావు త్వరలో వత్తునని చెప్పి యీవఱకు రాఁడయ్యె. మేము దోఁచుకొనివచ్చిన ద్రవ్యమంతయు వ్యయముచేసి హాయిగాఁ బిండి వంటలతో మీరు ముమ్మారు భోజనము సేయుచు మానిమిత్తము శ్రద్ధ చేసినారు కారు. మీరు పరాక్రమవంతులనుకొని యింతమహా పదవి మీకిచ్చితిమిగాని మొదటనే యింతవారగుటఁ దెలిసినచోఁ బట్టము గట్టింపకుందుము మాతో మీరు కలసి యుద్ధమునకు వచ్చె దరా లేదా?" యని నిష్ఠురోక్తుల నాడి భిల్లుఁడు నిలువ శాయాజీ వానిం గన్నెత్తి చూడ లేక తల వంచి మెల్లగ నిట్లనియెను. "నేను మిము నడపించి మీకు సేనానాయకుఁడనై రాజ్యముఁ గొన యత్నించుచుండఁగా నన్నిట్లాడఁ దగునా? వివాహమైనతరువాత గత్తిగట్టి యుద్ధముసేయవలెనని యున్నది అది యటుండ హరి హరపాండ్యాజీ మనపై రాణితో నేరములు చెప్పుచున్నాఁడఁట ఇతఁ

డున్నపక్షమున మనము నెగ్గఁజాలము. నీ వీరాత్రి వీనిని గడ తేర్చి వేని బెండ్లియైనవెనుక మన మనుగుడము" అని చెప్ప భిల్లుఁడు గోపముతోఁ గన్నులెఱ్ఱజేసి యుద్ధమైనతరువాత నీవువివాహమాడ వచ్చును. ముందుగా వద్దు. ఆదిగాక యీదినము నారెండవకొడు కును నాకు జయము కలుగుటకై కాళికి బలియిచ్చుచున్నాను. బలి యైనవెంటనే మనము వెళ్ళినచో జయమే గల్గును. తప్పు తప్పదు. హరిహరుఁడు మనపైఁ గుట్ర లెన్నఁడు జన్నకుండఁజేసెదనులే" యని గుడారము వెడలి యావలకుం జనెను. అతఁ డరిగినవెంటనే బాజీ రావు మహారాజువద్దకువచ్చి నిలిచి సంతోషముతో "స్వామీ! మీరు చెప్పినట్లు సీతతోఁ జెప్పినాను. మీవంటినవమన్మథుని మహారాజును జెట్ట పట్టుటకామె కిష్టముగ నుండక పోవునా? అన్నిఁటికి నామె యొప్పుకొన్నది కాని మీ రాగుడారమునకు రావలదనియుఁ దానే మగవేషము వేసికొని యీ గుడారమునకు రాత్రి వత్తుననియుఁ జెప్పుమన్నది. మీరు నన్నీదినముఁ జెఱ విడిపింపవలయును జుడీ. లేకున్న నేనిది చక్క జేయను" అని కర్ణానందకరముగఁ బలుక మహారాజుయొక్కశరీరము పులకరెత్త మనోరథసిద్ధి నేఁటికి గదా చేకురుట యని యానందమొందుచు నాతఁడు నిన్నీవేళ సాయం కాలముననే చెఱవిడిపించి పంపెదను భయపడకు నీమేలు నేను మఱువఁజాలను మిత్రుఁడా ! యని గాఢాలింగన మొనర్చి యభ్యం జనముచేసి నూతనవస్త్రాలంకృతుఁడై సూర్యుఁడెపు డస్తమించునా యని పరితాప మొందసాగెను. ఒకమారు బాజీరావును బిలిచి నీమాటలు నాకు నమ్మకముగఁ లేవు. ఆమెచే నట్లుసమ్మతమని పలి కింపుము అని వేడుకొనుటచే గుడారముపక్కకు మహారాజును గొనిపోయి బాజీరావు "సీతా నీవిందాఁక చెప్పినట్లు చేయుదువుగా" యని లోపలనుండి కేక వేయ నామెయు నిశ్చయముగఁ జేసెద

సందేహమేల ? యనిమృదుమధురస్వరముతోఁ బ్రత్యుత్తర మొసం గెను. అంతట గుండెదుడుకు తీరినందున శాయాజీబాజీరావునుబంపు ప్రయత్నము చేయుచు దాలతరావునొద్దకు నాతని నంపెదనని గండా భిల్లుతోఁజెప్పి గొండఁబఱచి పిల్లకిలి బోయులను సిద్ధముగఁ జేసెను. ఇంతలో సాయంకాలమైనందున సీత బాజీరావు చెప్పినదొప్పనమాట దప్పకుండ వర్తింపఁదలంచి చక్కని తెల్లయిజారును నట్టిదే యం గరఖాయు నట్టిదే తలపాగాయునుధరించుకొనిచేతనొకఖడ్గముంబూని తనగుడారమునసుండి సమయము బ్రతీక్షింపఁ దొడఁగెను. ఆరాత్రి సీతనిమిత్తము శాయాజీని సంహరింపఁ దలఁచి హరిహరపాండ్యాజీ రెండుజాములరాత్రి యైనతరువాత గాఢనిద్రాసమయమున వానిఁ ద్రుంపఁదగు నని ముందుగాఁ దాను నిద్రించుచుండెను. ఇంతలో గండాభిల్లు గండ్రగొడ్డలి భుజముపై వేసికొని యెవరితోడఁ జెప్పక హరిహరునిగుడారము సొచ్చి నిద్రాసక్తుఁడై తలనిండనున్న కోర్కె లచే గడియ కొకస్వప్నము గనుచున్న యానిర్భాగ్యునిఁగని గొడ్డలి నెత్తి సత్తువ మీఱ నాతనికంఠభాగమున నొకదెబ్బ దీసెను. వెంటనే శిరమును మొండెమును వేఱుగఁ దొలగింపఁబడ మొండెము కొట్టుకొనుటయు నెత్తుటిరుధిర ప్రవాహము గుడారము నింపుటయు భిల్లునినయనములకుఁ బర్వము సేయ నాతఁడు జుట్టుపట్టుకొని చచ్చిన వానితల యెత్తి తిన్నగా శాయాజీయున్న గుడారమునకుంజని వానిం గని "చూడు నీహరిహరుఁ డెట్లున్నాఁడో !" యని యారక్తసిక్త మగు బుఱ్ఱ వానితొడపైఁబెట్టెను అదిరిపడి శాయాజీలేచి గడగడ వణఁకి భిల్లుఁడలుక వహించెనేని దనపని యట్ల యగునని తలంపుమదికిఁ దట్ట మెల్లగా "నీవు సాహసుఁడవు. మంచిపనిచేసినావు. నీవంటివాని నెందుఁ జూడలేదు. మన్నెసుల్తాను బిరుదునీకుఁ దగునుమీ" యని వానినిస్తవమొనర్చి చల్లనిమాటలతో సాగనంపి తనపనిమీఁదఁ దానుండెను.

హరిహరుఁడు ధనమునువిడిచి, సీతనువిడిచి ప్రాణములువిడుచుటయు, సీత తనప్రాత్తున కంగీకరించుటయు, శాయాజీ బాజీరావును ముందుగఁ జెఱ విడిపించి పంపఁ దలఁచి పల్లకీఁ దెప్పించి బోయల సిద్ధము జేసి సీతతో మఱల మాటలాడుచున్న బాజీరావునుబిలిచిపల్లకి నెక్కుమనెను. వెంటనే గుడారమునుండి యొక విగ్రహము వచ్చి యందుఁ గూర్చుండ బోయ లొక్కముహూర్తములో వానిని మోసికొనిపోయిరి. అట్లు బాజీరావును బంపి సీతనిమిత్తమెదురుచూచుచు శాయాజీ మదనతాపము నొందుచు మాటిమాటికి నామె వచ్చుచున్నదేమో యని గుడారము వెడలివచ్చి చూచుచు మనస్తాపము నొందుచుండ నింతలోఁ దనమనోరథసిద్ధి జేయఁ దలఁచినపారిజాత వృక్షమువలె సుందరవదనారవిందము చీఁకటిగుడారమున వెన్నెలలు గాయగా వలయున్న భిల్లులు నిద్రించినవేళ కనాపురుషవిగ్రహముమహారాజుయొక్క గుడారము బ్రవేశించెను. ప్రవేశించినతోడనే యెదురుగ నేగి శాయాజీ యాభువనమోహవిగ్రహమును జేయి పట్టుకొని ముద్దుపెట్టుకొని తనమంచమునొద్దకుఁ దీసికొనివచ్చెను. ఆకపటపురుషుఁడును మెల్లగవచ్చి ప్రాణేశ్వరా! మిమ్ము వివాహమాడుటకు నాకు సందేహములేదు. కాని మీరు యుద్ధములు చేయుట కరుగుదురు. యుద్ధమున మరణ మొందుదురేమోయని నాకు భయము గలదుసుండీ యని పలికెను. హోల్కా రామెపలుకులకు సంతసించి నేను యుద్ధమునకుఁ బోవను. భిల్లులను మోసపుచ్చుటకుఁ గయ్యము సేయుదు నని నే నంటినే కాని యామాట యబద్ధము. నిన్ను విడిచి నేనెం దరుగుదును? ఇన్ని దినములనుండి నేఁ జేయుప్రయత్నములు సఫలము లయినవి. ఏదీ యొకముద్దుబెట్టు ప్రాణేశ్వరీ యని ముద్దు పెట్టుకొని చెక్కిలి నొక్కుచుండ నీవేషధారి యాకామాతురుని చెల్లున నొకచెంపవాయఁగొట్టెను. ఝల్లున నసాలమంటిన

యాదెబ్బతో శాయాజీకిఁ గన్నులనుండి బాష్పములు రా నది తుడిచి కొని మెల్లన నిట్లనియె. "సుందరీ! అబ్బా! ఇదేటిసరసమే గూబపగిలినది. మాటలతో సరసము కాని చేతులతో నేమిటే" యని, మందలించి యాసుందరిని గౌఁగిలింపఁబోవ నాటక్కరి తనమొలలోనున్న బాకు దీసి శాయాజీని నేలఁ బడఁద్రోసి కుడిప్రక్క నొక్కపోటు పొడిచి తత్క్షణమే యెరికిం గనఁబడక యెటకో చనెను. శాయాజీ యాపోటుతో కెవ్వున కేక వేయుటచే నార్తరవము నాలకించి గండాభిల్లు గండ్రగొడ్డలి భుజముపై వేసికొని వచ్చి పడియున్న శాయాజీని జూచి యాశ్చర్యమొంది మెల్లగ వానిని లేవ నెత్తి కారణ మడుగ నాతఁడు జరిగినవృత్తాంతమును సవిస్తరముగ నీరసముతోఁ జెప్పెను. ఆమాటలు చెవులసోఁక గండాభిల్లు మహాగ్రహమునఁ గన్బొమలు ముడివడ సాక్షునిరీక్షణములనాతనిజూచి, "దురాత్మా! నాతోఁ జెప్పక నీవిట్లు చేసితివి కనుక నీకింతే కావలయును. సీత జంపుట కాదు. నేను నిజముగఁ జంపివేసెదను చూడుము. నీవు నీచుఁడవు కాని రాజువు కావు" అని మాటలచే నొప్పించి జేతిగొడ్డలి నెత్తెను. అపరిమితబాధ పడుచు శాయాజీ యెట్లో లేచి భిల్లుని రెండుపాదములం బట్టుకొని నాతండ్రి నన్ను రక్షింపుము. నన్ను నిష్కారణముగ దొంత రావు గంగలో దింపినాఁడు. నాకేదైనఁ గట్టుగట్టి నాప్రాణములు దక్కింపుము. అని జాలికలుగఁ బ్రార్థనలు చేసి యేడ్చుటకు మొదలుపెట్టఁగా, గండాభిల్లు గొడ్డలి దింపి నిను నేను గట్టుగట్టుదు చావుమని తిట్టి గుడారము విడిచిపోయి సీతకై వెదకి యామెను బాజీరావుకు గూడ గానక విసిగి తనబస కరిగెను.



## ఇరువదియొకటవప్రకరణము.



మరునాఁ డుదయమున మంగళతూర్యరావములు సెలంగ నహల్యాబాయి మేల్కాంచి కార్యములు నిర్వర్తించి మహోత్సాహ పూరితమానసయై కోటముట్టడి జరుపుచుండ జమానుఖా నామెకు సలాముచేసి రాధాకాంతరావు వచ్చియున్నాఁడనియు రాణిదర్శనముం గోరుచున్నాఁడనియు విన్నవించెను. రాధాకాంతరావుపై సంపూర్ణముగ నలుక వహించిన దగుటచే రాణి జమానుఖానుతో, "నోయీ రాధాకాంతుని మొగము నేనింకఁ జూడఁజాలను. అతనివిశ్వాసమును గూర్చి మాకుఁ గల పిచ్చినమ్మకము పోయినది. శ్యామసుందరదత్తును వదలిపెట్టుమని గోమాజరావునకు జాబు వ్రాయుటయు రఘునాథ రావుతోఁ దాను జేరి నాపైఁ గత్తి బూనుటయు నాహృదయమున నాటినవి. అందుచే నాతఁడు నాకడకు రావలసినపనిలేదు. రఘునాథ రావుకొద్ద కరుగు మనరాదా?" యని యుత్తరువు జెప్పెను. చెప్పి ఖానుని వానిపనిమీఁద నంపెను. ఖాను వృద్ధుండగు రాధాకాంత రాయునిపైఁ దనయేలికకు వచ్చిననిర్హేతుకాగ్రహమునకు విచారించి తనశక్తిలో నాకార్యము లేకుండుటచే నప్పటి కూరకుండెను. రాధాకాంతరా వీయలుకకుఁ గత మేమయియుండునా యని కొంతతడవు విచారించి జమానుఖానుని బిలిచి తా నరిగినదండయాత్రలో జరగిన విశేషాంశముల నెల్ల నాతనికి రహస్యముగఁ జెప్పి రాణిదయను సంపాదింపఁ బ్రయత్నలోపము లేకుండ నింబపురమునందే నివసించెను. అప్పటికి నింబపురిముట్టడిలో రజపుత్రులకంటె మహారాష్ట్రులే జయము నొందువారివలెఁ గన్పడుచుండిరి. రాణి కందుచే రాజపుత్రులను జయింపవచ్చునను ధైర్యముదయించెను. ఆమెకు ధైర్యమును శత్రువుల కధైర్యము నొకమారె జనియించినందునఁ గడపటివారు జయమున

కుపాయములు వెదకుటమాని సురక్షితముగఁ బారిపోవుట కుపాయము వెదుకనారంభించిరి. రాజపుత్రసేనకుఁ దినుబడిసామగ్రియైనందున వారాఁకలికి నోర్వఁజాలక చిక్కులు పడుచుండిరి. కోటలోనికినీటిచుక్కయైనఁ బోనీయక యహల్యాబాయి నీటియాధారముల నెల్లఁ గప్పించెను. ఫిరంగులమూలమునఁ గోట భేదింపఁబడి రంధ్రములతో నిండియుండఁ జొచ్చెను. అందుచేఁ దమకు జయముగొందునాశ లేశమయినను లేదనియు నహల్య తమతో సంధి చేసికొనదనియు నుదయపురరాణావారు నిశ్చయించి పారిపోవుటకు మహూర్తము నిర్ణయించుకొనుటకు మొదలు పెట్టిరి. శత్రుపుబలమును గట్టుచు దనకుఁ జిక్కినందున నహల్యా వారి లక్ష్యములేక వారు లోఁబడినట్లెంచుకొని జస్వంతరావు గండాభిల్లును దక్కిన భిల్లులనెల్ల దాదాపుగ నిర్మూలించినట్లు విని యొక్క శాయాజీహోల్కారు విషయమై చక్కజేసికొనవలయునని నిశ్చయించి జమానుఖానుని పిలిచి శాయాజీయొద్దకు రాయబారము గైకొని పొమ్మని యానతిచ్చి యొకమూల పీనుఁగువలె నొదిగియున్న వామనభట్టునోటినుండి మహారాజు వసించు కొండ నానవాలు చెప్పించి తగుపరివారముతో నంపెను. నింబపురమున కాకొండ యొకవారముపయనములో నుండినందున జమానుఖాను రేయింబవళ్ళు నడచి శ్రమ యనక యెండ యనక కొండలెక్కి వాఁగులు దాఁటి యరణ్యములం గడచి మూఁడుదినములకు శాయాజీ యున్నస్థానమునకు వచ్చెను. నాఁటిరాత్రి శాయాజీ సరసమాడఁబోయి కత్తిపోటుదిని గండాభిల్లువద్దనుండి సహాయము నందక కొంతసేపు బాధపడి తనపరిక్కగుడ్డలలో నొకదానిని గాల్చి మసి చేసి తనగాయమునకుఁ గట్లు కట్టుకొని మఱియొకభిల్లుసాయమున మఱికొంత. యుపచారముచేయించుకొని గాయము కుదుర్చుకొని సత్తువ దెచ్చుకొని సమయము దొరకునేని దనకు రాజ్యము

గీజ్యము వలదని భిల్లులబారి నుండి పరతెంచి యేకాశిలోనైన ముష్టి యెత్తుకొని బ్రతుకవచ్చునని యత్నముగావించుచుండెను. పట్టాభిషేక మహోత్సవకాలమున దన్ను సేవించినభిల్లు లొక్కరొక్కరుగ దేశములపైఁ బడి జస్వంతరాయనిఖడ్గధారాగ్నికి మిడుతలగుటచేతను గొంద ఱాతనిధాటికి వెఱచి దూరదేశములకుఁ బాఱుటచేతను మఱి కొందఱు వనమృగములవలెఁ గొండగుహలలో దాఁగుటచేతను జమానుఖానువచ్చినప్పటికి రెండువందలకంటె నెక్కుడుభిల్లు లాపర్వతమున లేరైరి. ఆరాత్రి గాయమే తగులకయున్న బలవంతముగ గండాభిల్లు శాయాజీని దనతోఁ గూడ యుద్ధమునకుఁగొనిపోయి యుండును. రాజముఖదర్శనము సేయువారికేఁ గూడ నమితమైన భయమే కాని సాహసధైర్యములు గలుగకుండెను. జమానుఖాను రాణీదగ్గరనుండి సందేశార్థములు దెలుపవచ్చినాఁడని విని యామె యొడంబడిక చేసికొనును నియుఁ దనకు రాజ్యము పూర్ణముగ రాకపోయినను గొన్నిజాగీరు లయినను రాక పోవనియు శాయాజీ యువ్విళ్ళూరుచుండ నతనికి రాజ్యము గల్గినఁ దమకు నిలువనీడ చేకురునని భిల్లు లానంద మొంది ఖానుగారిని సగౌరవముగ నాదరించి సందేశము జరుపుటకు వారునిశ్చయించిరి. శాయాజీయుఁ దనపట్టాభిషేకకాలమున ధరించినదుస్తులను నాభరణములను దొడిగికొని శూరశిఖామణివలె మహారాజశీవితోఁ దన గుడారమునఁ గూరుచుండ నింతలోఁ దన పరివారముతో జమానుఖాను బ్రవేశించి మహారాజునజూచి తనలో నవ్వుకొని తలయూఁచి సమర్యాదగా నమస్కారముచేసి యర్హాసనముపై నాసీనుఁ డయ్యెను. గండాభిల్లు గండ్రగొడ్డలిని బూని తన మహారాజుయొక్క వామభాగమున నిల్చెను. అప్పుడు ఖాను హాస్యోల్కారుతో "స్వామీ! మీతో నేను గొన్ని రహస్యములు మాటలాడవలయును. మీభిల్లుల నావల కంపివేయు

వలయును. "మీకొక సందేహము లేకుండ నాతురకమహారాష్ట్రసేవకు లంగూడ నావలకంపెదను. మీరట్లు చేయుదురా" యని మనవి యొనర్చెను. అంతట భిల్లులు, మహారాష్ట్రయోధులు గుడారముబాసి దూరముగాం జన, శాయాజీయు జమానుఖాను నిట్లుమాటాడిరి.

జమా.—దేవా! మీరు రాణిగారి విషయమున నేదో సదుపాయమును జేయవలయును. ఆమెకు ముద్దులుమూటగట్టు నొక కొమార్తె కలదు గదా.

శాయా.—రాణికి నేను రెండుమూండు జాగీరులు మాత్ర మిచ్చెదను. నాకు రాజ్యమంతయు నప్పగించి యిందూరునగరము విడిచి యామె యరుగవలసినది. ఇటులొప్పుకొనకున్న నే నొడంబడికం జేసికొనను.

జమా.—పాపము దిక్కులేని యనాథురాలిని మీరింతశ్రమ పెట్టుట న్యాయముగాదు. మఱి యే షరతులనైనం నేర్పఱుపుఁడు.

శాయా.—ముక్తాబాయిని నాకిచ్చి వివాహము చేసిన యెడల నేనామెను రాజ్యమునందుంచి యన్నవస్త్రము లిచ్చి కాపాడెదను.

జమా.—పోనీ రాజ్య మంతయు మీ కామె వదలివేసినచో మీరామె కేమి యిచ్చెదరు? మీతోడను, మీభిల్లులతోడను నామె యుద్ధము చేయఁజాలదు.

శాయా.—నెలకు నొక వేయిరూపాయల మనోవృత్తి నిచ్చెదను. అంతకంటె నెక్కువగా నే నేమియు సదుపాయ మామె విషయమునం జేయం జాలను.

జమా.—ఆమె మిమ్ముం బెంచుకొన్నచో మీరు దత్తు లగుట కంగీకరింతురా?

శాయా.—ఏమో ఆలోచించి చెప్పవలెను. ఆమె నాకుం దల్లి యగుట శ్రేయము కాదు.

జమానుఖా నెందుచేతనో కడుదీనముగా మాటలాడుటఁ జూచి శాయాజీహోల్కారు తనకు వారు జంకినా రనుకొని గర్వించి యంతకంతకు నిర్లక్ష్యముగఁ బల్కనారంభించి యావల తన బాహుబలమును దానె ప్రశంసించుకొని జమానుఖానుతో, "నోయీ నీవాడిన మాటలు నాకు మహానందమును గలిగించుచున్నవి. నీవు మా యెడ నెంతభయభక్తులతోఁ బలుకఁబట్టి నిన్నిట్లువిడిచితిమి కాని కొంచెము గౌరవ హీనముగాఁ బల్కితివేని నిన్నిక్కడ మట్టు వెట్టుదుము. నీ వదృష్టవంతుఁడవు. చెడ్డటక్కరివి. ఎవరివద్ద నెట్లుమాటాడవలయునో పరిపూర్ణముగ నెఱుఁగుదువు సుమీ!" యన ఖానునకు నిలుపలేనంత యాగ్రహము పొడముటచే నాతఁడు దిగ్గున లేచి, "నేను మీపరాక్రమ మెఱుఁగుదును. మీరు చెప్పవలెనా" యని యాతని రెండుభుజములు పట్టి గట్టిగ నొక్కి చేతిలోనున్న ఖడ్గము నూడఁబెఱికికొనెను. తెల్లబోయి శాయాజీ నోరెత్తకయుండ "ఖాను నిన్ను రాణి తీసికొని రమ్మనినది రా" యని నేలకుం దోసి రెండుచేతులు వెనుకకుఁగట్టి గుండెలపైఁ గత్తిమోపి, "దురాత్మా నీవు హోల్కారువా! నిన్నిపుడు నేను దుదముట్టించెద. నీకు దిక్కెవ్వఁడురా" యని యొక్కయేటున వాని నేయఁబోయి యంతట నిలిచి రాణి కాతని జీవముతోడ నుండఁగ నర్పించుట యుచితం బని పల్లకిఁ దెమ్మని తన భటుల కానతిచ్చెను. ఇంతలో నీసంరంభమును జూచి నూతిలోఁ బడిన వాని లాగు శాయాజీ వేసిన కేకలు విని గండాభిల్లు తన మూఁకలం దోడికొని తురకను నలుకుటకు వచ్చెను. భిల్లుల యట్టహాసమును సైరింప నోపక ఖానుయొక్క యంగరక్షకసేనలో నున్న ముప్పదుగురు మహారాష్ట్రులు నిరువదిమంది తురకలు నదివఱకే తుపాకులలో మందు దట్టించినందున నొక పెట్టున వచ్చి గుడారపు గుమ్మముకడ నిలిచి భిల్లులను లోని కరుగనియ్యరైరి. భిల్లసైన్య

ప్రవాహము మహారాష్ట్రబలమునగట్టుచే నాఁపఁబడినందున శాయాజీ నిర్విణ్ణుఁడై భోరున నేడువఁ బ్రారంభించి తన్ను వదలుమని ఖానున కనేక భంగుల వేడుకొనెను కాని ఖానుని హృదయము రాజద్రోహుల విషయమున పాషాణమువంటిది యగుటచే వాని దీనాలాపములు వాని డెందమును గరగింపనేర వయ్యెను. అప్పుడు కుపితులగు రెండువందల భిల్లులకును నేఁబదుగురు మహారాష్ట్రసైనికులకును ఘోరయుద్ధము జరిగెను. మనుష్యులు మనుష్యులను గొట్టుటయటుండ ఢమ్ముఢమ్మున ప్రేలు మహారాష్ట్రుల తుపాకులగుండ్లును రివ్వురివ్వున వచ్చు భిల్లుల యమ్ములును నొండొంటితో వియ్యమొందసాగెను. తుపాకినుండి వెడలిన ప్రతిసీసపుగుండు నొక్కొక్కని ప్రాణమును గొనుటచే జస్వంత రావుచే హతముగాఁగ శేషించిన భిల్లప్రపంచమున కది ప్రళయకాలమయ్యెను. ఆదినమున నూఱుగురుభిల్లులు యుద్ధరంగమునకు బలియైరి. ఒకతుపాకిగుండు గండాభిల్లుయొక్క చెవికిఁ దగిలి దూసికొని పోవుటచే నాఁతడు రణరంగమును విడిచి వెంటనే ప్రాణరక్షణార్థమొక కొండగుహలో నిక్కఁ జనెను. యజమానుఁ డరుగ గొఱ్ఱెదాఁటువలె భిల్లులందఱు నొకరివెంట నొక రరిగి యరనిమిషములో రణభూమి నిర్మానుష్యముగాఁ జేసి శాయాజీయొక్క హృదయమును గూడ ధైర్యశూన్యమగునట్లు చేసిరి. మహారాష్ట్రసైనికులు హతులయిన భిల్లులపైఁబడి వారికడనుండిన గొఱుకొమ్ములను నేనుఁగు దంతములును మొదలగువానిం దోఁచుకొని యుద్ధాంతమందు జరుగ వలసిన పూర్వాచారమగు దోఁపిడున్నదనిపించిరి. తరువాత నొక ప్రాంతపల్లకిలో శాయాజీని గూర్చుండఁబెట్టి జమానుఖాను స్థలమును విడిచి ప్రయాణము సాగించెను. ఈ ప్రయాణములో శాయాజీ తన యుత్కృష్టద[illegible]ండి తప్పించుకొనుటకుఁ జేతనయినంత యత్నము సలిపి కృతకృత్యుఁడుగాక ప్రాణములు వారి కప్పగించి యాశ్వాసుని

పయి భారమున వైచెను. జమానుఖాను మూఁడు దినములకు నింబ పురమునకుం జని తన ప్రజ్ఞాదికములను దెలియఁజేయ నామె వానిని బహువిధముల మెచ్చుకొని యొక రత్నపుటుంగరమును బహుమానముగ నొసఁగి తన యెదుటకు శాయాజీని రప్పించెను. సిగ్గువరితిము లాగున బద్ధుఁడై యున్న వానిని జూచి రాణి, "పూజ్ఞాత్రి సిట్టియుపస్థలో నుంచుట నా కిష్టము లేదు. నాకీ సరిసము లేదు. నాకు మనోవృత్తి నియ్యఁ జాలినవాఁడు. ఈతనిని గౌరవింపక యవమానింప నా మనస్సు తాళ" దని పల్కి బంధవిమోచనము జేయించి యొకపీఠముపైఁ గూర్చుండఁబెట్టెను. ఆ పలుకులకులికి శాయాజీ జమానుఖాను చేసిన యన్యాయమునుగూర్చి రాణితో ముచ్చటింపఁదలంచి రాణి తన పక్షమున నున్నదని నమ్మి యిట్లనియె. "మన మిరువురము సమానులమయి యేకకుటుంబములోఁ జేరిన వారమయితిమి. అట్టి నన్ను నాగౌరవము నెంచకుండ నీతురక చేతులు విఱిచికట్టి యిట్లిపుడు తెచ్చుట మీ రంగీకరింతురా? ఈతఁడు నన్ను మీ దగ్గఱకుఁ దెచ్చుటలో నీతని గొప్ప లేదు! నేను రావలెనని కోరుచుండఁగఁ దాను మీచే సన్మానింపఁబడుటకు నిట్లు ప్రారంభించినాఁడు తల్లి" అని మనవి యొనర్ప రాణి తలయూఁచి సరే యావిషయమయి నేను విచారణసల్పెదఁగాక! నీవాఁగుడారమున నుండుము. అని యామె నతిచ్చి విచ్చుకత్తులతో నుండు పచ్చితురకలఁ గావలియుంచి సురక్షితముగ నాతని నా గుడారమున నుంచెను.

# ఇరువదిరెండవ ప్రకరణము.



శాయాజీహోల్కారను నామధేయము నొసఁగి యాశ్ల వానిని బయికిఁ దెచ్చుటలో దౌలతరావుయొక్క ముఖ్యోద్దేశ మొక్కటియు జరిగిన దొకటియు నయ్యెను. క్రొత్తహోల్కారునకుఁ బట్టాభిషేక మగుటఁ బ్రజలు వినినతోడనే యహల్యాబాయిని విడిచి తమవద్దకు వత్తురనియు రాణికిఁ గష్టము గట్టుననియు రాణి జంకి రాజ్యము విడిచి పోవుననియు నతఁడు గొంతెమ్మకోరిక్కతో నీకార్యము గావించెను. తరువాతఁ బ్రజలు తన మొగము జూడక పోవుటయుఁ గొందఱు దురాచారులుమాత్రము తమ్ముఁ జేరుటయుఁ జూచి దౌలతరావు బెంగగొని రసపుత్రులతోఁ జేరి వారికేవిధమైనసాయము సేయఁజాలక పట్టినపట్టు వీడవలదని ప్రోత్సాహము సేయఁదొడఁగి మరల శాయాజీయొక్క మొగముజూడక భీలులఁ దలపెట్టక యేమి చేసినను రాజపుత్రులే దిక్కని వారిని నమ్మియుండెను. తమ రాణి పయిఁ దిరుగుబాటుచేసిన కొందఱునామధేయులమాటలునమ్మి రాణి ప్రాణ మెఱియక యట్లు దేశముపై దండువిడియుటకును లంచము దని గోమాజీరావు సహాయ మొసంగనందులకు దౌలతరావు మాటలు చెప్పుటయే కాని చర్యలు జరపలేనందులకు నుదయపుర రాణావారు మిగుల నొచ్చుకొనుచుఁ బశ్చాత్తాపముఁ బొంది యాఁడు దాసిని గెలువలేక వచ్చినాఁడని రాజపుత్రకుటుంబములు తన్ను దెప్పునని విచారింపసాగెను. అట్లు పశ్చాత్తప్తులగు మహారాణా వారిపాదసన్నిధికి వచ్చి నిల్చి భీతాళసింగు నమస్కరించి యిట్లనియెను.—"దేవా! ఈదౌలతరావు మన కుండి యేమి లేక యేమి? ఈతని నేల సా[illegible]ంపరాదు. అదియటుండ నేను దమకార్యమునకుఁ బ్రాణములనైన విడిచెద. నేను గోమాజీరావు మాటలునమ్మి మిమ్ము

బోత్సాహపెట్టి యిటకుం దీసికొనివచ్చితి. అందుచేత నేనీరాత్రియొక యద్భుతముజేసి తమకు జయము చేకురంజేసెద. నాకనుజ్ఞమాత్రిము సంగుడు." అని రాణిచెవిలో నొకరహస్యముజెప్పి యాతనిసమ్మతి వడసి తనప్రయత్నముసం దానుండెను. అంతట వైరానలముచల్లారిన దని యెఱింగింపనో యన నెండ చండతమాని యగుపడదయ్యెను. దేశ మంతయు వేఁపి మాడ్చినశత్రుమండల మిదెకురింకుచున్నదని సుదు; ఃజాధిమునుఁగుచున్నదనియుఁజాట నాభానుమండల మపరజలధిఁగ్రుం కె. శత్రువు" చండతేజంబడఁగిన వెనుక సన్మార్గవర్తులగుధవళయశు లనేకులుందురని వెల్లడిసేయు తెఱఁగున నంబరముస నక్షత్రకోటులుద యించె. అదికృష్ణపక్షమగుటచే వెన్నెలమాత్రము లేదయ్యె. ఆరా త్రిజామయినతరువాత ముక్తను నిదురబుచ్చి యహల్యాబాయిదగ్గఱ నున్న యాస్త్రీనిజూచి యమునా! నీకింతవిచారమెందుకు? ఈయుద్ధము ముగిసినదిగనుక శివనానానబిలిచి నీకుమారునివదలించుటకు నేమియ భ్యంతరమున్నదో యడిగెదను. నీవిట్లువిచారింపకు. ఆహా!కడుపుతీపిని మించిన దేదియు లేదుగదా. ఇన్నిదినములుగడిపితివి. ఈరాత్రికూడ గడుప్పము. నాకునిద్రవచ్చుచున్నది. నీవుమేలుకొనెదవాయనియడుగ "నమ్మా నాకు నిద్రవచ్చునా? ఇన్నిదినములనుండి యన్న మెట్టిదో యెఱుఁగను తల్లీ! నాకుఁ బుత్రబిక్షబెట్టవేని యింక మృతినొందుదు సుమీ యమ్మా" యని రాణి పాదములపైఁ బడి కొంతసేపు విలపించి లేచి తనప్రక్కపైఁ గన్నులు దెఱచి పండు కొనెను. ఉహల్యాబాయియనముక్తమనఃకంటకమైపోయిగగుండెపై జేయివైచుకొనినిద్రించెను. చాలతరా.వారాత్రినిద్దురలేక తనయవస్థ దలంచుకొని యింకఁ దన కెట్టియాసయు లేదని యేమియుందోఁచక యిటునటుఁ దిరుగుచుఁ గొంతసే పొకచోటఁగూరుచుండి యిట్లనివిల పించెను. "హా నేనేలరాజద్రోహము జేసితిని. చేసినవాఁడ నిందుసెరవే

జన్నైతి. ఈరసపుత్రులు నన్ను నమ్ముటలేదు. ఏసహాయమును వారికి సలుపలేని నావంటి యప్రయోజకునియందు నమ్మకము వారేలనిల్పుదురు? ఆకమలపైఁ నాకావెట్టిమోహ మేలయుదయింపవలయును! నా భార్యా! హాదుర్గా! దుర్గా! నేనేనీగొంతుంగోసి నాగొంతుంగోసికొంటిని. ఇంక నీసుందరవదనదర్శనమును నీమధురాలాపము లాలకించుటయు నాకు లేదు. భిల్లులతోఁజేరి యచ్చటనుండక యేటికిచ్చటికివచ్చితిని ? వీరునన్ను గదలనీయరు. నాభార్యచేసినహితోపదేశమును మండోదరీ వాక్యమును నిరాకరించిన రావణునివలె నిరాకరించి యిట్టిముప్పు దెచ్చిపెట్టుకొంటిని. నేనుజచ్చుచు నిరపరాధియగు శాయాజీ యనుపేరుఁగల యీ కుట్టువాని ప్రాణముల దీసి వానిని గోతిలో బడఁద్రోక్కి బిచ్చమెత్తుకొనినైన బ్రతుకకుండఁజేసినాఁడను. ఇప్పు డొకవేళ రాణి పాదములపైఁబడి క్షమార్పణజెప్పుకొన్నచో లాభముండునేమో? ఏమినా వెట్టి! నావంటిద్రోహిని రాణి బ్రతుకనిచ్చునా? హా దుండిరావా! నాజీవనమున కుసూరుమనుచు నీవెందున్నావు? హా దైవమా! నేను బాపినగుటచే నాకీమరణమనఁ గడుభయముదయించి యీలొండిబ్రతుకు బ్రతుకవలెనని యున్నదిగదా" ఇట్లు పశ్చాత్తాపమొందుచుండిన దాలతరావుకొద్దకు హఠాత్తుగావచ్చి, "నీతోఁగొంచెముపని యున్నది. రాణావారు నీతోఁ గొన్నిరహస్యములఁ జెప్పుమన్నారు. ఒకమాఱు కోటబురుజుమీఁదికి రా" అనిభేతాళసింగు వానింబిలిచెను. కోటలబురుజుమీఁది కొంటరిగనేగుటకిష్టములేనివాఁడయ్యు నెట్లైన దప్పదుకదా యని సింగువెంట నియమితస్థానమునకు విధిలేక నడచిపోయి దాలతరా వెక్కలేక యెక్కలేక బురుజుపైనెక్కి కోటక్రిందికొకమారు తనదృష్టి బఱపెను. వెంటనే మహానరకమువలె నగాధమైయున్నకందకమును దిమ్మని దెసల నావరించినయంధకారమును మహారాష్ట్రునకు భీతిగలిగించినందున నాతఁడు గజగజ వణఁకఁజొచ్చెను.

ఇంతలో భైరవసింగు వచ్చి వానింగలిసికొని దౌలతరావును బాదాపు గఁ బ్రాణములు లేనివానిగ నొనర్చెను. వానిభయమునుజూచి నవ్వి భేతాళసింగు "నీకింతభయ మేల? నేను నిన్ను సలహా యడుగుటకుఁ దీసికొనివచ్చితిఁగాని నీకు హానిచేయుటకుఁ గాదు. అహల్యాబాయి సైన్యమునఁ గలకలము పుట్టినది. వారు పరుగెత్తుచున్నట్లున్నారు చూడు. నావ్రేలిచాయపై నిదానించిచూడు" అని రెండవవ్రేలితో రాణిసైన్యమున్నచాయ నాతనికిఁ జూపెను. దౌలతరావు వెఱ్ఱివెఱ్ఱి చూపులఁ జూచుచు వానితో "వారు నాకగపడుచున్నారు. పారిపోవు చున్నది నిజమే"యని యుత్తరమిచ్చునంతలో భేతాళసింగు భైరవ సింగును మెల్లన గోకెను. తోడనే భైరవమహాప్రభుఁ డగుభైరవసింగు ఖడ్గమును దీసి యొక్కవ్రేటున సకలకలహాకారుఁ డగుదౌలతరావు శిరముఁ దెగవ్రేసెను. మారుమాటలేక మహాప్రభుఁడు బురుజు పైఁ బడె. భేతాళసింగు నిర్దయుఁడై గుబాలున నాతని నత్యలోకము నకుఁ ద్రోసినట్లు కందకములోనికిఁ ద్రోసివైచి వెంటనే యాతని స్థూలకాయము దడదడ దొర్లుచుండ భేతాళసింగు మహానంద మొందుచు వాని మొండెమును గనులపండువుగఁ జూచుచు భైరవ సింగుతో "మిత్రుఁడా! లంచముసొమ్ము మనమే యపహరించితిమని యీదురాత్ముఁడు రాణితోఁ జెప్పునని నాకనుమానము గలిగినది. అందుచేత నింతపని చేసినాఁడను. ఇక మనము సేయదలంచిన రెండవకార్యమున కరుగుదము రమ్ము" అని బురుజులు దిగి పాణి ద్వారము దాటి కోట వెలువడిరి. అప్పుడు సరిగా రెండుజాము లయ్యె. ఉభయసైన్యములయందుఁ గావలి గాచు భటులు దక్క తక్కినవారందఱు నిద్రించుచుండిరి. శత్రువులు పరాజితులై రేపో మాపో నింబపురమును విడిచిపోవుట కుద్యుక్తులైయున్నవారని విని యహల్యాబాయి సేనయంతయు నిద్రించుటయే గాక కావలి గాచు

యోధులుగూడ నిద్రకు లోఁబడి నడుమ నడుమ నులికిపడి చేతులతోఁ దుపాకులం బట్టుకొనుచు నొడ లెఱుంగకుండిరి. రాణి గుడారమున యున్న యమున యను నాసుందరి కుమారయోగముచేతనో మఱి యెందుచేతనో కునుకు లేక పలుమాఱు తెరగదిలోనుండి రాణి గదిలోనికి కరిగి యహల్యను ముగ్గాగా ఖుని బరీక్షించి చూచుచు గుడ్డ తలుపులం దెఱచి యావల కరిగి యడుగులచప్పు డగుచున్న దేమో యని యాలకించుచు మనస్స్థిమితము లేక తిరుగసాగెను. ఒకమాఱామె వీథిలోనికి రా జమాలఖా నామె సూత్రముగ గని యేదియో నేఁడు జరుగనున్నదని నిశ్చయించి నిద్రవిడిచిపెట్టి భద్రముగనుండి యామెలక్షణముల నొలఁకువతోఁ బొడఁగనుచుండెను. ఆమె నాలుగుసార్లు గుడారముయొక్క వెనుకనమ్మము దాఁటి యావల నిల్చి యేమి గానక గుడారమున కరిగి కొంతసే పచ్చట విశ్రమించి యైదవసారి గుమ్మము జేరునప్పటి కామె పాదముల కేదియో తగులొక్కెను. సర్పము కాలిని జుట్టుకొన్న దేమోయని భయపడి తొందరతోఁ గాలువిదలింప మెత్తని యామెపాదములకు దృఢమైన మనుష్యదేహము తగిలెను. అది యేమని యామె వంగిచూడ నొక మనుష్యుఁడు మెల్లఁగా "నేను. భయపడి కేక వేయకు. యమునా లోపలికి రా" యని పలుక నామె తొట్రుపాటుతో వచ్చినావా వచ్చినావా లోనికి రాయని తాను మునుముందు గుడారముఁ బ్రవేశించెను. వెంటనే యామనుష్యుఁడును తనతో వచ్చిన తన మిత్రుని గూడ లెమ్మని యిరువురును యమునయున్న స్థలము జేరిరి "యమునా! భోగముదాన వన్న నీవే భోగముదానవు. నిన్ను నే నంచుకొన్నందుకు నాసొమ్ము నీ వింతకాలము దిన్నందుకు నాకీ రాణిగుడారము బ్రవేశింప వీలు చేసితివి. నడచివచ్చినచో మనుష్యవిగ్రహము నానవాలు పట్టుదురని నేను వీఁడును నేలఁ బండుకొని దొర్లిదొర్లి

నచ్చినాము. ఇంక మేముకృతకృత్యుల మగుదుము. ఐనను దైవ మేమి చేయునో యని యమునయొక్క నిద్దంపుచెక్కుటద్దములు ముద్దుపెట్టుకొని లోపలికిం దమ్ము దీసికొని పొమ్మని యామె నడుగ నామె మార్గప్రదర్శకురా లయి వారి నహల్యయున్న గుడారమునకుం దీసికొని పోయెను. వీ రిరువురు యమునాసమేతముగ లోని కరుగు నప్పుడే మఱియొక పురుషుండు జోడుతుపాకులను మందుకూరి సిద్ధముగ నుంచుకొని యహల్య నిద్రించు గుడారమునకు వెనుకప్రక్క నున్న గమ్మముచాటునం బొంచియుండెను. క్రొత్తపురుషులలోం బ్రథముండు గుడారము నంతయుం బరికించి యొక మెత్తనిపాన్పుపై శరీరమును మఱచి జన్మాంతరాయని తలంచుకొని పలువరించు ముక్తాబాయి ముఖారవిందముం గాంచి నేను దీని జోలికిం బోవను. ఇది పసికూన యని యామెను గడచి రాజకార్యాంశముం బలువరించుచు నొకమూల బ్రహ్మచర్యవ్రతము జరుపుటం దెలియంజేయ నొక చాపపై మృదుబాహువు తలగడగం జేసికొని పవళించిన రాణిం జూచి, "యీయామెయే మన రాణావారి హృదయశల్య మగు నహల్య. ఈమెను గడతేర్చెద" నని వెండిదీపస్తంభముపై వెలుంగుదీపిక నుఫ్ఫున నూఁదివేసి యహల్యకు దగ్గఱ వచ్చి గుమ్మముముందఱ కావలి యుండుమని రెండవవాని కానతిచ్చి మొదట ఖడ్గసాధనమున నామెను దునుముటకుం దలంచి కత్తి యెత్తెను. కాని యొక్కపోటున కామె చావవచ్చుం జావకపోవచ్చు. చావకుండినచో నల్లరి యగుం జుమీ యని యమున సమయానుకూలముగం జెప్పిన యాలోచనము బట్టి యాతండు తుపాకి నుపయోగింపం దలచెను. ఆపురుషుండు తుపాకి బారుచేసికొని రాణియొక్క కుడివైపున మోకాళ్ళు నేలవాల్చి కూరుచుండం నాతనికి సరిగ నెదురుగ యమున సమయమునకు రాణిని గదలకుండం బట్టుకొనం దలంచి రెండవప్రక్కను గూరుచుండెను. అంతట

నాతఁడు తుపాకి రాణిగుండెపై గురిపెట్టి యింతకంటె నెమకుక్షణము గొట్టినవో మఱి మాఁటాడక పరలోకయాత్ర కామె వేంచేయునని యాగురి మార్చి కణతకుఁ బెట్టి జాగ్రత్తయని యమునతోఁ జెప్పెను. ఆవల రెండుతుపాకులు గైకొన్న పురుషుఁడు కూడ రాణిపైనే గురినిల్పి తెప్పవాల్పక చూడసాగెను. యమునయు మెల్లగ నహల్యాబాయిపైఁ జేతులు వైచెను. వైచిన తక్షణమే గుభిల్లు మని తుపాకినాదము వినఁబడెను. ఆధ్వనితో దద్దరిల్లి మహారాష్ట్రసైన్యమంతయునిద్రనుండి ప్రబోధింపఁబడి శివనానా, తుకాజీహోల్కారు మొదలగు సేనాపతులు సకలయోధులు కలవరపడి లేచి హాహాకారములతో రాణిమృతినొందినది రాణిమృతినొందినది యని యఱచుచు నామెగుడారమును జేరిరి. సైనికు లందఱు నాక్రందనధ్వనులతో నానాముఖములనుండి రాణిగుడారమువై పరుగసాగిరి. శివనానా కన్నీళ్ళతోఁ గావలివాండ్రఁ దిట్టుచుఁ గొట్టుచు మీయజాగ్రత్తచే నేఁడు రాణి చచ్చినదిరా దున్నపోతులారా వెధవలారా పశువులారా మిమ్ము నందఱఁ జంపెదను జూడుఁడీ. అయ్యో యనిదుఃఖించుచులోనికరిగి దీపముదెప్పించి యతిదీనముగఁ బడియున్న యొకయాఁడు శవమును గాంచి యోతల్లీ! యని యామెపైఁబడి యేడువనారంభించెను.

---

## ఇరువదిమూఁడవ ప్రకరణము.

అహల్యమృతినొందినవార్త శ్రవణానందకరముగవిని శాయాజీహోల్కారు తనకింకసింహాసనము దప్పక యీయఁబడునని యాసజ నింపఁదన దురవస్థను మఱచి, "యామెను నేను దహనముసేయవలె

ను. సన్నిహితజ్ఞాతియుండగ మఱియొకఁడు వల్లకాదు. నన్నువదలం డీ"యని భటులను వేగిరపెట్టెను. కాని వారు జాగరూకులై వానిని గాని వానిసహభృత్యులనుగాని విడువరైరి. శాంతేయముకనిదానమగునాంలో చనమునకు ప్రసిద్ధికెక్కిన తుకాజీహోల్కారు సుడారముఁ బరివే ష్టించి యేమ్పుచున్న శివనానాను గనఁగొని వారించి యాస్థలమును బకిరించి తనగంభీరస్వరముతో నిట్లనియె-"రాణిగారు సురక్షితులై యున్నారు గడబిడవద్దు. భయములేదు. ఈ యమున చచ్చిపడియున్నది. ఆమెప్రక్కను రాజపుత్రుఁ డొక్కఁడుకూడఁ బడిచచ్చినాఁడు. ప్రాయశః వీఁడు భేతాళసింగయియుండును నూరకొనుండీ" యని పలుకఁ బరిజనులు నిశ్శబ్దముగ నుండిరి. శివనానా యామాటల నాలకించి యాశ్చర్యముతో నా రెండుశవములను నిదానించి చూచి కలవలపాటుచే లేచి జడిసిన బాలహరిణమువలె నోటమాటలేకయున్న కూఁతు వీఁపుపైఁ జేయివైచికొని కూరుచున్న యహల్యనుగాంచి, అమ్మా మీరు బాగున్నారా యని పాదములపైఁబడి రోదనముచేసెను. రాణి వానిపైఁదనచల్లనియభయహస్తమువేసి, యీపాపిణిదాని కీఁడుచేసెనో కాని నేనీగడియవఱకు బాగున్నాను. తనకుమారుని నీవుచెఱలోఁ బెట్టితి వను నొక వంకబెట్టుకొని యీయమున దురాత్మురాలు శత్రువులచేఁ జంపఁబడినది కాఁబోలు. నేఁ డిది యెఱుఁగక దాని మాటను నమ్మి లోన నుంచినందులకు నాపని బట్టినది. వీఁడేనా భేతాళసింగు. వీనినిగూర్చి పలుమారు విన్నదానను. వాని చావునకే వాఁడిందువచ్చె నని పలికి తానును ముక్తయు నంటఱు కగుపటుకు సుడారము ముందటికి వచ్చి నిలిచి వెలుతురు వచ్చుటకు నెగళ్ళువేయించిరి. అప్పుడు రాణి సజీవురాలయి యున్నదని తెలియుటచే శామూజీకి నిలువునఁ బ్రాణములు పోయెను. అప్పుడు తుకాజీహోల్కారు రాణితో, "అమ్మా! యీ మహాపకారమును

జేసినవాఁడు మనజమానుఖానయి యుండవలయును. ఏఁడీ యాతఁ డెక్కడనున్నాఁడు రాఁడేమి? యని నలుదెసలంజూచి యాతనింగానక యతఁ డొకవేళ శత్రువులచేఁ జిక్కెనేమోయని భయపడసాగెను. అంతలో వారియెదుటఁ జుట్టుజరీపట్టెలుగల యెఱ్ఱతలపాగ జుట్టుకొని పచ్చపట్టుషరాయి సర్వపట్టు నిలువుటంగీ తొడిగికొని తన యాకారము నెగళ్ళవెలుతురులో నొక వింతకాంతినొంది ముద్దులు మూటఁగట్టి నొక క్షాత్త్రవిగ్రహము నిలిచెను. అంత నాశ్చర్యనిమగ్నమానసులై వాని మొగమును జూచి "ఏమిరా! శ్యామసుందర దిట్లువచ్చినాఁడేమి? నీ వింతకాలము నెచట నున్నాఁడవోయి" యని యడిగిరి. అహల్య వానిని దప్పక చూచి నీవిక్కడనే యున్నావా యని వానిని బలుకరింప "అమ్మా! నిరపరాధ యగు శ్యామసుందరుఁడే జమానుఖానుఁడండీ" యని యేలికకును నమస్కరించెను. ఆనంద బాష్పములతో వానినెత్తి రాణి "నాయనా! నీమూలమున శాయాజీ మాచేతఁ బడినాఁడు. నీమూలముననే నేనును గూఁతురును భేతాళసింగుపాలఁ బడక బ్రతికితిమి. నిరపరాధివగు నిన్ను నిర్హేతుకముగ నురిదీయింప యత్నించి తుదకు రాజ్యమునుండి తఱిమితిని. నా యపరాధము నీవు సైరింపఁదగుఁ జుమీ నాయనా" యని యాతని మందమందమృదూక్తులతో లాలించెను. శ్యామసుందరుఁడా పలుకుల కలరి "అమ్మా! నే నెప్పుడును రాజభక్తి యందుఁ దీసిపోవనివాఁడనే. నే నాదినమున నురిదీయఁ బడుటకు సిద్ధముగ నుండియు జస్వంతరావు గారి వసంతగృహమున వారందఱుఁ జేరుదురని మీకుత్తరముఁ బంపితి. అందువల్లనే కదా మీరు వారలం బట్టుకొనఁ గలిగినారు" అనెను. ఆమాటలు విని యచ్చట నున్నవా రందఱు నాశ్చర్యము నొంది దత్తుయొక్క రాజభక్తిని వేనోళ్ళఁ బొగడసాగిరి. ఇంతలో నీకోలాహలము నాలకించి రాధాకాంతరావు వినయసంభ్రమములతో నేలిక

యెదుటకు నరుగుదెంచి చేతులు జోడించి “అమ్మా! యిదే రాధా కాంతుఁడు. కనువిచ్చి చూచి రక్షింపుమీ” యన దేవి వాని మొగమును జూచి నీరఘునాథరావును విడిచినా వేమని యడిగెను. తనపై రాజద్రోహమును హేయమైన నేరమును స్థాపింపఁబడినందునఁ గొలఁకులకుండి కన్నీరు గారఁ దన వృద్ధశరీరము వడఁక నతఁ డిట్లనియెను. తల్లీ! గోమోఁజీరావునందు మీకు మిక్కిలి నమ్మకము కలదు గాని యాతఁడు ద్రోహి. అతఁడు తమ ప్రతికక్షులలోఁ జేరి కృతజ్ఞుఁడ నగు నన్ను మీసన్నిధినుండి సాగనంపఁ దలంచి రఘునాథరావు వచ్చుచున్నాఁడని మీతోఁ జెప్పి నన్ను దూరదేశమున కంపెను. నేనెంత కాలము కనిపెట్టుకొని యున్నను రగోబా కాని యాతనిబలము గాని నామీఁదికి రాదయ్యెను. తుదకాతఁడు దండెత్తి రానిశ్చయించుకొనలేదని నాకుఁ దెలిసినది” రాణిచెవులకీమాటలు వినిపించినతోడనే విశేషాశ్చర్యమొంది రాధాకాంతునితో “సరే! నీవు దత్తు నన్యాయముగ వదలిపెట్టుమని గోమోఁజీరావునకు లేఖవ్రాసినావు. తరువాతరఘునాథరాయునివద్దనుండి నీకువచ్చిన జాబుకూడ మాకుదొరకినది. అందుకేమి యుత్తరము చెప్పెదవు” అని ప్రశ్న వేసెను. ఆప్రశ్నవినియుత్తరమీయలేక యొకకొంతసేపు తత్తరపడి యెట్టకేలకు నాతఁడు, “నేను గోమోఁజీరావునకు జాబులు వ్రాసినానా? రఘునాథరావువద్దనుండి నాకు గమ్మవచ్చెఁదా? అమ్మా! మీ రెంతవఱకు మోసపోయినారు! నాపై నసూయ గలిగింపవలెనని గోమోఁజీరావు స్వయముగ వ్రాసియో మఱియొకరిచేత వ్రాయించియో యీజాబులు మీకుఁ జూపినాఁడు. జాబు జూడనిచ్చినచో వ్రాఁత యెవరిదో చెప్పెదను” అని విన్నవించెను. విన్నవింప రాణి యీరహస్యమువినవలెనను నాతురముతోఁ దనకు మున్నిచ్చిన గోమోఁజీరావు సంబంధము లగు రెండులేఖలు రాధాకాంతునిచేతి కిచ్చెను. ఆయుత్తరములు జదువు

కొని రాధాకాంతరావు తనయేలికతోఁ దల్లీ యీవ్రాఁత వామన భట్టుది. వానిచేత వ్రాయించి గోమాజీ మిమ్ము మోసపుచ్చినాఁడు. వామనభట్టువల్ల గొన్ని రహస్యములు బయలకు వచ్చునని పలికెను. తమచేతఁ జిక్కియున్న వామనభట్టును రప్పించి రాణి వెంటనే యీ యుత్తరములఁజూపి యది యెవరివ్రాఁతయని యడుగ నతఁడు గద్గద స్వరుఁడై యీవ్రాఁత తనదని యొప్పుకొనెను. అంతట శ్యామసుంద రదత్తు భట్టుదాఁచికొన్న యంగరకాజేబులు వెదకి యందుండి మఱి యొకజాబును దీసి రాణికిచ్చెను. వింతతరువాతవింత బయలు దేరుటచే రాణి కోపమునాఁపుకొని నవ్వుచు నాయుత్తరము నీక్రిందివిధముగఁ జదువసాగెను. “గోమాజీరావు భేతాళసింగునకు వ్రాయున దేమన మీకు నింబపురికోట స్వాధీన మగునట్లు నేను సకలసహాయము లను జేసియుండ నాకీయవలసిన సొమ్మునిచ్చుట మీకెంత కష్టముగ నున్నది. మీరు వచ్చునప్పటికి మహాధీరుఁడైన రాధాకాంతుని మంచియుపాయముచే, దూరదేశమున కంపితిని. అవిశ్వాసమైనమీకు లేదు. ఈయుత్తరమందిన తక్షణము నాసొమ్ము నాకంపుము” అని రాణి చదివిన యాలేఖనువిని తుకాజీ శివనానా మొదలగువారు దత్తు, రాధాకాంతుఁడు నోరెత్తలేక కొత్వాలుచేసినద్రోహమునకు సిగ్గు పడి మిన్నకుండిరి. రాణి వారింజూచి నేనింతకాలమును క్రూరభుజం గములమధ్యఁ గాపురము జేసితిని. ఇంతింత దుర్మార్గులుండ దేశము న కెట్లుసేమము గల్గును. రాజపుత్రులు నింబపురిపై వానిమాటలు నమ్మివచ్చినారు. ఈభేతాళసింగు నాప్రాణములు దీయఁ దలఁచు టలోఁగూడ గోమాజీయొక్క యాలోచన యుండవచ్చును సుమీ యనెను. అనవుడు వామనభట్టు మెల్లగా, అమ్మా! గోమాజీరావు గారు నకారామును పేరుపట్టి భేతాళసింగును వెంటఁబెట్టుకొని గుట్టు లన్నియుఁ జెప్పినారు. నేను గడుబీదవాఁడనై తినుట కన్నములేక

యీతఁడు చెప్పినపనిచేసి పొట్టబోసికొనుచుంటిని గాని నే నేలినవారి మీఁదఁ గత్తిఁబూనుటకు వీరిలోఁ జేరలేదు. తమ పాదరక్షలు మో యుటకైనఁ దగిని బీదబ్రాహ్మణుఁడను. నేను దమపైఁ గత్తిగట్టుట కెంతవాఁడను. నన్ను క్షమింపుము తల్లీ యని వేఁడుకొనెను. ఇది యగునప్పటికి జాముకోడి కూసెను. రాణి నిద్రాభారముచే నలసి యుండఱకును సెలవిచ్చి ముక్తాబాయితోఁగూడఁ దాను నిద్రింప నరిగెను. చిరకాలమున కైన పరస్పరసమాగమమునకు రాధాకాంతుఁడును శ్యామసుందరదత్తుఁ డానందభరితాంతరంగులై నిద్రపోవక తమ కష్టములు జెప్పుకొని యామిగిలిన రాత్రికాలముం గడపిరి. ఆరాత్రి భైరవసింగు తప్పించుకొని పారిపోయి కోటఁజేరి భేతాళసింగుయొక్క దుర్మరణవార్త రాణావారికి విన్నవించెను. రాణావారావార్త విని భేతాళసింగుతోఁ దమయాసయుఁ దుదముట్టెన దని యెఱింగి ప్రాణ ములతో నింబపురము విడిచి యుదయపురము బ్రవేశించుట యుక్త మని యెంచి మఱునాఁడు రాత్రి భేరీఢక్కాదిధ్వనులు గట్టిపెట్టించి టెక్కెములు చుట్టించి చడిచప్పుడు లేకుండ హతశేషమైన సేనలతో గోటవదలి పారిపోయెను. అర్ధరాత్రిశూరశిఖామణులగు రాజపుత్రులు చేసిన తెగువ నుదయమున నహల్య విని సంతసించి రణదుందుభి నాదములు తనవిజయవార్తలఁ జాట నున్నతధ్వజములు దనయౌన్న త్యముం దెలుప రత్నాకరముచందమున మహాఘోషసమేత మగు సేనలతో నుభయపార్శ్వముల ముఖ్యసేనాధిపతులు గొల్చి రా, నహల్య నింబపురికోటఁ బ్రవేశించెను. అటమహాపురమునానంద బాయి యొకనాఁ డుదయమున నింటఁ బ్రాచిపని జేసికొనుచుండఁగ మును పాకసారివలె గుమ్మములో నొకపల్లకి దిగెను. ఆసమయమునఁ బల్లకి నెక్కివచ్చువా రెవ్వరని సంశయముకలిగి యానంద పరుగెత్తు కొనివచ్చి చూచునప్పటికి మెల్లగఁ బల్లకి దిగి యొకవిలాసవతి యా

నంద కెదురుగ వచ్చి యామెను గౌఁగిలించుకొనెను. ఆనందయామె రాక కద్భుతమొంది "కమలా! నీవు బాగున్నావా? నిన్నుఁజూచి చాల కాలమయినది. నీవు మృతినొందితి వని లోకులు చెప్పుకొన్నారు. మాదత్తును రాణి రాష్ట్రమునుండి వెళ్ళఁగొట్టినది. వాఁ డేమైనాఁడో నే నెఱుఁగనమ్మా" యని కంటఁ దడిబెట్టుకొనెను. శ్యామసుందరదత్తునకు భయము లే దని కమల యామె నూరార్చి మాతమ్ముఁడు మార్గాయాసముచే డస్సినాఁడు. వానికిఁ గొంచె మన్నమును బెట్టఁగలవా యనుచు నడుగ నానంద యాసంగమున వాని కన్నము బెట్టెను. బాజీరావు భోజనము సేయుచుండఁగఁ గమలయు నానందయు నిట్లు మాటాడిరి.

ఆనంద—నీ తమ్ముఁడు నిన్నెచటఁ గలిసికొన్నాఁడు ? నీ వెందుండి వచ్చినావు?

కమల—నా నిమిత్తము మాయమ్మ మాతమ్ముని నిటకుఁ బంప వాఁ డదృష్టహీనుఁడై భిల్లులచేతఁ బడి రెండుసారులు చావు దప్పించుకొని యిట్టటునుండఁగ నేను రాణిదగ్గఱ సీత యను వేషముతో దాసిగనుండి దైవయోగమున భిల్లులచేతఁ బడితిని.

ఆనంద—అయ్యో! ఆదురాత్ములచేతినుండి యెట్లు తప్పించుకొన్నావు?

కమల—అక్కడ శాయాజీహోల్కారను నామధేయుఁడొకఁడు నన్ను బెండ్లియాడవలయు నని యత్నింప మేము వానిని మోసముచేసి యిటకు వచ్చినాము. బాజీరావు నాతమ్ముఁడు గాఁడనుకొని యాదురాత్ముఁడు తనకొఱకు నన్ను గూర్చి వీనిద్వారా ప్రియత్నించి నన్నుఁ దనకు సమకూర్చినపక్షమున మాతమ్ముని జెఱవిడిపించునట్లు వాగ్దానము చేసెను. నేను మగవేషము వేసికొని రాత్రి శాయ్యాజీని దర్శించునట్లు నిర్ణయింపఁబడినందున నేను మగవానిలాగు

దాఁచికొని యుంటిని. అప్పుడు మూర్ఖుఁడగు శాయాజీ ముందుగ నా తమ్ముని జెఱవిడిపింపఁ బిలచి పల్లకీఁ దెప్పింప నే నాపల్లకిం గూరుచుంటిని. మగవేషముతో నుండునాకు నాతమ్మునకును భేద మేర్పఱచుట కష్టమైనందున మాతమ్ముఁడే పోవుచున్నాఁ డనుకొని యామందుఁడు నన్ను విడిచిపుచ్చెను. తరువాత మాతమ్ముఁడు వానియొద్ద కరిగి వాని నొక్కపోటున బొడిచి యాస్థలము బాసి ముందు పయనముచేయు నన్నుఁ గలిసికొనెను. వింటివా మాయవస్థ నాఁటి నీ యుపాయముప్రకారముగ నేఁటివఱకు నేను వర్తించుటచే నాకు మానహాని వాటిల్లలేదు.

ఇట్లు వారు పరస్పరప్రేమచేఁ గష్టసుఖములఁ జెప్పుకొనుచు నాఁటిదినమును గడపిరి. కమల యచ్చటఁ గొన్నిదినము లుండెను.

---

## ఇరువదినాల్గవ ప్రకరణము.

వామనభట్టు రాణిశిబిరమునఁ జిక్కినాఁ డనువార్త వినినతోడనే గోమాజీరావు తనకు ట్రిక దాఁగనేరదని తెలిసి దారపుత్రాదుల విడిచి యుద్యోగము మానుకొని నాఁ డర్ధరాత్రియందు నిందూరునగరము బాసి పలాయనుఁ డయ్యెను. ఎక్కడికి కరిగినాఁడో వాని సేవకులుగాని దారపుత్రాదులుగాని యెఱుఁగరు. గోమాజీ యధికమయిన యాశయు స్వల్పమైన ధైర్యమును గల పిఱికి మహారాష్ట్రుఁడగుట నతఁడు తన చర్యల భరింపనేరక దేశములపా లయ్యెను. జస్వంతరావు భిల్లుల నందఱ నాశనముజేసి కృతకృత్యుఁ డయ్యు గండాభిల్లుదొరకమి నిండారు సంతోష మొందక కొండలు, గుహలు, నడవులు, వాగులు సంచరింప సాగెను. దేశమును గొల్లగొన్న భిల్లు

లును శాయాజీతోఁ జేరిన భిల్లులును దాదాపుగ హతులగుటచే నితర భిల్లులు భయకంపితులై దోఁపిడిను తలంపు విడిచి వ్యవసాయములు జేసికొనుటయు బిచ్చమెత్తుకొనుటయు నారంభించిరి. కొందఱు దొంగతనములు మొదలగువానిని మాని మాఱువేషములతో జనులయొక్క సేవకులుగాఁ బ్రవేశించి పొట్టబోసికొనసాగిరి. అందుచే గండాభిల్లు చిక్కుట యసాధ్యమని జస్వంతరావు నిరాశనొంది తుద కక్లైరాణికి లేఖవ్రాసియు వాని నప్పగించినంగాని ముక్తాబాయి నిచ్చుట లేదని రాణి వాని కుత్తర మంపెను. అదివఱకు పడినశ్రమ యంతయు వ్యర్థమైనదని గంగాధరుఁడు మరలఁ బ్రయత్నము సేయుచు గోసాయీలను బయిరాగులను రప్పించి యడవులయందుఁ దిరుగునెడ వారికి గండాభిల్లుఁ డెందైన గానంబడునేమోయని యరయుచు నానాశ్రమ లొందుచుండెను. అతఁ డొకనాఁడు మహానగరమునకరుగ నచ్చటి జనులెల్ల నొకమహాత్ముఁడు గ్రామమునకు వచ్చినాఁడనియు నాతఁడు గండాసంగతి నెఱిఁగింపవచ్చు ననియుఁ దెలిపిరి. "ఇట్టి మహాత్ముల నెందఱినో నే నిదివఱకుఁ జూచినాఁడను. ఎవరును నాకు వానిజాడఁ దెల్పరైరి." అని తిరస్కారభావముగఁ బల్కి తన బసకుం జనియెను. అయినను మనసు తాళక మధ్యాహ్న మొకసారి యామహాత్ముఁడు జయదేవుని మఠమున కరిగి యాతని దర్శించెను. గాని యాతఁడు మౌనముద్రాభరణ మొనర్చిన బయిరాగి యగుటచే నాతని నీతఁడు పలుకరింపకయే యింటికి వచ్చెను. రాత్రి జపము ముగిసిన తరువాత నాబయిరాగి వచ్చియు రాని హిందికీర్తనలు పాడుచు శ్రీకృష్ణునియమునావిహారములు రాధారసమును స్తవమొనర్చి యానందించుచుండ నచ్చటికి మఱియొక బయిరాగి వచ్చి తన సంచి నందుదింపుకొని మొదటివాని నడిగి గంజాయి కొంచెము గ్రహించి పీల్చి మహారాష్ట్ర భాషలో వల్లభాచార్యస్తవాను లగు పాటలు పాడసాగెను. ఇట్లిరువురు

విసుగు వచ్చువఱకు భగవద్ధ్యానము చేసి తమతమ కంబళములపైఁ దాము పవ్వళించిన తరి రెండవ బయిరాగి మొదటివానిని బలుకరింప మొదలుపెట్ట నాతఁడు మౌనభంగ మగునని కాఁబోలు పలుక నిష్టపడక పదిప్రశ్నల కొక్కయుత్తరముఁ జెప్పుచు నిద్రింపఁజొచ్చెను. రెండవవాఁడు విధివిరామము లేక ప్రశ్నలడుగఁజొచ్చుటచే నాతఁడు విసిగి లేచి కూర్చుండి నీ వెన్నిప్రశ్న లడుగఁదలఁచితివో యన్ని యడుగు మని కోపముతోఁ బలికెను. అప్పుడు వారికిట్లు సంభాషణ జరిగెను.

రెండ.—మీరు నామీఁదఁ గోపపడవద్దు. గోసాయీలము. మనలో మనము చేదోఁడు వాదోఁడుగ నుండకుండిన నన్ను నెవ్వరందురు. నేను క్రొత్తగ నీయాశ్రమమును స్వీకరించితిని. మీరు మహాత్ములు. నా కుపదేశ మేదైనఁ జేయుఁడు.

మొద.—నాకు మంత్రములు రావు. రామా రామా యను మాట తప్ప నా కేమియు రాదు.

రెండ.—మీ రనేకతీర్థములు తిరిగినారు. మి మ్మెక్కడనో చూచినట్టున్నది.

మొద.—నేను ప్రయాగ, కాశి, గయ వెళ్ళినాను. నన్ను నీ వందుఁ జూచితివా?

రెండ.—అయ్యా! యీదినములలో బైరాగులకు సన్యాసులకు దేశసంచారము గష్టముగ నున్నది.

మొద.—అవును. ఈదేశమున మిక్కిలి కష్టము. జస్వంతరావు బయలుదేరి ప్రతిసన్యాసిని బిలిచి 'గండాభిల్లును నీ వెఱుఁగుదువా' యని యడుగుచుండును. అందుచే ననేకులు తమకుఁ దెలియకపోయినను వానినుండి తప్పించుకొనుటకు నేదియో యబద్ధము చెప్పుచుందురు.

రెండ.—వ న్నావిషయమై యాతఁ డడిగినాఁడు. నేనేమియుఁ జెప్పలేదు కాని మీరు చాలదేశములు తిరిగినారు. మీ రెక్కడ నైన గండాభిల్లును జూచియుంటిరా? పాపము వానిజాడ కొంచెము నాకుఁ దెలుపఁగలరా?

మొగ.—నాకు గండాభిల్లు కనఁబడలేదు. ఆతని విషయమై వేరే ప్రయత్నించుటకంటె మహానగర సమీపమున నున్న ఋషిని బట్టుకొన్న సన్నియుం దెలియును. ఆ ఋషియు గండాభిల్లుఁడును నొక్కటి. భిల్లుల కాలోచన మతఁడే చెప్పి వారి నింత దూరము దెచ్చినాఁడట.

రెండ.—అవును. ఆ ఋషియే వారిపక్షము గాకున్నపక్షమున నిష్కారణముగ మొదట పట్టుబడిన గండాభిల్లు వాని కుటీరమునుండి యెట్లు పారిపోవును? ఆ ఋషిని బట్టుకొని యురిదీయింపఁ బ్రయత్నింతము. కాని గండా యెట్లుపాఱిపోయెనో చెప్పఁగలరా?

మొగ.—అయ్యో! నా కెందుకు. గోడలకుఁ జెవు లుండును. ఈ సంగతులు పైకిఁ బొక్కిన నేదియు నెఱుఁగని మనలనుబట్టి యహల్యాబాయియు జస్వంతరావుగారును బాధపెట్టుదురు. మన మీ సంగతులు చెప్పుకొనవద్దు. రాజుతోపని పాముతో చెలగాటము.

రెండ.—ఆ మాట నిజమేకాని యీ సంగతులు నే నెవరికిఁ జెప్పను. ఊరూరఁ దిరుగు సన్యాసులము. మన కిట్టి దెందుకు? వినవలెనను కోర్కచే నడిగితిని. మీ కిష్టమైనచో జస్వంతరావును నే నెఱుఁగుదును గనుక వానితోఁ జెప్పి ఋషిని శిక్షించునట్లు జేసెదను. ఇష్టము లేనిచో నదియు మానెదను.

మొగ.—దుర్మార్గుఁడైన యీ ఋషిని శిక్షించుట నా కిష్టమే. మన రాణివిషయమై మానము పనిచేసి దొంగల నప్పగింపకపోయిన మొదల మనబ్రతు కెందుకు. ఆమె సదా పృత్తులిచ్చి మనలను రక్షిం

చుట యెందుకు? ఆఋషిసంగతి ప్రయాగలో నొకనాఁడు తులసీదాసు మఠములో నొకగోసాయి చెప్పఁగా విన్నాను. అది చెప్పెదను విను. వాఁడు ఋషికాఁడు. మూఁడవపానిపట్టు యుద్ధమున వీఁడు మహారాష్ట్రులలోనుండి సగము యుద్ధ మైనతరువాత తురకలపక్షమునకుఁ దిరిగిపోయినాఁడు. తరువాత తురకలు గెల్చియు వీని నిరాకరించుటచే మరల పేష్వారాజ్యమునకు నరిగినచోఁ దనను చంపుదు రని యీ హోల్కారురాజ్యమున నున్నాఁడు. వీనిపేరు మురారిపంతు. మిక్కిలి వృద్ధుఁడనని చెప్పుకొనును గాని యంతవయస్సు లేదు. తా నెఱుఁగుదు నన్న విషయముల నెఱుఁగఁడు. వయస్సునుబట్టి వీనియందు గౌరవము గల్గి మాటలనుబట్టి భక్తిగలిగి ప్రజ లీతఁడాగతానాగత వర్తమానవేదియని యనుకొని వానితో సర్వకార్యములలో నాలోచనము సల్పుచు మోసపోవుచువచ్చిరి. రాధాకాంతరావు మొదలగు బుద్ధిమంతులుకూడ వీనిచే మోసపోయిరి. వాఁడు భిల్లులకు సాయమై దేశముల దోఁచించినాఁడు. కొడుకులు లేరని దిక్కులేని వాఁడనని వాఁడు చెప్పుకొనునే కాని కొంకణదేశములో వీని కందఱు నున్నారు. భిల్లులతో స్నేహముజేసి వారిచే నూళ్ళు దోఁచించి యీ సొమ్ము బిడ్డల కంపును.

రెండ.—ఆహా హా! ఎట్టిచిత్రము నేఁడు విన్నామండి. మీరు రాణికి నాప్తులుగదా! కాని గంజాభిల్లెట్లు పారిపోయినాఁడో తెలియఁ జెప్పినారు కారు.

మొద.—ఆహా! అరే మఱచిపోయినాను. నాఁడు ఋషికుటీరము జేరి దత్తు దొంగనక్కడ విడిచి యెక్కఁడికో యరుగ ఋషి యొకగొల్లనిచే దాపుననున్న భిల్లునకు వర్తమాన మంపి మువ్వురను రప్పించి గంజాభిల్లును దోడుకొని పొమ్మనెను. వారు కావలిగాచు ఒంట్రాయిను జంపి గంజాను వదలించుకొని పోవుచుండ ఋషి తన

మీఁద దత్తున కనుమానము లేకుండఁ దన్నుగూడఁ గాలుసేతులు కట్టుమని కోరి తన యిష్టప్రకారమే బంధింపఁబడెను. అంతటియు క్తి చేయఁబట్టి వానిదొంగతనము రాణియు దత్తును బట్టుకొనలేరైరి.

ఈపలుకులు విని రెండవయోగి యెంతుచేతనో మితములేని యానంది మొందుచు "మీరు సాక్షాత్తు విశ్వేశ్వరులు, రాణి మీ యెడల మిగులఁ గృతజ్ఞతగ నుండును సుఁడీ" యని పలుక నాతఁడు "మీరు ఋషిని బట్టుకొనవచ్చును. కాని యీ సంబధమున నాపేరు చెప్పఁబోకుఁడీ. నానిష్టలు తపములు చెఱుపుకొని నేను సాక్ష్యము నకుఁ దిరుగనేర" ని పలికి యప్పటికిరాత్రి యతిక్రమించుటచేగుఱ్ఱు పట్టి గాఢముగా నిద్రపోయెను. రెండవయోగి నిద్రానందున రామ స్మరణ జేసికొనుచు మేలుకొనియుండి మొదటివాఁడు నిద్రించిన వెనుక వానిదగ్గఱ సరిగి మొగముపై మొగముపెట్టి చక్కఁగ వానిఁ బరీక్షించి తలయూచి యనంతరము దూరమున నున్న వానిసంచి దగ్గఱగఁ దీసి యది తనచంకఁ దగిలించుకొని చప్పుడు గాకుండ మెల్ల మెల్లగఁ దలుపులుఁ దీసికొని మఠము దాఁటి చనెను. తరువాతనాతఁ డాసంచిలోనున్న వస్తువుల నెల్ల వెలికిఁదీసి యందొక ముద్దుటుంగర ముచు మిగుల విలువగల రతన మమర్పఁబడినదానిని గని సంతసించి "యుంగరమా! నీవువిశిగానుండి నాహృదయము దహించుచున్నావా! ఆమె యెందిరిగినది" యని కన్నుల నద్దుకొని ముద్దుపెట్టుకొను దానిని మూటగట్టుకొని తన యిచ్చవచ్చిన త్రోవ సరిగెను. ఇంతలో మొదటి బైరాగి మఱికొంత గాఢముగనిద్రించి "ఓజస్వంతరావు! రాకురాకు" మని పలువరించి మరల నిద్రించెను. అనంతరమున సరిగ నొకజా మగువఱకు నిరువదుగురు దృఢదేహులగుభటులతో జస్వంతరావు జయదేవమఠమున దగ్గఱకు వచ్చి నిద్రించుచున్న యీ బైరాగిని లేపి "స్వామీ! మిమ్ముఁ దోడుకొని రమ్మని రాణి సెలవయినది. మీరు

భిల్లులసంగతియు ముఖ్యముగ గండాభిల్లు సంగతియు నెఱుఁగుదు రని వారికిఁ దెలిసినది. అందుచేత నీలాంకిలో నెక్కి మీరు రాణిగారి దగ్గఱకు దయచేసి ఋషివిషయమై భిల్లులవిషయమై సాక్ష్యమియ్యవల యును. రండి" యని పలికెను. బైరాగి యామాటల కాశ్చర్యము నొంది యాశ్చర్యము వదలి తన్ను భయము దృఢముగా నావేశించు టచే నివ్వెరపడి తడబాటుతో "నేనెఱుఁగను. నేను సాక్ష్యము నీయఁ జాల. నాజపము విఘ్న మొందును. నన్ను విడువు" మని వేఁడు కొనెను. కాని జస్వంతరావు తాను బట్టినపట్టు వదలక "మీ మూల మున రాజ్యమునకు మహోపకారము జరగును. దయచేయుఁడి" యని వానిని లాంకిలో నెక్కించి తిన్నగా నిందూరునగరమునకుఁ గొనిపోయెను.

---

## ఇరువదిరెండవ ప్రకరణము.

అట్లు నింబపురపుకోట నాక్రమించుకొని రాణి గండాభిల్లుదొర కలేదనుచింతదక్క తక్కిన సమస్తశత్రుసంహారమును దనచేనైనదని శ్రీకాళికావిశ్వేశ్వరునకు నమస్కరించి పూర్వమారంగజేబుచే నాశన ముచేయఁబడిన యాదేవుని యాలయమును దాను గట్టింతునని మ్రొ క్కుకొని శాయాజీతోడను వామనభట్టుతోడను ముక్తతోడను బయ లుదేఱి మహాసంతోషముతో నింబపురము బాసి తుకాజీ, శివనానా, రాధాకాంతరావు, శ్యామసుందరదత్తు మొదలగు సేనానాయకులు పరివేష్టించి యుభయపార్శ్వములఁ గొలువ నిందూరుపురికి వచ్చెను. రాణిచేసిన యాదరణముచే శాయాజీ ధైర్యముం బూని తన కామె కొన్నిజాగీరులనైన నిచ్చునను పేరాసగల్గి నడుమనడుమ నేమిచేయు

నో యని సందేహముతోఁ దానుచేసిన పొరబాటునకు వగచుచు రాణితో నరుదెంచెను. రాణి వచ్చునప్పటికి జస్వంతరావు యొకనొక మందిరమునుండి తానెన్నండును వానిని బాయక సకలోపచారములు స్వయముగఁ జేయుచు నతిగౌరవమున నాదరించినగరమందంతటఁ బచ్చ నిపందిళ్ళు వేయించి తోరణములుగట్టించి యనంటిబోదెలునాటించికల యంపులుజల్లించి ముగ్గులుపెట్టించి శృంగారించితన సేనతో నామెనెదు ర్కొని యామెచే గౌరవింపఁబడి యామెను నగరప్రవేశము చేయించి యామెసెలవుప్రకారముగ వామనభట్టును శాయాజీమహారాజును గా రాగృహప్రవేశము జేయించెను. అప్పటికిసనకాశలుచచ్చినవనుకొని శాయాజీ తానునుజచ్చినయటులెయెంచుకొనిచెఱసాలలోఁగంటికినేలకు నేకధారగా నాఁడుదానికంటెఁ బసివానికంటెనన్యాయముగరోదనము సేయఁదొడఁగెను. సీత యెందును దన కగపడకయున్నను ముక్తబెంగ గొని నింబవుకరిగినదాది చిక్కి మఱల నలఁనగ నున్నందున రాణి సీతవిషయమై మరలఁ బ్రయత్నముసేయ నిశ్చయించి తనసరదారుల తోనామెను వెదకుమనెను. ఆరాత్రికిమురళీధరదాసును నానందబా యియుఁ దనవెంటరా సోదరసమేతయయి సీత రాధాకాంతుని యింటికివచ్చి చేరెను. రాధాకాంత నా వామెనాదరించిరోహిణీబాయి కింజూపనామెయు సగౌరవముగలోనికిఁదోడ్కొనిపోయి యామెకు నానం దకు భోజనమిడెను. మధ్యాహ్నమామెయు రోహిణియునానందయు రాణిదర్శనమునకరుగ రాణియు ముక్తయు సీతరాకవినిదిగ్గునలేచియె దురుగవచ్చిరి. అందుముక్త వీథిగుమ్మమువఱకువచ్చిసీతంగని కౌఁగి లించుకొని "యేమే నీవింతకాలము నన్ను వదలియెట్లుంటివేఁ అయ్యో నాకు నిజముగ నోటికన్నముబోలేదేసీతా. ఈవేళ నేనెంతయదృష్టవం తురాలనో సుమీ! రావే మాయమ్మ నీకై వేగిరపడుచున్నది" యని వారలనందఱ నంతిపురికిఁ దోడ్కొనిపోవ రాణి వారిమువ్వురసగౌరవ

ముగఁ గూర్చుండఁబెట్టి సీతం గని "యింత కాలము నీ వెట్లుంటివి. భిల్లులు పాపము నిన్ను బ్రతుకనిచ్చిరా?" యని యడిగి యామె భిల్లుల వలన జరిగిన బాధ నెల్లఁ గమఁజమత్తారముగఁ దెలుప వినియెను. పిమ్మట నా స్త్రీసంభాషణములను విని గ్రామమునకు సాగెను.

అహ.—దేవుఁడు తలఁచిన కార్యము లన్నియు నైనవి. జస్వంతరావు లోఁబడినాఁడు. నా పుత్రులు సురక్షితులైరి. కాంతరావు వారిచే నిహతుఁడయ్యె. దుష్టుఁడగు గోమాజి పలాయనుఁడయ్యె. భిల్లులు నిర్మూలింపఁబడిరి. సీత దొరికినది. శాను కూడఁ జేతఁజిక్కెను.

యుక్తి.—ఇన్నిటిలో సీత దొరకుట ముఖ్యము గాదా అమ్మా.

అహ.—కాని గంగాభిల్లు చిక్కలేదు. ఎప్పటికైన దొరకక పోఁడు. అన్నిటికంటె నాకొక్క బాధ యొక్కటియున్నది. నేను కమలను రక్షింపలేనైతి నను విచారము హృదయశల్యమైయున్నది.

గోపి.—అమ్మా! ఆవిచారము తమ కెందుకు? ఈసీతయే కమల. కాంతరావుచే నీమె బాధింపఁబడు నని మావారు సీత యను పేరు పెట్టి దాఁచి సంరక్షించిరి.

అహ.—ఆమె చావలేదా? ఈమెయే కమలయా? ఇది మాయగా నున్నదే. జనముగూడ సాహసము చేసినారని చెప్పినారే.

గోపి.—అమ్మా! ఆదినముననే మఱియొక స్త్రీ మఱఁదలితోడి వివాదమూలమున నల్లమందు వెట్లకోటలో నూతిలోఁబడి మృతినొందినదఁట! ఆమెతండ్రి మొదలగువారామె బలవన్మరణముచేఁ దమకు మాట వచ్చుననియుఁ దన యల్లునకు మాట వచ్చుననియు నోరెత్తక యూరకుండుటచే నాశవము కమలశవమే యని పౌరులు భావించినారు. ఇట్లు మావారు చెప్పినారు.

అహ.—ఆలాగునా? ఇది మఱి దావింపఁగ నున్నది. పాపము విధవవైన నీమొగము నాఁడు చూచుటకు బదులు నేఁడు చూచి పరా

మర్శ చేయవలసివచ్చినది కదా! కమలా! నీవింత కాలము నాయొద్ద నున్నను నే నెఱుఁగనైతిని.

ఆనంద—అమ్మా! నామాట వినఁజాలవలెను. ఈమె విధవ కాదు. అవివాహిత యగుకన్యక.

అహ—(కోపముతో) ఈయబద్ధములను గట్టిపెట్టి నిజముఁ బల్కుఁడు.

రోహి—అమ్మా! ఆగ్రహింపక! యీవిషయమై యామె నడుగుట మంచిది.

ముక్త—కమలా! సత్వరముగ నీ చమత్కారవచనములతో నద్భుతమగు నీచరిత్రమును జెప్పి చాలకాలమునుండి తృప్తిపొందని మాచెవులకు విందుచేయుము.

అహ—కమలా! నీచరిత్ర మామూలాగ్రముగ నెఱిఁగింపు.

కమల—తల్లీ! నాచరిత్రము నాలకించి న్యాయమైనరీతిననాదరింపఁగోరెదను. శ్రీమాధవరావుగారి పాలనమందున్న పునహానగరము మాకాపురము. కులమునందున్నతుఁడై సంపదలలో నిరుపేదయగు నీశ్వరచంద్రునికుమార్తెను. మాతండ్రిగారి మరణానంతరమున మాతల్లి ధనాశకు లోఁగి హరిహరపాండ్యాఖ్యయను బ్రాహ్మణాధమునిప్రేరణచే నన్ను వృద్ధుఁడగు రాఘోజీవల్కారున కీయఁదలంచినది నెన్నిసారులు వివాహమున కనిష్టత సూచించినను మావారు నామాటలు సరకుగొనకపోవుటచే రెండుమూడుసారులు రాత్రివేళ నేనొంటరిగ భవానీమాత యాలయమున కరిగి నా కావివాహము దప్పింపుమని యామెను వేఁడుకొంటి. దేవి యప్పటికేమియుఁ బ్రత్యక్షోపకారము నాకుఁ జేయనందున మాతల్లి యాత్మలాభము జూచుకొనికొంతద్రవ్యము వల్కారువద్దనుండి గ్రహించి పెండ్లినిశ్చయించి తానుపునహాలో వివాహము జరుప శక్తికలది కానందున నిందూరునగరమునకునను

దీసికొనిపోయి పెండ్లియాడుమని నన్ను వాని కప్పగించెను. అతఁడు నన్ను పెండ్లియాడకమునుపే బహుదినములు దేశాటనము చేయుటకు వెళ్లెను. తర్వాత గోపాళుడు వచ్చి ప్రియురాలా మా మెయొక్కయాజ్ఞనొక వేళ్ళ నాసౌఖ్యము నిమిత్తమై నేను జీవించు చుంటిని. గనుక నామెయిష్టప్రకారము నేను వర్తించి పెండ్లియా డుటకు నిష్టములేక యిష్టపడి వానివెంటవచ్చితిఁగాని వివాహమాడక ముందె యాతఁడు మృతినొందినాఁడు గాన నేను గన్యను.

అహ.—ఏమీ! దైవయోగము. నీమాటలయందునాకపనమ్మ కము గల్గుచున్నది. నిన్నాతఁడు పెండ్లియాడకపోయినపక్షమున నీవట్లు నెవ్వరితోడను నేలచెప్పవైతివి? పోనీ వైధవ్య మేలయనుభవించితివి?

కమల.—ఇమాంబ నన్ను మానసంకుబాయి చెప్పవలయును.

ఆనంద.—అమ్మా! అందుకు త్తరము నేనుజెప్పెదను. ఈమెయు గాయముతగిలిన రాణోజీయు మాయింటికి వచ్చిననాఁటిరాత్రితనయవ స్థనంతయు నాకుఁజెప్పి యీమెతనబ్రతుకు తెరువునుగూర్చి నన్నడుగ నే నిట్లు చెప్పితిని. "రాణోజీబ్రతికినచో సరే. నీవాతనిం బెండ్లియా డుట కర్తవ్యమే. అతఁడు పోయినచో నీవు దురాత్ముఁడైన దావలత రావునింట నుందువు గనుక వివాహముకాని కన్యక నని చెప్పవద్దు. కన్యనన్నచో నీవంటిదాని నతఁడు పెండ్లియాడకవిడువఁడు. ఇదివఱకు రాణోజీ యందఱితోడను దనభార్యనని చెప్పుచున్నాఁడుగనుక జనుల నాయభిప్రాయములోనే యుంచుట మంచిది. లోకులు నిన్ను విధవ యనుకొందురు కాఁబట్టి దావలతరాయని దౌర్జన్యమును వారువారించి నీపక్షమున నుందురు. కన్నెవని చెప్పినచో నిన్నతనికిఁ గట్టిపెట్టక మానరు. అందుచేతఁ గొంతకాలము దావలతరాయని యిల్లు విడుచు వఱకు భర్తృహీనవలె నుండు" మని యుపాయముఁ జెప్పితిని. దానిం బట్టి యీమె వర్తించి యుండును.

ఆమాటలువిని యహల్యయు ముక్తయుఁ బొందినయాశ్చర్యము వారిమనస్సులెఱుఁగవలయు. తత్కథాశ్రవణముఁ జేసినవారెఱుఁగవలయు. ఎట్టిసారములేని పొడిమాటలునైన రసవంతముగఁ జెప్పు నేర్పుగల కమలాబాయి సారస్యముతోఁ గూడిన స్వచరిత్రము సద్భుతముగ విన్నవింపఁ దగినసాక్ష్యముండుటచే నహల్య నమ్మి యానిరుపమానలావణ్యరాశి విధవకానందులు కమితానంద మొంది "నీకు మా ముక్తకు నింక వివాహములు చేయుట యనావశ్యకమే. నీమనోహరు నేనెఱుంగుదును. మిగుల శ్రమఁజెంది యేయుండి రాకాయనిప్రాణములు నీవు నాతోఁజెప్పి రక్షించితివో యాశ్యామసుందరుఁ డని నేఁ దలంచెద నని యాపంపనుజూచి "నీకిమ్మున కేమెఱిచ్చి వివాహము చేయుట నీకిష్టమేనా? రోహిణీబాయీ! నీవు కుమారునివలెఁ బెంచుకొనుచున్న మీవత్తున కీమె యనురూపయగునిల్లాలుకద" యని యడుగ వారిరువురుఁ దమకుసమ్మతమని నొక్కి చెప్పిరి. అంతట నప్పలుకులకు ముసిముసినగవులు నగి కమల ముఖకమలము వికసింపఁ జెంగున నొకతెర చాటున కరిగి సిగ్గునఁ దలవంచుకొని చిరకాలముక్రిందట నాటఁబడిన మనోరథబీజములంకురించి శరీరమావంతట మొలకలెత్తెనో యన పులకలు వొడసూప మనోనేత్రము దెఱచి భువనసుందరుఁడగు శ్రీశ్యామసుందర సుందరముఖారవిందము నానందమున ధ్యానించి చూచుచు నానందమహాంబుధి నోలలాడఁ దొడఁగెను. అంతట వారి కందఱకు సెలవిచ్చి ముక్తబాయికోరికపరికారము కమలను మందిరమునుండఁ బంచి రాణి జస్వంతరావును బిలువనంప నతఁ డూర లేఁడని చెప్పిరి. మధ్యాహ్నము పై రాణిదగ్గఱ శ్యామసుందరుని గాంచి జస్వంతరావు తురంగము నెక్కి తనపరివారముతో ఋషికుటీరము బ్రాపించెను. రాత్రి జాముగువఱకు ఋషిని వెంటఁబెట్టుకొని రాకయే తానొక్కఁడువచ్చి రాణిదర్శనము జేసి భిల్లులవిషయమై యెఱిఁగినపై రాగ

వచ్చియుండుటఁ దెలిపి విచారణ సేయుమని యడుగ మఱునాఁడు సయముఁ జేయవచ్చునని వారినంపి రాణి నిద్రించెను. భిల్లులబాధ యడఁగి రాజ్యము సౌఖ్యోదయ మైనయట్లు చీఁకటిబాధ యడఁగి సూర్యోదయము కాఁగానే రాణి కాల్యములం దీర్చి బైరాగిని వెంటఁబెట్టుకొని రమ్మని జస్వంతరావునకు వర్తమానమంపెను. బైరాగిని సగౌరవముగఁ దీసికొనివచ్చి రాణియెదుట నొకపీఠముపైఁ గూర్చుండఁబెట్టి జస్వంతరా విట్లనియె 'ఓయీ! నీకీరత్నపుముద్దుటుంగర మెక్కడిది స్వామీ' అనఁ దెల్లబోయి బైరాగి ప్రత్యుత్తర మేమియు నీయవలయునని యోచించుకొనుచు దిక్కులు చూచుచుండ రాణి యాయుంగరమందుకొని చూచి "యిది మాముద్రాబాయిది. నాఁడు భిల్లులు దోఁచుకొన్నప్పుడు పోయినది. ఈబైరాగియు భిల్లులలోనివాఁడాయేమి" యని యడిగెను. ఆపలుకులు విని జస్వంతరావు శాయాజీని రప్పించినచో దీనివిషయమై తెలియును. అట్లు చేయుఁడీ" యన శ్రీకుమార మహారాజుగారిని రాణి చెఱనుండి రావించెను రాజభటులు శాయాజీని నిలువఁబెట్టిన తరువాత జస్వంతరావు వానినిజూచి బైరాగిని జూపి "ఈతఁ డెవ్వ" రని యడిగెను. శాయాజీ రోదనధ్వనితో "నీతఁడు గండాభిల్లుగాఁడా" యని పలికెను. వెంటనే రాణి యాశ్చర్యమొంది యిట్లనియె. "అహల్యాబాయికి హృదయశల్యమును జస్వంతరావునకుఁ జిరకాలప్రయత్నఫలమును దేశసౌఖ్యమునకుఁ గాఱుచిచ్చునగు దురాత్ముఁడా యీబైరాగివేషము ధరించినవాఁడు. గండాభిల్లుపేరు విన్నచో నిందూరురాజ్యముననున్న సుందరులకు గుండియ లవిసెనుగద! ఈతని మూలమున నేనును నా ప్రజలును నొక్కనాఁడైనఁ గడుపారఁ బట్టెడన్నము దినియెఱుఁగము. కన్నార నిద్రయెఱుఁగము. ఈతఁడు నాభాగ్యవశమునఁ జిక్కినాఁడు. భిల్లులనందఱఁ గూల్చుట యొకయెత్తు వీనినిగూల్చుట యొకయెత్తు స్వామీ! నీ ఋణము నేను దీర్పఁజాల గంగాధరా" యని పలుకుచుండ

భటులు గండాభిల్లునకు సంకెళ్ళు వేసిరి. అంతట జస్వంతరావిట్లనియె. "అమ్మా! నేనే స్వయముగ బైరాగివేషముదాల్చి జయదేవర మఠమున వీనిం గలిసికొని యనుమానపడి ముక్తాబాయియొక్క యుంగరము వీని సంచిలోఁ జూచి వీఁడే గండాయని పట్టుకొంటిని. ఋషిని గూడబట్టుకొనవలెనని నేనాకుటీరముఁ జేరి వానిని బట్టుకొంటిని కాని వెంటనే వాఁడు విసముదిని యక్కడనే మృతినొందినాఁడు. గండాబిల్లు ఋషికుటీరములోనుండి తలదాఁచుకొనఁ బ్రయత్నింపనా ఋషి తనకు మాటవచ్చునని యందులకు సమ్మతింపఁడయ్యెనఁట. అందుచే గండాబిల్లు కోపించి బైరాగివేషముదాల్చిన నాతో ఋషిపై నేరములు చెప్పినాఁడు. అందుచే నీకొఁడుచిక్కె, నాకొఁడు వచ్చె. యిక్కడికి శత్రుశేషముగూడ నిర్మూలమయినదిగదా" అను పలుకులువిని రాణి బిల్లునకు మరణదండన విధించెను. తరువాత శాయాజినిగని "నీవు మొదటమహాజ్ఞాతియగు శాయాజివేమో యనుకొంటిని. అతఁడు మృతినొందినాఁడఁట. నీ నిజనామము నీయునికి నీ నీచజన్మము నాకుఁ దెలిసినవి నీకును మరణదండన విధించినాను పో" యని యానతీయఁ దనసుందరకాయము నేలఁగూల వాఁడు మూర్ఛిల్లి "అయ్యో! బిచ్చమెత్తుకొని బ్రతుకకుండ దౌలతరావు నాకొంప దీసినాఁడు. ఎనుబది యేండ్లది మాయమ్మ జీవించియున్నది. చచ్చిచచ్చి నేనొక్కఁడను బ్రతికినాను. క్షమింపుతల్లీ' యని ప్రార్థించి యతఁడేడ్చెను. కాని యీమె వానిని క్షమింపదయ్యె. నెమలియీఁకలఁ దగుల్చుకొని నెమలినని చెప్పుకొను మాలకాకివలె శాయాజీ యనుపేరు బెట్టుకొని రాణికిసన్నిహితజ్ఞాతినని స్వల్పకాలము మహారాజభోగ మనుభవించి దౌలతరావుచేతిలోని కీలుబొమ్మయై దేశక్షోభకుఁ గారణుఁడైన మహారాజుగారును మన్నెసుల్తానుగారగు గండాభిల్లును నేక కాలముననే యురిదీయఁబడుటకుఁ జెట్లకుఁ గట్టఁబడిరి. పాపముదుండిరావున కెంతకష్టమువచ్చినది! దుం

డిరావును గండాబిల్లును నేకకాలముననే యురిదీయఁబడిరి. వామన భట్టును క్షమియించి రాణి వానిని రెండుసంవత్సరములు చెఱసాల నుంచెను. వికలాంగుఁడైన కృష్ణపంతునకుఁ బనిసేయనక్కఱలేకయే నెలకు నేఁబదిరూకలు జీవితమేర్పఱచెను. రమునితమ్ముఁడగు శాట్ రావునకు నెలకు ముప్పదిరూకలు జీవిత మేర్పఱచి యొక యుద్యోగ మొసఁగెను. తరువాత వెనుకటియుద్ధములలో విశ్వాసవంతులగు వారికి బహుమానములు బిరుదులు నొసఁగుచు శ్యామసుందరునకుఁ గొత్వాలుపని నొసంగెను. తరువాత వివాహములుసేయ నిశ్చయించి దత్తును గమలయు సమానశాఖలోఁ జేరిన శూద్రులేయని తెలిసి శుభముహూర్తమున వారిరువురికిని ముక్తకును బ్రతిజ్ఞానముదరి మును ధైర్యమను తెప్పచే నీఁదిన జస్వంతరావునకు వివాహములు చేసెను. శ్యామసుందర దత్తాత్రమన్మథ సామ్రాజ్యలక్ష్మిని నాఁటికి నేఁడు కన్నుల కఱవుదీర వీక్షించునప్పుడును శరీరము శరీరముతోఁ దాఁకి నిలుచునప్పుడును వానికంటె నామెయు నామెకంటె నతఁడు ననుభవించిన యానందమును మన్మథవ్యాపార పారీణులును నింపు జవ్వనమువనుండి ప్రథమసంయోగము గలవారును నూహించు కొందురుగాక! అట్లు వివాహితులై కమలాశ్యామసుందరులు మహా నందముతోఁ జిరకాలము సకల సౌఖ్యములు ననుభవించిరి.

సమాప్తము.

---




## మొదటిప్రకరణము.

ఒకనాఁటి సూర్యాస్తమయ సమయమున శరీరమునందంతట భస్మముఁ బూసికొని కాషాయాంబరములఁ గట్టుకొని యొకమార్గస్థుఁడు యమునానదివైపునకు వచ్చుచుండెను. అతఁ డేగ్రామము నుండి వచ్చుచుండెనో యేగ్రామమునకుఁ బోవుచుండెనో యెఱిఁగిన వారెవ్వరును లేరు. మార్గమధ్యమున నొకరిద్దరాతనిని బలుకరించిరి. కాని వారికతఁ డెట్టి ప్రత్యుత్తరమును నీయలేదు. అది వేసవికాల మగుటచేతను, సకలజంతు భయంకరముగా నామధ్యాహ్నమున గాడ్పువీఁచుటచేతను, నామనుష్యుఁడు మార్గాయాసము వలన డస్సియుండెను. ఆతని యాయాసమునుబట్టి దూరప్రయాణము నతఁడు చేసెనని నిశ్చయముగాఁ జెప్పవచ్చును. అతఁడు రమారమి నలువది సంవత్సరముల వయస్సు గలిగియున్నను, నంత వయస్సుగల వానివలె గనఁబడఁడు. ఆమనుష్యుఁడు పొడగరికాఁడు కాని కేవలము పొట్టియని చెప్పుటకు వీలులేదు. శరీరము చామనచాయఁ గలదియై యుండెను. ఆయనను జూచువా రందఱు నతఁడు సుందరపురుషుఁడని యనకమానరు. లావుగానున్న శరీరమునం దాపాదమస్తకము వఱకును భస్మమలఁదఁబడి యుండుటచేతను మెడలో యజ్ఞోపవీతము వస్త్రముచాటుననుండి కనఁబడకుండుటచేతను, నతఁ డేజాతిమనుష్యుఁడో తెలిసికొనుట దుర్లభముకాని, యాతఁడుత్తరహిందూస్థానవాస్త

వృద్ధుఁడనియు నందుబ్రహ్మక్షత్రియవైశ్యజాతులలో నొకజాతివాఁడని యు మాత్రమూహింపవచ్చును. తీవ్రమైన సూర్యతాపమువలన బయలు వెడలిన చెమ్మటచేత శరీరమునం దలఁదుకొన్న భస్మ మక్కడక్కడ కరఁగిపోయి యతని సహజకోమలమైన శరీరమును జూపుచుండెను. గడ్డమును జడలును నతఁడు యోగియని చెప్పుచున్నవి. కాని చక్కగా నవి పెరుఁగకుండుటచేత నూతనముగా నాశ్రమస్వీకారము నొనర్చినట్లు చూపరు గ్రహింతురు. భగ్నభగ్నమని కాలుగాలుచుండినను, నెండవేఁడిమిచే శిరస్సు మాడుచుండినను, నతఁడు పాదరక్షలు కాని గొడుగు కాని ధరింపకయే దినమంతయుఁ బ్రయాణము జేసెను. బైరాగులు దగ్గఱనుండు కక్షపాల, యతనిదగ్గఱనుండెనుగాని యోగిజనుల కత్యంతప్రియములగు గంజాయియుఁ జిలుమును నందు లేవు. యమునానదీతీరమున నున్న మధురాపుర సమీపమునఁ కతఁడు నాలుగుగడియలప్రొద్దువేళ వచ్చి యేమికారణముననో పట్టణమునఁ బ్రవేశింపక కొంతదూరమున నున్న మామిడితోఁటలో దాఁగియుండి సూర్యాస్తమయ మయినతోడనే యాస్థలమును విడిచి చీఁకటికాలమగుటచేత నొరులకంటఁబడకుండ యమునాతీరమునకుఁ బోవుచుండెను. నదీతీరమునఁ జేరినతోడనే చంకనున్న కక్షపాల నొకమూలఁ బడవైచి కాలుసేతులు జన్నీటఁ గడిగి మొగముపైని నానిర్మలోదకములఁ జల్లుకొని నాలుగుపుడిసిళ్ల నీళ్ళు త్రాగి యచ్చట నిసుకతిన్నెపై నించుక శయనించెను. అప్పుడు యమునాజలబిందువులతోఁ గూడ మలయమారుత మరుదెంచి యాప్తమిత్రుఁడు వచ్చి మీఁదఁ జేయి వైచి తట్టినట్లు గనుమార్గాయాసము నొందియున్న యాతని శరీరమును స్పృశించి యాయాసము నపనయించెను. అతఁడును సకలజనసులభమైన యీదైవదత్తసౌఖ్యముచేత పరవశత్వమునొంది కనులు మూసికొని హాయిహాయి యని కొన్నినిమిషములవఱకును దనకష్టము

లనెల్ల మఱచిపోయెను. ఆసమయమునం దాకాశమున ననంతకోటి నక్షత్రములు మిణుకుమిణుకు మని జ్యోతులవలెఁ బ్రకాశించుచుండెను. అదినిర్జనస్థల మగుటచే నీలకోఁడి, చిమ్మట, మొదలగు జంతువుల రొదతప్ప మఱియొకధ్వని యేదియు లేదు. నిశ్శబ్దముగ నున్న యాస్థలమునందు శయనించిన కొలఁదినే యతనికిఁ గత పూర్వవృత్తాంతము జ్ఞప్తికివచ్చి వానిని విచారమునం దుంచెను. వెంటనే యతఁడు "హా దైవమా! ఎంతకష్టము గలుగఁజేసితివి. అహా! ఏమి తుదకలదారిద్ర్యము. ఈమహాసామ్రాజ్యపరిభ్రష్టు మెట్లు దైవ సహించునో" యని తనలోఁ దాననుకొనుచు వశముగాక వచ్చిన బాష్పజలములను దుడుచుకొని యాకాశమువంకఁ జూచునప్పటికిఁ జిన్నమబ్బు కనఁబడెను. అది క్రమక్రమముగా గొప్పదై యాకసమునంతను నాక్రమించుకొనుటచేతను, దానితో గాలిదుమారము వచ్చుటచేతను వర్షమువచ్చునని యోజించి యిసుకతిన్నెమీఁదఁ బవ్వళించిన యీయోగి యెచటతల దాఁచుకొందునాయని చింతింప నారంభించెను. కొంచెమాలోచించుకొనునప్పటికిఁ దాను బగలు దాఁగికొన్న మామిడితోఁపునకును నదికిని మధ్యనున్న పాడుదేవాలయ మాతనికి జ్ఞప్తికి రాఁగా నటకుఁబోవఁ బ్రయాణమయ్యెను. ఆదేవాలయమునకును నదీతీరమునకును గొన్ని గజముల దూరముమాత్రమే యుండుటచేత నీమనుష్యుఁడు త్వరితముగా నడిచి గుడివైపునకు వెళ్లెను. కాని యంతకుముందే చినుకులారంభమై యెండచేఁగాఁగియున్న యోగిశరీరమును వడఁకునట్లుచేసి యాతని వస్త్రములఁ దడిపెను. బట్టతడుపుజల్లువాన కురియునప్పటికి మన బాటసారి దేవాలయపు ముంగిలిభాగమునకు నడచెను.

ఆదేవాలయము మనము వ్రాయుచున్న యీకాలమునాఁటికి శిథిలావస్థనొందినను బూర్వకాలమునందుఁ గొన్నిదినములున్నతదశ యందుండెను. క్రీస్తుశకము 1016 వ సంవత్సరమునందు గుజనీమహ

వ్వాఁడు హిందూదేశముపై దండెత్తి జగత్ప్రసిద్ధపుణ్యక్షేత్ర మగు మధురానగరమునం దిద్దేవాలయమును దోఁచికొని స్వామివిగ్రహమును స్వహస్తములతోఁ బెకిలించి దేవాలయమునెల్ల భూమితో మట్టము చేసెను. ఈదేవాలయ మూరిబయట నుండుటచేత మ్లేచ్ఛవిగ్రహపుస్వయ ముగా నాశనము చేయలేదుగాని సన్యాసులు విగ్రహారాధన మొప్పియుండుపై స్వయముష్ట్యాగ్నంశకాంతముగ దానమునసించిరి. నాఁట నుండియు నాకోవెల శిలావిగ్రహశూన్యమయ్యె నిప్పుడప్పు డర్ధ రాత్రములయందు మనుష్యవిగ్రహములుఁ గూడియుండుటగలదు. పరదేశవిద్యమానములను చేయుచున్న బాటసారులను, ద్రవ్యవంతు లను వణిజులను దోఁచికొని స్త్రీలను జెఱఁబట్టి స్వచ్ఛందవిహారము సేయు దుర్నీతిపరులగు దొంగలకును దురాచారులకును నాదేవళము శరణ్యంబై యుండెను. అందుచేత దీపములుపెట్టినతరువాత మధురాన గరవాస్తవ్యులెవ్వరు నాదేవాలయప్రాంతమునకు రారు. అరిగిననపా యములేకరారు. ఒకనాఁడు శవవహనమైనసుగ్గులుకనఁబడుటవలనను నింకొకనాఁడు మనుష్యులు ధరించు కొన్ని వస్త్రములును జిలుమును గనఁబడుటవలనను జను లాప్రాంతమునకు బొత్తుగా వచ్చుటమానిరి. ఈపరిదేశమునకు నలుదెసలను దట్టముగనున్న వృక్షములు పెట్టెలికో టవలె నుండుటంబట్టి చోరులకు నదుపాయ మెక్కువగ నుండెను. ఆదేవాలయమునందుఁ బూర్వము శ్రావ్యమైన మురళీనాద మొనర్చు చుఁ గాళియుని పడగలపై నాట్యమునలుపు శ్రీకృష్ణుని విగ్రహముం డెనని పట్టణమునఁగల వృద్ధు లప్పుడప్పు డాస్థలమును జూచునప్పు డనుకొనుచుందురు. తురుష్కులు చేసిన నాశనమునకుఁదోడు కాలము గూడ దేవాలయ ప్రాకారమును నాశనదేవతపాలు చేసెను. మనము వర్ణించెడు కాలమునాఁటికి ముఖాలయమొకటి తక్క మఱి యేదియులేదు. గర్భాలయము సహజముగా నంధకారబంధురమై

యుండెను. నాఁటిరేయి మేఘములచే గుడియందుఁ జీఁకటి పది రెట్లధికముగ నుండెను. మన తెరువరి తడిసిన వస్త్రముల నారఁ గట్టి కటుపాలయందున్న పాడిబట్టను దీసి కప్పుకొని మహాగుహ వలె భయంకరముగా నున్న యాదేవళముఁ బ్రవేశింప జంకుచుఁ జలిబాధ కోర్వఁజాలక లోనఁజొరఁబడి తప్పటడుగు లిడుచుఁ గొంత దూరముపోయి పూర్వము విగ్రహము పెట్టియున్న స్థలమునఁ గూర్చుండెను. అతఁడక్కడఁ గూర్చుండి తన పూర్వాశ్రమ సంబంధములగు దుఃఖాలోచన సముద్రమునఁ మున్గి పరవశత్వముఁ జెందియుండ నాసన్నప్రదేశమునం దతనికి మనుష్యుల యలికిడి వినఁబడి యాతనిఁ జింతాసమాధినుండి మేలుకొలిపెను. నిర్మానుష్యప్రదేశమున నరుల యలుకు డగుట కతఁడాశ్చర్యపడి యది నిజమా యబద్ధమా యని వితర్కించుచుండఁగా నిద్దఱు మనుష్యులు చీఁకటియందుఁ దళతళ మెఱయుచున్న ఖడ్గములు హస్తములఁ ధరియించి గుమ్మముముందఱ నిలువఁబడిరి. అప్పటికి వర్షము మానిపోయినందున వారి దేహము లంతగాఁ దడిసి యుండలేదు. చేతులనున్న ఖడ్గములను గోడకుఁ జేరవైచి గుమ్మము ముందఱ నిలిచి దేహములను దుడుచుకొనుచు వారొకరితో నొకరు మాటలాడక యెవరినిమిత్తమో నిరీక్షించుచుండిరి. ఇట్లుకొంతసేపు చూచి వారిరువురు లోనఁబ్రవేశించిరి. అందొకఁడు మహారాష్ట్రుఁడు; రెండవవాఁడు తురుష్కుఁడు. తురుష్కుఁడు దీర్ఘకాయముతోను, దూలములవలెనున్న భుజద్వయముతోను గుండెలను దాఁకుచున్న నల్లనిగడ్డముతోడను జూచువారికంటికి భయమును గల్గించుచుండెను. భయంకరమైన యాకన్నులు భావలోకనము చేసినవారెవరును దయయనున దతనియందులేదని నిశ్చయముగఁ జెప్పఁగలరు. మహారాష్ట్రుఁడు కొంచెము గొప్పకుటుంబమునం దుద్భవించినను గాలవశమున ధనాదులు గోలుపోయి దురాచారుల స్నేహముఁ జేసి దౌర్జన్య

ములందారి తేలెను గాని ముఖవిలాసముజూడఁ గొంచెము జాలిగల వాఁడనితోఁచును. అయినను దొంగతనము మనుష్యవధ మొదలగు దుష్కార్యములనాచరించుటకు జంకును సందేహమును నిరువురకును లేవు. అదివఱకు గోషులకుఁ జేరవైచిన ఖడ్గముల నొరలలో నుంచి వారు దేవళము నునుముందఱఁగూర్చుండి యేదో యోచించుచుండిరి. అందు మహమ్మదీయుఁడు మహారాష్ట్రునిఁజూచి యిట్లనియె.

సందా! బాలాజ యింకను రాకుండుటకు నేమి కారణము? అతనినిమార్గమునం దెవ్వరైనఁ బట్టుకొనియుందురా?

సందు—గులామల్లీ! నీకింత వెఱ్ఱియెందుకు? మనబాలాజి యిదివఱకెన్నఁడైన నొకరిచేతఁ జిక్కెనా? అతఁడు దేవాంతకుఁడని యెఱుఁగవా?

గులా—అవును! నేనెఱుఁగుదును. అందుచేతనేమనకీవఱకెన్నఁడును జక్రవర్తివలన భయము లేదు. మనరహస్యముబయలుపడలేదు.

సందు—మనచేతనీకార్యములఁ జేయించుచున్న రహిమాన్ఖాన్ సలాయుద్దీనుచక్రవర్తికడ గొప్ప యుద్యోగమునందుండఁగా మనకు నెవరిభయమును గలుగదు. అతఁడు సుఖవంతుఁడగుఁగాక!

గులా—మొన్నటిరాత్రి స్త్రీలను దోఁచుకొన్నప్పుడుదొరకిన నగలలో నెన్నవవంతు మనము తీసికొనునట్లు ప్రభువుగారేర్పఱచినారు?

సందు—ఎంతయిచ్చిన నంతే మనము పుచ్చుకొందము.

గులా—అదిసరే. కాని యీదినముల మనుష్యులను నఱికినట్లు నీవిదివఱకెప్పుడు నఱికియుండలేదు. ఒక దెబ్బకు రెండుతునకలుగదా! వహవ్వా! శహబాస్! అటువంటి యేటు మఱిదొరకదు.

సందు—అదియొక్క లెక్కా? నెలదినములక్రిందటఁబ్రయాగలో యాత్రికవరుసఁదెంగిన యోధులను దోఁచుకొన్నపుడు

దయాదాక్షిణ్యములులేక స్త్రీలను శిశువులనుగూడ నఱికివేసినాను. నాఁడు నీవుచూడలేదా?

అని వీరిరువురు సంభాషించుకొనుచుండఁ బోతివిగ్రహమువలె నాలయమధ్యమున సుఖాసీనుఁడై యున్న మనబాటసారి భయముచే గడగడవడంకుచు నేమియుఁ జేయలేకయుండెను. వారిసంభాషణము నుబట్టి వారు మనుష్యహంతకులని యతఁడు తెలిసికొనెను. వారిదివఱ కతనినిజూడక తమరహస్యముల బయలుపఱచుకొనుచుండిరి. అప్పుడు నందుఁడు కొంచెము గంజాయి పీల్చవలెననికోరి సంచిలో నున్న చెకుముకిరాతిని నినుపముక్కను దీసి వానిరాపిడిచే నగ్నిని పుట్టించి చిలుములో గంజాయియాకును బొగాకునువైచి యందు నిప్పంటించి తాను నాలుగు గుక్కలను దాగి గులామున కందిచ్చెను. ఈనిప్పు వెలుతురున గులాము మనుష్యుఁడాలయమున నున్నట్లు జాడగట్టి తన యనుమానమును నందుని చెవిలోవైచెను. సహజలక్షణమైన క్రౌ ర్యములకు గంజాయిమత్తు తోడ్పడ, వెంటనే నందుఁడు త్రొక్కుచు పాము వలె లేచి మన బాటసారియున్నవైపున కరుగుచుండఁగా గులా మాతనిని వెంబడించెను. అదివఱకే భయకంపితుఁడైన మన తెరువరి యీదురాత్ములు తనవైపు వచ్చుచుండుటఁజూచి కెవ్వునఁ అఱచి స్మృ తితప్పఁగ తన యున్నస్థలమునుండి క్రిందఁబడెను. అతనిఁజూచి నందుఁడును గులామును నాశ్చర్యపడి యొండొరులతో నిట్లు సంభా షించిరి.

నందు—అరే! అన్నయ్యా! ఏవఁడురావీఁడు?

గులా—ఎవఁడో మనమాటలువిని మనగుట్టుఁబైటఁబెట్టఁదలం చినదొంగ.

నందు—ఈభండాలు నిప్పు డేమి చేయుదము? ఏదీ కత్తి యీలాగునతే.

గులా—కి త్రిత్రోఁ గొట్టవద్దు. ఈలాగునఁ జేయుదము. (అని చెవిలో రహస్యముగాఁ జెప్పెను.)

అట్టిసమయముఁ గూడఁ బలుకకొనినిస్పృహాన్వితుఁడై యున్న యూదీయునినోట గుడ్డలఁగుక్కి శిరస్సునొకరును పాదములొకరును బట్టుకొని మోసికొనిపోయి యతఁడు గిజగిజ తన్నుకొనుచున్నను వదలక నదీతీరముఁ జేరి లోతునీటం దిగి, చావు మునుఁగకొనక, యని వాని నందుఁ బాఱవైచిరి. తరువాత వారిరువురు నాలయమునకు వచ్చి యాతని కటపాలను వెదికి యందుండి కొన్నివస్తువులను సంగ్రహించి తమప్రియమిత్రుఁడైన బానాజీ కాఁడని నిశ్చయించుకొని యథేచ్ఛం జనిరి.

---

## రెండవ ప్రకరణము.

ఆగ్రామమునకు రమారమి పదునైదుక్రోశముల దూరమున "పాలి" యను చిన్నగ్రామము కలదు. తత్పరిసరమున నున్నమండలమునకు దానిని ముఖ్యపట్టణముగ నొనర్చి యందొక ప్రతినిధినేర్పఱచి యాతనికి సర్వస్వతంత్రాధికారమిచ్చి చక్రవర్తియగు అల్లాయుద్దీను పరిపాలనము సలుపుచుండెను. పాలిసర్కారున కీసమయంబున రహిమానుఖాన్ ఖిల్లాదారుగ నుండెను. అతఁడు మొదట పారసీకదేశమునుండి వచ్చిన బానిసవాఁడయ్యుఁ దనస్తోత్రపారనైపుణ్యముననో దురాచారసంపత్తి చేతనో యల్లాయుద్దీనుచక్రవర్తి కాప్తవర్గములోనివాఁడై నానాఁటికి నున్నతపదవుల నొందుచుఁ దుదకు నీయధికారమునొందెను. ఈతఁ డీనూతనపదవినొంది యిప్పటికి మూఁడుసంవత్సరములైనది. అధికారప్రాప్తియైనదిమొదల లాతఁడు

గర్వోన్మత్తుఁడై రాజ్యోద్యోగస్థుల నందఱ నగౌరవంబుతోఁ జూచుచు నిజాధికారమునకు లోఁబడిన ప్రజల ననేకకష్టముల పాలు చేసి ప్రజావిరోధియై యుండుటయేగాక యంతఃపురస్త్రీలను జెఱపట్టుటయు దురాచారులచే దొంగతనములఁ జేయించుటయు లోనగు దుష్కార్యకారియుఁడై యహోరాత్రములు మద్యపానమత్తుఁడై స్త్రీజనమధ్యంబునఁ గాలము పుచ్చుచుండెను. అది చిన్నగ్రామమగుటచే నచ్చట నున్నయుద్యోగస్థులలో నెల్ల ఖానుగారే మహోన్నతపదవియున్న కారణమున జనసామాన్య మాతని నవాబని చెప్పుకొనుచు నతని కటాక్షపాత్రు లగుటకు యత్నించుచుందురు. వెయ్యేల! చండతరమైన ఖానియొక్క పరిపాలనచేఁ బ్రజలు మలమల మాఁడుచు నన్నవస్త్రములకు దూరులై యాత్మసమరణ మెదురుచూచుచు సాధ్యమగునేని తామె యాతనిఁ దునుముట్టింపఁ దలంచుచుండిరి. ఈతఁ డన్యమతస్థులగు హిందువులకే కాక సదాచారపరాయణు లగుమహమ్మదీయులకు ననిష్టుఁడుగ నుండెను.

క్రీ. శ॥ 1301 వ సం॥ రము వేసవికాలమున నొకనాఁటి మధ్యాహ్నము నిద్దరుమనుష్యు లశ్వారోహణ మొనర్చి పాలిగ్రామ సమీపమునకు వచ్చుచుండిరి. అందు ధవళతురంగమునెక్కి మన్మథునివలె లావణ్యనిధియైన యొక రాజపుత్రకుమారుఁడు సేనానాయకుఁడైన తోడివారలను దన మృదుమధుర వాక్యములచే హెచ్చరించుచు నెండతాపము నుస్సురనుచు వచ్చుచుండెను. మదనసింగు రమారమి యిరువదియైదు సంవత్సరముల వయస్సుగలిగి మూర్తీభవించిన పూర్ణయౌవనమువలె సర్వాంగసౌష్ఠవముతోడను నిరంతరమందహాసవిలసితమైన మొగముతోడను, విశాలవక్షస్స్థలముతోడను జూచువారెల్లరు మెచ్చునట్లుండెను. అతని ధవళాశ్వముమీఁదఁ బాగసీక దేశపుజీను వేయఁబడియుండెను. చలువచేసిన తెల్లనిపరాయిదొడిగికొని

విశాలమైన జరీపట్టుతోఁ దలతలమని సూర్యకాంతిచే మెఱయుతలపా గను ధరించి, నిగనిగకాంతులను గ్రక్కుచున్న నల్లమొహము లంగ రకహాళిని, నడుమునకు పటకాతో బిగించి, పైనున్న కాశ్మీరశాలువ నెం డకడ్డముగ మీఁదవైచుకొని గుఱ్ఱమును మాటిమాటికిఁ జబుకుతో బెదరించుచుఁ బ్రయాణము సేయుచుండెను. క్షత్రియకుల శిరోభూష ణుండును, దనయోలికయుఁ, జిత్తూరురాజ్యసంరక్షకుఁడును నగు భీమ సింగునకు మదనసింగు బాలుఁడయ్యు నాంతరంగికుఁడగుటచే స్వామికా ర్యనిర్వహణమునకై యప్పుడాగ్రానగరమునఁ గారాగారాంతరమున వసించు చున్న చక్రవర్తియొద్దకుఁ బోయి తన ప్రభువు పంపిన సందేశమును దృష్టికరముగ నిర్వర్తించి చక్రవర్తిదయసంపాదించి తిరిగి చిత్తూరున కతఁడు వోవుచుండెను. అల్లాయుద్దీ నతనితోఁగూడ నాజరుజంగను నతని నిచ్చి పాలిగ్రామమువఱకు మదనసింగునకు సహాయమొనర్ప వలసినదని పంపెను. నాజరుజంగు హిందూస్థానవివాసులగు మహమ్మ దీయులలోఁ బ్రఖ్యాతిగన్న వంశభూతుఁడై గుణములచేఁ దనవంశ మునకుఁ గీర్తిఁ దెచ్చుచుండెను. చక్రవర్తికాతనియందుఁ గొంత నమ్మకము గలదు. మదనసింగు నాజరుజంగును సహజసద్గుణ సంప న్నులు గనుక నాగ్రానగరముఁ దున్నప్పు డిరువురకు స్నేహము య్యెను. అట్టిద్దఱును బయలుదేరి పాలిగ్రామమునకు వచ్చుచుండఁగా మార్గమధ్యమున బందిపోటుదొంగలసంఘ మొకటి వారిపైఁబడ శౌర్యరాసియగు మదనసింగు నాజరుసహాయమున దొంగలనందఱఁ బాఱఁదోలి యందనేకులవధించెను. స్వభావసిద్ధముగ నతఁడు మోటు చొరవయుఁ దెగువయుఁగల శరీరలక్ష్యము లేని సాహసుఁ డగుటచే సంపూర్ణ జయమునొందినను మెడమీఁదఁ జేటికెనవ్రేలులోఁతుగల గాయము నొందవలసి వచ్చెను. ఎండవేఁడిమిచేతను, గాయపుమంట చేతను దాళఁజాలక రెండుమూఁడుపర్యాయము లతఁడు మూర్ఛిల్లసి

ద్ధముగ నుండి వెంటనే తెలివిఁదెచ్చుకొని కష్టముమీఁదఁ బ్రయాణ మొనర్చుచుండెను. ఏకధారగ స్రవించుచుఁ జూపఱకుఁ గనులు మిఱుమిట్లుగొలుపు రక్తముచే నతని యంగరకాలన్నియుఁ దడిసి శరీరమున కంటుకొనిపోయి మిగుల బాధకరముగ నుండెను. మకనసింగుతోఁ జిత్తూరునుండి వచ్చిన సేవకు లెవ్వరును భయకంపితులై నోటమాట లేక హృదయస్థితవిచారమును నేత్రబాష్పములవలనఁ దెలియఁజేయుచుండిరి. స్వల్పకాలపరిచయుఁడైనను నాజరుజంగు తన మిత్రుని యవస్థకు మిగులఁ గుందుచు నతనికి ధైర్యముఁ గలిగించుటకు బహువిధప్రయత్నంబులు సలిపెఁగాని యవియెల్ల వ్యర్థములయ్యెను. కొంతసేపు నిశ్శబ్దముగ నయ్యాశ్వికులు నడచిరికాని తుదకు నాజరుజంగు రసపుత్రకుమారుఁ బలుకరించె. "నాలుగుగడియ లోపికఁ గలిగియుండుము. గ్రామసమీపమునకు వచ్చినారము. ఆచెట్లచాటున నున్నదే పాలిగ్రామము" అని హెచ్చరించి కొంచెము మంచితీర్థ మతనికిఁ ద్రావనిప్పించె. నీరుత్రాగి సేదదేఱి రసపుత్రుఁడు ధైర్యమును బూని గుఱ్ఱముపైఁ గూర్చుండఁగా మరల నాజరుజం గిట్లనియె. "ఈ గ్రామమున మాబంధువుఁడును జక్రవర్తికిఁ బరమాప్తుఁడునైన రహిమానుఖానున్నవాఁడు. మనకు సమస్తోపచారములు నతఁడుచేయును" ఈమాటలతరువాత నిశ్శబ్దముగా వారందఱు నడచునప్పటికి గ్రామము వారియెదుట నతిదూరమునఁ గనఁబడెను. ఈయాశ్వికులు గ్రామసమీపమున కరుగుట, ఖానుయొక్క సేవకులు కోటబురుజులమీఁదనుండి దూరముననే చూచి రహిమానుఖానున కెఱిఁగింప నతఁడును సముచితవస్త్రములు ధరించి వారి నెదుర్కొని సగౌరవముగ నాదరించి మకనసింగుయొక్క దురవస్థనుజూచి గాయమునుమాన్పు మంగలివానికై వర్తమానముపంపెనుగాని యతఁడూర లేనందునఁ గొంచెము విచారించి ఖాను నాజరుజంగుతో నిట్లనియె. "తమ్ముఁడా! మంగలి

వాఁడు లేఁడని మనము విచారింప నక్కఱలేదు. ఆవల మఠమున నొకవృద్ధుఁడగు బావాజీకలఁడు. ఆతఁడంధుఁడైనను గాయములను గనుఁగొనుట బాగుచేయును. ఈతని నిటకుఁ దీసికొని పోండు" అని చెప్పి తన సేవకులలో నొకనిని మఠమునకు జూపుటకుఁ బంపెను. పిదప సింగుఁడు మెల్లమెల్లగా మఠమునకుఁ గొనిపోఁబడెను. రాత్రినాలు గుగ్గడియలు కాలమైనది. బావాజీయును సాయంకాలానుష్ఠానములను దీర్చుకొని భోజనముచేసి పండుకొనుటకు సిద్ధముగనుండెను. ఖానుచే నంపఁబడిన పరివారము ద్వారమునందుండి ఖానుయొక్క సేవకుఁడు బావాజీ మహారాజ్, అని కేకలువేసి తలుపుదట్టెను. బావాజీ యాతని కంఠధ్వని నానవాలుపట్టి తనకడ కెవరైనరినో గాయపడినవారిని దోడుకొనివచ్చెనని యెంచి తనప్రక్కను బవ్వళించిన మనుమరాలిని మెల్లగఁ జేతితోఁదట్టి "హేమలతా! హేమలత! తలుపుఁదీయు మమ్మా" యని పిలిచెను. సాధుశీలయు నవనీతహృదయయు నగు హేమలత తనపితామహుఁడు పిలిచినంతనే లేచి తన్నుతఁడు పిలిచిన కారణ మెఱిఁగి నిద్రాభారముచేఁ గనులు నులిమికొనుచు నతిదీర్ఘమగు వేణీభరమువీడి ప్రక్కలఁబైఁబడ మెల్లమెల్లఁగఁ దలుపుదీసెను. అప్పుడు రాజసేవకులవలన వేయఁబడిన కాగడాలవెలుతురున హేమలత ముఖము సంపూర్ణశరత్కాలచంద్రమండలమువలె ముద్దులమూటఁగట్టుచుండుటచే నొకనిమిషమువఱకును వారందఱు నిశ్చేష్టులై మానసింహునియొక్క యదృష్టము మెచ్చి యనిమిషత్వముఁ బొంది యామె సురూపమును గాంచిరి. వారి యాశ్చర్యమొకకొంతతగ్గువఱకు కామె తాత దగ్గఱకుఁబోయెను. అంతట సేవకులు వృద్ధునికోఁ దమ రాకకుఁ గారణ మెఱిఁగించి స్మృతియెఱుంగకయున్న రాజపుత్రుని జూపిరి. వృద్ధుఁడును వానికిఁ బ్రక్కగదిలో నొకమంచము వేయించి పూర్ణాంధుఁడు గనుక గాయమును దనహస్తముతోఁ దడవి "యిదిదిట్టమైనగాయమే.

అయినను రామదేవునిదయచే నాకిది సాధ్యమగునని తోఁచుచున్నది. మీరందఱు నావలకుఁ బొండు. ఒకముహూర్తమిచటనుండుఁడని చెప్పి వారినందఱ నవలకంపకముందే యంధుఁడయ్యు నేత్రములున్నవానికంటె నేర్పుగ గాయమునుగట్టి దానిపై నొకపట్టిక వైచెను. అంతవార్ధకమునఁ బతనికిఁ గల యోపికకును నపారప్రజ్ఞకును నందఱు నాశ్చర్యపడి కన్నులున్నను నెంతనేర్పరియై యుండునో యని యోచింప నారంభించిరి. తరువాత వారిపరివారమున నొక్కనిఁ దక్కఁ దక్కినవారలనందఱ నావలకంపి వృద్ధుఁడు మనుమరాలిం జూచి "అమ్మాయి! ప్రొద్దుపోయినది పండుకొను" మని చెప్పెను కాని యెందుచేతనో హేమలతకు నిద్ర రాకుండుటచే "దాదా! ఈయన యవస్థను నేను గొంతవఱకుఁ గనిపెట్టి యుండెదను. పెద్దవాఁడవు నీవు నిద్రపొమ్ము నే నిదివఱకు నిద్ర పోయినా"నని ప్రత్యుత్తరమిచ్చి తానామంచమువద్దఁ గూర్చుండి మదనసింగు లక్షణములఁ జూచుచుండెను. యోగియు మదనసింగుయొక్క యనుచరునివలన నతఁడు క్షత్రియ రసపుత్రవంశస్థుఁడని యెఱింగి గాయముతగిలినకారణ మడిగి తెలిసికొనిపిమ్మట నిద్రపోయెను. రసపుత్రుఁడును సుఖముగఁ గొంతవఱకు నిద్రించెను. హేమలత యతని మంచముదగ్గఱఁ గూర్చుండి ఱెప్పవాల్పక చూచుచుండెను. హేమలత యసమానరూపలావణ్యములయం దాకాలపుస్త్రీలలో నెల్ల శిరోరత్నమై యుండెనని చెప్పుటకు సందియములేదు. నిరంతరము నామెను బాయకుండు సద్గుణములుతక్క దదితరభూషణములామెకడ లేవు. ఆకర్ణాంతవిశాలనేత్రములును, దొండపండువలె సహజారుణ్యముగల మోవియు వంకరతిరిగి విండ్లవలెనున్న కనుబొమలును, నిరంతరమునుండు హాసమును, నామె ముఖారవిందలావణ్యమును బరిపూర్ణత నొందించెను. ఆమెపితామహుఁ డాగ్రామము వచ్చినప్పుడు బాలికగ నుండుటచే

శుక్లపక్షచంద్రమండలమువలె దినదినప్రవర్ధమానమగు నామెరూపము జూచి తత్పురవాసు లామెయెడ ననురాగసమేతు లయిరి. ఆమె రాజవీధిని బోవుతరి తేరిపాఱి యామెను గన్గొనని చాటసాహసులును, ఉత్కంఠముగఁ బుష్పహారములు వేయని పూలవర్తకులును, నామెకొఱకుఁ జక్కెర పెట్టని కోమటులును లేరు. కాని యీ జగన్మోహనాకారము ప్రజల కనేకులకు విచారకారణమయి యుండెను. ఇంతసౌందర్యవిలాసవతియగు కన్య యేమహారాజు గర్భమునైన నుదయింపక నిరుపేదయయిన జాత్యంధుని మనుమరాలయి పుట్టి సామాన్యస్త్రీవలె పాటుపడవలసివచ్చెను గదా యని జనులందఱు విచార మొందుచుందురు. కెంగురాకులకు వన్నెదెచ్చు నామె పరిశస్త హస్తములతో బావినీరు తోడునప్పు డామెవ్రేళ్ళుకందినొప్పులెత్తుటఁజూచిన స్త్రీలందఱు నొక్కుమారు కంటఁదడిపెట్టుకొని యామె నేపనిని జేయనీయక తామె యామెకయి సకలకార్యములను జేయుచుందురు. ఈమెసంప్రాప్తయౌవనయైనదిమొద లామెతాత యామెను వీథిలోని కరుగవలదనియు, దురాత్ములదృష్టిని బడవలదనియుఁ బలుమాఱులు చెప్పుచుండుటఁబట్టి మునుపటివలె నిలువెడలక గృహమునందే యుండుట కారంభించెను. అంధుఁడయిన పితామహుని పరిచర్యయం దతిశ్రద్ధ గలిగి యతని కామె సమస్తోపచారములు విసుగక చేయుచుండును. అందుచేతనే నిద్రాభంగ మగునేని తాతకనారోగ్యమగునని యతని నిద్రపుచ్చి యామె రోగిమంచమునొద్దఁగూర్చుండెను. అప్పుడు రెండు జాములరాత్రియైనది. మదనసింగును గాఢనిద్రాసక్తుఁడై నడుమ "ఓరి! దురాత్ములార! రండిరండి మీ ప్రాణము లపహరింపక మాననుఁడీ!" యని రెండుసారులు పలవరించెను. ఒకపర్యాయము లేచి దాహముత్రాగి యొత్తిగిలి పండుకొన్నప్పుడు మనుష్యావతారము ధరించిన సౌందర్యదేవతవలెఁ గట్టెదుట నిలిచి తనకు దాహ మొసంగి

న కాంతారత్నమును గన్నెత్తి చూచి మరల నిద్రపోయెను. హేమ లత యాతని ముఖావలోకనముఁ జేయుచు సుందరమందహాస మతని ముఖారవిందమున సంకురించునప్పుడు తాను నలుసవ్వు నవ్వుచు, వా నిశరీరమునఁ జెమ్మటపట్టునెడఁ దన శరీరమునఁ జెమట పట్టువఱకును విసనకఱ్ఱతో విసరుచు గాయమువలన రాచకొమరుఁడు బాధపడునెడఁ దానెంతయు విచారపడుచు నతఁడు జ్వరపీడితుఁడగువేళ, తాతను లేపి యౌషధ మొసఁగుచు నీతనితో సమస్త బాధలఁ దాను బడుచు నక లోపచారములఁ జేయుచుండెను. మదనసింగుయొక్క మనోహరాకార మును జూచుటాదిగ హేమలత కదివఱకెన్నఁడును జనింపనిదియు నిట్టిదని నిరూపింప రానిదియు నగు నొకానొక మనోవికార ముదయిం చెను. దానితో బాలికకు రాచకొమరునియందు ననురాగముప్పతిల్లెను. హృదయము గాఢముగ క్షత్రియపుత్త్రినియందుఁ దవులొ్కని మరల్చుకొనదమని యయ్యబల ప్రయత్నించిన మరలకయుండెను. అందుచే రాచకొమరునఁ డుచిరపరిచయుఁ డయినను, గుణ సముద్రుఁడై కడుసుందరుఁడగునీతని కింత బాల్యమునం దింతకష్ట మేలసంప్రాప్తిం పఁజేసితివి దైవమా! ఈతఁడు నిరపాయుండయి బ్రిదికి యెన్నఁడ యిన బట్టఁగట్టునా" యని దైవము ననేకవిధంబుల వేఁడుకొనుచు నిష్టదేవతాప్రార్థన మొనర్చుచు నామె చింతించుచుండెను. అప్పుడు రమారమి యొకజాముప్రొద్దుండుటచే కోడికూఁతవలన యోగి మేలు కొని మనుమరాలిని బిలిచి "అమ్మా! నీవు రాత్రి యంతయు మేలు కొన్నావు. ఇఁక నేను గనిపెట్టుకొనియుండెదను. నీవు నిద్రపొమ్ము" అని చెప్పి రోగిమంచముదగ్గఱకుఁబోయి యాతనినాడిఁ జూచి జ్వర మతి తీవ్రముగానుండుటచే మఱియొక క్రొత్తమందు వేసి మనుమ రాలిని నిద్రపుచ్చి తా నొంటరిగఁ గూర్చుండెను.

అప్పుడు తనకు జరిగిన మహోపకారము జ్ఞప్తికిరా "ఆహాహా!

అలాయుద్దీను చక్రవర్తి యొక్క క్రౌర్యము నన్నింతవఱకుఁదెచ్చినది! భగవంతుఁడు దుర్మార్గులకుఁ దోడ్పడుట కలియుగ ధర్మము కదా ? హా జలాలుద్దీను చక్రవర్తి! ఎందున్నావు. అట్టి ధర్మశీలుఁడగుపినతండ్రి నిజంపి సింహాసనమెక్కిన యలాయుద్దీనునకు నామీఁద దయ యెట్లుండును. ఇంతకు దైవానుగ్రహమేమో" యని యాత్మవిచారిమొందు నప్పటికి రోగి దాహమడుగుటవలన యోగితనతలంపుమాని దాహమిచ్చి శరీరముపైఁ జేయివైచి జ్వరముతగ్గినదని యెఱిఁగి సంతోషించి రాచకుమారుఁడు జీవించు నని నిశ్చయించుకొనెను. తరువాతఁ గొంతసేపటికి కాకలుకూయ నుదయపర్వతశిఖర మలంకరించుచు సకల జనమిత్రుం డగుసూర్యుఁ డుదయించి తన యరుణకాంతి దిగంతములయందుఁ బర్వ బంగరుపూఁతవలె నలరు లేఁతనీరెండ సమస్త పదార్థములపై వ్యాపింపఁజేసి వాని కపూర్వాలంకార మొసంగెను. తన యాప్తమిత్రుని యవస్థ యెటులున్నదో యెఱుఁగఁగోరి సూర్యోదయపూర్వముననే లేచి రహిమానుఖానుప్రముఖులను లేపి తనవెంటఁ బెట్టుకొని వచ్చిన నాజరుజంగు తనమిత్రుస్థితి యపాయమును దాఁటినదని సంతోషించెను కాని రహిమానుఖాను రోగి యోగక్షేమములరయక యవల ప్రక్కగదిలోఁ దలుపుచాటునఁ నిలువఁబడి యున్న హేమలతయొక్క యరుణపదపల్లవములఁ జూచి యాశ్చర్యపడి యాప్రక్కనే తనచిత్తమును నిలిపి, నాజరుజంగు మదనసింగులు తనతోఁ జెప్పుచున్నమాటల కసంబద్ధప్రత్యుత్తరంబుల నిచ్చుచు "నేను విన్నదానికిని నేఁడు చూచినదానికిని సరిపోయినది. ఇందుఁడు సమయము నకు లేకపోయెనుగద. అయిననేమి?" యని మనశ్శాంతి కలుగమి వారితో "నాకీ దినమునఁ దల దిమ్ముగానున్నది. మీ రనుకొనుమాటలు నాకు వినఁబడుచుండుటలేదు." అని చెప్పెను. మదనసింగును నాజరుజంగును ఖానసాహెబుయొక్క ముఖలక్షణములు మాఱుట

యు నతం డసంబద్ధసంభాషణముం డగుటయు గ్రహించి కారణమూ హింపఁజాలక యూరకుండిరి. తరువాత సంగతులు గోటకుఁ జనిరి.

---

## మూఁడవ ప్రకరణము.

---

మదనసింగునకు, గాయము తగిలిన మఱునాఁడు రహిమాను ఖాను తనయంతఃపురమున నొకగదిలో దీర్ఘవిచారమున బాధపడుచుఁ గూర్చుండెను. అపుడు నాతనియెదుట కిర్వురు సేవకులువచ్చి భయవినయములతో వంగివంగి సలాములుచేసి కట్టెదుటనిలువంబడిరి. అదిసంధ్యాసమయముగనుక కార్యాంతర మాలోచించుచున్న ఖాను వారిని గుర్తింపక “ఎవరువారు? ”అని బిగ్గఱగనఱచిచూచి ‘ఓహో! సందుఁడా! రెండవవాఁడెవఁడు? ఓరీ గులామల్లీ! మీరు సుఖముగా వచ్చినారా?, యని పలుకరించెను. అంతట నాసేవకద్వయము “ఏలినవారికటాక్షమువలన మేమీ గడియవఱకు సుఖముగానున్నాము స్వామీ” యని కంట నీరుపెట్టుకొనఁ జొచ్చిరి. ఖానసాహెం బదరిపడి జరిగిన యావద్వృత్తాంత మెఱిఁగింపుమన వారిలోనందుఁ డిట్లని చెప్పసాగెను. మహాప్రభూ! ముందుగ నిన్నటివృత్తాంత మెఱిఁగించెదను. నిన్న నుదయ మెవరో పదుగురుమనుష్యు లాగ్రానగరమునుండి యెటకో బోవుచు మాకగపడిరి. భాగ్యవంతులగు బాటసారుల విడువవలదని యేలినవారిచ్చిన హుకుముప్రకారము వారు ద్రవ్యవంతులవలె నుంటచే మే మిరువదియైదుగురము వారిపైఁ బడితిమి. తరువాత నేమి మనవిచేయుదును మహాప్రభూ! అం దొకసుందరుఁ డగురాజపుత్రుఁడు మాపైఁ బడి మాలోఁ దక్షణమే పండ్రెండుగురను స్వర్గమునకంపెను. మిగిలినవారమిర్వురు గాయములఁజెంది మరణమునకు సిద్ధ

ముగ నున్నారు. కాని యారాజపుత్రికకు గాయము దిట్టముగఁ దగి లినది స్వామీ" యని చెప్పి కన్నీరు కాల్వలుగట్ట నేడ్చుచు గద్గద స్వరముతో మఱచాంగాక్షికూడ మూర్ఛనొందెను. మహాప్రభూ! యని గోడన మారంభించెను. ఈవృత్తాంతము సవిస్తరముగ నాలకించిన తోడనే నా హేంబునకు మహాశోకమును భయమును నాశ్చర్యమును నేక కాలమున జనియింప గడియదాఁక మాటాడలేక కొయ్యవలెనుం డెను. తుదకు ధైర్యముఁ దెచ్చుకొని "యూనా! యెంతపని చేసితిరి. కొంప మునిఁగినది. పాపముండకొడుకులు మీరొక కార్యము చక్కఁ జేయఁగలరా? అయ్యయ్యో! వారు చక్రవర్తి కడకు రాయబార ముదెచ్చిన రాజపుత్రకుమారుఁడు మొదలగువారు. ఈగ్రామమున వారిప్పు డున్నారు. వారిలో మన నాజరుజంగుకూడ నున్నవాఁడు. నావిషయమై యతఁ డెఱుఁగును. చక్రవర్తితో సంభాషింపకమా నఁడు. హా మౌలాఅల్లీ! హా మహమ్మద్! ఈగండముగడచినయె డల నూఱుగురు ఫకీరులకు నన్నముఁ బెట్టించెదను. అని ధైర్యము వదలిపిఱికిస్వభావముగలవాఁ డగుటచే సేవకులనిందింపఁదొడఁగెను. అప్పుడు గులామల్లి గడగడవణఁకుచుఁ దనయేలిక పాదములపైఁబడి మేమది యెఱుఁగక గోతిలోఁ బడినాము. మహాప్రభూ! మీగులాపు వాండ్రను రక్షింపవలయు నని స్వామిని బ్రార్థించెను. తరువాత ధైర్యముఁదెచ్చుకొని ఖాను తదనంతరవృత్తాంతము నెఱిఁగింపుఁడని వారల నడుగ నందుఁడు నోట మాటాడక నొకసంచిని దెచ్చి యం దుండి యొక కాగితములకట్టను బైటకుఁ దీసి, "మహాప్రభూ! ఇది యమునాతీరమున దేవాలయమువద్ద మాకొక యోగిదగ్గఱ లభించి నది. వానిని గడతేర్చి యిది తెచ్చినాము. ఏలినవారు చిత్తగింపవ లెను" అని చేతి కందించెను. ఆతఁ డాకాగితముల నందుకొని దీప ముఁదెప్పించి వానిని జక్కఁగఁ జదివి పరీక్షించినప్పు డంను మిగుల

రహస్య మగు కాగిత మొకటి కనఁబడుటచే విచారసహిత మగు మొగము మందహాసముతో వికసించెను. నూతనముగ సంభవించిన యీ కాగితమునందు దాను చక్రవర్తి హృదయ సంపాదించు కొనుట కాధారములు కలిగెనవి. అందుచే నానందపారవశ్యమున వెనుక చింత మఱచి గులాముకు భోజనమునకుఁ బొమ్మని పంపి నందుని దూరముగఁ దీసికొని పోయి యిట్లు చెప్పఁ దొడఁగెను. నందా! నీవు మిగుల విశ్వాసము గలవాఁడవు. నీతో నాకు రహస్యకార్య మొకటి కలదు. ఆకార్యముఁ జేసినయెడల నీచేతినిండ వరహాలు పోసెదను. ఈగ్రామమున నంధుఁ డగుయోగివద్దనున్న యొకసుందరాంగిని నాకడకు నీవు మాయోపాయమునైనను సమ్మతితోనైనను తీసికొని రావలయును. దానిని వివాహమాడకున్న నేను జీవింపఁజాలను. నీనిమిత్తమయి నే నెదురుచూచుచుంటిని. అని చెప్పినతోడనే నందుఁ డులికిపడి శరీరము జల్లుమన "స్వామీ! ఆమె సద్గుణవంతురాలు. ముసలివాఁడును మిగులమంచివాఁడు. జనులకందఱకు నతనియందు భక్తి గలదు. అది నాకు సాధ్యమగునా" యని నందుఁడు తన యసమర్థత నెఱిఁగింపఁ గోపోద్దీపితుఁడై ప్రక్కనున్న ఖడ్గమును జేఁబూని విశ్వాసఘాతకుఁడా! నాసొమ్ముదిని నాకార్యమును జేయలేవా? ఇదిచేయవేని నీప్రాణములు దక్కవు సుమీ" యనిబెదరింప మందుఁడగు నందుఁడు మ్లేచ్ఛుని పదములపైఁబడి "దేవా! ఆగ్రహింపకుఁడు. నాప్రాణములతైన ధారవోసి యీ కార్యము సాధించెదను. గోవిందశాస్త్రియింట దాసియగు రాధవలన నీకార్య మగును. నెలలో సమకూర్తును." అని వాగ్దానము చేసినతరువాతఁ దురుష్కుఁడు నందుని విడువ నతఁడు మృత్యువుని ముఖమునుండి వెడలినట్లు సంతోషించుచు స్వామికార్యసాధనమందు నుపాయములఁ బన్నఁదొడఁగెను ఇదియిట్లుండ మదనసింగునకు గాయము నెమ్మదిగానున్నదని హేమ

లత యిష్టదేవతం గొల్లు ముహుర్ముహుర్గుణము సంతోషించుచుండ నాజరుజంగు నమితానందభరితుఁడయి భగవంతునకు నమస్కరించెను. మదనసింగునకు నానాఁటి కారోగ్యము గలుగ నారంభించెను. రక్తక్షయము ఖుసది గనుక నప్పటికి నీరసము తక్క తక్కిన రోగమేదియుఁ గానరాదయ్యెను. ముసలివాని నేర్పుచే నరములకు బలము కలుగుచుండెను. తన ప్రియమిత్రుఁ డారోగ్యస్నానమొనర్చువఱకు నాజరుజంగా గ్రామముఁ బాసి పోఁదలఁచుకోనందున దానచట నుండునంతకాలము ఖానుగారియింట బసచేసి ప్రతిదినమును ఖానుయొక్క దుర్గుణములను, మర్కటచేష్టలను స్వానుభవమువలన గ్రహించుచుండెను. అందుచే సద్గుణసంపన్నుఁడైనందున, నన్యమతస్థుఁడయినను సింగునం దనురాగంబును స్వమతస్థుఁడును నాప్తబంధుఁడునైనను దుర్గుణుఁడయిన ఖానునెడ నసూయయు నాజరుజంగునకుఁ గలుగ నారంభించెను. హేమలతచేయు వివిధోపచారములును నామెసౌందర్యాతిశయమును సుగుణవైభవమును మదనసింగు హృదయమున నామెయెడ గాఢానురాగమును గల్గించెను. మధ్యాహ్నకాలమున సింగునకు నిద్రరాకుండఁగాఁ జిన్ననాఁటఁ దాతదగ్గఱ నేర్చుకొనిన హిందీ భాషలోని భక్తిరసప్రధానములగు నీతికీర్తనలు హేమలత శ్రావ్యతర కంఠముతో నప్పుడప్పుడు పాడుచుండును. ఒకప్పుడు తాఁ బెంచుచున్న చిలుకకు "రామరామ" యని మాటలు నేర్పుచు వినువారి చెవులకు విందు సేయుచుండును. ఈకన్య తన యీడువారును స్థితికిని దగిన విద్యలను దనపితామహునిదగ్గఱ నేర్చియుండుటచే నన్యులెవరులేని సమయములయందుఁ దాతకు వినిపించువంకఁ బెట్టి తేనెతేటలొలుకు మాటలతోఁ బుస్తకము జదివి సింగునకు హృదయానందమును గలిగించెను. అదిగాక ప్రొద్దుపోవునప్పుడు వృద్ధుఁడును, వినోదకరములగు కథలను మ్లేచ్ఛరాజవృత్తాంతములను దన చిన్ననాఁటి యుద్ధములను

గడుఁజమత్కారముతో వర్ణించి చెప్పుచుండును. ఆగ్రామవాసులందఱును రహిమానుఖాను చేష్టలను హాస్యరసప్రసంగములుగ మార్చి వానికిఁ జెప్పి నవ్వించుచుందురు. అందుచే నిరంతరానందమగ్నుఁడై సింగు త్వరలో నారోగ్యస్నానముఁ జేసెను. సింగు సద్గుణవంతుఁడని సద్వంశసంభూతుఁ డనియు నెఱిఁగి వృద్ధయోగి తన దీనచరిత్రమును రామకామునకుఁ దెలియ పఱుపఁగోరి యాతనితోఁ గూడ నొకటి రెండుసారులు తన యిచ్ఛఁ దెలిపెను. అతఁడును విన నుత్సహించెను గాని యోగి యేకారణముననో చెప్పలేదు. చిత్తూరు నుండి బయలుదేఱి చిరకాలమగుటచే భీమసింగుమహారాజు తనకయి యెదురు చూచుచుండునని ప్రయాణమై పోవుటకు సిద్ధముగనుండియు యోగి బలవంతపెట్టుటచే మఱియొకవారము నుండ సమ్మతించి యొకనాఁడు రహిమానుఖానుగారి దర్శనముఁ జేసి యాకచ్చేరియుఁ గోటయుఁ జూడవలెనని పోయి యనేక రాజకార్యముల ముచ్చటించుచుఁ బ్రసంగవశమున మదనసింగు ఖానుతో నిట్లనియె.—

మద.—మిత్రుఁడా? నీవు కోపగించుకొనకుందువేని నీకొక సలహా చెప్పెదను.

రహి.—మంచిసంగతికిఁ గోపమెందుకు! అవశ్యముగాఁ జెప్ప వలసినదే.

మద.—ఈగ్రామమున మీకీర్తి చక్కగా లేదు. మీరు ప్రజల నవమానము చేయుదురనియు బాధించుచుందురనియు నందఱుఁ జెప్పుకొనుచుండ వినుటకు నాకుఁ గష్టముగనున్నది. అదిగాక దొంగతనము మొదలగునవి మీవలన జరుగుచుండునని జనులు దురభిప్రాయముఁ బడియున్నారు. అట్టి దురభిప్రాయమును మీసత్ప్రవర్తనమువలన మీరు పోఁగొట్టుకొనవలెను. మీదగ్గఱనున్న తుచ్ఛసేవకులను త్వరితముగఁ బంపివేయుట మంచిది.

అని యివ్విధమున హితోపదేశము చేయుచున్న రాజకుల భూషణునిపయి మహమ్మదీయుఁడు తాఁచుపామువలెలేచి తనచేత నున్న ఖడ్గముతో నాతని నొకదెబ్బ వేయఁజూచెను గాని నాజరుజంగాతనిఁబట్టుకొని యాదౌర్జన్యము నివారించెను. వెంటనేసింగమువలె సింగునలేచి యాయుధపాణియై నిలువ ఖాను వెనుకదీసెను. అనంతరమామందిరము విడిచి మదనసింగు నాజరుజంగుతోఁ గలిసి మఠమునకరుదెంచెను. తనదురాచారమును జక్రవర్తికి నివేదించి తన కపాయమును గలుగఁజేయుదురని నాజరుజంగు మదనసింగులపయిఖాను సాహెబున కీవఱకే యాగ్రహమును ననుమానమును నుదయించినవి. గోరుచుట్టుపై రోఁకటిపోటన్నట్లు నేఁటికథ దానినత్యున్నతస్థితికిఁ దెచ్చినది. రాజనందననిసంబంధమున సజాతీయుఁడైననాజరుజంగుపై నతనికి మహాగ్రహము గలుగ, నేయుపాయములను బన్నియైనను నేనేరములను జక్రవర్తితోఁ జెప్పియైనను దాను నిర్దోషియనిపించుకొని వారపరాధులని దండింప జేయవలెనని మహమ్మదీయుఁడు యోచింపుచుండెను. శత్రురాజ్యమున నుండుట ప్రాణాపాయకరమనిమదనసింగు ప్రయాణమగుచుండెనుగాని యతనిప్రయాణము హేమలతకు దుఃఖకారణముగ నుండెను పైవాదము డటస్థమయిన మఱునాఁడు తెల్లవాఱునప్పుడు ప్రయాణము నిశ్చయింపఁబడెను. ఆరాత్రి హేమలత యన్నము ముట్టుకొనలేదు. ఎట్లయినను రాకొమరుఁడు పోకతీరదనితలఁచి వృద్ధయోగి రహస్యముగ నొకగదిలోని కాతనిం దీసికొనిపోయి రహస్యమును బయలుపఱుపకుండ ననేకప్రమాణములఁ జేయించి యొట్టుఁబెట్టించి తన పూర్వాశ్రమవిచిత్రవృత్తాంతము లీ తెఱంగునఁ జెప్పనారంభించెను. "నాయనా! నీవునాకుమారునివంటివాఁడవు. నిన్నుజూడ నాబంధువు లందఱు వచ్చినట్లున్నది. నాదీనమైనచరిత్ర నీకుఁ దెలియఁజేయుమనియు నీవలన నాకుపకారము కలుగుననియు నాయుం

తరాత్మ నన్నుఁ బ్రేరేపించుచున్నది. అందఱనుకొనునట్లునేను బావా జీనిగాను. నేనుత్తమరాజపుత్రవంశస్థుఁడను. మాకాపురము జయపురము. కాలవశమున నేను స్వదేశమును బాసి ఢిల్లీచక్రవర్తియొద్ద ఫౌజుదారుగ నుంటిని. నేనును నాకుమారుఁ డగుజనార్దనసింగును కిల్జివంశస్థాపకుఁడగు జలాలుద్దీనువద్ద సేనానాయకులుగా నుండి యతని యన్నకుమారుఁడును బ్రస్తుతచక్రవర్తియు నగు నలాయుద్దీనుతోఁగూడి దక్షిణహిందూస్థానముపై దండెత్తినారము. అచట మహారాష్ట్ర రాజ్యమును జయించినపుడు నేను జాల సహాయమును జేసినాఁడను. జలాలుద్దీనునకు నాయందు పుత్రవాత్సల్యముండెను. దక్షిణ హిందూ దేశమునుండి వచ్చినతరువాత నలాయుద్దీనునకుఁ బినతండ్రిని గపటముగ వధించి తాఁ జక్రవర్తి యగుటకుఁ దురుద్దేశము కలిగెను. ఆకాలమున నాతని కాంతరంగికుఁడ నగుటం జేసి నాతో నాతఁ డాలోచింపరాగా నేనట్టి దుష్కార్యమున కీయకొనక నిరుత్సాహము గలిగించి రాజభక్తివలన యువరాజును గొంచెము నిందించినాఁడను. అలాయుద్దీను మహాగ్రహముతో మరలిపోయి యారాత్రి—హా! ఏమి చెప్పుదును—నా రెండుకన్నులును దనఖడ్గముతోఁ బొడిచివైచి నాకు శాశ్వతమయిన యంధత్వమును దెచ్చిపెట్టెను. తరువాత నన్నుఁ జంపుమని సుబేదారులలో నొకని కతఁ డుత్తరువిచ్చి నాప్రియపుత్రకు నా రాత్రి జంపించెను. నాపూర్వస్నేహితులందఱు నన్నుఁ జంపకుండ మాయోపాయములచే రక్షించి నన్నీగ్రామమునకుఁ బల్లకిలోఁ బంపిరి ఈ పిల్ల యప్పటి కేడు సంవత్సరములు పసికూన నిష్ప్రయోజనమైన యాజీవనముకంటె మరణమే యుత్తమమని తలంచియు నీపసికూన నిరాధారమైనందునఁ జెట్టంతకొడుకును జంపుకొనియు [illegible]ండి [illegible]నై యిట్లు జీవించినాఁడను. అమఱునాఁ డల్లాయుద్దీను తనపినతండ్రిని జంపించి మఱికొన్నిదినములకు మహావైభవముతోఁ దాను జక్రవర్తి

యయ్యెను: ఉద్రేకము నీతియుఁ బాహ్యభీతియు లేనివాఁడు. ఒకటి తలఁచి యొకటి పలికెను. కుమారా! నాదశ యిట్లున్నది. డెబ్బది యేండ్ల వాఁడను నాకు మరణము సమీపించుచున్నది. ఈబాల సంప్రాప్త యౌవన. నేను మృతినొందిన దీనినెవ్వైన బలాత్కారముగ నవ మానింతురు. నాకుఁ గలబెంగ యిదియే; నాకిప్పు డిట్టులయినఁ జిత్తూ రు నగరము రావలెనని యున్నది. భీమసింగుమహారాజుతో నా దీనదశ దెలిపి నాపయి ననుగ్రహము గలిగించిన నీకు మిగుల పుణ్యముండును. నా పేరు నారాయణసింగు. అహాహా! నారాయణసింగుదశ యెంతవఱ కు వచ్చినది. ఇరుపార్శ్వముల నెచ్చట దిక్కులేక యనాథుఁడనై యున్నాను గదా నాయనా! అనుచు సహజధైర్యమును విడుచుచుఁ గొలఁకులనుండి వేఁడికన్నీరొలికి తన తెల్లగడ్డము దడియ నేడ్వసాగెను. వజ్రసమాన హృదయమునకు గనికరమునుబ్బించు నారాయణ సింగు దీనచరిత్రమును విని మదనసింగు క్షత్రియకారుణ్యమును విడిచి యొక్కనిమిషము విచారించి యిమ్మట "తాతా! నీవు విచారింపకుము కష్టములు దైవికములు మీవిషయమయి భీమసింగు మహారాజుతో నేను జక్కఁగాఁజెప్పి మీపయి వారికనుగ్రహము గలుగునట్లు చేసెద ను. మీకష్టములు గట్టెక్కినవని నమ్ముఁడు. మీమనుమరాలికిఁ దగిన యుత్తమవంశజాతుని వెదకి పెండ్లి చేయించెదను. నామాట నమ్మి యుండుఁడు కొద్దిదినములలో మీకు నేను వర్తమానమంపెదను. అప్పుడు మీరు రండు. రేపుదయమున నేను నిశ్చయముగఁ బ్రయా ణమై చిత్తూరు పోయెదను" అని చెప్పి యారాత్రి సుఖముగా నిద్రిం చెను. మఱునాఁడు రహిమానుఖానునొద్ద సెలవుఁదీసికొని నాజరు జంగును నాగ్రా నగరమునకుఁ బ్రయాణ మయ్యెను.

మఱునాఁడు వేకువజామున ఖ్వాజప్రత్రిమహమ్మదీయు లొండొ రులవలన సెలవుగైకొనిపోవునప్పుడు మదనసింగు నాజరుజంగును రహ

స్వస్థలమునకుఁ గొనిపోయి గాఢాలింగన మొనర్చి "మిత్రుఁడా! మన మిరువుర మన్నదమ్ములవలె నుంటిమిఁ మన మన్యజాతులవార మైనను మనకు భేదములేదు. ఇంక ముందుండదు. నాకిదివఱకుఁ జేసి నదిగాక యింకొక మహోపకారమును జేయవలయును. ఈవృద్ధుఁడును బాలికయు నిరాధారులై యున్నారు. వారికి రహింమానుఖానువలన భయము గలదు. అతనివలన నపాయము గలుగకుండ నీవు జాగ్రత పెట్టవలెను. ఈయూర నెవరికైనను వారి నప్పగింపుము." అన నాజరుజంగును నటులే చేయుదునని యాపూటకుఁ బ్రయాణము మానెను. మదనసింగంతట నాజరునుజూచి "మనమింక మరల నెన్నఁడు కలియుదుమో? మామహారాజును మీచక్రవర్తియు సంధిచేసికొందురేని మనము రాకపోకలు గలిగి మన స్నేహబీజముయొక్క ఫలముల నందవచ్చును. కాదేని ప్రళయ యుద్ధమున మనము కలిసికొందుము. సాధ్యమయినప్పుడు నీక్షేమము నాకంపుచుండుము. నేఁబోయివచ్చెదను సలాము" అని తన పరివారముతోడ బయలుదేఱి మాటిమాటికి హేమలతను దలంచుకొని తిరిగిచూచి విచారించుచు వెడలిపోయెను. ఆనాఁటిమధ్యాహ్నము నాజరుజంగు తనతండ్రికిఁ జిరపరిచయుండగు నబ్దుల్ ఖరీముఖాలవియనునాతనిం బిలిచి నారాయణసింగు నొప్పగించి వారి కపాయముకలుగునప్పుడు సహాయ మొసఁగుమని చెప్పి వానిచేనట్లుచేయుటకు వాగ్దానముఁ బ్రగహించి యారాత్రి బయలుదేఱి వెళ్ళెను. మాలవి యాగ్రామమునందు జనమిత్రుండును భగవత్సేవాపరాయణుఁడు నయి యుండుటచేఁ బ్రజల కతనియం దతిగౌరవము కలదు. నారాయణసింగును వైద్యమూలమున సకలజనోపకారి యగుటచేతఁ బ్రజలెల్ల నతని కాప్తులైరి. ఈ పరిచయములవలన మాలవియు నారాయణసింగును మిత్రులై. తమతమమతములఁ గూర్చి వాదములు సలుపుచు సుఖముగఁ గాలమును బుచ్చుచుండిరి.

## నాల్గవ ప్రకరణము.



మదనసింగు పాలిగ్రామమును విడిచిపోయినతరువాత హేమలత కొన్నిదినములవఱకు మునుపటివలె నన్నపానాదులపై నిష్టము నిలుపక బెంగఁ గొని చిక్కియుండెను. కాని ప్రాణతబడినవెనుక యథాస్థితి కామె మరలవచ్చి సుఖముగానుండినను రాజకుమారుని యందమును మృదుమధురభాషణంబులును మఱవక యెల్లప్పుడు తలంచుకొనుచుండెను. నారాయణసింగు మదనసింగు తననిమిత్తమెన్నఁడు వర్తమానమంపునో యెన్నఁడు తాము తురుష్కరాజ్యపు సరిహద్దులఁ బాసి చిత్తూరురాజ్యమున సుఖముగానుందుమో యని యెదురుచూచుచు నామార్గమునఁ బోవు బాటసారులనెల్లఁ బరీక్షించి యడుగుచు దినమొక యేఁడుగ గడపుచుండెను. మాలవికిని, నారాయణసింగునకును స్నేహము నానాఁటి కధికమైనందునఁ బ్రజలు వారిమైత్రికి మిగులనానందించుచుండిరి. నారాయణసింగునకును మనుమరాలికిని రహీమాఖాను యొక్క దౌర్జన్యములం జూచినకొలఁది భయ మధిక మగుచుండెను. ఖానుసాహేబునకు హేమలతయందనురాగము క్రమక్రమముగ నభివృద్ధిపొంద రాజకన్య మ్లేచ్ఛనాయకునిహృదయమునం దెల్లప్పుడునుండసాగెను. బలత్కారముగనామెను బట్టి తెప్పించి తనయంతఃపురమున బంధించి సఫలమనోరథుఁడగుట ఖానునకు సులభమే కాని యందున నేమికీడు మూఁడునో యనుభీతియు వారికాప్తుఁడైన మాలవి కాగ్రహము వచ్చునను భయమును వానిని బాధింపుచుండెను. మాలవి సంపదలు లేక సామాన్యస్థితిలో నున్నను, వాని విద్యాసంపదను బట్టియు, సత్ప్రవర్తనమును బట్టియు, జనుల కాతనియెడ భయగౌరవములు గలిగియుండినవి. ధనము స్వీకరింపక దీనుల కుచితముగ నౌషధము లిచ్చుటంబట్టియు

వయోవృద్ధుఁ డగుటంబట్టియు నారాయణసింగునందు జనులకు మిగుల గౌరవము గలదు. వారిరువురు కపకార మొనర్చినవారు పరిజల కంటఁటకును విరోధులై యుందురు.

స్వామికార్యమునం దపరిమత్తుఁడై నందుఁడు శక్తివంచన లేక పాటుపడుచు నేవిధముననైన హేమలతను దన యజమానునకు సమకూర్పవలెనని సకలప్రయత్నములఁ జేయుచు ముందుగ రాధతో స్నేహము చేసెను. ఈరాధ కిప్పుడు రమారమి పదునాలు సంవత్సరములుండును. దానితల్లి భర్తను విసర్జించి లేదివచ్చి వ్యభిచారవృత్తి వలన జీవించి రాధ కెనిమిదిసంవత్సరములవయ స్సున్నప్పుడు మృతి నొందెను. అప్పటినుండియు రాధ బ్రాహ్మణుల యిండ్లఁ బాచి పని జేసి బ్రతుకు చుండెను. అది యిప్పుడు గోవిందశాస్త్రి యను నాబ్రాహ్మణునియింటనుండెను. ఆమెయుక్తవయస్కురాలైనవెనుక శాస్త్రివివాహముచేయఁదలఁచెను. గాని రాధ తనతల్లివృత్తి యందె ప్రవేశింప నిచ్ఛ గలదగుటచే శాస్త్రియుఁ దనయుద్యమమును మానుకొనెను. రాధ మిగులసౌందర్యము గలశూద్రాంగన యగుటచే స్వల్పకాలముననామె గ్రామమున నున్నపడుచువాండ్రకందఱకు బ్రాణమిత్రురాలై యఱచేతి నిమ్మపండువలె నుంటయొకాక యొకపర్యాయము ఖానుగారిహృదయమును గూడ నాకర్షించెను. ధనమును నధికారమును గలఖానుమైత్రి యామె కిష్టమే కాని తన కన్నవస్త్రముల నిచ్చుచున్నహిందువుల కాగ్రహము వచ్చునని యామె వెనుకదీయుచుండెను. నందుఁడుఁ దాసీపుత్రుఁడె కనుక రాధతో సులభముగ స్నేహము జేసి తనస్వామి మనోరథమును దెలియపఱచి కార్యసాఫల్యము జేయుమని ప్రార్థించెను నందునిమాటఁ దీసివైవలేక రాధ యందుచే కియ్యకొని బావాజీమఠమున కనుదినమును బోయి హేమలతతో నేదోవంకఁ బెట్టి మాటలాడుచు నామెపరి

చటుముచు సంపాదించెను. పరిచరియ మయినది మొదలు హేమలత కామె పనిపాటలు చేయుచ వినోదకథలను జెప్పి యామెను నవ్వించుచు నుండెఁ గాని దుస్సహావాస మొనర్చుట కిష్టములేక రాధతో దిన్నగా మన హేమలత మాటలాడ దయ్యెను. ఈపరిచారిక మదనసింగు పాలిగ్రామమున నున్న కాలముననె రాధ రెండుసారులు హేమలతకొఱకు వచ్చి సింగును జూచి మోహించి యాతనితో మాటలాడఁ బ్రయత్నించిన దయ్యు నతఁడు పరిత్యక్త్ర మొనఁగ కుండుటచే మరలవలసిన దయ్యెను. రాధకు మదనసింగునందుఁ గలమోహ మతిశయింప వాసిగ నున్నతన యంతరమును రాజపుత్రికగునత ని యనంతరమును నాలోచింపక యెట్లయినను తనిఁ దనవంలో వైచికొనవలయు నని యామె యత్నింపుచుండెను. హేమలతకు సింగునం దనురాగము గలదని యెఱిఁగి యామెయం దసూయ మనస్సున నిల్పి రహిమాన్ ఖానన కీమెను సమకూర్చునెడలఁ దనకు సవతిగా నీ మెయుండ దని నమ్మి మదనసింగును దాను స్వాధీనపఱచుకొనవచ్చునని నిశ్చయించెను. అందుచే "నేకకి్రయాద్వ్యర్థకరీ" యని యామె ఖానున కుపకార మొనర్చునట్లును దనమనోరథము నీడేర్చుకొని నట్లును గూడ నగునని రాధ హేమలతమనస్సు విఱచుటకై ప్రయత్నించి యప్పుడప్పుడును ఖానుయొక్క గుణరూపముల నామెకడవర్ణించుచుండె. ఒకనాఁడు ఖానుయొక్క రూపాతిశయమును రాధ వర్ణింపగా శరీరము వడఁక హేమలత భయమంది యాతనిపరిసంగమునకు దనవద్ద నెన్నఁడును దే వద్దని యామెను గఠినముగా మందలించెను. అప్పటినుండియు నీదురాత్మురాలు - ఖానుపరిసంగములను మానుకొని నఁదునితో "నీక హేమలతపై ఖానుని కాశ యుండఁ దగదు. ఆమె కీతనియం దిష్టములేదు. మదనసింగున కామె ప్రాణము లిచ్చు" నని చెప్పఁగా ఖానుతో నందుఁ డావార్త విన్నవించునపుడు వానికిఁ

గలిగినదుఃఖము వర్ణింపనలవి కాదయ్యెనని యిట నేను వ్రాయనక్క ఱ లేదు. కామోద్రేకమును విచారమును మల్లడిగొను మహమ్మదీయుఁడు హేమలత నెట్లయిన జేసికొని తీరవలయు నని కృతనిశ్చయుడై నారాయణసింగునకును మాలవికిని మిత్రభేదము గల్పింపఁబ్రయత్నించెను గాని యందుఁ గృతార్థుఁడు గానేరకపోయెను. అందుచేత నందుఁడును, ఖానును, యితరసేవకులు నిగూఢ నుపాయమును వెదకుచుండిరి.

అది యిట్లుండ ఖానునకు హేమలతయందు గాఢ మోహము దగులుకొన్నదని జనులు చెప్పుకొనుటవలన కర్ణాకర్ణిని నారాయణసింగును మాలవియు, హేమలతయు విని యేసమయమున నెట్టి యపాయము మూడునోయని భయపడుచుండిరి. విదేశీయు లయిన వారిని రక్షించుటదనకువిధియని మాలవివారికపాయము రాకుండగనేమిచేయుదునా యని చింతింపుచుండెను. మదనసింగు వద్దనుండియిప్పటికి నాలుగైదుమాసములు గడచినను వర్తమాన మేదియు రానందున నతఁడు తమవిషయమయి మఱచినాఁడని వారాలోచించి నిరాశపడి గతితోఁచక యుండిరి. తుదకు వారందఱు నాలోచించివృద్ధుఁడునుమనుమరాలును నక్కడకు నాలుగైదుక్రోసులదూరమునను న్న యలీఘురపురమునకుఁ బోవలెనని నిశ్చయించిరి. అందుచేమాలవి వారిని బ్రయాణముచేసి యాయూరం జనకుఁగల యిష్టులుముఖ్యమిత్రులకు నుత్తరములు వ్రాసియిచ్చి సాధ్యమైనంతత్వరగఁబ్రయాణమై పోవలసినదని చెప్పి వారితోఁ బోవుట కిర్వురుసేవకుల నేర్పఱచెను. ఆమధ్య హేమలతకు జ్వరమువచ్చుటచేఁ బ్రయాణ మాగిపోయెను. మాలవియునారాయణసింగుతో స్నేహముచేయుట తనకనిష్టముగనున్నందున ఖానువానితో స్నేహము చాలింపవలసినదని యాయనకు వర్తమానమంపెను. మాలవి దానిని లక్ష్యపెట్టనందునఁ గోపమతిశయింప

వారి గర్వభంజన మొనర్చుటకుఁ గృతనిశ్చయుఁడై సమయమునకెదురుచూచుచు సాహేబు దినములఁ గడపుచుండెను. ఈనడుమ హేమలత జ్వరమువలన మిగుల బాధనొందుచున్నందునను, నదియే యౌషధముచేతను లొంగకున్నందునను వృద్ధుఁడు కొండఱియోచన మీఁద నాగ్రామమునకు వచ్చియున్న గోసాయినిఁ బిలిపించి యాతనితోఁ దన మనుమరాలి వృత్తాంతముఁ జెప్పెను. గోసాయిని జూచి హేమలత సమస్కరించి యెదుట నిలువ నతఁడామె నాశీర్వదించి యామె మొగమువంకఁ దేఱిపాఱజూచి ముసలివాని శరీరము నామూలాగ్రముగఁ బరీక్షించి మిగుల నానందము నొంది తన యానందసూచకముగఁ గొన్ని మాటల ననుటకు యత్నించియు, బలవంతముగ దన సంతోషము నాపికొని ఆహా మీరిరువురును జీవించియున్నారా? ఎన్నిదినములకు మీరగపడినారు! భగవదనుగ్రహము మనపైఁ బూర్ణముగఁ గలదు అని తనలో ననుకొని హేమలతనాడి పరీక్షించి కొంచెము దృష్టిదోషము తగిలినదని రక్షరేకు నొకదానినిచ్చి కంఠమునఁ గట్టుకొమ్మని చెప్పి, యామె చేయి ముద్దుపెట్టుకొని తరువాత వృద్ధుని యొద్దకుఁ బోయి యనేక వ్యవహారముల ముచ్చటించుచు నడుమ నిట్లనియె. "అయ్యా! తమసంగతి నంతయు నేనెఱుఁగుదును. మీరు బ్రదికియున్నారని నేనిదివఱకెఱుఁగను. నేఁడు సుదినము" అని గోసాయి పలుకఁగా వృద్ధుఁడు భయపడి నాయనా నీవెవరు? నాసంగతి బయలుపెట్టకుము అని బతిమాలుకొనెను గోసాయియు వృద్ధుని హస్తమును బట్టుకొని నేనెవ్వరయిన మీకెందుకు? నాసంగతి ముందుముందెఱుఁగఁగలరు. నాప్రాణముల మీఁద మీకు నమ్మకము గలదేని మీరహస్యము నేను బయలుపఱుపనని ప్రమాణము చేయుచున్నాను భయపడకుఁడు. నేనింక నిట నుండరాదు" అని చెప్పి వారివలన సెలవుగైకొని గోసాయి యరిగెను. ఆదినమున గోసాయి గోవిందశాస్త్రియింట విందారగించి యాగ్రామముననే యుండెను.

ఆనాఁటిసాయంకాలమున పాలికోటలో నొకవిధమయినకళవళము పుట్టెను. అక్కడనుండి కన్నులార నది చూచినవారికేకానియన్యులకుఁ దెలియదు. దీపములు పెట్టినతోడనే రహిమాన్ఖానుఁ సాధారణముగ. యుద్ధరంగమునకుఁబోవు సమయములయందు దానుధరించు వస్త్రములను గవచమును, ఖడ్గమును ధరించుకొని తన యధికారము క్రిందనున్న రాజభటులందఱు నట్లే కలహసమయానుకూలమగు వేషముల ధరింపవలెనని యాజ్ఞాపించెను. అట్లు సర్వప్రయత్నములు జరిగించి రాజభటసమేతుఁడయి ముష్కరుఁడగు నాతురుష్కుఁడు రెండుజాములరాత్రియైన వెనుక గ్రామమంతయు నిశ్శబ్దముగ నున్నప్పుడు వృద్ధుఁడు నివాసముచేయుచున్న మఠమును జుట్టువెచి లోపలివారినిపిలువుమని సేవకులలో నొకనిని నాజ్ఞాపించెను. అతఁడును శావాజ్అనిపిలువ రోగపీడితులెవరో యాపదలోనుండి వచ్చినారని విసుగుగొనక తడవిగొనక లేచివచ్చి తలుపుఁదీసెను. వెంటనే నిర్దయాత్ముఁడగుకఱకుతురక డెబ్బదిసంవత్సరముల ప్రాయముకలిగి యశక్తుఁడయి నిరాధారుఁడయి గుర్డితసమునఁ గదలలేక యతిదీనుఁడయికాలముఁబుచ్చుచున్న నారాయణసింగు చేయిపట్టుకొని కఠినస్వరముతో నీదౌర్జన్యమును గుట్రలును విని నిన్నుఁదక్షణమే పట్టుకొని చెఱసాలయందుంచవలసినదని, చక్రవర్తిగారు మాకుత్తరువునంపినారు. అందుచేతనిదిగో నిన్నిప్పుడు పట్టుకొన్నాను' అనిచెప్పి "ఱెక్కలువిఱిచికట్టుఁడు జాగ్రతయని సేవకులతో నడిచెను. కర్ణశూలములవలెనున్న యాపలుకులువిని నిశ్చేష్టుఁడయి వృద్ధుఁడునిలువఁబడి "అమ్మా! హేమలతా!"యనియొకకేకవైచిఁ‚అయ్యయ్యో! నేనేమిచేసినాను. నావలననేమియపరాధము వచ్చినది. చక్రవర్తియుత్తరువు నేనెన్నఁడు నతిక్రమించలేదు. నన్నుఁ బట్టికొనుట యన్యాయము. నన్నువిడువుఁడు. అని దీనస్వరముతో మనవిచేసికొనుచున్న వృద్ధునిమాటలను జెవినిడక రాజభటులు

గట్టిగ బిగియఁదీసి రెక్కలు నొప్పిపుట్టునట్లు వెనకకువిఱిచికట్టిరి. నా రాయణసింగుదీనాలాపములు నాలకించి రాజభటులుగూడ దయగల వారయిరి. కాని మూర్తీభవించిన పాపదేవతయగు రహిమానుఖాను వానివిలాపమునఁజూచి, 'ఓరీ! బద్మాష్! లుచ్ఛా! ముసలిదొంగ! నోరుమూసికొనుము. లేకున్న కొరడాదెబ్బలుతినెదవు. ఏమియునెఱుఁగ నివానివలె నటించెదవేమి? నీవు రాజపుత్రులనుగలిసి చక్రవర్తిమీఁద కుట్రలు చేయుచున్నావు. మీయింట బసచేసిన మదనసింగుతో నీవు మాటాడినరహస్యములు నేనెఱుఁగుదును. నాజరుజంగు నీకుట్రలనెల్లఁ జక్రవర్తితోఁ జెప్పినాఁడు. అందుచేత నాతఁడునిన్నుఁగారాగృహము నకంపుమని యాజ్ఞయొసఁగెను. నీపాపము నీవే యనుభవింపుఁ'మని నిష్ఠురముగఁబలుకఁ దనపైవచ్చిన యపవాదమునకును దురవస్థకును మిగులఁగుందుచు వృద్ధుఁడుండ నీకోలాహలమంతయు విని హేమలత దిగ్గునలేచి బంధింపఁబడియున్న పితామహుని గాలయమునివలె నెదు టనిల్చియున్న రహిమానుఖానునియమదూతలరీతిఁ దనపితామహుని బట్టికొనియున్న రాజభటులను, జూచి వెఱగుపడి శరవేగముతో నతని కడకుఁబోయి దాదా! దాదా? యని కెవ్వుననఱచి, వానిని కౌఁగిలిం చికొని రోదనము చేయసాగెను. రాజసేవకులకు వెఱచియో యనున ట్లు సహజగాంభీర్యమును ధైర్యమును నారాయణసింగును విడిపోవ మనుష్యస్వభావమునుబట్టి పొరలిపొరలివచ్చు దుఃఖమునాఁపలేక యి తఁడు మనుమరాలిని కౌఁగిలించికొని స్త్రీవలె 'అమ్మా! నేను చెరసాల కుఁబోవుచున్నాను', అని పెద్దపెట్టున నేడ్చెను. ఇట్లువాపోవువారినిరు వురనుజూచి దయాహీనుఁడగు రహిమానుఖాను విచారమును లేశము నొందక హేమలతసౌందర్యాదులనుగని యానందించుచువారినివిడఁ దీయ భటుల కాజ్ఞయొసఁగి ముసలివానినీడ్చిలాగనారంభించెను. ఆనడు మ గ్రామముననున్నవారందఱు నీకలకలధ్వనులవలనను, మున్నెముటు

చున్న వారిరోదనధ్వనులవలనను మేలుకొని, మరియును జుట్టుకొని యీవిచిత్రిముసజూచుచుండిరి. దుఃఖభారమున నిలువలేక తాతయె డకుఁ దన బాహులతికలను బెనవైచి గాఢాలింగనముఁ జేసికొని విలపించుచున్న హేమలతను విడఁదీయుట దుర్ఘటమని తలఁచి తురుష్కులు ముసలివానిని లాగుచుండ నందొకఁడు కొరడాలతో బాలికచేతుల మీఁద రెండుదెబ్బలుకొట్టెను. ఆనొప్పిచే బాలికకౌఁగిలింతవదలెను. వెంటనే రాజభటులు నారాయణసింగును గెంటుకొనిపోవుటఁజూచి «అయ్యో! దాదా! దాదా! నేనెట్లుబ్రిదుకఁగలను! నన్నెవరికప్పగించి పోవుచున్నావు! నాకెవరుదిక్కు! నన్నుఁదీసికొనిపోవేమి? నేఁజచ్చి పోవుదును; నేనుండలేను. అయ్యో! మాకేఁగాడవేమి! దాదా, యనిసకలజనులహృదయములును నీరైపోవునట్లుఅచి మొదలునఱికిన వృక్షము వలె నేలఁబడి మూర్ఛిల్లెను. ఆమె మూర్ఛిల్లినవెనుక నారాయణసింగును రాజభటులు దీసికొనిపోవుటకు వలనుపడెను.

అంతట రహీమాఖాను సేవకులలోఁగొందఱికాతనినప్పగించి «ఓరీ ముసలివానిని దీసికొనిపోయి కోటలోఁ జెఱలో నుంచుఁడు. నాకింకను బనియున్నది. నేనిప్పుడేవచ్చెదను' అనివారలఁబంపి హేమలతయింటికి నిర్వురు సేవకులఁగావలియుంచి తానావలవీధికిఁగొంచెము సాగిపోయెను. అచట నారాత్రి గుమిగూడిన గ్రామస్థులలో హేమలతానారాయణసింగుల దురవస్థఁ దలఁచి కంటఁదడిబెట్టనివారును మహమ్మదీయుని నిందింపనివారును లేరు. కానియాయుధపాణులయియున్న రాజభటులకు వెఱచి యెవరును సాహసించి యాదురాత్ముల దౌర్జన్యమునుమాన్పరయిరి. గాఢమూర్ఛనొంది హేమలతశరీరము నెఱుఁగక రెండుమూడుసారులు «దాదా! దాదా! తెల్లవాఱినదిలెమ్ము» అనియు, మదనసింగు! మదనసింగు! అనియుఁ బలవరించి మరల మూర్ఛిల్లెను. గ్రామస్థులు కావలియున్న రాజభటులకు వెఱచి యామెకు సహాయ

మొసఁగకయె క్రిమక్రమమున నొకరొక్కరుగఁబోవనారంభింపఁగొం తసేపటికె నెవ్వరును లేకపోయిరి. ముష్కరతురుష్కుఁడు సపరివార ముగఁ బట్టణములో మహమ్మదీయులు నివాసముచేయు భాగమునకు బోయి యబ్దుల్ ఖరీమను మాలవిగ్రహమును ముట్టడించి, సుఖముగ నిద్రించుచున్న మాలవిని బ్రిక్కమీఁదనేపట్టికొని బంధించెను. అతని దారాపుత్రులుకర్తవ్యమునెఱుఁగకగొల్లున నేడ్వసాగిరి. ఆవీధివారంద ఱువచ్చి ఖానును గారణమడిగిరి. కాని మొదట నాతఁడు నిరుత్తరుఁ డై తుదకిట్లు లనియె. ఈతఁడుమహమ్మదీయుఁడై యుండియు హిందువులతో స్నేహము చేయుచున్నాఁడు. కాఫరులతోనాలోచనలుగల యీపాపాత్ముఁడు సత్యమతస్థుఁడగునా! అదిగాక రాజపుత్రులఁగలిసి చక్రవర్తిపైఁ గుట్రలుపన్నుచున్నాఁడు. మతవిరోధియు రాజద్రోహి యునగు నీదురాత్ముని బట్టి బంధింపవలసినదని చక్రవర్తివద్దనుండి నా కు హుకుము వచ్చినది. అందుచేతఁ బట్టికొన్నాను. అనిచెప్పి చెక్కలు వెనకకు విఱిచియఁగట్టించి మాలవిని జెఱకంపెను. కామాతురుడు నీర్ష్యాపీడితుఁడగుటచే రహిమానుఖానొక్కరాత్రి తనబలవద్విరోధిని నిర్బరను బట్టుకొన్నందున కానందించుచు సఫలమనోరథుఁడయివా రినిర్బరఁ జెఱియొకగదిలోనుంచి తలుపులుమూయించి తాళములు వే యించెను. తరువాత గడియరాత్రియుండ నతఁడొంటరిగబయలుదేఱి మఠమునకువచ్చెను. అప్పుడుతానచట కావలియుంచిన సేవకులిద్దఱు ను గాఢముగ నిద్రించుచుండిరి. హేమలతపరిథమమునూర్ఛిల్లినచో ట లేనందున రహిమానుఖాను గదిలోనికిఁబోయిచూచెను. అందును నామె గన్పడనందున నిల్లు నాలుగుపరిక్కలను దొడ్డును ఖానుగారు స్వయముగ వెదకికొనిరిగాని హేమలత యగపడలేదు. ఆశాభంగము ను దుఃఖమును బాధింప సాహేబు బొడలెఱుఁగక నిద్రించుసేవకులను దన్ని నిదరలేపి హేమలతయేదిరా? యని యడుగ వారునదిగ్గులుపడి

మాటలాడక చూడనారంభించిరి. వారినివెంటఁబెట్టుకొని ఖానుకోట
కుఁబోయి తన మందిరమున శయనించి గ్రామమున బ్రాహ్మణ క్షత్రి
యవైశ్యశూద్రవివేచనము లేక ప్రతిగృహమును, మాలమాదిగగూ
డెములను, మహమ్మదీయులయిండ్లను, నూతులు, గోతులు, చెఱువులు
మొదలగువానిని వెదకించెను. కాని హేమలత యెందునుగానఁబడద
య్యె. తుదకు నిరాశపడి కోపమెట్లును దీరక కావలియుండి పరాకున
హేమలతను దాఁటిపోవనిచ్చిన సేవకులఁబిలిచి యందత్యంతోపకారి
యగువానిని క్షమించి మేఘకుండగు రెండవవానికిమరణదండనవిధిం
చెను. పాపము చిరకాలము దారులు కొట్టికొట్టి మార్గస్థులఁజంపిచంపి
దోషియైన ఖానునకాప్తుఁడైనగులామల్లికనేఁడుమరణముతప్పదయ్యెను.
వానిని వృక్షమునకుఁగట్టించి కత్తితో ఖాను తానే నఱికివైచెను. అం
తకును మనశ్శాంతిలేక పిచ్చివానివలె నటునిటుఁదిరుగుచు గడ్డమునొ
కసారి సవరించుకొనుచుఁ గుళ్ళాయి నేలఁబాఱవైచుచు, సేవకులనెల్ల
దిట్టుచుఁ జెఱసాలకడకుఁబోయి నారాయణసింగును మనమరాలివిష
యమై యడుగుచు వానిసంహరించెదనని బెదరించుచు నన్నము ము
ట్టక సకలావస్థలఁబొందుచు ఖాను విలపించుచుండెను. ఇదియిట్లుండ
రాధ మఱునాఁటియుదయమున లేచి హేమలతగృహమునకువచ్చిమత
మంతయు వెలవెలఁబాఱి చిన్నఁబోవుటయు బాలిక పెంచురామచిలుక
దిగులుపడియుండుటయు నామె యాడుకొనువస్తువులన్నియు నెక్కడి
వక్కడనుండుటయు ముసలివానిమందులసంచియు వానినెన్నఁడునుబా
యని చేతికఱ్ఱయు నటఁ బడియుండుటయుఁ జూచి కరిసచిత్తయయ్యె
నామె స్త్రీజనస్వాభావికమగువిచారమును బొందకతప్పదయ్యెను. త
రువాత రాధ గృహమునంతను వెదకి హేమలత మ్లేచ్ఛునిపాలఁ బడి
యుండునని తనమనోరథ మీడేరునని సంతోషించి హేమలత వస్తువు
లన్నిఁటిని వెదకనారంభించెను. తనదగ్గఱనున్న మాఱుతాళములతో

బోషాణముతీసి యందున్న సందుకాపెట్టెమూఁత తెఱచి హేమలత యాభరణములను దొంగిలించి యందున్న రెండుకాగితములను దీసి చదువుకొన్నదగుటచే వానినిమెల్లఁగఁ జదువుకొని,నగలకంటెవానిక యి సంతోషించుచు నెవరును జూడకుండ రవికెలోఁబెట్టికొని పోయెను. అటు మదోన్మత్తుఁడై చిత్తవైకల్యముగలిగి ప్రవర్తించురహిమాన్ఖానునకు నల్లాయుద్దీనుజక్రవర్తియొద్దనుండి పరమానాయొకటివచ్చెను. చిత్తూరుపరంపయాత్రనుగూర్చిఖిల్లాదారులతోనెల్ల యోజింపవలసియున్నదనిఖానును జక్రవర్తి రమ్మనెను.నిరంకుశమగు చక్రవర్తియుత్తరువు నతిక్రమింపఁజాలక యొకవారములో ఢిల్లీకిఁబోవుచు,సింగును మాలపిని విడువవలదని తనక్రిందియధికారితోఁజెప్పి చనెను. గ్రామస్థులందఱును హేమలత బలవంతమున మృతినొందెనని నిశ్చయించిరి.

---

## అయిదవ ప్రకరణము.

---

మహమ్మదీయులు భరతఖండమునుబరిపాలించినంతకాలమును ఢిల్లీనగరము రాజధానియైయుండెను. ఈఢిల్లీచక్రవర్తులె రారాజులవలనఁ గప్పముల గ్రహించి మూర్ధాభిషిక్తులను బాదాక్రాంతులఁ జేసిరి. ఈఢిల్లీచక్రవర్తులె యాసేతుహిమాచలమగు భరతఖండము నేకచ్ఛత్రముగఁ బాలించిరి. గజనీమహమ్మదు పండ్రెండుసారులు హిందూదేశముపై దండెత్తి దేశమునెల్లఁ గొల్లగొని లక్ష్మిని దనవెంటఁగొని దారిద్ర్యదేవత నిట నిలిపి చన్నయనంతరము మహమ్మదుగోరి యను నతఁడు ఢిల్లీమహారాజుగ నుండిన పృథ్వీమహారాజును థనేశ్వరయుద్ధమున వధించి దేశము నాక్రమించెను. తన్మరణానంతరము బానిసరాజులు 1206 మొదలు 1290 వఱకు నుత్తరహిం

దూస్థానమును బాలించిరి. వారు బలహీనులయినవెనక వృద్ధుఁడయ్యు జలాలుద్దీను భుజబలముచే బానిసలనుగెల్చి సింహాసన మెక్కి కిల్జీవంశస్థాపకుఁడయ్యెను. జలాలుద్దీన్ చక్రవర్తి 1290 మొదలు 1295 వ సంవత్సరమువఱకు మాత్రమె పరిపాలించెను. రాజ్యకాలకాలము స్వల్పమైనను మహమ్మదీయు లదివఱకెన్నఁడు నెఱుఁగని దక్షిణహిందూదేశముపై ప్రథమదండయాత్ర 1294 వ సంవత్సరమున జరగెను. అది జలాలుద్దీనునకు నన్నకుమారుఁడును కపటోపాయధురీణుఁడును, రాజనీతివిశారదుఁడు నగునల్లాయుద్దీను సేనానాయకుఁడై నడిపి మహారాష్ట్రదేశము నాక్రమించెను. ఆకాలమున మహారాష్ట్రదేశమున దేవగిరినగరము రాజధానియై యుండెను. అల్లాయుద్దీను మహారాష్ట్రదేశాధీశ్వరుఁడగు రామదేవమహారాజును గెల్చి యాతఁడు ఢిల్లీకి సామంతరాజుగ నుండునట్లును గప్పము గట్టునట్లును నొడంబఱచి బహునగరములను గొల్లగొన్న దోపిడిధనముతోడను, కానుకలతోడను బినతండ్రి నెదుర్కొనుట కరిగెను. అరిగినతోడనే యతఁడు పినతండ్రిని జంపించి తాను జక్రవర్తికాఁ గోరి యపారసేనాసమేతుఁ డయియుండుటచేఁ దనమనోరథమును సులభముగ నెఱవేర్చికొని మహావైభవముతో 1295 వ సంవత్సరమున సింహాసన మెక్కి 1316 సంవత్సరమువఱకును రాజ్యము చేసెను. ఈతఁడు లోకవ్యవహారములం దారితేఱిన దిట్టరియేకాని కుటిలుఁడు. కార్యసాధన మొనర్పఁగలబాహుశాలియెకాని నీతిలేనివాఁడు. ఈతఁ డుత్తరహిందూస్థానమును దాదాపుగ స్వాధీనము జేసికొనినను రాజపుత్రస్థానమునుజయింపలేదు. ఆతఁడుసింహాసనమెక్కునాఁటికిదక్షిణమున మహారాష్ట్రముదక్క దక్కిన దేశము లెవ్వియు వానిపాలనమునకు లోఁబడియుండలేదు. దేవగిరి, మహారాష్ట్రసామంతుఁడగు రామదేవేలుచుండెను. ఓరగల్లు రాజధానిగఁద్రిలింగదేశము కాకతీయవంశ

జులు పాలించు చుండిరి. ఖిలాజీవంశస్థులు ద్వారసముద్రమునుండి మైసూరురాజ్యమునేలు చుండిరి. కర్ణాటకమునస్వదేశ రాజులుపాలించు చుండిరి. రాజస్థానమును దక్షిణ రాజ్యములను స్వాధీనపఱచుకొనవలయు నని యల్లాయుద్దీను చిరకాలమునుండి కోరుచుండి దక్షిణహిందూ దేశముపై మాలికాఫరను సేనానాయకుని గొప్పసైన్యముతో నంపఁగా నతఁడును దనప్రభువువలె నీతిసంపత్తి లేనివాఁ డగుటచే మాయచేతనో బలముచేతనో స్వదేశప్రభువుల నడఁచి రామేశ్వరమువఱకుఁగల దేశమును జయించి యనేక పురాతనరాజకుటుంబముల నిర్మూలన మొనర్చెను. ఈతఁడు దక్షిణదేశమందుండఁ జక్రవర్తి రాజస్థానదండయాత్రకు గూర్చి యోజించుచుండెను. ఢిల్లీనగరమునందున్న సైన్యమును జాలకాలమునుండి యుద్ధమునకు సిద్ధమగునట్లు జేయుచు నితరమండలములయం దుండు సైన్యంబులఁగూడ బిలిపించి సన్నాహ మొనర్చుచు సైనికులకెల్లఁ గావలసినభోజనసామగ్రిలను, గజములను బశువులను సిద్ధపఱచుచుఁ జక్రవర్తి ప్రయత్నము సేయుచుండెను. ఒకనాఁటి సాయంకాలము సంధ్యారాగము నిస్సీయమై ఢిల్లీనగరముపైఁగట్టఁ బడిన యెఱ్ఱనివితానమువలె వెలయుచుండెను. సంధ్యారాగముక్రమముగ నదృశ్యమయి వెన్నెల వ్యాప్తమయ్యెను. నల్లని యమునానదీ జలమునందు ఢిల్లీనగరము మేడలతోడను, మిద్దెలతోడను, మహాగోపురములతోడను నీటఁ గట్టఁబడినపట్టణమువలెఁ బ్రతిబింబితమై కనుపట్టుచుండెను. సాయంకాలము నమాజునకు భక్తులఁ బిల్చువారి కేకలతో మజీదులు ప్రతిధ్వను లిచ్చుచుండెను. మసీదుల యగ్రభాగములును, హిందూదేవాలయశిఖరములును మహోన్నత గోపురములును వెన్నెలలో ధగధగలాడుచు నగరముయొక్క యున్నతస్థితినిధము పొడవుచేఁ దెలియఁ జేయుచుండెను. నగరమధ్యముననున్న కోటలో సరోవరమధ్యమున నిలసిల్లు తెల్లబానురవలెఁ జక్రవర్తి వసియించు నేడంతస్థులమేడ

క్రొత్త కాంతులతో నావెన్నెలయందుఁ గన్పట్టుచుండెను.

ఆనాఁటిరాత్రి నాలుగుగడియ లయినతరువాత చక్రవర్తి రహస్యములు మాటలాడుకొనుగదిలో మెత్తనిపరుపులువేయఁబడిన యొక కుర్చీమీఁదఁ గూర్చుండి హుక్కాత్రాగుచుండ నతివినయముతో నంతఃపుర సేవకుఁడగు నొకనల్లనిదీర్ఘకాయముగల తురక గదిఁ బ్రవేశించి చక్రవర్తిపాదములదగ్గర సాష్టాంగపడి భయవినయములతో, మహాప్రభూ! ఏలినవారి గులాపువాని దొకమనవి యున్నదని మెల్లగఁ బలికెను. ఆమాటవిని యదినట్టి కేదో యోజించుచున్న చక్రవర్తి మహాకోపముతో బానిస నొకతన్నుఁ దన్ని, ఏమిరా! లుచ్ఛా! నీ వెందు కిటుచెరవురా, యనిభయంకరముగఁ గేకవైచెను. బానిసయు వడఁకుచు, "స్వామీ? పాలిఖిల్లాదారు రహిమానుఖానువచ్చియున్నాఁడు. సెలవుదయచేసినపక్షమునఁ దమపాదములసన్నిధికిఁ దోడుకొని వచ్చెదనని పలుకుటయుఁ జక్రవర్తి తనయంగీకారసూచకముగఁదల యూఁచిన, సేవకుఁడు ఖానుగారినివెంటఁబెట్టుకొనివచ్చి గదిలోనికంపి తానావల నిలుచుండెను. ఖానుసాహేబు పాలిగ్రామమునవసించునప్పటిగర్వమును వదలి చక్రవర్తి సమ్ముఖమున నేలఁబడి తత్పాదముల నంటి సలామొనర్చెను. చక్రవర్తియు వానినిజూడఁగానే వానిదురాచారములఁగూర్చి నాజరుజంగు విన్నవించినయంశములు జ్ఞప్తికిరా మండిపడి, ఓరి! రాజద్రోహి! మా దేశమునఁ గలదివ్యవంతులను సామంతులను బోపించుటకా నీకధికారమిచ్చినది? ఛీ! నీమొగముఁజూడఁ రాదు. నీవు నాయెదుటనుండి పో, యనితనపాదములపైఁ బడియున్నయాతనిఁ ద్రోసివైచి రెండుతన్నులుదన్నెను. స్త్రీవలె రోదనము జేయుచు, "ఓమహామ్మదీయమతసంరక్షకా! ఓసకలలోకచక్రవర్తి! నేను మీబానిసను. నేనేపాప మెఱుఁగను, నిర్హేతుకముగ నామీఁదనొర్వలేక తుచ్ఛులెవరో నేరములు జెప్పినా రని" విలపించుచున్న ఖాని

ర్భాగ్యనిఁజూచి చక్రవర్తియించుక కరుణించి, నీనిర్దోషత్వమును నీవె ట్లు స్థాపింపఁ గలవు? అట్లు చేసికొనినపక్షముననే నీప్రాణములు ద క్కఁగలవు. రేపు సాయంకాలమువఱకు నీకుగడు విచ్చినాను. రేపు రాత్రిదర్బారు. ఆసమయమునకు నీవుసంసిద్ధుడవై యుండవలెనని పలికి యాపూఁటకుక్షమియించెను. ఈవాక్యములతో మనశ్శాంతికలి గి రహిమాను భానుసంతోషించి మహాప్రభూ! ఏలినవారు ధర్మమూ ర్తులు. రేపుసాయంకాలము నేనునిర్దోషినని స్థాపించుకొనఁగలను.అం తేగాక రాజపుత్రస్థానసంస్థాపన గూర్చి యత్యంతరహస్య మ యినకాగితములుగూడ నాకులభించినవి. అవి యన్నియు నేనుమీకు నిచ్చెదను. అప్పుడు నాసత్ప్రవర్తనమును మీరెఱుంగఁగలరు. ఇంక నేను సెలవుగైకొనిపోయివచ్చెద నని ఖాను చెప్పిన సలాముద్దీ నా శ్చర్యమును సంతోషమునుగదురఁజల్లనికటాక్షవీక్షణములు వానిపైఁ బఱపుచు నీకు లభించిన కాగితముల నీరాత్రి తెచ్చి మాకుఁ జూపవల యును. ఆకాగితములఁ జూచినదాఁక మాకుఁ దోఁచదు. నీవతివేగ మేగి వానిని దీసికొనిరమ్మని చక్రవర్తిపలుక మందహాసముతో సెలవుగైకొని బసకుఁబోయెను.

---

ఆఱవప్రకరణము.

---

ప్రపంచమునం దిప్పటికి నిలిచియున్న పురాతనపుకట్టడముల లోనెల్ల మిగులనున్నతమయి సర్వజనస్తవనీయమయియున్నది, ఢిల్లీ నగరమునకు నైదుక్రోసులదూరముననున్న కుతుబుమైనరను గోపు రమని చెప్పవచ్చును. ఇదికుతుబుద్దీననుమహమ్మదీయ ఋషిపేరఁ గట్ట బడినది. ఇది కట్టుట కారంభించిన యిరువదియైదు సంవత్సరములకు

ముగింపఁబడినది. ఇప్పటి కది నిర్మింపఁబడియాఱునందలయేఁబదిసంవత్సరములు గడచినను నేఁటికిని జూపఱకుఁ గనులపండువు జేయుచునాశన దేవతపాలఁబడక మహమ్మదీయుల శిల్పిశాస్త్రనైపుణ్యమును బ్రకటించుచున్నది. అదియిన్నూటయేఁబదిరెండడుగుల యెత్తుగలిగిగర్భమందు వంకరగఁ బాముమెలికలవలెఁ దిరిగియున్నమున్నూటతొంబదితొమ్మిదిమెట్లతో నెలయుచుండును. పూర్వకాలమునఢిల్లీరాజ్యమును బరిపాలించిన మహమ్మదీయచక్రవర్తులగోరీలు దీనిచుట్టునున్నవి. నేఁడు దీనిసమీపమున నొకచిన్నగ్రామముబయలు దేరినది. మనమువర్ణించుచున్న కాలమునాఁటికిఁ గూడ తత్సమీపమునఁ గొన్ని సమాధులుండుటచే జనులు రాత్రులందుఁ డఱచుగ నాప్రక్కకుఁ బోవుచుండుటలేదు. ఈగోపురముపయికిఁ బోవువారు శ్రమకలుగకుండవిశ్రాంతిఁ గైకొనుటకు నడుమనడుమనంతస్థులు మందిరములుఁగట్టఁబడియున్నవి. వీనినెల్లఁ గడచి చివరియంతస్తుపై కెక్కి చూచువారినేత్రములకుఁగ్రిందనుండు మనుష్యులు పిల్లలవలెఁగన్పడుదురు. దీనియందుసాధారణముగాఁబరదేశగతులగుఫకీరులువసించుచుందురు. ఆనాఁడుసూర్యాస్తమయ మైనవెనుక నిద్దఱుశిష్యులు వెంటరా నొకఫకీరు మెల్లమెల్లగ గోపురపుమెట్లనుండి క్రిందికిదిగెను. మెట్లనన్నిఁటినిదిగిక్రిందికి వచ్చి తనశిష్యులతోఁ గొన్నిరహస్యములనుజెప్పి చెఱియొకవైపునకుఁ బంపి వారు బయలుదేఱిన నాలుగుగడియల కతఁడు తత్ప్రదేశమును బాసి పురమువంకఁ బోవుచుండెను. అతఁడు షష్టివయఃపూర్ణుఁడగు వృద్ధుఁడని నెఱసినగడ్డము తెలియఁజేయుచుండెనుకాని శరీరదార్ఢ్యము జూచువారంతవయస్సుండుననినమ్మరు. తనశరీరమునఁ బ్రాఁతయంగరకాధరించి తలగుడ్డనుబెట్టికొని పూసలతావళమును ద్రిప్పుచు నతఁడు పురముఁ బ్రవేశించి వీథులవెంబడిఁ దిరుగుచుండెను. రహిమాను ఖాను చక్రవర్తియొద్ద సెలవుగైకొని రాజమందిరమునుబాసివీథిలోనికి

వచ్చువఱకు ఫకీరును దనచేతికారు చప్పుడు చేయుచు వినోదమునుగ
ల్గించుపాటఁ బాడుచు నాస్థలమునకువచ్చెను. చక్రవర్తితనవిషయము
న నేమిచేయునో తనకాగితములు దనవృత్తాంతములను సమ్మునో, స
మ్మక ప్రాణములఁదీయించునో యని భయపడుచు మందగమనము
తో వచ్చుచున్న ఖాను ఫకీరునుజూచి వారు భూతభవిష్యద్వర్తమాన
ముల నెఱిఁగివారగుటఁ దానును విని యుంటఁ దన భవిష్యదవస్థనీఫకీ
రు నడిగి తెలిసికొన వలయునని తలంచి యాతనిసమీపమునకుఁబో
యి వినయముతో "అస్సలా మాలేఖు" మ్మని సలాముచేసెను. ఫకీ
రును "ఆలేఖుంసలా"మని యచట నిలిచెను. అంతట వారిట్లుమాటా
డిరి.

ఖాను.—మీరు కులందర ఫకీరులా? ముదార్య ఫకీరులా?

ఫకీ.—నేను కులందరఫకీరునె. అయ్యా! నాసంగతినీకెందులకు

ఖాను.—అయ్యా! తమరు మహాత్ములు. పైగంబరులవంటి
వారు. నాకు నేఁ డొక్కయాపద తటస్థించినది. అదియెట్లగునోమీరు
తెలుపవలెను.

ఫకీ.—(మాటవిని కొంచెమాలోచించి) హా! మహామ్మదు!
మాలాఅల్లీ! నామీఁదదయగలిగియుండుఁడు. అయ్యా! నాకుఁదెలిసి
నంతవఱకు నీయవస్థను దెలిపెదను, అది నిజమగునేని నీవు నూఱుగు
రు ఫకీరులకు నన్నము పెట్టఁగలవా?

ఖాను.—సందేహ మేమి! మీసెలవుప్రకారము జేసెదను.

ఫకీ.—అయ్యా! నీపేరు రహిమానుఖానుకాదా?

ఖాను.—(ఆశ్చర్యముతో) చిత్తము.

ఫకీ.—నీపైని దుర్మార్గులు చక్రవర్తితో నేరములఁజెప్పిరి కా
ని మహామ్మదువారిదయవలన నీదగ్గఱనున్న కాగితములనుబట్టి నీమా
టయే పైనుండును. నీశత్రువులు నశింతురు.

ఈవాక్యముల నాలకించినపుడనే ఖానత్యాశ్చర్యము నొంది “మీరు సర్వజ్ఞులరు. నేను బాపాత్ముఁడను. నాపాపములు నశించునట్లును నాకు శుభములుగల్గునట్లును నన్ను మీరాశీర్వదించి దేవతలఁ బ్రార్థింపవలెను.” అని వేఁడుకొనెను. అంతట ఫకీరు సంతోషముతో నీపై నల్లాకు దయ గలదు. మహమ్మదీయుఁడ వగుట నీపాపములు క్షమింపఁబడినవి. కాఫరు లందఱు నీచేత హతు లగుదురు. నీకు శుభమగు బొమ్ము అని, తాను సాగిపోయెను. ఖానును మహానందములోఁ దనబసకరిగెను. ఆలోపునఁ జక్రవర్తి ఖానురాక కెదురు చూచుచు, నిర్హేతుకమైన యాలస్యమునకు వానిని నిందించుచు సమీపమున నున్న బానిసపై మండిపడుచుఁ గొంతసేపటికి ముఖ్యమంత్రియైనజహందరులోడికి వర్తమానమంపెను. అతఁడును వచ్చి చక్రవర్తికి సలాముచేసి చేతులు జోడించుకొని యెదుట నిలువఁ జక్రవర్తి కూర్చుండు మని కనుసన్నఁ జేయ నొకపీఠముపైఁ గూరుచుండెను. అంతటఁ జక్రవర్తి వజీరును జూచి రహిమానుఖాను కొన్ని రహస్యము లగుకాగితములఁ దెచ్చినాఁడట! వానిని మనము పరీక్షింపవలెను. అని చెప్పఁగా నావజీరు ఖానునిమిత్త మెదురు చూచుచు నుండెను. అంతలో రహిమానుఖాను కాగితములకట్ట చేతఁ బట్టుకొని మెల్లమెల్లగా మేడమెట్ల నెక్కి మూఁడవయంతస్తు మీఁదకు వచ్చి చక్రవర్తియు వజీరును నున్న మందిరముఁబ్రవేశించి వినయపూర్వకవందనముల సల్పి యెదుట నిలిచెను. చక్రవర్తి వాని నుచితాసనమునఁ గూర్చుండ నియమించి యతనిచేత నున్నకాగితములకట్ట నందికొని విప్పిచూడ నందు నాలుగైదు కాగితములుండెను. ఆకాగితములు మహారాష్ట్రభాషలో నుండుటవలన, నాభాష యందెవరికిని దెలియ కుండుటచే వారందఱు యోజించి రాజభక్తిగలిగి మాయోపాయములం దాటితేఱిన వసంతభట్టును మహారాష్ట్రబ్రా-

హమ్మీరునకు వర్తమానము నంపిరి. అతఁడును నర్ధరాత్రి వచ్చినవర్తమానమునకు భయపడుచుఁ, జపలచిత్తుఁడైన పాదుషావలన నేమి కీడు మూఁడునో యని, యీగండము గడచినయెడల భవానికిఁ గుంకుమపూజ జేసెద, నని మ్రొక్కుకొని యచ్చటికి వచ్చెను. అతని నుచితగౌరవముతోఁ గూర్చుండ నియమించి చక్రవర్తి యాకాగితములనిచ్చి చదువుమనెను. అతఁడును నామూలాగ్రముగ వానినెల్లఁ డనలోఁ జదువుకొని యైదుకాగితములనియు నైదవదిమాత్రము ముఖ్యమైనదనియుఁ జెప్పి దాని నిట్లు జదువనారంభించెను.

“శ్రీసూర్యకులప్రదీపకు లగుభీమసింగు మహారాజువారికి దేవగిరిరాజు రామదేవు నమస్కారములఁ జేసి వ్రాయుచున్న దేమనిన ఈమధ్య మీకును గ్రొత్తఁగా నయ్యల్లాయుద్దీనుచక్రవర్తికిని మనస్పర్థలు గలిగినట్లును, జిత్తూరు రాజ్యముపై నతఁడు దండెత్త నూహించుచున్నట్లును మేము వినుచున్నాము. అది నిజమగునేని మిగులవిచారము నొందుచున్నాము. ఈవఱకు దక్షిణహిందూస్థానమునకు వచ్చి మమ్ములఁ దోడించుట మీరు వినియుందురు. సమానాపదలోనున్న మనమిరువురమును క్షత్రియకులజులము నేకదేశీయులము నగుటచేనన్యమతస్థుఁడు దురాచారుఁడు నగుచక్రవర్తిపైఁ గలిసి యుద్ధము చేసినపక్షమున గెలువకపోము. పౌరుషధనులు నభిమానసముద్రులునగు మీకు మేము దోడ్పడినయెడల దైవానుగ్రహమువలన ఢిల్లీనుండి మ్లేచ్ఛులను బాఱదోలవచ్చును మ్లేచ్ఛుఁడగు చక్రవర్తి దురాచారుఁడగుటచే స్వబలమునం దనేకు లతని కనిష్టులుగ నున్నారని విని సంతోషించుచున్నాము. మీదేశముమీఁద దండయాత్రముందుగ జరఁగునేని మాబలమును మీకు సాహాయ్యముగ నంపెదము. అదియుంతట జరుగదేని మాకు మీరు సహాయముచేయుఁడు. నీతివిశారదుఁడగునీసోమాగెమునకుత్తరప్రత్యుత్తరము దెచ్చియిచ్చుచుండును. దీనికి

వెంటనే యుత్తరము నంపఁగోరుచున్నాము. త్వరపడవలయును.

రామదేవురాయలు."

అని మహారాష్ట్రభాష నున్న యాయుత్తరమును బారసీకభాష లోనికిమార్చి చక్రవర్తికి విన్నవించి వసంతభట్టూరకుఁడెను. చక్రవర్తి కాగ్రహమును నాశ్చర్యమును నేకకాలమున జనించెను. ఉత్తర హిందూస్థానమందున్నగొప్ప రాజ్యమగుచిత్తూరును దక్షిణమున గొప్ప రాజ్య మగుదేవగిరియును గలిసినఁ జక్రవర్తి వారలగెలుచుటయసాధ్యము. అందుచేఁ జక్రవర్తి భయపడి కర్తవ్యమూహించుచునీకీకాగితము లెట్లులభించినవి? అని ఖాను నడిగెను. ఖానేమోయుబద్ధముఁ జెప్పుట కాలోచించుచుండెను. ఈయుత్తరమునుబట్టిచూడ నీవలకు రాజపుత్రులు మహారాష్ట్రుల కేమియువ్రాసినట్లు కనఁబడదు! మహారాష్ట్రులు ముందుగ రసపుత్రులకు వ్రాసినకాగితములుమనకుదొరకినవి కాఁబట్టి భీమసింగివార్తయెఱుఁగరు. అనివజీరుపలుకఁ దద్వచనము లయందుఁ జక్రవర్తి విశ్వాసముంచి యూనని తలఁచూఁచి నీకెవరివద్ద నివి లభించినవి? అని ఖానను మరల నడిగెను. అంతట ఖానులేచి చక్రవర్తి కభిముఖుఁడై నిల్చి చేతులుజోడించి, "ఓమహాప్రభూ!మదనసింగుపై మీకుఁగలగొప్పయభిప్రాయమునుజెఱుపుటకు నాకిష్టములేదు. అయినను మీయాజ్ఞ శిరసావహించి రాజ్యముకొఱకును మీకొఱకును బాటుపడునట్టివాఁడనగుటచేఁ జెప్పకతప్పదు" అనెను. విని యాశ్చర్యమునొంది మదనసింగుసమాచార మెందుకు? అతని కీవృత్తాంతము తెలియునా యేమి? వేగముగఁ జెప్పు మని చక్రవర్తి త్వరపెట్ట ఖానిట్లనియె. ఈకాగితములు నాకు మదనసింగునొద్దనేలభించినవి. అతనిదగ్గఱ నీకాగితము లున్నవనివిని నా సేవకుల నంపి బలవంతముగ వీనిని దెప్పించితిని. నేనీపని కేవల రాజభక్తితో నొనర్చినను దార్ఘులుగొట్టించి దోఁపిడి చేసితినని యేలినవారితో దుర్మార్గులు చె

ప్ప విశ్వసించి నాపయినలుక వహించినట్లున్నది. ఆమదనసింగునకును యోగికినిబరమమైత్త్రి కలదు. ఆయోగియెవరో నిలుకడమీఁదఁదెలియవలయును. అనవుడు జక్రవర్తి యాగ్రహము పట్టఁజాలక తత్క్షణమే యాదుర్మార్గునిఁ బట్టి యేల చెఱలో వేయలేదు? నీవు సమయోచితబుద్ధి లేనిగాడిదవు, అని తిట్టుచుండఁగా రహిమానిట్లు చెప్పుచుండెను. "మదనసింగును నఱకవలెననియే నేను రోషముతో ఖడ్గమునెత్తి యాపాపాత్మునిపయిఁ బడితిఁగాని నాజరుజంగునన్నుఁ బట్టుకొని యాఁపెను". అనవుడుమండిపడి శీరమునుండిలేచి చక్రవర్తి నాజరుజంగడ్డువచ్చెనుగా? అతఁడును వానితోఁ గలిసెనా? యనియడిగెను. అంత ఖాను మెల్లన నిట్లనియె, "దేవరవారు నన్ను క్షమించినపక్షమున నా సంగతి మనవిచేసికొందును. మదనసింగునకు నాజరుజం గాప్తమిత్త్రుఁడు. లతఁ డీకుట్రలోఁ జేరకున్నయెడ, విదేశీయులు విమతస్థులు నగువారి కీస్నేహ మెట్లు కుదురును? దానికి నిదర్శనముగ నిప్పుడు చదివినయుత్తరములో మనబలములోఁ గొందఱు రాజపుత్త్రులతోను మహారాష్ట్రులతోను జేరుదురనియుండలేదా? నాజరుజంగుమొదలగు వారుండుటచేతనే యీయుత్తరమునన్నట్లున్నది." అని చక్రవర్తికి సలాముచేసి ఖానకూర్చుండెను. తరువాతఁ జక్రవర్తి నజీరును వసంతభట్టునుఁ జూచి నాజరుజంగువిషయమున మీయభిప్రాయమేమి? అనిపలుక వజీరిట్లనియె "ఆవిషయమున నాతఁడెట్లు చెప్పుకొనునో విని కర్తవ్యమూహించుట శ్రేయము" అనుచుండఁగా పాదుషా దీని కతనివలన వినుట యెందుకు? లిఖితనిదర్శనముండఁగానిందబద్ధమేమున్నదిఅనెను. తాను బ్రవ్వినగోతిలో మదనసింగును నాజరుజంగును దప్పకపడుదురను పూర్ణవిశ్వాసముతో రహిమానుఖానానంద మొందుచుండెను. చక్రవర్తి రాజపుత్త్రులపై దండెత్తుట కర్తవ్యమగునా కాదాయనితనలోఁ దానాలోచించుకొనుచు, రాజపుత్త్రుల దేశముపైదాడివెళ్ళుదమా? వద్దా? మదనసింగుతో సంగమాత్త్రము లేదని చెప్పినాము. ఈవిషయము

న మీయభిప్రాయమేమి? అనియడిగిన రహిమానుఖానిట్లనియె. మహాప్రభూ! రాజస్థానదండయాత్ర మీరు మానవలదు. రాజపుత్రులు పైగాంభీర్యము గలవారె కాని నిజముగఁ బిఱికివారు. చిత్తూరు జయింపకున్న యెడల మహమ్మదీయులు రసపుత్రులను జయింపఁజాలరని ప్రజలకు మనపై గౌరవము తగ్గును? అనిచెప్పఁగానే చక్రవర్తియునది సరేయని 'ఱేఁపు రాత్రి దర్బారగును. అప్పుడు దండయాత్రసంగతి నెల్లరకుఁదెలియ జేయుదము." ఈరాత్రిప్రొద్దుపోయినది. మీయరహస్యము నుబయలు పఱుపకుఁడు, అని చక్రవర్తి లేవఁగా రహిమానుఖానప్పుడు మరలమదనసింహుతో దేవరవారుయుద్ధమునకు రామని చెప్పుటమిగుల లాభము. మనము దండెత్తి రామనివారనుకొనుచుండ నాకస్మికముగ వారిపైఁ బడి యోడింప వచ్చు, ననెను. పాదుషాపకపక నవ్వి శెహబాస్ మంచియోచనచేసినావు. నీవంటిబుద్ధిమంతుఁడుమారాజ్యములో నింకొకఁడు లేఁడు. అని వజీరునుపిడుకొలిపి రహిమానుఖాను వసంతభట్టును దీసికొనిపోయి వేఱువేఱుగ నిద్దఱికిని జెఱియొకరహస్యమును జెప్పి పుచ్చెను. ఖాను తనబసకుఁ బోవుచుండ మార్గమునఁ గులందరు ఫకీరు మరల నగపడి యతనిని బలుకరించి నీపని నేఁజెప్పిన ట్లయినది గదా? యని యడుగఁగా నైన దని చెప్పి ఖాను ఫకీరుకోరిక మీఁద నతని కారాత్రి జరిగినవిశేషము లన్నియు విన్నవించెను. మఱునాఁటి యుదయమునఁ జక్రవర్తి రహిమానుఖానును దనసన్నిధికి రావించి దండయాత్రనుగూర్చి ముచ్చటించుచుండఁగా మఱింతప్రోత్సాహము కలిగింపఁ దలఁచి ఖాను దేవరివారికి నే నొకప్రియము విన్నవించెద. [illegible]త్తూరు రాజ్యసంరక్షకుఁడగుభీమసింగుమహారాజుభార్య పద్మినియను నొకజగన్మోహనాకార కలదు. ఆమెను బోలుసుందరులు ప్రపంచమున లేరు. మహాచక్రవర్తులైనతమ కాసుందరితగినది. ఈదండయాత్రవలన రాజస్థానము లోఁబడుటయేగాక పద్మినియు మీకు లభించును అని

విన్నవించినతోడనే యమితానందభరితుఁడై చక్రవర్తి వజ్రపుటుంగరము ఖానునకు బహుమానము నొసంగి, సాయంకాలపు దర్బారునకు మరల రమ్మని యాతని సంపివైచెను.

---

## ఏడవ ప్రకరణము.

ఆనాఁటిరాత్రి కొలువుకూటమునదర్బారు జరిగెను. నానాభాగములనుండి ఖిల్లాదారులు, జమీందారులు, ఫౌజుదారులు వచ్చి చక్రవర్తికిఁ దమతమయధికారగౌరవంబుల కుచిత మగురీతిఁ నజరులసర్పించి యర్హమర్యాదల నొందిరి. చక్రవర్తివలన ననేక బిరుదములఁ బొందిన ఢిల్లీనగరవాసు లగుమహమ్మదీయప్రభువులుఁ గూడ వచ్చి దర్బారు నలంకరించిరి. అంతట రాజరుజంగు వచ్చి యుచితాసనముసఁ గూర్చుండెను. సభ పూర్ణమైన వెనుక చక్రవర్తి రాజపుత్రస్థాన దండయాత్రనుగూర్చి తన యభిప్రాయమును బూర్ణముగ నెఱిఁగించి సైన్యములును, సేనానాయకులును యుద్ధసన్నద్ధులై యుండవలయునని యాజ్ఞ యొసఁగెను. అదివఱ కెప్పుడును దర్బారులయందు రాజరుజంగు నతిగౌరవముతోఁ జూచి యాతని యాలోచన నడిగెడి చక్రవర్తి యాదిన మాతనివంకఁ జూడక, దర్బారుముగిసెడు [illegible]ప ముతో మనలో ననేకులు రాజద్రోహులున్నారు. మాసొమ్ము[illegible] మాశత్రుపక్షమునఁ జేరి మాప్రాణములఁ దీయఁ గోరుచున్నవా రీసభలో ననేకులు గల రని పలుక సభాస్థలమెల్ల నిశ్శబ్దమయ్యె[illegible] అచటఁజేరిన సామంతు లందఱు నొకరిమొగమువంక నొకరుచూడ నారంభించిరి. అప్పుడు జరుగుచున్న కలవరపాటునవలోకించినచక్రవర్తి సభ నుద్దేశించి, మీరందఱు నిట్లనుమాన మొందవలదు, మాకిట్టి

యనుమానమునకు నెడ మొసఁగినవాఁడు మాకత్యంతాప్తుఁడని మే మిదివఱకెంచుకొనుచు వచ్చిననాజరుజంగు. అతఁడు నాజపుత్రులలోఁ జేరి మనపైఁ గుట్రలఁజేయుచున్నాఁడఁట. అతనికుటుంబమునకు మే మొసలిపిన మహోపకారమునకు మాకితఁడుచేసిన ప్రత్యుపకారమిదే యని యెలుఁగెత్తి చక్రవర్తి పలుక, నాజరుజంగు గుండెలు ఝల్లు మనియెను. రహిమానఖాను ముఖము మందహాసముతోఁగూడుకొని యుండెను. మహమ్మదీయసామంతులహృదయము లాశ్చర్యముతోను విచారముతోను నిండినవి. పిడుగువలెఁదనపైఁబడిన యపనిందభరింప లేక నాజరుజంగు ధైర్యముదెచ్చుకొని చక్రవర్తికభిముఖుఁడై "మహా ప్రభూ! నాచేసిన యపరాధ మేదియు నేనెఱిఁగినంతవఱకు లేదు. నా యపరాధమును నాకెఱిఁగించి యది యిందు ఋజువుచేసి యీమహా జనమధ్యమున నన్ను శిక్షించుటయుచితముగాని నిష్కారణముగ శూల ములవంటి మాటలతో నన్ను బాధపెట్టుటతగదు. నేనునారాజునకును నాదేశమునకును వ్యతిరేకముగ నెన్నఁడు బ్రవర్తింపలేదు." అని సభ్యులకెల్లఁ జాలిజనియింపఁ బలికిన నాజరుజంగు వచనంబులు చక్ర వర్తి లక్ష్యపెట్టక మహాకోపమున "నీవింక మాటలాడవలదు. నీవు చేసిన యపరాధమునకు నీయుద్యోగము నూడఁదీసినారము. నీవు నేన కధిపతిగ నుండఁదగవు. నీతండ్రితాతలయందలిగౌరవమునుబట్టి నిన్ను [illegible]తో విడిచినాము. పొమ్ము" అని తక్షణము సభనుండి స[illegible]దొలెను. నాజరుజంగు పరువుగలయుత్తరహిందూస్థానమహమ్మ దీయ కుటుంబములో నివాఁడు. అతనితండ్రి బానిసవంశమునాఁటనుండి [illegible] జక్రవర్తులకొలువుననుండి యావంశనాశనానంతరమున జలాలు ద్దీనువద్ద సేనానాయకుఁడుగ నుండెను. ఈకాలమున వృద్ధుఁడై పనిచేయఁజాలక తనకుమారుని రాజసేనయందు నియోగించితానింటి నద్దనుఖముగఁగాలక్షేపముఁ జేయుచుండెను. చక్రవర్తికినాజరుజంగుపై

నీవఱకును నమ్మకము దయయు నుండెనుగాని రహిమానుఖానుని దుర్బోధనలవలన నిప్పు డలుక పుట్టెను. అట్లు పరాభవము నొంది నాజరుజంగు తనగృహమునకరిగి జరిగినవృత్తాంతమును జనకున కెఱిఁగింప నతఁ డావార్తవిని యద్భుతపడి రాజభక్తికి బుట్టినిల్లని ప్రజలచే స్తోత్రముగందిన తనకుటుంబమున కది గౌరవహీనత యని చింతాక్రాంతుఁడయ్యెను. ఇచటఁ జక్రవర్తి దర్బారునం దున్నవారిని జూచి "యీకొలువులోని సరదారులెవ్వరును, లోలోపలఁగుట్రలుసలుపక నాకుఁ బ్రతిపక్షులుగా నుండువారు నిరాటంకముగ నాకొలువు విడిచిపోవచ్చు" నని సెలవిచ్చెను. ఆమాట నాలకించి సభాసదులెవ్వరును లేవరైరి గాని యొక పురుషుఁడుమాత్రము లేచెను. మాయలమారియగు వసంతభట్టను మహారాష్ట్రుఁడు తన యాసనము నుండిలేచి నిర్భయంబుగఁ గంఠమెత్తి యేలికతో నిట్లనియెను. "ఓ మహాప్రభూ! ఈవఱకుఁ జాలకాలమునుండి తమవద్ద సేవఁజేసినవాఁడను. నేనింకఁ దమవద్దనుండఁజాలను. ప్రభువువారిక్రూరస్వభావమును జూడ నాకిందుండుట కష్టముగ నున్నది. నాకు సెలవొసంగుఁడు" అని మహారాష్ట్రుఁడాడినతోడనే పండ్లు పటపటఁగొఱుకుచు దురాత్మ! మాకొలువు నీకుభారముగనుండినఁ బోఁదగును. కాని యిట్టికాఱుకూతలఁ గూయనేల? మాప్రతిపక్షులు నిర్భయముగఁ గొలువువిడిచిపోవచ్చునని మేమభయహస్త మిచ్చియుండుటచే నిట్టికాఱు లఱచియును బ్రాణములతోఁ బోఁగలిగితివి పొమ్ము" అని చక్రవర్తి "ఈతఁడు మాకిదివఱకుఁ జేసిన సేవఁబట్టి వధింపక విడిచినారము. వెంటనే యీతనిఁ దీసికొనిపోయి కారాగృహమున బంధింపుఁడు" అని భటుల కాజ్ఞాపింప వారట్లుచేసిరి. ఇట్లు రాజస్థానదండయాత్రను బ్రకటించిచక్రవర్తి దర్బారుచాలించెను. అందఱునుదమతమనిలయముల కరిగిరి. నాజరుజంగుతండ్రి మహావిచారమున మునిఁగి తనకుమారుని

వెంటఁబెట్టుకొని యారాత్రి చక్రవర్తి దర్శనముచేసి యుచితసత్కారమునొంది వేడుకొనఁగా జక్రవర్తి దండయాత్రకోఁ దనసైన్యముతో గూడ నాజరుజంగు వచ్చుటకుమాత్రము సెలవొసంగెను. అంతటితో దృష్టినొంది నాజరుజంగు దండ్రియు సంతోషిం జనిరి. మఱునాఁటి సూర్యోదయకాలమున ఢిల్లీనగరమునందు వసంతభట్టు చెఱలోనుండి పాఱిపోయెనని యొకవాడుక పడెను. అట్టిమహాద్భుత విందివఱకు నెన్నఁడుఁ గనివిని యెఱుఁగమని జనులు పరిపరివిధములఁ జెప్పుకొన సాగిరి. కారాగృహాధికారి భయముచే వడఁకుచువచ్చి పాదుషాపాదములపైఁబడి యేడ్చుచు నావార్తఁ దెలిపి క్షమియింప వేఁడుకొనెను. చక్రవర్తియు నాశ్చర్యమునొంది యాతనికభయమిచ్చి వసంతభట్టును బట్టి తెచ్చినవారికి నూఱువఱహాలు బహుమానముగ నిచ్చెదమని పట్టణమునఁ జాటఁబంచి యతనినివెదకుటకై యనేకులను బంపెను.

అక్కడనట్లు నారాయణసింగు చెఱలో నుంచఁబడిన రాత్రి వర్ణింపనలవిగాని మహాదుఃఖము నంది తెల్లవారినదాక నిద్రలేక తనకు సంభవించినమహాపదకంటె మనుమరాలిసంగతి యేమయ్యెనా యని యెక్కువసంతాపము నొందనారంభించెను. మఱునాఁడుదయమున హేమలత యెచ్చటఁగనఁబడ లేదని తెలిసినప్పు డామె మృతి నొందియుండునని నిశ్చయించుకొని యతఁడు కంటికి నేలకు నేకధారగా నేడ్చుచు నడుమనడుమ మూర్ఛిల్లి యామూర్ఛలో హేమలతా! మందులసంచి తెమ్మనికలువరించుచుఁ గలఁతనిద్రగలిగినప్పుడు మనుమరాలిపై దుస్స్వప్నములఁ గనుచు లేచి విలపించుచు, మేలుకువగనుండునప్పుడు, అమ్మా! హేమలతా! చిన్నతనమునుండి యుఁదల్లి దండ్రులులేని పసిపిల్లను నిన్నుబెంచి నేఁడు నేలపాలు చేసినాను. అమ్మా! నీవేనూతిలోఁబడి చచ్చినావు. నాకడుపుమీఁదఁదలపెట్టుకొని నీవిఁక నెన్నఁడును నిద్రబోవుగదా. కథలనుజెప్పుమని నన్నిఁక రాత్రి

బలవంతపెట్టువారెవరు! అయ్యయో! ఆనాఁటిరాత్రియే మనకుఁ గడసారి కాఁబోలును యని పరిపరివిధముల హేమలత చేసినచేష్టలను నామె ముద్దుమాటలను దియ్యనిపాటలను, దలఁచితలఁచి విలపించుచుండెను. ఆమఱునాఁటి మధ్యాహ్నమతనికి గోవిందశాస్త్రి భోజనమును దెచ్చిపెట్టెను. ఈపరిచారమొకవారము గతించునప్పటికిఖాను ఢిల్లీకిఁబోవలసి వచ్చెను. ఖానుస్థానమునందంతకంటెఁ గర్కోటకుండొకఁడు నియమింపఁబడెను. అతఁడు ఖానుచేతిక్రింద నున్న చిన్నయుద్యోగస్థుఁడైయెను నధికారి యైనతోడనే గర్వముగలవాఁడై జనసామాన్యముతో మాటలాడుట తన గౌరవమునకుఁదగదనియుఁ దనతో సమానులు లేరనియు దురభిప్రాయమునొంది తనకంటెను కటిఖానే గుణవంతుండని జను లనుకొనునట్లు వర్తించుచుండెను. అతఁ డాయుద్యోగమునకువచ్చిన నాల్గుదినములకుఁ జెఱసాలపరీక్షచేసి నారాయణసింగును మాలవినిజూచి నారాయణసింగు బ్రాహ్మణులు తెచ్చియిచ్చిన భోజనమును దినఁగూడదు. ఇచ్చటమహమ్మదీయులు వండిన యన్నమునుదినవలయునని యాజ్ఞనొసంగెను. ఈయుత్తరువు వలన మహమ్మదీయుఁడగు తనకు బాధలేకపోయినను పరమత సహనము గలవాఁడగుటచే మాలవి నారాయణసింగుస్థితికి మిగులదుఃఖింప నారంభించెను. మఱునాఁడు మధ్యాహ్నము తురకలిద్దఱన్నమువండి చిప్పలోవైచితెచ్చి నారాయణసింగును భుజింపుమనిరిగాని యాతఁడు[illegible]క నుపవాసములుచేయుచుండఁగా నతనికిఁ బ్రాణాపాయము వచ్చునయెడలఁజక్రవర్తిచేఁ దనకుమాటవచ్చునని భయపడియాక్రొత్త యధికారి యాతనికెప్పటియట్లు బ్రాహ్మణు లన్నము పెట్టవచ్చునని యుత్తరువుచేసెను. వారాపరిచారముగాఁ జేయుచుండిరి. ఈసాహేబు మతవిషయమైన పట్టుదలగలవాఁడని మహమ్మదీయులెఱిఁగి మాలవిని గారాగృహమునుండి విడువుమని సాహేబును బలవంతపెట్టసాగిరి.

వారిప్రోత్సాహములకును స్తోత్రములకును సాహేబు మిగుల నుప్పొంగి యొకనాఁడు చక్రవర్తివద్దనుండి తనకు త్తరువు వచ్చెనని మాలవిని విడుదలచేసెను. తోడివానిని విడిచి తన్ను బాధించుట నారాయణ సింగునకుఁ గిష్టముగనుండుటకు మారుగ మాలవి స్వేచ్ఛగానున్న పక్షమునఁ దనవిషయమై పనిచేసి తనకు బంధవిమోచనఁగల్గించు నని సింగు సంతోషించుచుండెను. మాలవియును విడువఁబడినతోడనే తన ముసలినెచ్చెలికి సాయము చేయుదునని వాగ్దానముచేసి తద్విషయమయి ప్రయత్నము చేయుచుండెను.

---

## ఎనిమిదవ ప్రకరణము.

ఉత్తరహిందూస్థానమునందలి క్షత్రియకుటుంబములలో రాజస్థానములోని మీవారు రాజ్యమునేలుకుటుంబమే మొక్కటోనిపరాక్రమము తోడను సత్కీర్తితోడను నగ్రగణ్యమైయొప్పెను. మహమ్మదుగోరీ హిందూదేశముపై దండెత్తివచ్చి యాకాలమున నుత్తరహిందూస్థానమునందుండెడిరాజులనెల్లస్వదేశములనుండి పాఱఁదోలెను. అప్పుడు రాజ్యభ్రష్టులైన రాజకులశిఖామణు లందఱును దద్దేశమున స్వతంత్ర రాజ్యముల నేర్పఱచుకొని వసించుటఁజేసి యాదేశమునకు రాజస్థానమనుపేరు కలిగెను. ఆరాజస్థానమునం దనేక రాజపుత్రకుటుంబము లున్నను వారిలోఁ జిత్తూరుకుటుంబము నేఁటికిని గౌరవమునందుఁదొల్లిటి స్థితికిఁ దీసిపోకయున్నది. మీవారురాజ్యమునకుఁ జిత్తూరు రాజధానియైయుండెను. ఆకాలమునందు రాజస్థానమునఁ జిత్తూరునకు సమానమైన పట్టణ మేవిషయమునను లేదు. చిత్తూరు రాజవంశము శ్రీరాముని ద్వితీయపుత్రుఁడగు కుశమహారాజసంతతి యని చెప్పుదురు. అందు

చేత సూర్యవంశజు లనియు రాజకులప్రదీపకు లనియు వారిని రాజు లందఱు గణింతురు. పరాక్రమమునందును సత్కులప్రసూనతయందును సద్గుణవైభవమునందును రాజస్థానము పందలి తక్కినరాజులు చిత్తూరురాజులకుఁ దీసిపోవుటం జేసి వారందఱుఁ బాలకాలమునుండి చిత్తూరుకుటుంబగౌరవము నెఱింగి యారాజులను దమకుసార్వభౌములుగ నేర్పఱచుకొని వారియాజ్ఞలకు బద్ధులై యుండెడివారు. శత్రురాజులు రాజస్థానముపై దండెత్తినప్పుడు చిత్తూరురాజునకుఁ దక్కిన వారందఱు నొకకట్టుగవచ్చి సాహాయ్యము జేయుచుండుటయు గలదు. మనము వర్ణించుకాలమునఁ జిత్తూరునకు మహారాజు లక్ష్మణసింగనునొక బాలుఁడు. చిన్నతనముననే యాతనితండ్రి పరలోకగతుఁ డగుటచే నాతనిపినతండ్రియు శూరశిఖామణియు సింహపరాక్రముఁడునగు భీమసింగమహారాజు లక్ష్మణసింగునకు సంరక్షకుఁడయి రాజ్యపరిపాలన మొనర్చుచుండెను. అతఁడు యుద్ధమునం దెంత శౌర్యవంతుఁడో రాజకార్యములయం దంత నిపుణుఁడు. అతనికి రణరంగమున నెంతసాహసమో న్యాయపరిపాలనమునం దంత శాంతముండెను. లక్ష్మణసింగప్పటికిఁ బదునాలుగేండ్లప్రాయము గలకుమారుఁడైనను శౌర్యసద్గుణములచే మిగుల వృద్ధుఁడై యుండెను. రాజస్థానముపై ఢిల్లీచక్రవర్తి యగు నలాయుద్దీను దండెత్తునని భీమసింగు విని చక్రవర్తి సమ్ముఖమునకు మదనసింగును రాయబా[illegible]ంపెను. చిత్తూరుసేనానాయకుఁ డగు ప్రతాపసింగునకు మదనసిం గన్నకుమారుఁడు. అతఁడు బాలుఁడయ్యు దృఢరాజభక్తియుక్తుడు విమలగుణసంపన్నుఁడు నగుటచే మహారాజున కాంతరంగికుఁడై రాజకీయవ్యవహారములయందుఁ గొంతభారము సహించి పాటుపడుచుండెను. ఇందుచేత నాతఁడు చక్రవర్తికడకు నంపఁబడి పాల్గ్రామము విడుచునంతవఱకును జరిగినవృత్తాంతమును మీరందఱెఱుఁ

కుదురు. చిత్తూరునుండి రాయబారిగ నేగినమదనసింగు దర్బారునం దుఁ గడుచమత్కారముగ సంచరించుటచేఁ జక్రవర్తి యాతని నెక్కుడుగౌరవముతో నాదరించెను. కాని కార్యములయం దాతనితో గపటము విడిచి మాటలాడలేదు. చిత్తూరుపై దండయాత్రజరుపుటకుఁ దనకిష్టము లేదనియు నెట్టికారణముగూడ లేదనియు రాజపుత్రులతో నత్యంతమైత్రియుంచుటఁ దనమనోరథ మనియు జక్రవర్తి యాతనితోఁ బలికి యతనిని సబహుమానముగ దేశమున కంపెను. మదనసింగు చిత్తూరునకు వచ్చిననాఁడె తనసందేశార్థమును భీమసింగుమహారాజునకు నిశ్శేషముగఁ దెల్పెను. అంతట మహారాజును దక్కిన యుద్యోగస్థులును సంతోషమునఁ బొంగి మదనసింగును స్తోత్రముజేసిరి. మదనసింగింటికి వచ్చినతోడనే తనపినతల్లియగు సువర్ణబాయికి నమస్కరించి యామెయాశీర్వచనముల నంది యనేకాంశములఁగూర్చి యామెతో ముచ్చటించెను. మాటలాడునప్పుడు పరధ్యానముచేతఁ దడబడుచుండుటయు నారాత్రినిద్రలేక నటునిటు విహరించుటయు సువర్ణబాయిచూచి యతఁడు మోహపరవశుఁడై యుండెనని కనిపెట్టెను. మఱునాఁ డుదయమున మదనసింగుతోఁగూడఁ బ్రయాణము జేసినకృష్ణసింగనుసేవకుని దత్కారణముడుగ నాతఁడు హేమలతసమాచారమును నామె యందాతని చిత్తముఁ దగులుటయు సమగ్రముగా విన్నవించెను. సువర్ణబాయి యుత్తమకులస్థురాలగుటచే హేమలతవంటి బీదకన్యను దనకుమారునకు భార[illegible] గ్రహించుట కిష్టపడక తనభర్తయగు ప్రతాపసింగున కావార్త నెఱింగించి యతఁడును దనతో నేకీభవించునట్లు జేసెను. మదనసింగు రెండుసంవత్సరములప్రాయము గలవాఁడైనపుడు తండ్రి మాధవసింగు మహాయుద్ధమున మృతుఁ డయ్యెను. మృతినొందిన భర్తకళేబరముతో నాతనిభార్యయు మదనసింగుతల్లియు నగు మోహిని య[illegible]

వాడుకప్రకారము సహగమనముచేసెను. సువర్ణబాయికి బిడ్డలులేరు గనుక బావకుమారుఁడగు మదనసింగును పెంచుకొని యామె కడు గారాముగఁ జూచుకొనుచుండెను. ప్రతాపసింగునకు మాధవసింగు దమ్ముఁడగుటచే నాతని సేనానాయకత్వ మితనికిచ్చి చిత్తూరుప్రభువు లీతనిగౌరవించిరి. ఆనాఁటనుండియు సువర్ణమతనితల్లిగను బ్రతాపసింగును దండ్రిగను నెంచికొని మదనసింగు తల్లిదండ్రుల మఱచి సుగుణసంపత్తి గలవాఁడై తండ్రికిని గుటుంబమునకును గీర్తిఁదెచ్చుచుండెను. మదనసింగు చిత్తూరు ప్రవేశించి హేమలతా నారాయణసింగులను మఱువక యొకదినమున మహారాజొంటిగి నున్నప్పుడు పాలిగ్రామమున సకలకష్టములతోఁ గాలముబుచ్చుచున్న వృద్ధుని వాని మనుమరాలిని రాజస్థానమునకుఁ బిలిపింపవలయు నని చెప్పి యనేకవిధములఁ బ్రార్థించెను. ప్రభువగు భీమసింగు వారల దైన్యమును విని విచారించి చక్రవర్తికిని దమకును జరుగుచున్న సందేశములు ముగిసినతరువాతఁ గొన్నినాళ్ళకు వానిని రావింప నగు నని చెప్పి మదనసింగును సంతోషపెట్టెను. మదనసింగునకు హేమలతయందనురాగము నానాటికి దృఢ మగుచుండ నామె యెంతదూరము నున్నను సింగుహృదయ మామెసమీపముననే యుండెను. ఇట్లు మదనసింగు మదనాగ్నిచే వేఁగుచు నాగతానాగతవేది యని ప్రసిద్ధికెక్కినచిదానందయోగిదర్శనము జేయఁగోరి యొకనాఁ డతఁ డున్న రామదేవునిమఠమున కరిగి యోగిని దర్శించి నమస్కారము జేసి యతఁడు గనుసన్నఁ జేయ నొకచోటఁ గూర్చుండి యితఁ డింత నిండుజవ్వనమందే యోగాశ్రమస్వీకార మేలచేసెనోయని యోజించుచుండెను. చిదానందయోగి సాక్షాచ్ఛివావతార మని జనులు చెప్పుకొనుట కలదు. మదనసింగు ముఖవిలాసము జూచి యాతఁ డేదోపని మీఁద వచ్చినాఁ డని తెలిసికొని యోగి "బాబా! ఏమి నీ విటు వచ్చినావు?" అని యడిగెను.

మద.—స్వామీ! మీదర్శనమునకే వచ్చినాను.

చిదా.—నీవేదో యడుగవలెనని వచ్చినట్లున్నావు అడుగ వచ్చును.

మద.—అయ్యా! దూరదేశమున నాకాప్తులున్నారు. వారుసుఖులై యున్నారా?

చిదా.—వారు తురకలా? హిందువులా? ఏజాతివారు?

మద.—హిందువులు మారాజపుత్రులు.

ఇట్లు మదనసింగు చెప్పినతోడనే కొంచె మాలోచించి చిదానందయోగి పైకిఁజూచి స్ఫటికాక్షసూత్రమునుద్రిప్పి సంచిలోనుండి యొకతాటియాకు గ్రంథమును దీసి యొక చిన్నపుల్లతో మూఁడుమాఱులు పుస్తకముపయిఁ గొట్టి గ్రంథమును విప్పి యేదియో చూచి యోగి యిట్లనియె. బాబా! నీవడిగినప్రశ్న రామదేవు ననుగ్రహముచే నాకుఁ బూర్ణముగఁ దెలిసినది. నీ వడిగినవారిలో మునలివాఁడొకఁడున్నాఁడు. పదునాఱేండ్లకన్య యొకతెయుఁ గలదు. వారిద్దఱు నాపదలో నున్నారు. ఆమె యతనివద్ద లేదు. పరదేశమందున్నది. వారి కింతలోఁ గష్టము తొలఁగునట్లు తోఁచదు. అని చెప్ప మదనసింగునకు ముఖవికాసము తగ్గెను. తరువాత యోగివద్ద సెలవుగైకొని యాతఁడింటి కరిగి యాదినమునుమ ముట్టక విచారగ్రస్తుఁడై యుండెను. రాత్రి జామైనతరువాత మదనసింగు మంచముపై శయనించి యుండఁ గృష్ణసింగు వచ్చి యాతనితో "అయ్యా' మహారాజుగారు త మ్మొకసారి రమ్మని వర్తమానము పంపినారు. వీధిలో వారిసేవకుఁడున్నాఁడు" అని నమ్రతతో విన్నవించుటయు వెంటనే మదనసింగు తల్లిదండ్రులకావార్తఁ జెప్పి రాజసమ్ముఖమునకరుగుటకుఁ దగు వస్త్రాలంకారములధరించి యశ్వారోహణముఁజేసి తిన్నగఁగోటకుఁజని, రాజపుత్రభటులుకావలియున్నయనేకద్వారములుగడచి

మహల్ ప్రవేశించి గుఱ్ఱము దిగి మహారాజు కూర్చుండియున్న గదిలోనికిం బోయి తన యేలిక యెదుట నిలుచుండెను. భీమసింగు తనిని జూచి 'కుమారా! ఇచ్చటం గూర్చుండు'మని చెప్పి పీఠము జూపెను. ఆగదిలో నొక యున్నతాసనము భీమసింగు గూర్చుండియుండంగా లక్ష్మణసింగును బ్రక్కను గూర్చుండి పినతండ్రివైపు జూచుచుండెను. వారికెదుట నెట్టసి వస్త్రములు గట్టుకొని నిలువంబడియున్న యొకపురుషుని జూపి "కుమారా! ఈతం డొక విచిత్రవృత్తాంతమును జెప్పుచున్నాండు. నీవును దానిని విని కార్యాంశము నాలోచింపుము" అని మహారాజు మదనసింగుతోం జెప్పి యెదుట నున్న యాపురుషునివంకం జూడ నతండు 'మహారాజా! నేను మహారాష్ట్ర దేశస్థుండను; బ్రాహ్మణుండను. నా పేరు వసంతభట్టు. నేనివఱకును ఢిల్లీ చక్రవర్తియగు నల్లాయుద్దీను కొలువులో నుంటిని. కాని యతని దౌర్జన్యమును దురాచారమును జూచి సహింపలేక యాతని కొలువు విడిచివచ్చినాను. గోవులను జంపు పచ్చితురకల దగ్గఱ నింతకాలము గొలువుసలిపిన పాపము నా కాశీవిశ్వేశ్వరుండు క్షమించుం గాక! స్వదేశీయులును వేదశాస్త్రసంరక్షకులును నగు మీ కొలువు నింకం జేయవలయునని మీ పాదములచెంతం జేరినాండను" అని విన్నవించిన యాకథ విని మదనసింగు మహారాజున కభిముఖుండై "స్వామీ! ఈతని చరిత్రము నాకు సందేహాస్పదముగ నున్నది. దేవర వానిని యోచింపవలె' ననెను. ఆమాటలువిని భీమసింగుతో 'దేవా! ఈ బాలుని మాటలు నమ్మి నాపై ననుమానపడంబోకుండు. నేను జేయంబోయెడి యుపకారము ముందుముందు నా కార్యములవలననే మీకు బోధపడును. అల్లాయుద్దీనుయొక్క గుట్టుమట్టు నాదగ్గర నున్నందున నేను మీరనాయాసముగం జక్రవర్తిని గెలుచునట్లు చేయంగలను" అని మహారాష్ట్రుండు పలుక భీమసింగు నచ్ఛీలుండగుటచే ననుమానపడక వానికి నెలకు పదివరహాలు జీతమేర్పఱచి యుద్యోగమిచ్చెను. మహా

రాష్ట్రుని చమత్కారసంభాషణమున బాల్యుఁడైన లక్ష్మణసింగు వాని యెడల వనురాగము గలిగియుండెను. మదనసింగు కేవలో కాని వసంతభట్టు చూపులను, రూపును జూచినవెనుక నాతనియం దనిష్టము కలిగెను. కాని తనయేలిక వానినాదరించుటచేఁ దానును గౌరవముతో నాతనిఁ జూచుచుండెను. అందఱును సంభాషణ చాలించిన తరువాత లక్ష్మణసింగు మహారాష్ట్రునిజూచి 'అల్లాయుద్దీనుసూ.దేశముపై దండెత్తునా'యని యడిగెను. వసంతభట్టు కొంచెము యోజించి 'స్వామీ! తమదేశముపైఁ జక్రవర్తి దండువెడలఁడు. అతనికి రాజపుత్రులచేతవిస్మృఁ గడుభయము' అని పలికిన వసంతభట్టుమాటలను మహారాజును లక్ష్మణసింగును విశ్వసించిరి. మదనసింగువారివలెదృఢవిశ్వాసముంచలేదు. కాని కేవలము నమ్మకపోలేదు. ఆసంభాషణము ముగిసినపిమ్మటభీమసింగు మదనసింగు ప్రముఖులకుసెలవుకొసంగెను. ఆనాఁడు మొదలు కుమారుఁడయిన లక్ష్మణసింగుమహారాజునకు వసంతభట్టు ప్రాణమిత్రుఁ డయ్యెను. భీమసింగునకు సలహాదారుఁగొంగిరుఁడై యుండి సర్వకాలములయందు నాలోచనము జెప్పుచుఁబ్రభుసన్మానముచే జనులకును గౌరవాస్పదుఁడై యుండెను. లరియుఁగుండ మదనసింగు త్రికాలవేది యగుచిదానందయోగిమఠమునకనేకపర్యాయములరిగి వేదాంతవిషయములను రాజకీయవ్యవహారములను ముచ్చటించుచు నుండుటచే యోగికిని మదనసింగునకును స్నేహ మయ్యెను. అందుచేత మహారాజునకుఁ గూడ యోగిని రెండుసారు లాతఁడు చూపి వారి కాతనియందు గౌరవము కుదురునట్లు చేసెను. యోగి రాజపుత్రులయందత్యంతాభిమానమును మహమ్మదీయులయం దసూయయు మెండుగఁజూపుచు, మదనసింగునకును రాణాకును ఢిల్లీవిషయవర్తమానముల నెట్లో తెప్పించి యనుదినమును దెలియఁజేయుచు వచ్చెను. అందుచేత యోగితోఁ బలుమారు రాజులర్ధరాత్రముల రహస్యములు మాటాడుచు వచ్చిరి. ఇట్లు నాలుగుమాసములు గడచెను.

---

## తొమ్మిదవ ప్రకరణము.



ఒకనాఁటిరాత్రి దీపములు పెట్టిననాలుగు గడియలకు మదనసింగును ప్రతాపసింగును గూర్చుండి రాజకీయవ్యవహారములు ముచ్చటించికొను చుండిరి. ఆసమయమున వ్రేలాడుచున్న జడలతోడను శరీరమునిండ నలఁదుకొన్న భస్మముతోడను తెల్లమచ్చలుగల కృష్ణాజినముతోడను మెల్లమెల్లగాఁ జిదానందయోగి వచ్చి వారికెదుట నిలిచెను. అతఁడు తఱచుగా రాత్రులయందుఁ బ్రతాపసింగుగృహమునకు వచ్చుటకల దు. కాఁబట్టి యాతఁడసుదెంపిఁ కార్యమును వెతికి ప్రతాపసింగు వెంటనే లోనికిఁ జనెను. మదనసింగు లేచి "ఓం నారాయణ! బావాజీ!," యని నమస్కరించి యాతనిం గోష్ఠ్యాసిగదిలోనికిఁ బోయి వచ్చినకార్యమేమని యడుగ యోగి యిట్లనియె. "బాబా! నీవు రాజభక్తి గల రసపుత్రులలో నగ్రగణ్యుఁడవు. రాజునిమిత్తము ప్రాణములనైన ధారవోయఁ గలసాహసికుఁడవు గనుక నేను నీనిమిత్తము వచ్చితిని. ఈరాత్రి చిత్తూరునగరమునందు నేను ముందుగా మీతోఁ జెప్పఁదగని ఘోరకృత్యములు జరుగఁదలఁచియున్నవి. మనమీరాత్రి యేమాత్రము నశ్రద్ధచేసినను మనమహాజన్మాంతము విచారింపవలసి వచ్చును. తెల్లవారిన దాఁక నీవు నాకొసంగుము' అని యోగి పలుక మదనసింగు శరీరము వడఁక నారంభించెను. యోగి యాతనిపైఁ జేయివైచి నాయనా! భయపడకు. నేనుండఁగ నీకగరమున కాపద కలుగదు. నీవు వచ్చునప్పుడు యుద్ధములయందు నీహస్తము నలంకరించు ఖడ్గము వదలికొనిరమ్ము. నీవు నీ రాజపుత్రవేషమును మార్చి బ్రాహ్మణవేషమును ధరించి జాముసరాత్రియైన తరువాత యోగానందమఠము దగ్గర నన్నుఁ గలసికొనుము. జయ్ క్షీరసాగరశయన. యనినీవుపలికిన వెంటనే నేను నిన్నానవాలు పట్టెదను. నేను మఱియొకనితో మాటలాడుచుండినయెడ నీవునా

కడకు రావద్దు. ఈరాత్రి నీరాజ్యమును నీదేశమును నీవుగాపాడుకొం దు, వని యోగి చెప్పి వెడలిపోయెను. అతని సాగనంపి రెండునిమిష ములు మదనసింగు వానిమాటల సారాంశమేమై యుండునా యని యోజించెను. కాని తెలియలేదు. అతఁడు లోనికిం జని ప్రతాపసిం గును జూచి యోగికిని దనకును జరిగినసంభాషణమును సవిస్తరముగ దెలియఁజేయ నాతఁడు విస్మయమునొంది కుమారునితో నాయనా! నీ వాలస్యమును జేయక త్వరగ నడుగుము. యోగిమాటలయం దర్థము విస్తారముగనున్నదని నేనూహించెదను. అతఁడు మనరాజ్యముపై మి గులభక్తిఁ గలవాఁడగుటచేఁ గారణాంతరమున యోగిగానున్నట్టులగప డునుగాని నిజముగా యోగికాఁడని నాయభిప్రాయము. త్వరగా నీవు బ్రాహ్మణవేషమునైచికొనుము. అని యాతనికుత్సాహజనకములగు మాటలఁజెప్పెను. మదనసింగు తత్క్షణమేలోనికేఁబోయి తనరాజచిహ్న ములనెల్లఁ దీసివైచి మొగమునిండ బూదిఁబులిమికొని చిన్న యంగ వస్త్రమును గట్టికొని చేతితో నొకచెంబును భుజముపై నొకదర్భాస నమును సంతరించి తండ్రియెదుటికివచ్చినమస్కరించెను. అంతటఁ బ్ర తాపసింగును కుమారునిఁ జూచి, నాయనా! నిజముగ బ్రాహ్మణుని వలెనున్నావు. అని లోపలకత్తియమర్పఁబడిన చేతికఱ్ఱ నతనికిచ్చెను. అది గైకొనిమదనసింగుపోవుచుండఁగానర్థరాత్రమునందుదుర్జనసంచా రము లగువీధులకొంటరిగఁ దనకుమారుఁ డరుగుట కిష్టములేకప్రతా పసింగుతత్సహాయముగ నిద్రించుచున్న కృష్ణసింగును లేపి నిద్రమత్తు నకు గంజాయిమత్తు తోడుగఁ దూలుచున్న వానిని వెంటనంపెను. అపుడు వారిరువురును గృహము విడిచి పోవునపుడు ప్రతాపసింగు, "నాయనా! కడుజాగ్రత్త. శత్రువులనేకులుందురు. నీకపాయమేదైన నండునేని కృష్ణసింగును నావద్దకుఁ బంపిన నేనువెంటనే తగుబలము తో నీసహాయార్థము వచ్చెదను. అని చెప్పి వారల నంపెను. వారరిగి

నవెనుకఁ బ్రతాపసింగు తనశరీరమింటనున్నను మనస్సుకుమారునిమీఁ
దికే పోఁగా నానాఁటిసంగతులనెల్ల మదిలో నూహించుకొనుచుఁ చి
త్తూరురాజ్యక్షేమమునుగూర్చి భయపడుచుఁ బురమునఁ గుట్రలు జ
రుగుచున్నవనివిచారించుచు నడుమనడుమ "ఓ భగవంతుఁడా! అతిప్ర
రాతనమైన చిత్తూరురాజ్యమున కాపదరాకుండఁ జేయుము. అవశ్యక
మైనచో నాప్రాణములనైన నిచ్చెదను. నాకుఱ్ఱవానిని సుఖముగనిం
టికిఁ దెమ్ము" అనిప్రార్థించుచు నిద్రరాక పలుమాఱులు వీథితలుపు
లుదెఱచి చూచుచు, నా రాత్రి కలవరపడుచుండెను. అట్లు మదన
సింగును గృష్ణసింగునుబయలు దేఱిపదినిమిషములలో రాజవీథికిఁజనిరి.
గంజాయిమత్తు పూర్ణముగఁ గృష్ణసింగును విడువనందున నడుచుచునే
యతఁడు కునుకుపాట్లు పడుచు యజమానుఁడువచ్చి వీఁపుమీఁద దట్టఁ
గా మేలుకొని వడివడిఁ బరుగెత్తుచు నతని వెంట వచ్చుచుండెను.
వారు రాజవీథిమధ్యమునకువచ్చునప్పటికి జామునరరాత్రియయ్యెను.
అది వెన్నెలగలదినముగానందున నంధకారము నగరమునంత నావరిం
చెను గాని గగనమండలమునందు వజ్రములవలెఁ దళతళ మెఱయు
చున్న నక్షత్రకోట్లు కొంచెము వెలుతురునిచ్చుచుండెను. పట్టణమెల్ల
మాటుమణఁగుటచే మనుష్యసంచారమంతగా లేకపోయినను జలువ
వస్త్రములఁ గట్టుకొని యత్తరుమొదలగుసుగంధద్రవ్యములను గమ్మ
పూఁదావులను దమరాకకుఁ దెలియఁజేయఁ దాంబూలము నమలుచు
వేశ్యాంగనాగృహముల నలంకరింపఁబోవురసికశిఖామణులుమాత్రము
కొండఱందందు వారి కగపడుచువచ్చిరి. అక్కడక్కడ రెండుమూఁ
డుమిఠాయిదుకాణములును నొకటిరెండు తమలపాకులదుకాణములు
నుదక్క దక్కినబజాఱులెల్ల మూయఁబడియుండెను. మెల్లమెల్లఁగ
నడచి రాజవీథినిదాటి పక్కసందులోనుండి కొంతదూరము పోయి
మదనసింగు తనకు యోగిచెప్పిన గుర్తులనుబట్టి యావీథినున్న చిన్న

దనకుచితమగు నాసనమునఁ గూర్చుండి భీమసింగును మ్లేచ్ఛులబారి నుండితప్పించుటకుఁ దగినుపాయ మాలోచించు చుండెను.

అప్పుడు గోరాసింగులక్ష్మణసింగునుసభ్యులనుజూచియిట్లనియె. మన మీసమయమునఁ జక్రవర్తియొద్దకు మదనసింగును రాయబారిగ నంపుదము. అంతటిన్యాయముతోఁ బ్రవర్తించిన మాయెడ మీరింత యన్యాయముతోఁ బ్రవర్తించుట సత్పురుషోచితము కాదని చక్రవర్తికి నతఁడు దెలిపి యతనిలోపము నతని కెఱింగించినను నతఁడు మనమాట కియ్యకొనఁడేని తగుచర్య జరుపుదము" అని గోరాసింగు నుడువ నంద అదియుక్తమని మదనసింగును సందేశార్థమరుగుమనిరి. మదనసింగు స్వామికార్యార్థ మెంతటి సాహసకార్యమునైననాచరింప నుద్యుక్తుఁడగుటచే నీకార్యమునకు సమ్మతించెను. అతఁడుమరలనింటికి రాక సువర్ణబాయికడ సెలవుగైకొనక కొలువునున్న పినతండ్రికి నమస్కరించి యతనిచే నాశీర్వచనముఁ బడసి రాణావద్ద సెలవుగైకొని చక్రవర్తి సమ్ముఖమునకుఁ గతిపయసేవకులతోఁ బోయెను.

ఇటఁ జిదానందయోగి యరుణోదయమున లేచిస్నానసంధ్యాదికములఁదీర్చికొని సదాశివునిచేరప్పింపఁబడిన మంగలివానినొకచోటఁ గూర్చుండుమని గాడిద నొకచెట్టునకుఁ గట్టించి రాధను దనకడకుఁ బిలిపించి యాగ్రహముతో "ఓసీ మూర్ఖురాలా! నీసంగతి నేనెఱుఁగుదును. నీవు పాలిగ్రామములోనుండు రాధవు. చిత్తూరు నీవెట్లువచ్చితివి?" అని యడిగెను. అది భయసంభ్రమములచే నోడ లెఱుంగక కొంతసేపుండి తెలిసి యింక బొంకిన కార్యము లేదని యిట్లనెను. "స్వామీ! మదనసింగు పాలిగ్రామమునకు వచ్చినప్పుడాయనమీఁద నాకు వెఱ్ఱిమోహ ముదయింప నాఁపుకొనలేక హేమలత ఖానుపాలబడని యెంచి నేనామెవేషము వైచికొనివచ్చి నాకర్మవశమున బట్టుపడితిని నాకుఁ బ్రాణదానముజేయవలెను. నేను మీబిడ్డను" అని

యోగిపాదములపైఁబడి హృదయము కరఁగునట్లు రోదనమారంభించెను. యోగి జాలిఁగొని ప్రాణదానము జేయుటకు వాగ్దానముజేసి దానిని దొడ్డిలోనికిఁ దీసికొనిపోయి తానొకచేయియు సదాశివుఁడొక చేయియుఁ బట్టికొని యౌవనపరిపూర్ణురాలగు నామెను వికృతాంగిగ నొనర్పఁదలఁచి క్షౌరము జేయుమని మంగలివాని కాజ్ఞయొసఁగ వాఁడు తుమ్మెదరెక్కలవలె నల్లనిదై నిడుదలగు రాధశిరోజములభారము బాపి విధవవలెఁ జేసెను. వికృతాంగియగునామెను యోగి తత్క్షణమె గాడిదపైఁ గూర్చుండ నియమించి చిత్తూరునగరము వీధులవెంటఁ ద్రిప్పించెను. గ్రామనివాసులెల్ల మందలు మందలుగ నామెనుజూడ వచ్చి కడుపులు పగులునట్లు నవ్వసాగిరి. ఇట్లు సంభవించిన పరాభవము భరింపలేక రాధ యాప్రొద్దుట నగరమువిడచి గ్రామాంతరము బోయెను. అక్కడ మదనసింగు చక్రవర్తి శిబిరమునకుఁజని తనరాక నతని కెఱిఁగించెను. అక్కడ మదనసింగువంటిశూరశిఖామణిని శత్రుమండలమున లేకుండఁ జేయుటకుఁ జిరకాలమునుండి ప్రయత్నించుచున్న చక్రవర్తి యాతనిరాకవిని రహిమానుఖానునకు వర్తమానము నంపెను. రహిమానుఖాను మదనసింగుపైఁగల యసూయచే నాతని రాయబారము వినవక్కఱలేదనియు వెంటనే యాతని జెఱఁబెట్టఁ దగుననియుఁ జక్రవర్తికి నాలోచనచెప్పెను. చక్రవర్తి తత్ప్రకారముగ మదనసింగును గారాగృహమునఁ బెట్టించి రహిమానుఖానును నచటఁగావలియుండనాజ్ఞాపించెను. మదనసింగు ననుచరులలో నొకఁడు సత్వరముగఁబఱతెంచియతనియవస్థను బ్రతాపసింగునకువిన్నవించెను. భీమసింగు చెఱలోఁ బడినప్పుడెట్లు చిత్తూరున దుఃఖముదయించెనో యట్లే నేఁడును మదనసింగువిషయమైదుఃఖముదయించెను. ప్రతాపసింగు విచారమునకు నలవిలేదు. సువర్ణబాయి కీసంగతి తెలిసినపుడు గాలితాఁకిన నేలపైఁబడు తీఁగవలె నామెమూర్ఛవోయెను. తెలిసినతరు

వాత సన్నపానములు ముట్టక దుఃఖపారవశ్యము నొందియుండెను. ఆ దివసమట్లు మహమ్మదీయశిబిరమున మహానందముతోడను రాజపుత్రశిబిరమున దుఃఖముతోడను గడచినవెనుక మఱునాఁడు హృదయమున జక్రవర్తి మదనసింగును జెఱఁబెట్టి గుడారమునకుఁ జని యొకపీఠముపై నాసీనుఁడై యతనిని దన యెదుటకుఁ దీసికొనిరమ్మని యాజ్ఞాపించెను. భటు లట్లతనిఁ దోడితేర మదనసింగు తురుష్కునికట్టెదుట నిర్భయముగ నిలిచి యుండెను. ఆతని ధైర్యసంపదకుఁ దనలోఁ జక్రవర్తి యచ్చెరువడి వానితో నిస్సందేహముగా నిట్లని చెప్పఁ దొడంగెను. "ఓయీ! కాఫరు! రాజపుత్రా! నీవు మాచేఁ బడినావు. నీకుఁ బ్రాణములఁ దక్కించుకొనవలెనని యున్నయెడల నాకార్యము చక్కఁ జేయుము. పద్మినిని మాకు సమకూర్చునట్లు మీభీమసింగునకు సలహా చెప్పి కార్యసాఫల్యము గావింపుము. అట్లయిన నీప్రాణసంరక్షణ మొనర్చుటయెగాక భీమసింగును విడుచుటయు నీకనేకబిరుదులను బహుమానములను నొసఁగుటయుఁగూడ నగును. లేకున్న నీకు మరణదండన విధించెదను. నీసుందరకాయమును నీపరాక్రమమును జూడ నాకు జాలియగుచున్నది. నీవు మరణమును గోరెదవా, నీప్రాణములను రక్షించుకొనఁ గోరెదవా?" యని చక్రవర్తి పలుక మదనసింగు మహాకోపోద్దీపితుఁడయి నేత్రద్వయము చింతనిప్పులవలె జేవురింప మొగ మెఱ్ఱఁబారఁ బరవశుఁడై తాను మ్లేచ్ఛసార్వభౌముని స్వాధీనమునందుండుటయుఁ దనకు మరణము సంప్రాప్తమగుటయు మఱచి నిర్భయముగ నిట్లు పలికెను. "ఛీ! నీదురాలాపముల నింకఁ గట్టిపెట్టుము నీవు పౌరుషవంతుఁడ వనియు మానాభిమానములు గలవాఁడవనియు నే ననుకొంటిని గాని యింత నీచుఁడవని నే నెన్నఁడెఱుఁగను. నీకు భీమసింగుమహారాజుభార్య యగు మహాపతివ్రత పద్మిని కావలయునా? మే ముత్తమక్షత్రియవంశ సంభూతులముగాని

కలుకుతురకలముగాము మాకు మానాభిమానములే తల్లిదండ్రులు. ప్రాణములఁ దీసివేయుదునని నీవు బెదరించుమాత్రమున తుచ్ఛప్రాణములకుజడిసి నీచకర్మము నొనర్చువార మనుకొంటివి కాఁబోలును! ఈ తుచ్ఛకర్మములనొనర్చి జీవించుటకంటె మాకు సూరజనసులభమగు మరణమే మేలు. పరాక్రమవంతుఁడవేని యీదుర్భాషలుడిగి కత్తి గట్టి మాతో మగవాఁడవై పోరుము." అని యనేకభంగుల నిందించుచున్న మదనసింగుమాటల కాశ్చర్యపడి చక్రవర్తి మేర మీఱిన కోపముతో "నీదురాత్ముని జంపివేయుఁడు. వీనినాలుకను గోసి యెఱ్ఱగాఁ గాలినయినుపకట్టులను వీనికన్నులలోఁ జొప్పించి పిమ్మటఁ దలఁదెగ వేయుఁడు." అని రహీమానుఖానున కానతిచ్చి తత్క్షణమె యాగుడారము నుండి వెలుపలికిఁ జని భీమసింగును జెఱపెట్టిన గుడారమున కరిగెను. కామపీడచేఁ జక్రవర్తికి యుక్తాయుక్తజ్ఞానము నశించినందున నతఁడు భీమసింగుసమ్ముఖమున కరిగి తనహృదయపద్మమును బాయకుండిన పద్మిని సంయోగమున దనకుఁగూర్పవలసినదనియాతని వేఁడుకొనెను. కీచకునిమాటల కలిగిన భీమసేనునివలెఁ జక్రవర్తిమాటల కలిగి భీమసింగు రౌద్రరస మొల్క నిట్లనియె. "అపకీర్తితోఁ జిరకాలము జీవించుటకంటెఁ గీర్తితోఁ మరణమునొందుట యుత్తమము. రాజపుత్ర రక్తము నరములయందుఁ బ్రవహించు నంతకాలమును, గంఠమునఁ బ్రాణము లుండునంతకాలమును భీమసింగు మరణమునకు వెఱచి నైచ్యము నొందఁబడు నని స్వప్నమున నయిన నమ్మకుము. నాకు మరణము మాటవంటిదికాని భయకారణము కాదు. నాకుమరణము సంభవించినను సరే; రసపుత్రవంశములు నిర్మూలమైనను సరె! నేనట్టి కార్య మొనర్పను," అని ప్రత్యుత్తర మియ్యఁగా నామ్లేచ్ఛచక్రవర్తి భీమసింగు మదనసింగుల నిరువురఁ జంపివేయవలెనని సంకల్పించుకొనెను. అందుచేత మదనసింగును దత్క్షణమే యంతమొందింపవలదనియు

మఱునాఁడు భీమసింగుతోఁగూడఁ దుదముట్టింపవచ్చుననియు రహిమానుఖానతోఁ జెప్పెను గాని మరల నారాత్రి కొండఱియాలోచనముచొప్పున భీమసింగును వధించుట మానుకొనెను. ఇప్పటికైనను బద్మినిపైఁ దనకాసనశించనందున భీమసింగును జంపిన వ్యవహారము మొకలే మోసమగునదియు నతఁడు సేమముగ నుండిన రసపుత్రులు పద్మినిఁ దనవద్దకేనాఁటికైన నంపి యతనిప్రాణముల రక్షించుకొందురనియు నమ్మి భీమసింగునకు మరణదండన మాన్పెను. మఱునాఁడు నిశ్చితమయ్యెను. రహిమానుఖా నాకాన్యని ర్వాహమునకు నియమింపఁబడినందున నతనియాసనము నర్తింప దుస్సాధ్యమైయుండెను. ఆమధ్యాహ్నమె యినుపకట్లలను గొలిమిలోఁబెట్టి యెఱ్ఱగఁ గాల్పించుచుండెను. ఆసాయంకాలమునందు రహిమానుఖానువద్దకు నందుఁడువచ్చి “స్వామీ! హేమలత చంద్రసేనునిగుడారములో నేయున్నది. ఆ రాత్రిచంద్రసేనుఁడామెనుగొనిపోయెననివిన్నాను మీఁద మీచిత్తము” అని విన్నవింప నాఁడఁబో యునతీర్థమెదురయినట్లు తనహృదయమును బీడించుకన్య తనశిబిరమున నుండుటకుసంతోషించి రాత్రిరెండుగడియలైనతరువాతఁ దనయశ్వమునెక్కి ఖానుచంద్రసేనుని గుడారమునకరిగి యాతనిఁబిలిచి తనకు నెట్లయిన హేమలతను సమర్పింపుమని యాతని బతిమాలుకొనెను. ఆతని మూర్ఖ్యమునకును దుర్వర్తనమునకును జంద్రసేనుఁడచ్చెరువడి యాతనితోఁ ‘మేము రాజులము. మీరు తురకలు, మాకన్యనెట్లు మీకియ్యఁగల మని యడిగినావు? చాలుఁజాలు! నీచర్యలు గట్టిపెట్టుము. లేకున్నఁ జక్రవర్తితో నిది చెప్పెదను.’ అని మందలించెను. రహిమానుఖానింటికరిగి భగ్నప్రియత్నుఁడగుటకుఁజింతిలుచుండెను. చంద్రసేనుఁడు వెంటనే చక్రవర్తిసన్నిధి కరుగుదెంచి వినయపూర్వకముగ జరిగిన వృత్తాంతమంతయు నెఱిఁగించెను, రహిమానుఖానుయొక్క దౌర్జన్యమునకుఁ

చక్రవర్తి మండిపడి చంద్రసేనునిబంపి ఖానుని బిలిపించి కఠినముగ నాతని మందలించెను అంతటఁ దనమీఁద నేరము దప్పించుకొనుటకు ఖా నుపాయమును వెదకి తుద కొకపన్నుగడ నూహించి యేలికతో నిట్లు విన్నవించెను. "మహాప్రభూ! అతనివద్దనున్న బాలిక నిజముగ నప్సరస. పద్మినివలె నుండును. పద్మిని కామబంధు వని విని యామె నెట్లయినఁ దమకు సమర్పింపవలెనని చంద్రసేనుని నేఁడిగితిని గాని యాకన్యానానిమిత్తము కాదు" అనివిన్నవించిన ఖానమాటలచే మదన వికారముదయింప ఖానుపై దయజూపి యంపి తత్క్షణమే చంద్రసేనుని రప్పించి హేమలతను దనశిబిరమునకుఁ దీసికొనిరావలయునని యాన తిచ్చెను. ఆమాటలువిని చంద్రసేనుఁడు నిర్విణ్ణుఁడై యదిరహిమానుఖానుమాయఁగా దెలిసికొని చక్రవర్తిసమ్ముఖమున మాఱుమాటాడ లేక సరేయని వెడలెను. మార్గమునఁబోవుచుఁ దానింతకాలము దిక్కులేని రాచకన్నియమర్యాదగాపాడి తుదకు నిర్దయాత్ముఁడయిన మహమ్మదీయచక్రవర్తి కప్పగింపవలసివచ్చెనని విచారముపొందుచు గుడారమునకు వచ్చి యతఁ డావార్త దనయింతికిని హేమలతకును దెలియఁజేసెను. హేమలత యవ్వచనములాలకించి - సకలదీనులకును న్యాయమొసఁగి స్త్రీలఁజెఱబట్టుదురాత్ముల శిక్షింపవలసిన చక్రవర్తి యే స్త్రీలఁ జెఱపఁదలంచినపుడు తనమర్యాద నిల్పుట దుర్ఘటమని నిశ్చయముగ నమ్మికొని, దైవముపై భారమునైచి యెంతెంతవారి నాశ్రయించిన నెన్నిదినములకును దనకష్టములు కంతము సంభవింప దయ్యెనని యారాత్రియెల్ల విచారించుచుండెను.

---

## పదియేడవ ప్రకరణము.



హా! దైవమా! నన్నింతదిక్కుమాలినదానింగనేలఁ జేసితివి? పవిత్రమగునట్టియు గౌరవముగలిగినట్టియు రాజపుత్రవంశమునఁ బుట్టినతుదకు నిర్భాగ్యురాలనై శివప్రసాదుపంచను గొన్నినాళ్ళును జంద్రసేనునియింటఁ గొన్నినాళ్ళును వసియించి మహమ్మదీయులబారిఁబడుచున్నాను. నాకేల మరణముగలుగఁజేయవు? హా తాతా! ఎందున్నావు? అయ్యోతల్లీ! నాబాల్యమునందె నీవు మృతినొందుటచేతగద నాకిటి యవస్థసంభవించినది. నామనస్సులోనున్న దుఃఖమునెల్లఁదెలుపుకొందమన్న నిరుపార్శ్వముల బంధువులైన లేరు. నేనేమిచేయుదును. మరణమే నాకు శరణమగుఁగాక! బలవంతముగఁ జక్రవర్తిచే నవమానింపఁబడుటకంటె మర్యాదగ మృతినొందుటమేలుగద, అని తనలోఁ దాననుకొనుచున్న హేమలతవద్దకుఁ జంద్రసేనుఁడువచ్చి యామె గౌరవమును గాపాడలేనందులకు విచారించుచు "అమ్మా! యీదినమున నిన్నుఁదప్పక తీసికొనిరావలసినదని చక్రవర్తి మరల నాకు వర్తమానము పంపినాఁడు ఈమాట నీతోఁ జెప్పఁజాలక నేను సంకోచించుచున్నాను. ఏమిచేయుటకును దోఁచదు. అయినను నాప్రాణముల నీనిమిత్తము పోఁగొట్టుకొందును. నామరణాంతమునఁగాని నీకుఁ బరాభవము సంభవింపదు. భయపడకుము" అని పలుక హేమలత యామాటలు విని "నానిమిత్తము మీరు మృతినొందవలదు. నాకవమానముఘటిల్లెడుపక్షమున నాచేతనున్న వజ్రమును నూరుకొని త్రాగుటకుసిద్ధముగనున్నాను. నావజ్రపుటుంగరమె నాయవమానమును బాపనోపును. ఆవేళలో నీవటకు మృతినొందియున్న మాతాతను సత్వరమె నేనుగలిసికొందును.' అని యాత్మహత్యకు సిద్ధముగనున్న సుందరాంగికిఁబ్రత్యుత్తరమీయఁజాలక మరల నొకపర్యాయము నీవిషయమై ప్రియ

త్నించెద, నని చంద్రసేనుఁడు కన్నీళ్ళతో వెడలిపోయెను. హేమలత ప్రతిక్షణమును దనకొఱకుఁ బల్లకివచ్చునని యెంచుచు మృత్యుదేవత రాక కెదురుచూచుచుండెను.

ఆదిన ముదయమైనదిమొదలు రహిమానుఖాను మదనసింగు ను దుదముట్టించు మహోత్సవముగలుగునని మహానందముతో నుం డెను. హేమలత తన సంయోగమునకు సమ్మతింపనందున నామెపైఁ గసిదీర్పఁగోరి దలంచి చక్రవర్తి కామెనెత్తిఁగొంచెను. ఆకారణముచే న తఁడు రెండురెట్లు సంతోషముగ నుండెననుటకు సందేహములేదు. జా ముప్రొద్దెక్కినతరువాత మదనసింగును బూర్వోక్తప్రకారముగ వధిం పవలసినదని చక్రవర్తియొద్దనుండి ఖానునకు త్తరువువచ్చెను. వెంటనే ఖాను మిగులనెత్తుగాఁ గాలిచియున్నపకట్టులను బట్టించుకొని యిరువురు సేవకులతో మదనసింగు వసియించు గుహారమునకుఁబోయి మదనసిం గునుజూచి మరణమునకు సిద్ధముగనుండుమని చెప్ప ఖానుతో నతఁడు దనకు మృత్యువు తృణప్రాయమనియుఁ దాను సిద్ధముగ నుండెననియు ధైర్యగాంభీర్యములఁబలికెను. అంతటఖాను కోపమునఁ బండ్లు పటపటఁ గొఱుకుచు నినుపకట్టులను మదనసింగుకన్నులపైఁ బెట్టి కాల్పుఁడని సేవకుల కానతిచ్చెను. సేవకులును నరహత్యయందు దాటితేఱినవారగు టచే యజమానునియాజ్ఞ తత్క్షణమే శిరసావహించి కాలిన యినుప కట్టుల నెత్తిపట్టుకొని మదనసింగుసమీపమునకరిగిరి. వెంటనేయందుఁడు సింగును వెనుకకుఁబడఁద్రోయు తత్క్షణమే యిరువురు సేవకులు మదన సింగు రెండుచేతులు నొకతాడుకు పఱచికట్టి పాదములబాటవ వ్రేళ్ళను గూడబంధించిరి. అప్పుడు మదనసింగుమనస్సున నీశ్వరధ్యానమొనర్చు చుండెను. ఇప్పుడైనఁ జక్రవర్తిమాట విందువేని నిన్ను రక్షించెదను. అట్లు చేసెదవా? యని రహిమానుఖానడుగ నిర్భయముగనతఁడు నేన ట్లు చేయను. నీయిష్టమువచ్చినట్లు చేయుము, అని యుత్తరమిచ్చెను.

అప్పుడు వారినపకిట్టును గన్నులదగ్గఱకుఁ దెచ్చునప్పటికి వెనుకనుండి యొకసేవకుఁడఱుదుచువచ్చి, నిలువుఁడు! నిలువుఁడు చంపవద్దని కేకవైచెను. ఆమాటలువిని రహిమానుఖాను తిరిగిచూచి యామనుష్యుఁడెవ్వఁడని యఱుచుచుండ నతఁడొక సాహేబుతో వధనాఁపవలసినదనియుఁ జక్రవర్తి ఖానునురమ్మనెననియుఁ జెప్పెను. ఆఘోరకృత్యము నాఁపి ఖాను మదనసింగుబంధములను విప్పించి చక్రవర్తిగుడారమున కరిగెను. చక్రవర్తియెదుట రసపుత్రుఁడొకఁడుకూర్చుండెను. ఖానును జూచినతోడనే చక్రవర్తి రసపుత్రునివంకఁ దిరిగి రాయబారమును విశదీకరింపుమని కోరెను. రాయబారములు నడుపుటయందు మిగులనేర్పుగల దుర్గసింగు చక్రవర్తితో నిట్లనియె. "అయ్యా! నారాణాయు శ్రీపద్మినీదేవియు విన్నవింపుమన్న సంగతులను నేను మీతో మనవి చేయుచున్నాను. భీమసింగుగారిని మదనసింగును మీరు చెఱనుండివిడిపింతురేని పద్మినీదేవి మీభార్యయైయుండుట కొప్పుకొన్నది. భర్త ప్రాణరక్షణమునకును, దనకాయమునైన సమర్పింపదలఁచి పద్మిని మీసాంగత్యమునకు సమ్మతించినది" అని దుర్గసింగు విన్నవింపఁజక్రవర్తియమితానందపరవశుఁడై యఱచి పీఠమునుండి లేచి రహిమానుఖానుని గౌఁగిలించికొని దుర్గసింగును మెచ్చికొనెను. అంతట దుర్గసింగు మరల 'ఆపద్మినితోఁగూడ మానగరమునందుఁగల గొప్ప స్త్రీలందఱు నిటకువచ్చి సాగనంపెదరు. వారేఁడునందలకంటె నెక్కువగ నున్నారు. అందఱుఁ బల్లకీలలో నెక్కివత్తురు. వారు ఘోషాస్త్రీలుకాఁబట్టి వారికిఁ బ్రత్యేకముగ నొకగుడారమునిచ్చిమహమ్మదీయులదృష్టిఁబడకుండ మీరుజాగ్రత్తపెట్టవలెను, అనవుఁడు చక్రవర్తి సందేహమెందుకు? మిగుల జాగ్రత్తపెట్టెదను. త్వరగారమ్మను త్వరగా రమ్మను. పో పో, యని కేకలువేయసాగెను. ఇట్లుచెప్పి దుర్గసింగుచక్రవర్తిని పీడుకొనిపోవునప్పుడు చక్రవర్తి రసపుత్రునకుఁ దనకంఠమున

నున్న రత్నములహారమును బహుమానముగనొసఁగెను. ఆ రాజపుత్రుఁ డరిగినదిమొదలు చక్రవర్తికిఁ బద్మినిపై ధ్యానమెక్కు_వగుటచేనతఁడు తీవ్రముగ మదనాగ్ని పాలయ్యెను. ఒకమాఱు సంతోషముచే వెఱ్ఱివానివలె నఱచుచు, నొకపర్యాయము సేవకులకు బహుమానము లిచ్చుచు, నొకమాఱు తోఁటక గుఱ్ఱముపై సవారిచేయుచు మదనావస్థనొందుచుండెను. పద్మిని ప్రముఖులగు రాజపుత్రీసుందరు లబలలగుటచే నాయుధపాణులగు భటులనుజూచి భయపడుదురని చక్రవర్తి నిరాయుధులై యుండునట్లుసైనికుల కానతిచ్చెను. వారును నాయుధముల నువదలి బంగు నిషాచేయు హాయిగ నిద్రపోవుచుండిరి. మదనపీడితుఁడగు నతనికి నెంతసేపటికిఁ బొద్దుపోనందునఁ డనఖాజీని రహిమానుఖానుని రప్పించి వారితోఁ గొంతసేపు దనకు రాఁబోవు నూతనభార్యనుగూర్చి పరిపరివిధముల ముచ్చటించుచుండెను. అట్లు గొంతసేపు ముచ్చటించి తనపెండ్లి నిశ్చయమనియెంచి తాను శయనించు మందిరమును జక్క_గ నలంకరింప నాజ్ఞాపించి యమూల్యవస్త్రాభరణములను ధరించెను. దుర్గసింగుదెచ్చినరాయబారమును వినియుండుటచేఁ జక్రవర్తి హేమలతమాట మఱచియుండ మధ్యాహ్నము చంద్రసేనుఁడే ప్రభుదర్శనమునకువచ్చి పద్మినిరాకను జక్రవర్తిముఖమున విని యిది యె హేమలతె నపాయమునుండి రక్షించుట కదనని యెంచి చక్రవర్తితో నిట్లనియె. ‹మహాప్రభూ! హేమలతను దీసికొనివత్తునా, వద్దా? ఆమె మీయొద్ద నుండినయెడల మీకొక కష్టము సంభవించును. హేమలతయుఁ బద్మినియు సవతులై యుండుటకు మహారాజపత్నియగు పద్మినియొల్లదు. ఆమె యిందుకాగ్రహము దెచ్చుకొని మరలిపోవునేమోయని నాకు భయమగుచున్నది. అని చంద్రసేనుఁడనఁ జక్రవర్తి హేమలత తనకావశ్యకములేదని నాకు చ్చెను. వ్యాఘ్రముఖమునుండి భయలువెడలిన కురంగమట్లు చంద్రసేనుఁడు సంతోషించుచుఁ బ్రభు

పురోద్దసెలవుగైకొనిపోయి యీవార్త హేమలతకును దసభార్యకును దెలిపి వారితోఁగూడ నానందమొందుచుండెను. సాయంకాలమగుట తోడనే చక్రవర్తి మధురాహారములు భుజించి యభ్యంగనమొసర్చి పద్మినిరాకను నిరీక్షించుచుండెను. వచ్చెడి స్త్రీజనంబులకెల్ల నొకపెద్ద గుడారమువేయఁబడి యుండుటచే వారు ఘోషాతో లోపలికరుగుట కు వీలేర్పడెను. ఈమహాట్టహాసమును విని పద్మిని సాహసమునకును రాజపుత్రుల యవినీతికిని రాజస్థానముయొక్క దురవస్థకును మదిససింగు భీమసింగు లద్భుతపడుచుండిరి. పతివ్రతయగుపద్మిని మ్లేచ్ఛరాజ సంభోగమున కియ్యకొనుటకుఁ గారణ ముండకపోదని చంద్రసేనాదు లును, నాజరుజంగును నాలోచించిరి. నాజరుజంగుపైఁజక్రవర్తికిరహిమానుఖానుచెప్పుడు మాటలవలనఁ గోపము నానాఁటి కధికమగుటచేఁ గనఁబడినచోట మాటలాడుటయును సతఁడు మానెను. నాజరుజంగు మహావిచారముతోఁ దన రాజభక్తిజూపుసమయ మెప్పుడువచ్చునా యని దేవునిఁబ్రార్థించుచుండెను. ఆసాయంకాలమున సూర్యాస్తమ యమైనతరువాతఁ జిత్తూరుకోటలోనుండి యొక్కవరుసగఁ దురుష్కశి బిరమునకు నేఁడువందలపల్లకులు రాసాగెను. పల్లకికి నల్వురుబోయ లుండిరి. కోటమొదలు శత్రువుల స్కంధావారముదాఁకనేక పంక్తిగ నున్న పల్లకులనుమోయు బోయల హోంకారనాదమువలన మహ మ్మదీయుల కర్ణపుటములు పగులుచుండెను. శిబిరమున నొకచోటనా లుగుపక్కలను దెరలఁగట్టించి చక్రవర్తి స్త్రీలపల్లకులను నాస్థలము నకుఁ దీసికొనిపోండని బోయల కాజ్ఞాపించెను. లోపలకరిగిన మను ష్యులు తురకల కగపడకుండఁ దమఘోషా నిలుపుకొనిరి. శత్రుసైని కులు పల్లకులవంకఁ జూచుచు నశ్రద్ధతో నిరాయుధులై యుండిరి. ఆ పల్లకులలో బంగరపుఁబనిచేసిన పల్లకియందుఁ బద్మిని కూర్చుండెనని చక్రవర్తితో బోయలు చెప్పిరి.

## పదునెనిమిదవ ప్రకరణము.



పల్లకులెల్ల నియమితప్రదేశమున నిలిచినపిమ్మట వానితోఁ గూడ వచ్చిన దుర్గసింగు చక్రవర్తి యొద్దకుఁ జని యిట్లనియె. "అయ్యా! పద్మినీదేవి యింక మీ పట్టపుదేవి యగును. కాఁబట్టి శాశ్వతవియోగము సంభవించుచుండుటచేఁ దనభర్తతో నొకమాఱు కడసారిమాటలాడఁగోరుచున్నది. అందుచే నొకగడియ సెలవు దయచేయుఁడవలెను." అని పలుకుటయుఁ జక్రవర్తి సరేయని సెలవొసఁగెను. పిమ్మట పద్మినిపల్లకి భీమసింగుకుడారమునకుఁ గొనిపోఁబడ వారిద్దఱు నొకగడియవఱకును మాట్లాడుచుండిరి. కామాతురుఁడైన యల్లాయుద్దీను [illegible]ష్టమైనను వియోగమును కోర్వలేక పద్మినితో సత్వరముగా స[illegible]షింపఁదలఁచియు, భీమసింగును విడువక ఢిల్లీనగరమునకు బందెగాఁగొని పోవఁ దలఁచియు రహిమానుఖానును బిలిచి యీ సంగతులను బట్టి కొమ్మని యానతిచ్చెను. రహిమానుఖాను నిజసైన్యముతో నచటి కరుగునప్పటికి రాజపుత్రస్త్రీలుండు మందిరమునుండి యొకపల్లకి వారి కెదురుగ వచ్చెను. పల్లకివెంట నాయుధపాణులగు రసపుత్రు లనేకులుండి యందున్నవారిని రక్షించుచుండిరి. ఎదురుగవచ్చివారిప్రయాణమును నివారించుటకు మ్లేచ్ఛభటులు ప్రయత్నించిరి. కాని రసపుత్రులు నిలువనందున వారలకిరువురకును సంకులయుద్ధము జరుగసాగెను. అంతలో భీమసింగు పాఱిపోవుచున్నాఁడని మహాధ్వనియొకటి శిబిరమున వ్యాపింప రహిమానుఖాను మోసమేదో సంభవించినదని తెలిసికొని ప్రాణభయమగునని యెంచి వడివడిఁ జక్రవర్తిసన్నిధికుఁ బరుగెత్తి విచారముతో "స్వామీ! మోసము! మోసముజరిగినది" అని యఱచెను. అల్లాయుద్దీనులికిపడి లేచి యది యెట్టిదనియడుగ ఖాను తొందర

తో నిట్లుచెప్పెను. "మహాప్రభూ! పల్లకులలోఁ గూర్చుండివచ్చినవారు స్త్రీలుకారు. ఒక్కొక్క పల్లకియందొకరజపుత్ర శూరుఁడుకూర్చుండెను. పల్లకులమోయువారందఱు రజపుత్రసిపాయిలేకాని బోయలుకారు. వారు బోయలవేషములఁదాల్చి పల్లకులలో నాయుధములఁ దెచ్చికొన్నారు. మనసైనికులశ్రద్ధగనున్నందున మనమీదినమునన్నోడిపోదుము. భీమసింగుపల్లకిలోఁగూర్చుండికోటకుఁబాఱిపోవుచున్నాఁడు. నేనాతనినాఁపఁజాలనైతిని" అని ఖాను విన్నవించుచుండఁ జకితవర్తి నిశ్చేష్టితుఁడై కొంతసేపటి కొడలెఱిఁగి రాజపుత్రుల ప్రవిష్టమహావిపత్సముద్రమునఁబడి తానును దనసైనికులును మృతినొందవలసివచ్చునని చింతించి ధైర్యమును దెచ్చికొని "హా మాలికాలీ! హా మహా...! హాహాస్నేక్! హాలుస్నేక్! అ... నాజుహుసేన్! అరే అరే అల్లా... ల్లాఅయ్యో! పరుగెత్తి భీమసింగును దఱిమిపట్టుకొనిరండు. అయ్యో! పట్టుకొని! పట్టుకొని! పట్టికొండు. సిపాయిలు లేచియుద్ధసన్నద్ధులుగండు. ఓయీ! ఇబ్రీహిం, ఓయీ! జహాండర్, లెండి లెండి. అరే! జోహారుల్లా త్వరపడు" అనియఱవఁజొచ్చెను. ఈలోన మునుపటిస్థలమునదాగియున్న రాజపుత్రవీరులు భటులసమేతముగ నాలుగువేలతొమ్మిదివందలమందియు నొక్కసారిగా హుమ్మనివచ్చి యశ్రద్ధగనున్న మ్లేచ్ఛసైన్యమునఁబాఁకిరి. అతిత్వరితముగ లేచి మహమ్మదీయసైనికులుతమతమ యాయుధములఁ ధరించి రజపుత్రులనెదుర్కొన నుభయసైన్యములకును ఘోరయుద్ధము జరిగెను. ఆకస్మికమహాయుద్ధములో మహమ్మదీయులు స్వసైన్యపరసైన్యభేదమెఱుఁగఁజాలక తమవారినిసహితమాచీఁకటిలోఁ బొడిచికొనసాగిరి. ఈలోన సురక్షితముగ నగరముజేరి భీమసింగు మూలబలమునెల్లఁ దీసికొనిదక్షిణభాగమున మహమ్మదీయసైన్యమునుదాఁకెను. బలపడిన యీసైన్యమునకును మ్లేచ్ఛులకును జరిగిన మహాయుద్ధము వర్ణింప దుస్సాధ్యమై యుండెను. తమనూన

ప్రాణములకు హాని తటస్థించునని శిబిరమునందున్న స్త్రీలాక్రిందసత్వ
నిఁ జేయ యుద్ధమునూని కొందఱు సైనికులు దారపుత్రాదులసంరక్ష
ణకై వెనుకకుఁ బరుగులిడుచుండిరి. కొబ్బరిపుచ్చెలవలె దెబ్బదెబ్బకు
నెగిరిపడుచున్న మనుష్యులపుఱ్ఱెలును స్రవించురక్తముతో నేలఁగుభా
లునఁబడు మొండెములును దళతళ మెఱయుయోధుల యాయుధంబు
లును దక్క మఱేమియు నచ్చటఁ గనఁబడుటలేదు. రసపుత్రులును
మహమ్మదీయులు నుహాతులై నతసబంధుమిత్రకళేబరముల మీఁదనుండి
నిర్దయాత్ములై నడచిపోవుచుయుద్ధముఁ గొనర్చుచుండిరి. పడినవారితో
డను, పడెడువారితోడను, గాయములచేబాధపడి యేడ్చువారితోడను,
దేహమును విడుచునెడ నీశ్వరస్మరణము జేయువారితోడను, వెన్నిచ్చి
పసుగెత్తువారితోడను, యుద్ధభూమినిండియుండెను. ఈమధ్య మహా
శూరుఁడగు ప్రతాపసింగు భీమసింగును విడిచి చక్రవర్తిని జెఱఁ
బెట్ట నుద్యమించి నాలుగువందల సైనికులను దోడుకొని యల్లాయు
దీను గుడారముపై నరిగెను. చక్రవర్తిమీఁదికి రాజపుత్రు
లరుగుటఁ జూచి స్వామి ప్రాణరక్షణ మవశ్యము కర్తవ్యమని
మహమ్మదీయులెల్ల నడినడిఁ బ్రతాపసింగు నాపుటకు వ్యాఘ్రములు
వలె రోషావేశపరవశులై చని ప్రతాపసింగును దాఁకిరి. ప్రతాప
సింగు మధ్యాహ్నసూర్యునివలె దుర్నిరీక్ష్య ప్రతాపుఁడై మహ
మ్మదీయభటులకు భీతి గొలుపుచుండెను. మహమ్మదీయులు రస
పుత్రులమీఁదికివచ్చుటయుఁ జచ్చుటయునేక కాలమున సంభవించెను.
ఎందఱుతురకలను రసపుత్రులు చంపినను దురకలసేన యధిక మగు
టచే మరల యథాప్రకారముగ సైనికులు ముందుకుఁ జనుచుండిరి.
తుదకుఁజీమలపుట్టవలె మోటతురకలు చుట్టుముట్టుటచే స్వల్పసంఖ్య
గల రాజపుత్రులు క్రమక్రమముగ క్షీణించిరి. ఏమిచిత్రమోకాని రా
జపుత్రసైనికులలో నొక్కఁడైనను రణరంగమును విడిచిపరుగెత్తఁడయ్యె.

కంఠమునఁ బ్రాణ మున్నంతవఱకును రసపుత్రులుఖడ్గమును విడువక
యుద్ధము జేసిరిగాని శత్రువులచేతికిఁగత్తి నీయరైరి. ఇట్లు సైన్యము
పలుచబడినందునఁ బ్రతాపసింగు ఖడ్గమును డాలునుబూని యకాల
మృత్యుదేవతవలెఁ దురకలపైఁబడి యనేకులను జెగటాఱ్చ నాతనిధా
టికి వెఱచి ముందటివారు చెల్లాచెదరై పరుగులిడిరి. తరువాతనలువ
దియోధులతో రణరంగమునవిలిచియున్న ప్రతాపసింగుపై వెనుక
నున్నతురకలు గవిసిరి. ప్రతాపసింగు దేహమంతయు గాయములతో
నిండి చిమ్మనగొట్టములనుండి వచ్చువసంతమట్లు గాయములనుండి
రక్తము స్రవించి చుట్టుప్రక్కలనున్నవారిపైఁ బడుచుండెను. రక్తక్ష
యముచే బలక్షయ మగుటయు సింగు నడుమ నడుమ సొమ్మసిలుచు
దెబ్బదెబ్బకు నొక్కొక్కతురకను గూల్చుచుండెను. ఆవేళఁ బ్రతాప
సింగుచే నిహతులైనవారు దాదాపుగ నూరుమందియుండిరి. బలహీ
నుఁడై యున్న ప్రతాపసింగుమీఁదికిరహిమానఖానునడిచివచ్చి తాఁక
సింగు గుఱ్ఱముమీఁదనున్న ఖానునుదిగలాగితన ఖడ్గమాతనిపై నెత్తెను.
అప్పుడు మ్లేచ్ఛసేనాధిపతి యగు రహిమానుఖానును ప్రతాపసింగు
పాదములపైఁబడి "నేననీబిడ్డనంటివాఁడను. నన్ను జంపినను మీయింటి
కుక్కను జంపఁ జూచినను నొకటే ప్రభూ! నాకుఁబ్రాణము దాన
ముసేయుము. నాతల్లికి నేనొక్కఁడనే కుమారుఁడను. నాకు బిడ్డలు
పుట్టిన మీపేరు పెట్టెదను. నన్ను వదలిపెట్టుము మహాప్రభూ! నన్ను
వదలిపెట్టినయెడల మాపకీరొద్ద నున్న రహస్యపథమును మీకుఁ
జూపెదను. అతనిని మీరు చంపి మీకసిఁ దీర్చుకొనవచ్చునుగాని నా
వంటి దిక్కుమాలినవానిని జంపిన నేమిప్రయోజనము" అని వీరపురు
షలక్షణముల విడిచి పరిపరిభంగుల వేఁడికొనఁ జాలిగుండె గలప్రతాప
సింగు వానిని విడిచిపుచ్చెను. రహిమాను గండమునుండి బయలుపడి
మఱియొకయోధుఁడు కనఁబడకుండఁ గొంతసేపు చచ్చినయేనుఁగు

చాటునను దాఁగికొని యక్కడనుండి లేచి రాజపుత్రులెక్కి వచ్చినపల్ల కులలో నొకదానియందు రహస్యముగఁ గలదాఁచికొనెను. అదివఱకు జెయిలోనుండిన మకరసింగు మహమ్మదీయుల కలకలముఁ జూచి, చక్రవర్తి తన్ను విడిపింపఁదలఁచియె నేగి యూరనిచే మోసపోకముందే మేలు కొని తనగుడారమునుండి వెడలివచ్చి రసపుత్రవీరులను గలిసికొనెను భీమసింగు వానినిగుర్తించి కొంత సైన్యమాతనికిచ్చి ప్రతాపసింగునకు సహాయము మొనర్పుమని యంప నాతఁడును సత్వరముగఁ జక్రవర్తిగు డారమునుండి వచ్చి ప్రాణావశిష్టుఁడై యప్పటికిని దనప్రాణరక్షణము సల్పుకొనుచున్న పినతండ్రిని జూచెను. మకరసింగు పినతండ్రియవస్థను గనుఁగొని యతనిశరీరమును బరీక్షించునప్పటికిఁ బ్రతాపుని దేహమున ముప్పదిరెండు పెద్దగాయములును నెనిమిదిచిన్నగాయములు నుండెను. మకరసింగు పినతండ్రితో "అయ్యా! మీరు మరణభయమునకరుగకుఁడు. మీరింక యుద్ధము మొనర్పలేరు. వైద్యులచే గాయములుకట్టుకట్టింపుఁడు" అని చెప్పఁబ్రతాపుఁడు "నాయనా! రణమునుండి యింటికి మరణభయమున నీవలకు నేరనిగలేను. నేనింకఁబోఁజాలను. రక్తవర్షముచేఁదడిసిన యీయింటిపైఁ బవ్వళించుకొనియెద. నీవు చక్రవర్తిమీఁది కరిగి వానిని బట్టుము. లేనన్న వధింపుము. నానిమిత్తమై విచారింపకుము." అనిపలుక మకరసింగు విచారముతోఁ బినతండ్రిప్రాణములు కావదలుకొని చక్రవర్తిమీఁదికరిగెను. చక్రవర్తి యంగరక్షకసైన్యములతో నొకచిన్నగుడారమునుండి సైన్యము పలాయనమగుటకును రాజపుత్రులు చేసినయుక్తికిని విచారించుచుఁ బ్రాణసంరక్షణమొనర్చుకొనుచుండెను. మకరసింగు ముందు యంగరక్షకులు నిశ్చేష్టితులుగా నతఁడు శత్రుసైన్యమును నుఱికి సూర్యాస్తమయమున సింగపుఁగొదమవలెఁ జక్రవర్తిమొదుటనిలిచి యీయున మొత్తులోనఁ జక్రవర్తిసమీపమున నున్న నాజరుజంగు వారివురకును నడుమువచ్చి నిలిచి ఖడ్గ

మును దగ్గింపుచు నాతని దాఁకెను. సుమారయిదుగంటల సమయమునకు రాకుం డినఁ జక్రవర్తి యాదినముఁ బరలోకవాసియై యుండును. చక్రవర్తి మదనసింగునుజూచి నిర్విణ్ణుఁడై చేష్టలుదక్కి కదలి పాఱిపోఁజూడ నయ్యెను. అప్పుడు నాజరుజంగు మదనసింగుతో నిట్లనియె. "మిత్రుఁడా! నాఁటికి నేఁడు నిశ్చయమైనదని నేనూహించుకుంటిని. నాప్రాణములుండినంత వఱకు నీవు చక్రవర్తివైపు పఱగిడఁజాలవు. అక్కడనే నిలువుము. ఒక్కయడుగు దాఁటివచ్చితివా నీప్రాణములు నీకుఁదక్కవు. మాస్వామి ప్రాణరక్షణముకంటె నాప్రాణ మెక్కువకాదు." అని శౌర్యరసము లొల్క రాజభక్తిపరిపూర్ణము లగుమాటలతో మదనసింగును నిలుప నతఁ డాశ్చర్యపడి, చక్రవర్తి యదృష్టవంతుఁ డగుటచే నీవాతనికి నేఁ డడ్డము వచ్చినావు. నీతో యుద్ధముచేసి గెలిచి చక్రవర్తిని బరిమార్చెదను. అని పలికి యాతనితో యుద్ధమారంభించెను. ఇద్దఱువురును గొంతసేపు యుద్ధము సలిపి యెవ్వరును గెలువనందున విసుగుచుండిరి. అంతలో యుద్ధమాఁపివేయుమని భీమసింగుత్తరువుఁ జేయ మదనసింగు మరలెను. ఆదినమున రాజపుత్రవీరు లనేకులు మృతినొందినను దుడుకు మహమ్మదీయులు చెల్లాచెదరై నానాముఖములకుఁ బాఱిపోయిరి. ఈ నడుమ మనచిదానందయోగి కాగడాలను వేయించుకొనివచ్చి నూరు గురుభటులతో రంగస్థలముజొచ్చి తురకలగడ్డములను దివిటీలతోఁ గాల్చుచు వారివస్త్రములను శరీరములను దహనమొనర్చుచుఁ జిత్రవిచిత్రముగ వారినిఁ జంపనారంభించెను. మహమ్మదీయు లప్పటికి నిశ్శేషముగ నోడింపఁబడిరి. సరదారులు చచ్చిన గుఱ్ఱము లొకవైపునను నేనుఁగులు మఱియొకవంకకుఁ జనసాగెను. స్త్రీలార్తనాదములతో నటునిటుఁ బరువులిడ మ్లేచ్ఛసైన్యమునఁ గలవలమును బాధయు నధికమయ్యెను. ఎచటఁజూచినఁ బీనుఁగులు, నెచటఁగనుఁగొన్న రక్తప్రవాహములు, నెందుఁ బడచిన నెముకలు, నేమివిన్న నార్తధ్వనులు నయ్యెను.

అట్లున్న రంగస్థలమున మృత్యుదేవత విచ్చలవిడిగ సంచరించుచున్నట్లు మహాభయంకరమై యుండెను. రాత్రి రెండుజాములకు సైనికులు శిబిరములువిడిచి పాఱిరి. రసపుత్రులు తెల్లవాఱువఱకు నుండిరి.

---

## పందొమ్మిదవ ప్రకరణము.

---

ఇట్లు సమస్తసైన్యము శత్రువులచే వధింపఁబడుటయుఁ దనకి పాటికష్టము సంభవించుటయుఁ బద్మినీదేవి చేకూరకుండుటయుఁ జూచి చక్రవర్తి రణరంగము విడిచి సత్వరముగ భద్రగజముపై నెక్కి తన కాపత్కాలమునఁ సహాయ మొనర్చిన నాజరుజంగును వేనోళ్ళ నుతియించుచు నాతనిఁ గూడ నేనుఁగుపై నెక్కించుకొని యనుండియు ఢిల్లీనగరమునకుఁ బ్రయాణమయ్యెను. శిబిరమునను సరించివచ్చిన స్త్రీజనమెల్ల నాక్రందనధ్వనులతోఁ బరుగెత్తనారంభించినప్పుడు వారివారిభర్తలు వారికి సహాయముగఁ బోయి వారి కపాయము వాటిల్లకుండఁగఁ జేసిరి. చంద్రసేనుఁడు యుద్ధము జరుగుచున్నంతవఱకును రంగస్థలమును బాసి చనక చక్రవర్తిసైన్యములు పఱచినవెనుక జయాశవీడి శిబిరమునకుఁ జని భార్యనుగనుఁగొని హేమలతతోఁగూడఁ బ్రయాణమై వెడలుమని యానతిచ్చెను. హేమలత వారిగుడారమున లేదని భార్యయెఱింగింపఁ గొంతసేపు చంద్రసేనుఁడు బాలికకొఱకు వెదకి యామెను గన లేక తుదకు విసిగి హేమలతను మహమ్మదీయులో, శత్రువులలో నెవరో తీసికొనిపోయియుందురని నిశ్చయించి కొంచెము విచారించి తనరాజు వెంటఁ దా నరిగెను. మదనసింగు పినతండ్రియవస్థయెట్లున్నదో యని త్వరితగతి నావంకకు వచ్చెనుగాని యానడుమనే భీమసింగు ప్రతాపసింగునిమిత్తము మనుష్యులనంపి వెదకి యాతనిఁ దోడ్కొనిరమ్మని

వారికానతిచ్చియుండుటఁ గాయమునిండ గాయములతో నున్నయమ్మహా
శూరశిఖామణిని వారుభీమసింగుగారిదగ్గఱకుఁదిసికొనివచ్చిరి. భీమసిం
గును వానిస్థితినిబట్టి యతఁడు జీవించుట దుర్ఘటమనియెంచినను బ్రా
ణములున్నంతవఱకు మనుష్యప్రయత్నములు మానుట యనుచిత
మగుటచే వ్రణవైద్యునికాతని నప్పగించి, తమమందిరమునకుఁ గొని
పోవనియమించెను. పినతండ్రిభీమసింగురొద్దనుపేక్షితుఁడై యున్నవార్త
మదనసింగువిని గాయములతగిలి ప్రాణములతో యుద్ధభూమిని బడి
యున్న తనయాప్తులగుదరసపుత్రుల కౌషధ మిప్పించి బ్రదికింపఁదలఁచి
కొందఱు రాజపుత్రులతో యుద్ధభూమిని సంచరించుచుండెను. రహి
మానుఖాను ప్రాణభీతిచే ఖడ్గమును దాఁచి యంతఃపురస్త్రీవలె నొక
పల్లకిలో యుద్ధము ముగియువఱకుఁ గూర్చుండి తమసైన్యమును
శత్రుసైన్యమును యుద్ధభూమిని విడిచినతరువాతఁ బల్లకీతలుపులు తెఱ
చిబైటకువచ్చి మెల్లఁగా నడచుచుండెను. అతఁడట్లుపోవుచుండ నతని
యదృష్టహీనతచే మార్గమున మదనసిం గెదురుపడెను. అతనిఁజూచిన
తోడనే ఖానసాహెబుగారు మీఁదిప్రాణములు మీఁదనే పోవ జీవ
చ్ఛవమువలె నిలువఁబడి తనకు మరణ మతనిచేఁదప్పదని శూరుని
చావుచచ్చుట కష్టముగలుగ ఖడ్గమును జేతఁబట్టుకొని మదనసింగుపైఁ
బడనరిగెను. మదనసింగతనియేటుఁదప్పించుకొని మ్లేచ్ఛసేనానాయకుఁ
డుక్కుదక్కి నేలవ్రాలునట్లొకదెబ్బకొట్టెను. బాటసారులనుదోపించిన
పాతకమును స్త్రీలనుజెఱఁబెట్టినదోషమును నిరపరాధులపైఁజక్రవర్తి
కాగ్రహముఁగలిగించిన క్రౌర్యమును వాని కానమయమున జ్ఞప్తికి
రానతఁడు మనఃక్లేశమునొందితుదకుమహమ్మదువారినిసర్వేశ్వరుఁడై
న యల్లాను దలఁచికొని మక్కావైపు మొగముద్రిప్పిప్రాణమువిడిచి
కొనెను. తనమిత్రులకు మందుమాకులిప్పించి తగినవారి నుపచారము
నకు నియమించి మదనసింగు ప్రొద్దుజూచి రెండుజాము లైనదని

తెలిసికొని గృహాభిముఖుఁడై యరుగుచుండ నతనివెనుక నొకమనుష్యవిగ్రహమువచ్చి వీపుపైఁ జేయివైచి యాకస్మికముగ నతని నాపెను. మదనసింగు లిక్కిపడి తిరిగి చూచి తనయెదుటఁ బదియాఱు సంవత్సరముల ప్రాయముగల యొకబాలకునిఁ జూచి యాశ్చర్యపడి నీ వెవ్వఁడ వని యడిగెను. నాపేరు కుమారసింగు; నేను రాజపుత్రుఁడను. అని యాతఁడుత్తరమిచ్చెను. అంతట వారిట్లు మాటాడిరి.

మద — నీవీరాత్రి యెందుండి యిటు వచ్చుచున్నావు? నీచరిత్రము నాకొంత చెప్పుము.

కుమా — అయ్యా! నేనీవఱకుఁ బరివర్తకు కొలువున నుంటిని. పాలిగ్రామమున నున్న నారాయణసింగు మాతాత. హేమలత నా చెల్లెలు. మేము చాలకాలముక్రిందట వియోగము నొందినాము. మాతండ్రి నాచిన్నతనమునందే మృతినొందెను.

మద — ఆహాహా! నీమాటలాశ్చర్యమును గల్గించుచున్నవి. హేమలతకు నన్నయుండుట నేనిప్పుడు విన్నాను. ఆహా! నీమొగ మచ్చముగ నామె మొగమువలెనే యున్నది. హేమలత యిప్పుడెందున్నది? ఆమెనుజూచి చాలకాలమైనది. మీతాత యేమయ్యెను?

కుమా — మాహేమలతా? ఆమెయు నీశిబిరములో వచ్చినది. కాని యీయల్లరిలో నెటకో పోయియుండును. ఆమె దొరకుట దుర్లభమని నాకుఁ దోఁచుచున్నది.

మద — అయ్యో! నాకాసంగతి తెలియదయ్యెను. నే నేమి చేయుదును? నాకామె దొరకుటెట్లు? దైవము నాయెడ నిర్దయుఁడై యున్నాఁడు.

కుమా — నీ కామెయం దంతప్రేమ యేల? నీ వామెను వివాహమాడెదవా యేమి? నీకామెపై ననురాగ మున్నట్లు లామెకు నీపై నుండునా?

మద.—నీవాలాగున ననుం బోకుము. ఆమెకు నాయందనురాగ మున్నది. ఆమె యెందున్నదో నేనెఱుంగంగోరుచున్నాను. దయచేసి నీవు చెప్పుము. ఆమె నిజముగ నీశిబిరములో వచ్చినదా? అట్లయిన నామెకొఱకు వెదకుదము నాతోరమ్ము.

అని మదనసింగాతురముతోనడుగం గుమారసింగు మందహాసముతో "నీవు తొందరపడకుము. తెల్లవారినదాక నోపిక పట్టుము" అనిచెప్పి పాలిగారిమనుజ రహిమానుఖాను హేమలతవిషయమునజరిగించిన దౌర్జన్యమును, నారాయణసింగును జైజుసారు కంపుటయు, హేమలత గోసాయీస్వయనగు కల్యాణగిరియను శివప్రసాదునింట నుండుటయు, నాయోపాయమున నామెను రహిమానుఖాను శిబిరమునకుం దీసికొనిపోయి బలాత్కరింపం జూచుటయుం జంద్రసేనునిదయవలన బాధావిముక్తినొంది యామె చక్రవర్తిశిబిరములో వచ్చుటయు నాదిగాంగలపూర్వవృత్తాంతము నెఱింగించెను. రహిమానుఖాను చేసిన దౌర్జన్యమును విని సింగు మిగుల విచారమునొంది హేమలతపై జాలియు ననురాగము నెక్కువకాంగా నామెను జూపుమని కుమారసింగును వేగిరపట్టెను. కాని యతం డేమియుం జెప్పక నన్ను నీ వేవిషయమునను బ్రశ్నలువైచి బాధ పెట్టకుము. రేపు నాసంగతిం జెప్పి మా చెల్లిలిసంగతింగూడ బయలు పఱచెదను. అనిపలుక మదనసిం గూరకుండెను. అతనిమనమున నానందోత్సవమధికమయ్యెను. వారిరువురును గొంతసేపు నడచి నగరమును సమీపించునప్పటికిం వారికిం జిదానందయోగి కనంబడెను. యోగినిజూచి కుమారసింగు వినయముతో నమస్కరించి చేతులు జోడించి నిలువ యోగి వాని నాశీర్వదించి యానవాలుపట్టి తనబసకు రమ్మని బలవంతము చేసెను. కుమారసింగు మదనసింగునొద్ద సెలవుగైకొని యారాత్రి యోగితోనరిగెను. మదనసింగుమాత్రము కుమారసింగుమాటలయం దర్థమునరయుచు నాతని

ముఖవిలాసమును దాకయాకర్షణముండుటచే ధ్యానమాన్పైపుంచి యింటి కరిగెను. కుమారసింగు రాత్రి చిదానందయోగిమఠమున భుజియించి సుఖముగా నిద్రించెను. మదనసింగింటి కరుగునప్పటికిఁ గృష్ణసింగు రోదనము చేయుచుఁ బ్రతాపసింగు గాయములచే మరణావశిష్టుఁడై రాజమందిరమున నుండెననియు, సువర్ణబాయి యటకరిగెననియుఁ జెప్పి యాతని నటకుఁ బొమ్మనెను. ఆమాటలువిని మదనసింగు దుఃఖభారముచే నడువఁజాలక కన్నీళ్ళువిడుచుచు మెల్లమెల్లగా రాజాంతఃపురము ప్రవేశించెను. భీమసింగు మహారాణాలక్ష్మణసింగు గోరాసింగు మొదలగువారందఱు మదనసింగున కెదురుగవచ్చి శత్రుజయమున కాతని బహూకరించి పినతండ్రియొద్దకుఁ దోడ్కొనిపోయిరి. జయసంతోషమును బితృమరణదుఃఖమును నేకకాలమున సింగుహృదయమున జనియింప నాతఁడు లోపలి కరిగి గాయములచే బాధపడుచు ధైర్యమువిడువని పినతండ్రినిం జూచి దుఃఖమునుబట్టఁజాలక యాతనిపైఁ బడి యేడ్వనారంభించెను. సువర్ణబాయి కుమారుని గౌఁగిలించికొని నాయనగారు పోవుచున్నారు తండ్రీ! యని రోదనమారంభించెను. అంతట మదనసింగు ప్రతాపసింగు మొగముమీఁద మొగముబెట్టుకొని "కాకా! నేను దల్లిదండ్రుల నెఱుఁగను. నీవే నన్ను గారాబముతోఁ దండ్రి లేనిలోపము కనఁబడకుండఁ బెంచినావు. అయ్యో! నన్ను విడిచిపోయెదవా! నాకెవరుదిక్కు? నే నింక నెట్లు జీవింతును?" అని వాపోవఁదొడఁగెను. శౌర్యరాశియగు ప్రతాపసింగు వానిని వారించి "నాయనా! నీవు రాజపుత్రుఁడ వగుదువా కావా? మరణ మెన్నఁడయినఁ దప్పదుగద. నేను వీరపురుషోచిత మగు మరణమునొందుచున్నాను. దేశస్వాతంత్ర్యమునకుఁ బోరాడి మృతినొందుచున్న నన్నుఁ గూర్చి సంతోషించుటకుమాఱు దుఃఖించెద వేల? నీవు రాజభక్తిగలిగి జాగ్రత్తగ నుండుము." అని యోదార్చి భీమసిం

గురు మహారాణాలక్ష్మణసింగును బిలిచి మదనసింగునుజూపి "అయ్యా! నాకును మాయన్నయగుమోహనసింగునకు నితఁడే కుమారుఁడు. ఈతని మీకుమారునిగ నెంచికొని లోపములను క్షమియించి రక్షించి కొనుఁడు" అనిచేతిలోఁ జేయివైచి యప్పగించెను. ఇంతలోఁ బ్రతాప సింగున కాయాసము రాఁగా నందఱును రామ రామ రామ యను చు హరినామస్మరణ మొనర్చిరి. అప్పుడు భగవద్ధ్యానముతోఁ బ్రతాపసింగు లోకాంతరమున కరిగెను. తరువాత నమితగౌరవముతో నూరేగించిప్రతాపునకు భీమసింగుదహనసంస్కారములు జేయించెను. మదనసింగు పినతండ్రి కుత్తరక్రియలుచేసి పితృఋణమును దీర్చికొని పితృవియోగమునకు హేమలతా వియోగముతోడ్పడఁ జింతిల్లుచుండ సువర్ణబాయియెఱిఁగి కుమారునిజూచి "నాయనా! నీవింక వివాహ మాడి యిల్లు నిలువఁబెట్టికొమ్ము. నీమనోనాయకి యగు హేమలత యున్నచో నామెను జేకొనుము" అని పలుక నామాట లమృతసే చనమట్లు మదనసింగున కపారసౌఖ్యమును గలిగించెను. కాని హేమ లత యెందునుగానరానందున నతఁడుదీర్ఘవిచారమగ్నుఁడయి యానాఁ డుదయమునఁ జిదానందయోగిమఠమునకరిగెను. కుమారసింగాతొలి నాఁడే మఠమును బాసి చనినట్లు చిదానందయోగియెఱిఁగింప మదన సింగు హేమలతజాడలు తెలియనందులకువిచారించుచు నింటికివచ్చు చుండెను. అప్పుడు రాజవీథిలో నొకపల్లకి యాతనికంటఁబడెను. ఆప ల్లకివెంటవచ్చుచున్న యేఁబదివత్సరముల ప్రాయముగల యొకతురక మదనసింగును గురుతుపట్టి "మదనసింగుగారూ! నిలువుండీ" యని పిలువ నతఁడును నిలిచిచూచి, యామనుష్యు నానవాలుపట్టి పేరు స్ఫురణకురానందున జ్ఞప్తికిఁదెచ్చికొనుచుండెను. అంతట నాతురక సింగుతో "అయ్యా! మీరు నన్ను గుర్తింపఁజాలరు. నాది పాలీ గ్రామము, నాపేరబ్దుల్ఖరీముఖాంవి. పల్లకిలోనున్నయతఁడు మున

లినారాయణసింగు. ఇతనిని మీరాదరింపుఁడు." అనసంతోషముతోఁ బల్లకినింటికిఁదోడ్కొనిపోయి నారాయణసింగును సగౌరవమున నాదరించి హేమలతకై యాతఁడు వెదకుటవిని చిత్తూరునందామె లేదని చెప్పి మీరుపాలిగ్రామమునుండి యిటకెట్లువచ్చిరో మాకుఁ దెలియఁ జేయుఁడి" యని మదనసింగడిగెను. రహిమానుఖానుదౌర్జన్యమును, దానజెఱసాలయందుంచుటయు, రహిమానునకుబదులుగవచ్చినవాఁడు తన్నుహింసించుటయు, వేఁటకుఁబోయినప్పుడొకవ్యాఘ్రము వానిపైఁబడి వధించుటయు గ్రామస్థులు తన్నువిడిపించి హేమలతను వెదకించి యెందును గానకుండుటయుఁ జెప్పి యామె చిత్తూరునందున్నదేమో యని మాలవిని సహాయముగఁదీసికొని నేనిటకు వచ్చినాఁడను. ఈతనిదయవలన నేనాపదనుండి బయటఁ బడితిని. అన్యమతస్థుఁడైనను నీతఁడు నాకొనర్చిన యుపకారమునకు నే నీతని ఋణము నెన్నిజన్మములకైనను దీర్పఁజాలను. మా హేమలత యెందును లేదని మీరనుచున్నారుగద. అయ్యో! నే నేమి చేయుదును? ఆమె యిక్కడనుండునని గంపంతయాశతో వచ్చినాఁడను. ఇంక నే మృతినొందుట మేలుగాని జీవించుట మేలుగాదు. ఈమాలవి నన్ను నమ్మికొని చక్రవర్తిరాజ్యమును బాసి చిత్తూరునఁ గాపుర ముండ నిశ్చయించుకొని వచ్చినాఁడు. నే నొకవేళ మృతినొందినను నీవీ మాలవిసాహెబున కుపకారము జేసి యిక్కడనుండునట్లు జేయుము. అనిచెప్పునారాయణసింగుపలుకులు విని మదనసింగు గబ్బుల్ ఖరీమునకభయ మిచ్చి హేమలతను వెదకించు చుండెను.



## ఇరువదవ ప్రకరణము.



ఆమఱునాఁడు మధ్యాహ్నము దర్బారు జరగునని భీమసింగు ప్రకటించెను. రాజపుత్రులెల్ల నియమితకాలమునకుసభామంటపమున కరిగియుచితాసనములఁ గూర్చుండిరి. భీమసింగును మహారాణాయును వచ్చి కొలువు దీర్చి యుద్ధమునందు వీరస్వర్గమునకుఁ జన్న శూరశిఖామణులనుగూర్చి విచారము దెలిపి శరీరముల గాశింపక యుద్ధ మొనర్చిన విక్రమశాలురకనేకబహుమానములను బిరుదులను నిచ్చి వారిని మిగుల గౌరవించిరి. అందు ముఖ్యముగ మదనసింగుసాహసధైర్యములకు రాణా మెచ్చికొని శౌర్యనిధియగుప్రతాపసింగుసేనానాయకత్వమునకు నాతని నియోగించిరి. రాజపుత్రసేనానాయకత్వము నందుటకు మదనసింగు మహానందమునొందినను, నాఁడుచిత్తూరుసభామంటపమునఁ దనతండ్రి లేకుండుటయు, సభయెల్లఁ జిన్నవోవుటయునాతని యుద్యోగమును దాను స్వీకరించుటయు నాతనికిఁగొంతదుఃఖముగల్గించెను. ఆయుత్సవము దాదాపుగ ముగియునప్పటికి నలుబదియేండ్ల వయస్సుగలయొక చామనచాయమనుష్యుఁ డుత్తమవస్త్రములుధరించుకొని వస్త్రాలంకారములతో సభ కరుదెంచి రాణాయెదుట నిలిచెను. అతఁడారీతిగ మున్నెన్నఁడు కొలువునకు రానందున నాతని నెవ్వరు నానవాలుపట్టి తగుగౌరవమునొనర్పక విస్మయమొందుచుండ భీమసింగాతని నుచితాసనమునఁ గూర్చుండఁబనిచెను. మదనసింగు మొదలగు వారీతని మొగము మున్నుజూచినట్లున్నదని తమలోఁదాము గుసగుస లాడ నారంభించిరి. అప్పుడానూతనపురుషుఁడు లేచి సభాసదులను తనవృత్తాంతమును విన నవధరింపుఁడని వేఁడికొని యిట్లు పలికెను. "రాజపుత్రులారా! నాచరిత్రమతిదీనమైనది. నేనొకపరువుగలరాజపుత్రవంశమునం దుదయించితిని, నాబాల్యముననే నా తల్లి

మృతినొందుటచే నేనుబ్రయాగలో నామేనమామలవద్దఁ బెరిగితిని. మా కాపురము రాజస్థానమున నున్న జయపురమైనను నేను ఢిల్లీచక్రవర్తుల పాలనముక్రింద నున్న దేశములో నుండుటచే జలాలుద్దీనుచక్రవర్తియొద్ద సేనాధిపత్యమునుగ్రహించి, యిరువదియేండ్లుదాటకముందే నేనా చక్రవర్తి యనుగ్రహమునకుఁ బాత్రుఁడనై గొప్పవాఁడనైతిని. జయపురమునందు నాతండ్రి నాతల్లి పోయినతరువాత మరల వివాహ మాడి ద్వితీయభార్యయుబిడ్డలును మృతినొందుటచే వైరాగ్యముగలవాఁడై ప్రయాగకువచ్చి మామేనమామల ప్రోత్సాహముచేఁ జక్రవర్తియొద్ద సైన్యాధిపత్యమును సంపాదించెను. అలాయుద్దీను దక్షిణదేశమునుండి వచ్చి జలాలుద్దీనును జంపించి తానె చక్రవర్తి కాఁదలంచి యాకార్యమునఁ దోడ్పడుమనినన్నును నాతండ్రినినడుగ మేమునిరాకరించితిమి. అందుచే మాపై నాగ్రహముగల్గి మాతండ్రికన్నులనుదనచేతికత్తితోఁ బొడిచివైచి నన్నువధించుటకుయత్నింపఁగా నేనామహాపదదప్పించికొని పాఱిపోతిని. నాభార్యయునంతకుముందే రెండుసంవత్సరములక్రిందటఁ బరలోకగతురాలైనందున నప్పటికి నేఁ డెనిమిదేండ్లవయసుగలనాచిన్న కుమారికను శిబిరమున విడిచి నేదేశాంతరములకు మాఱువేషముతో నరుగఁ బూనితిని. తురకలవలన నాకింతద్రోహము జరుగుటచే నెట్లయిన నల్లాయుద్దీనుపై హిందూరాజులఁ బ్రేరేపించి దండెత్తించికసిదీర్చికొనఁ దలఁచి నేను దక్షిణహిందూదేశమునకుఁబోయి మహారాష్ట్రరాజగురామదేవుని మీతోఁ గలియునట్లొడఁబఱచి వారియొద్దనుండి మీకుత్తరములఁగూడఁ దెచ్చితినికాని మధురానగరమున నేనొకపాడు దేవాలయమున యోగివేషముతోనుండఁ దరహిమానుఖాను సేవకులునన్ను యమునానదిలోఁ బడఁద్రోసి యాకాగితముల నపహరించిరి. ఈఁతవచ్చినవాఁడ నగుటచే దైవానుగ్రహమున నే నాజలగండమునుండి బైటఁబడి, గోసాయివేషముతోఁ బాలిగ్రామమునకు కరిగి యచ్చట

నాతండ్రి యగునారాయణసింగును నాముద్దుకూఁతురగు హేమలతయు బ్రదికి యుండుటకు సంతసించి రహిమానుఖాను హేమలతను జెఱఁ బెట్ట నుంకించుచుండ నామెనురక్షించి కుల్యానగరమునకుఁ దోడ్కొని పోయి నాస్నేహితుఁ డగుశివప్రసాదునింట నుంచితిని. తరువాత రాజ స్థానముపైఁ జక్రవర్తి దండెత్తు ననుమాట విని ఢిల్లీనగరమున జరుగు చర్యలను గ్రహించి రాజపుత్రుల కెఱిఁగింపఁ గోరి కుబండరు ఫకీరుగా రహిమానుఖానువద్దనుండి రహస్యములు బైటకుఁ దీసితిని. అంతటనుండియు నేనీనగరమునఁ బ్రదానంద యోగివేషముతో నుండి రాజపుత్రులసేనలకు నాతపస్సునెల్ల ధారవోసితిని. ఆ రాత్రిమహా రాణాలక్ష్మణసింగుగారిని మదనసింగు సాహాయ్యమువలన రక్షించిన వసంతభట్టును, జ్ఞానానందస్వాములవారివేషమువైచికొని యుత్తరముల దెచ్చుచు పాండురంగనాథునిఁ బట్టికొని వసంతభట్టును జంపించి పాండు రంగనాథుని మీకప్పగించితిని. నే ననేకసేవకుల నుంచికొని వారిని నానాభాగముల కంపి వసంతభట్టాదులరహస్యముల నెఱిఁగి నేఁడుతుద కల నోడించి సఫలమనోరథుఁడనైతిని. నా పేరు జనార్దనసింగు. హేమ లతనాకూఁతురు. అంధుఁడగునారాయణసింగు నాతండ్రి. హేమలత నావద్దకు వచ్చినది. కాని నాతండ్రిజాడలు దెలియలేదు. ఎఱిఁగిన వా రున్న యెడల నా కాతనిజాడ నెఱిఁగించి నన్ను ధన్యునిజేయుఁడు. నా కుమార్తెను మదనసింగునకిచ్చి వివాహము చేసెదను. ఇట్లు జనార్దన సింగు తనపూర్వవృత్తాంతమును సభ్యులకుఁ దెలియఁజేయ వారాశ్చ ర్యపడి యందఱు నాతనివంక దృష్టి నిలిపి చూచుచుండ, హేమలత చిత్తూరునగరమున నున్న దనియు నామెను దనకిచ్చి వివాహము చేయుట నిశ్చయమనియు జనార్దనసింగు పలుకుటచే మొదట మదన సింగు మిగుల నుప్పొంగుచు నారాయణసింగు తనగృహమున నున్నట్లా తనితోఁ జెప్ప తనతో రమ్మని పిలిచెను. పాలిగ్రామమునుండి రాజస్థాన

మున కాయంధుఁడు వచ్చుట కాశ్చర్యము నొంది జనార్దనసింగుచిర కాలమునకింటఁజూచినతనతండ్రినిదర్శింపఁగోరి రాజాయొద్దనసభ్యుల కడను సెలవుగైకొని తనమందిరమునకుఁజని యొకపల్లకిలో హేమలతను గూర్చుండఁబెటి వెంటఁబెట్టికొని మదనసింగుతో సరిగెను. చిరకాలము నుండి పరస్పరవియోగముగలయాప్తబంధువుల విచిత్రసమ్మేళనము నేత్రోత్సవముగఁ జూడఁగోరి భీమసింగును సభ్యులును మహారాజాతో బయలుదేఱి మదనసింగుగృహమునకుఁజనిరి. మదనసింగు తనయదృష్ట వశమునఁ దనగృహముఁనలంకరించిన మహారాజాప్రభృతులను యథా శక్తిని గౌరవించి యథాసనము లిడ వారందఱుఁ గూర్చుండిరి. మనుమరాలు గనఁబడనందులకు దుఃఖించుచున్న నారాయణసింగు నొద్దకుఁ జని, మదనసింగు "తాతా! మీహేమలతవచ్చినదిసుమీ!" యని పలికెను. వెంటనే నారాయణసింగు గదరిపడి "నాయనా! ఏదీ! మా హేమలత? ఏదీ! నాయనా! నిజమేనా చెప్పుచెప్పు"మని వేగిరపడు చుండఁనంతలో హేమలత మేఘములచాటున మెఱుపువలెవచ్చి "దాదా! దాదా!" అని పిలుచుచు నానందాతిశయమున దన్యపురుషు లుండి రనుమాట మఱచి యానందబాష్పములతో ముసలివాని యొడిలోఁ గూర్చుండి యతనికంఠమును గట్టిగఁగౌఁగిలించుకొనివిలపింపసాగెను. నారాయణసింగునుమనుమరాలిపైఁ జేయివైచి కనులనుండి బాష్పము లామెశిరముపైఁబడ "అమ్మా! నాఁటికినేఁడు నిన్ను జూచితిని. నిన్ను జూచి యానందించుటకు నీతండ్రి లేఁడు గదా తల్లీ"యని పరిపరిభం గులఁ దనసంతాపసంతోషములను మాటలచేతను జేష్టలచేతను దెలుపు చుండెను. అప్పుడు మదనసింగు వృద్ధునితో "తాతా! నీకుమారుఁడు వచ్చినాఁడు చూచెదవా!" యని పలుక నారాయణసింగు తనపుత్రుఁ డావఱకె యలాయుద్దీనుచక్రవర్తిచేఁ జంపఁబడినట్లు దృఢమగునమ్మ కముగలవాఁ డగుటచే నామాటనమ్మక "నాయనా! మీరు నన్నేల

పరిహసించెదరు! నాకొడుకెక్కడ ? నాకగపడుటెక్కడ? జలాలుద్దీను చచ్చుటకుముందా రాత్రి నాకును నాకుమారునకును ఋణముతీరినది. అటువంటి పుత్రరత్నము నావంటిపాపకర్ముల కేలదక్కును? నాయనా ! జనార్దనసింగూ! ఇఁక నాకగపడవుగదా" అని విలపించుచున్న నారాయణసింగుమాటల కడ్డమువచ్చి "జనార్దనసింగు దాదా! నామాటల నానవాలుపట్టఁజాలవా? నేనుజనార్దనసింగును. ఆరాత్రి నేనల్లాయుద్దీను చేతఁ బడకుండ దైవానుగ్రహమునబ్రతికి శిబిరమును విడిచి యింత కాలమును మాఱువేషముతో బహుదేశములఁదిరిగి సమస్తయాత్రలు సేవించి తుదకుఁ శాలిగ్రామమునకు వచ్చి మీరు బ్రతికియుండుట నెఱిఁగి మనశ్శాంతిఁ గలిగియుండి నేఁడుగలిసికొన్నాను" అనిజనార్దనసింగు తన పూర్వాశ్రమవృత్తాంతమును నెఱిఁగింప నారాయణసింగు వానికంఠమునుబట్టి తనకుమారుఁడని తెలిసికొని యక్కునఁ జేర్చి, యనిర్వాచ్యానందము నొంది "నాయనా! చక్రవర్తి నాకన్నులను బొడిచివేయకముందు నిన్ను గన్నులారఁజూచినాఁడను. నేఁడు నిన్నుఁ జూచి సంతోషింపనాకుఁ గన్నులులేవు. అయినను నీవును హేమలతయు నాకు రెండుకన్నులయి యున్నారు. మీరు దొరకుటె నాకు గనులు లభించుట" యని పలికి సంతోషమున వెఱ్ఱివానివలె నుండెను. జనార్దనసింగు హేమలతను శివప్రసాదుగృహమునకుఁ గొనిపోవునాఁడు గాని యీరెండుదినములలోఁ దనయొద్దనున్నపుడుగాని, తానామెకుఁ దండ్రి యగుటఁజెప్పనందున దనకు జ్వరముతగిలినప్పుడు రక్షరేఖ గట్టిన గోసాయియె తనతండ్రియని హేమలత ప్రథమపర్యాయమున విని విస్మయమొందెను. తా నామెనువిడిచిపోవునాఁటి కెనిమిదిసంవత్సరముల బాలికగ నుండి నేఁడు సంప్రాప్తయావనయై యుండుటచే జనార్దనసింగు చాలకాలమున కగపడిన కూఁతును ముద్దుపెట్టుకొని యొడిలోఁ గూర్చుండఁబెట్టుకొనెను. తరువాత సువర్ణబాయి హేమ

లతను జూడఁగోరినందున జనార్దనసింగామెను లోనికంపెను. సువర్ణ యు హేమలతసౌందర్యాదులను, మొగమునరసప్రతిక్షణను, సత్కుల జాతచిహ్నములను విశయసంపత్తినిజూచి యామె యెట్లయినఁ దన కుమారునకిల్లాలైన జాలునని కోరుచుండెను. అప్పుడు మదనసింగు జనార్దనసింగును జూచి "అయ్యా! హేమలతకు సహోదరుఁడైన కుమారసింగెచట నున్నాఁడు? అతఁ డాదినమున మీమఠమునకు వచ్చెఁగద" అని యడుగ "నాయనా! ఆకుమారసింగే యీహేమ లతయయ్యెను. యుద్ధమునందు జరిగెనకలకలములో హేమలత దుష్టుల పాలఁబడకుండఁ బురుషవేషము వైచికొని యామేను పెట్టుకొన్నది." అని జనార్దనసింగుత్తరముచెప్పెను. హేమలతయొక్క సమయోచిత బుద్ధికిని యుక్తికిని మదనసిం గాశ్చర్యపడుచుండు నప్పుడు భీమసింగు లక్ష్మణసింగునెదుట, జనార్దనసింగు హేమలతను మదనసింగునకిచ్చి వివాహము చేసెదనని చెప్పి, తనతండ్రికిని నావివాహ మిష్ట మగు టచేఁ దద్విషయప్రయత్నముల నొనర్పుఁడని భీమసింగుతోడను దక్కినరిసప్రుత్రులతోడను జెప్పెను. ప్రతాపసింగు మృతినొందుటచేఁ బెద్దలెవ్వరును లేరని మదనసింగుపక్షమున భీమసింగు సర్వప్రయత్న ములనుజేయించి పందిళ్ళు వేయించెను. నారాయణసింగు జనార్దనసిం గును హేమలత వివాహ మగుపఱకును దమమందిరమునకు రండని భీమసింగు పిలిచికొనిపోయెను. సంపూర్ణశరత్కాలచంద్రమండలము నపహసించు హేమలతముఖము నవలోకించి ముద్దుపెట్టుకొనిమొఱుఁగు దీఁగఁబోలు నామెదేహమును బిగ్గఁగౌఁగిలించికొను నిమిష మెన్నఁడు వచ్చునాయని మదనసింగు నిమిష మొకగడియవలె గడుపుచుండెను. నహాపొందిన మన్మథునివలె నల్లపట్టుకుచ్చులఁ బోలుమీసముతోడను నీలోత్పలములవంటి నేత్రములతోడను సంపూర్ణచంద్రబింబమువంటి ముఖముతోడను దనహృదయమును దోయకున్న మదనసింగునదలఁచి

కొని హేమలతయు వానిఁ గలిసికొనుసుదిన మెదురుచూచుచుండెను. అంతట నొక సుదినమున సుముహూర్తమేర్పఱచి జనార్దనసింగు హేమలతామదనసింగులకు సకలరాజపుత్రముఖ్యులసన్నిధిని మహావిభవముతో భేరీమృదంగాదిమంగళధ్వనులతో వివాహము గావించెను. పద్మినీదేవి హేమలతయొక్క వినయాదిసుగుణములకు మెచ్చియో, పుత్రిసమానుఁడైన మదనసింగుపైఁ గలప్రేమనెంచియో, యామెకు సమస్తాభరణములను బెట్టి తనయింటఁ బెండ్లికుమార్తెను జేసెను. చూచినవారందఱు నది యనుకూలదాంపత్యమనిపొగడ హేమలత మదనసింగును వివాహమాడెను. వివాహమహోత్సవ మైదునాళ్లును మహావైభవముతో నడచెను. మదనసింగేకపత్నీవ్రతస్థుఁడై విద్యావంతురాలయిన యామెసాంగత్యముచే నపారసౌఖ్యము నొందుచు నారాయణసింగుతోడను మామగారితోడను సుఖముగాఁ గాలక్షేపము చేయుచుండెను. వివాహమైన నెలదినముల కబ్దుల్ ఖరీముమాలవిని మదనసింగు భీమసింగునకుజూపి యాతఁడు మ్లేచ్ఛరాజ్యమును బాసి చిత్తూరురాజ్యమున నుండుట కనుజ్ఞ వేఁడుచుండుటఁ దెలియఁ జేయ భీమసింగందులకు సంతోషించి యాతనికి నెలకుఁ బదియైదువరాలవేతనముగలయుద్యోగమునిచ్చి యాతని కుటుంబమునుగూడ రప్పించెను. ఆనాఁటనుండియు మాలవి చిత్తూరువాస్తవ్యుఁడై మహారాణాకొలువు నందుండెను.

తరువాత హేమలత సుఖముగనున్నవార్తను శివప్రసాదునకుఁ జంద్రసేనునకును దెలియఁజేయుటకు మదనసింగు వారికడకు మనుష్యులనంపెను. హేమలత తనకుఁ గడుసహాయము నొసర్చినచంద్రావతికి యుత్తరము వ్రాసి యామనుష్యులచేతి కిచ్చెను. హేమలతామదనసింగులయనురాగఫలమై, వివాహమైన రెండు సంవత్సరములనాఁటికి వారి కొకకుమారుఁడుదయించెను. అతనికి మదనసింగు మాధవసిం

గని తనతండ్రిపేరు పెట్టెను. తరువాత వారి కనేకులు కుమారులు గుమార్తెలుం జనించిరి. మదనసింగు రాజభక్తియుక్తుఁడై తనతండ్రి కంటెను బినతండ్రికంటెను బరాక్రమమునఁ బేరుగాంచి శత్రుపుంజక బక్కలో బల్లెమై రాణాకు గుండెకాయ యై పుత్రపౌత్రాభివృద్ధి గలిగి వర్ధిల్లుచుండెను.

సంపూర్ణము.



శ్రీసుజనరంజనీ ముద్రాక్షరశాల, రాజమహేంద్రవరము.